| | | |
|---|---|---|
| Book Title | : | Andamaina Ala |
| Writer Name | : | Sathyajit Rey Sreekurmam |
| Copy rights | © | Sathyajit Rey Sreekurmam |
| First Edition | : | November, 2024 |
| ISBN Number | : | |
| Price | : | Rs./- |
| Copies | : | 500 |
| Address for Copies | : | Sathyajit Rey Sreekurmam<br>+91 9949999718<br>satyajitgis@gmail.com |
| Publications | : | Thapasvi Manoharam Publications |

Book, Cover Page Design & Printing:

Thapasvi Manoharam Publications
Reg. No : U22300TG2022PTC161797
Kondapur, Hyderabad.
Mail.ID: Publications.thapasvimanoharam@gmail.com
https://thapasvimanoharam.com/
Phone Number: +91 7893467516

# అంకితం



ఊపిరి ఇచ్చి, దాని కాపు కాచి, సుఖానికి దుఃఖానికి అర్థాలు నేర్పి, నాకంటూ ఒక వ్యక్తిత్వాన్ని ఇచ్చిన అమృత మూర్తి మా అమ్మ శ్రీకూర్మం విజయలక్ష్మి గారికి, అద్భుత మూర్తి మా నాన్న స్వర్గీయ శ్రీకూర్మం విజయ బాలగోపాల్ గారికి ప్రేమతో ఈ నా మొదటి నవల అంకితం.

సత్యజిత్ రే శ్రీకూర్మం

# నాంది..

కాలం మనిషి కొలబద్ద పెట్టి కొలుస్తాడని కోపం కాబోలు, ధనం, ప్రేమ, బంధం, అనుబంధం వంటివి మనిషి బలహీనతలతో ఆడుకుంటూ.. తనకి నచ్చితే కన్న కలలకి కళ్ళు, కాళ్ళు ఇచ్చి జీవితాన్ని కమనీయ కావ్యంగా మారుస్తుంది. నచ్చకుంటే, నుంచున్న చోటే.. నిరాశ తవ్విన నిర్లిప్త కూపంలోకి తోసేస్తుంది. అయితే ప్రేమ ఒక్కటే ఎన్నో సార్లు కాలాన్ని జయించింది. ప్రణయ ప్రళయాలు రూపంలో కాలాతీతంగా నిలిచింది ఒక లైలా మజ్ను, ఒక రోమియో జూలియట్, ఒక దేవదాస్ పార్వతి.. పరిచయం అక్కరలేని ప్రణయానికి ప్రతిరూపాలు. ఈ "అందమైన అల" వారికి అంకితం.

సత్యజిత్ రే శ్రీకూర్మం

# ముందు మాట

"అందమైన అల" ఈ నవల పేరులాగానే ఈ నవల చదువుతున్న సమయం అంతా కూడా ఒక అందమైన అల మీద సాగే అద్భుతమైన ప్రయాణంలాగా అనిపిస్తుంది. అద్భుతమైన రచన, చదివే వారిని ఒక అద్భుతమైన ప్రపంచంలోనికి తీసుకునివెళ్ళి అక్కడ విహరింప చేస్తుంది.

ఈ నవలలోని పాత్రలు మనకు ఎంతో పరిచయమున్న వారి లాగా అనిపిస్తూ చదువుతున్నంత సమయం వాళ్ళందరూ మన చుట్టూ వున్నట్టు మనం అనుభూతి చెందుతాము. రచయిత సత్యజిత్ రే గారు ఆయన ఊహా శక్తికి ఒక ఆకారం రూపొందించి దానిలో మనం ఎన్నో అద్భుతమైన పరిసరాలు, ప్రదేశాలు కళ్ళకు కట్టినట్టు విహారిస్తున్నట్టు రచించారు.

రచయిత సత్యజిత్ రే గారి రచనా పటిమ ఈ నవలను ఒక దృశ్య కావ్యంగా రచించడం. ఆయన ఈ నవల రచించిన విధానం పాత్రల ఆవిష్కరణ, కథలోని మలుపులు, పాత్రల మధ్య ప్రేమానురాగాలు చదివే వారి హృదయానికి హత్తుకునేలాగా వుంటాయి. నవలలోని పాత్రల ఆవిష్కరణ, ఆ పాత్రల మధ్య వున్న సంభందం, భావోద్వేగాలు, వారి వున్నతమైన మనస్తత్వాలు, సంభాషణలు, త్యాగాలు చదివే వారిని ఆ పాత్రలకు ఎంతో దగ్గర చేస్తాయి. ఈ కథలో చెప్పుకోతగ్గ విషయం ఏమిటంటే, చదివే వాళ్ళు ఏదో ఒక పాత్రతో లేదా సన్నివేశంతో ముడిపడ్డట్టు వుండటం అది వారి జీవితంలో ఎదురైన పరిస్థితి లేదా సంఘటనగా భావించడం.

ఈ నవల చదవడం ఆరంభించిన తరువాత చివరి పేజి వరకు నిర్విరామంగా, ఆనందంగా, ఆశ్చర్యంగా, ఉత్కంఠగా, మామతానురాగాల మధ్య ప్రయాణం సాగుతూ చదివించేస్తుంది. ఈ నవల మొత్తం ఒక అద్భుత ప్రపంచాన్ని మనకు పరిచయం చేస్తుంది, బహుశా అది కూడా ఈ నవలకు "అందమైన అల" అని పేరు పెట్టడానికి ఒక కారణం అయివుండవచ్చు.

ఈ నవల అన్నీ వయస్సుల వారికి ఆనందం పంచుతుంది. కుటుంబంలోని చిన్న, పెద్ద, వృద్దులు అందరికీ అర్ధమయ్యేలాగా, ఆనందించే లాగా, అందరికీ

కావలసిన నచ్చే రీతిలో రచించారు రచయిత సత్యజిత్ రే గారు. పాత్రలన్నీ సున్నితమైన మనస్సులతో, మధురమైన ప్రేమాభిమానాలతో, ఒక సైన్స్ ఫిక్షన్ కథను కన్నులకు కట్టినట్టు రచించడంలో రచయిత సత్యజిత్ రే గారు విజయం సాధించారు.

–ఉదయ భాస్కర సంబరాజు



# పరిచయం



ఇంటిపేరు శ్రీకూర్మం, వంటిపేరు సత్యజిత్ రే, పుట్టింది నిడదవోలు, పెరిగింది రాజమహేంద్రవరం, పట్టబద్రుణ్ణి చేసింది విశాఖపట్నం, స్థిరపడింది హైదరాబాద్. బ్రతుకు తెరువు సాఫ్ట్వేర్ ఉద్యోగం. ఈ కథ రాస్తున్నప్పుడు, ఇది ఒక నవలగా వస్తుందని నేను ఊహించలేదు, మిత్రులు, సీనియర్ రచయిత, నా సోదరుడు శ్రీ ఉదయ భాస్కర సంబరాజు గారి ప్రోతాహంతో నేను ఈ ప్రయత్నము చేస్తున్నాను. మొదటి సారి చదివి, నేను రచయిత గా పనికొస్తానని నాకు కితాబు ఇచ్చిన నా సహోదరి శ్రీమతి అర్చకం వల్లి దీక్షిత్, శ్రీమతి జానా సత్యవాణి సుబ్రహ్మణ్యం, శ్రీ కోనేరు గీతాదేవి మరియు మిత్రుడు సుందర్ అకునూరి కి ధన్యవాదాలు. ఈ నవల భావోద్వేగ భరితమైన ప్రేమ , ఫాంటసీ లు కలిపి రాసాను. చదివిన వారు తప్పులుంటే మన్నించి, మీ సలహాలు సూచనలను satyajitgis@gmail.com కి కానీ లేక +91 9949999718 వాట్సప్ నెంబర్ కి కానీ పంపించగలరని నా ప్రార్ధన.

– శ్రీకూర్మం సత్యజిత్ రే

# PART 1

అది అంకితా ఇంజనీరింగ్ & బిజినెస్ మానేజ్మెంట్ కాలేజ్ క్యాంపస్, ఐటీ కంపెనీలు ఇంటర్వ్యూస్ నిర్వహిస్తున్నాయి. వాటితో పాటు దేశంలో ప్రసిద్ధి గాంచిన హ్యూమన్ రిసోర్స్ కంపెనీస్ కూడా ఉన్నాయి. ముఖ్యంగా ఎంబీఏ విద్యార్థులకు మంచి అవకాశాలు ఉన్న పెద్ద పెద్ద సంస్థలు.

ఎంబీఏ సెకండ్ ఇయర్ ఫైనల్ సెమిస్టర్ రాసి ఉన్న జాహ్నవికి.. ఈ ఉద్యోగం చాలా చాలా అవసరం. గ్రూప్ డిస్కషన్ అయిపోయింది, ఇక పర్సనల్ రౌండ్ మిగిలి వుంది.

జాహ్నవి నాన్న రిటైర్ అయిపోయారు. ఇంకా తమ్ముడు, చెల్లి చదువుతున్నారు. ఇంటికి తాను పెద్ద, ఎంతో కొంత ఆస్తి ఉన్నా.. ఈ జాబ్ రాకపోతే ఇంట్లో పెళ్ళి చేసేస్తారు, అందుకే ఈ ఆరాటం.

జాహ్నవికి స్పీకర్ లో తన పేరు వినిపించింది, సీట్ లో నుండి లేచి 'దేవుడా..!' అనుకుంటూ కదిలింది.

ఇంటర్వ్యూ రూమ్ సెకండ్ ఫ్లోర్, లిఫ్ట్ లోకి ఎంటర్ అయ్యింది. అందులో ఇంకో వ్యక్తి కూడా ఉన్నాడు. చూడడానికి అందంగా ఉన్నాడు కానీ, అతని డ్రెస్, స్టయిల్ అంతా ఏదో పాత సినిమాలో హీరోలా ఉన్నాడు. జాహ్నవికి టీవీలో చూసిన పాత చిరంజీవి సినిమా గుర్తుకు వచ్చింది.

లిఫ్ట్ సెకండ్ ఫ్లోర్ లో ఆగింది. బయటికి అడుగు పెడుతుండగా ఆ వ్యక్తి,

"జాహ్నవి..! కంగారుపడకు ఇంటర్వ్యూలో నువ్వు 'విశాల్ రాజవంశీ తాలూకా' అని చెప్పు" అన్నాడు.

వెనుతిరిగి చూసింది లిఫ్ట్ డోర్స్ క్లోజ్ అవుతున్నాయి, వాటి మధ్యలో నుండి చిరునవ్వు నవ్వుతున్న అతని ముఖం కనిపించింది. "మీరు ఎవరు? విశాల్ రాజవంశీ ఎవరు?" అని అడిగే లోపు లిఫ్ట్ కదిలిపోయింది.

అప్పుడు, తన అమ్మ చెప్పిన మాటలు గుర్తు వచ్చాయి.

'బయట ప్రపంచంలో జాగ్రత్త.. ప్రతి మగాడూ ఏదో ఒక సాకుతో దగ్గరవ్వాలని చూస్తాడు. ఎవరిని పడితే వాడిని నమ్మకు' అని..

'పాపం.. అమ్మ ఎన్ని బాధలు పడిందో' అనుకుంటూ.. ఇంటర్వ్యూ రూమ్ లోకి అడుగుపెట్టింది.

ఒక మోస్తరు హాల్.. పానెల్ లో ఒక లేడీ, ఇద్దరు జెంట్స్ ఉన్నారు. ఒక చైర్ ఖాళీగా వుంది.

జాహ్నవి అందించిన ఫైల్ తీసుకున్న లేడీ "ప్లీజ్ హేవ్ యువర్ సీట్.." అన్న తరువాత, కుర్చీలో కూర్చుంది జాహ్నవి.

ఫైల్ ఓపెన్ చేసి, "డిస్కస్ చేద్దామా! లేక విహంగ్ కోసం వెయిట్ చేద్దామా!?" అని ఆమె మిగతా వారి వైపు చూస్తూ అంది.

ఇంతలో "సారీ గైస్.. అమ్మ దగ్గరి నుండి కాల్, మాట్లాడక తప్పలేదు" అంటూ వెనక నుండి వచ్చిన వ్యక్తిని చూసి అవాక్కయ్యింది జాహ్నవి.

అతను ఇందాక లిఫ్ట్ లో చూసిన వ్యక్తి, కాదు.. కాదు.. లిఫ్ట్ లో చూసిన వ్యక్తిలా ఉన్నా.. ఇతను మరో వ్యక్తి. ఎందుకంటే, ఇతను సూట్ వేసుకుని స్టైల్ గా ఉన్నాడు.

'అతనే డ్రెస్ చేంజ్ చేసుకుని వచ్చాడా! మరి ఇందాక ఎందుకు వెళ్ళిపోయినట్లు?' అని ఆలోచనలో కొట్టుకుపోతున్న జాహ్నవికి..

"హలో మిస్ జాహ్నవి.." అన్న పిలుపుకి తేనెతుట్ట లాంటి ఆలోచనలు నుండి బయటికి వచ్చింది.

"ఏంటి నెర్వస్ ఫీల్ అవుతున్నారా!? జస్ట్ చిల్, కొంచెం వాటర్ తాగండి" అన్నాడు విహంగ్.

ఇంటర్వ్యూలో అడిగిన అన్ని ప్రశ్నలకు సమాధానం చెప్పింది, కానీ మైండ్ లో ఎక్కడో ఏదో డిస్టబెన్స్.

"కంగ్రాట్స్ జాహ్నవి.. యు ఆర్ సెలెక్టెడ్" అని విహంగ్ చేయి అందిస్తూ అన్నాడు.

జాహ్నవి రెండు చేతులు జోడించి నమస్కారం చేస్తూ, "చాలా థాంక్స్ సర్.." అంది.

విహంగ్ కొద్దిగా ఇబ్బంది పడ్డాడు. వెంటనే తాను కూడా నమస్కారం చేస్తూ "యు ఆర్ వెల్కమ్, కాసేపు బయట వెయిట్ చెయ్యండి ఆఫర్ లెటర్ ఇస్తాము" అని చెప్పాడు.

ఇంతలో ఒక ఆఫర్ లెటర్ తీసుకుని అక్కడకి వచ్చింది ఎగ్జిక్యూటివ్. అది జాహ్నవి చేతికి ఇచ్చి "అన్నీ నచ్చితే.. వన్ వీక్ లో ఆఫీస్ కి వచ్చి కలవండి" అంటూ విహంగ్ వెళ్ళిపోయాడు.

లెటర్ ఓపెన్ చేసి చూసింది, చాలా పేజీలు ఉన్నాయి. 'ఇంటికి వెళ్ళాక చూసుకుందాం' అనుకుని, తిరిగి కవర్ లో పెట్ట బోతుండగా.. ఆఖరి పేజీలో కనిపించిన సంతకం దగ్గర జాహ్నవి కళ్ళు ఆగి పోయాయి.

'విహంగ్ రాజవంశీ.. లిఫ్ట్ లో కలిసిన వ్యక్తి విశాల్ రాజవంశీ.. వీళ్ళిద్దరు బ్రదర్స్ ఆ! అయినా అతనికి నా పేరు ఎలా తెలుసు!?' అని విహంగ్ కోసం చుట్టూ చూసింది.

అతను నెక్స్ట్ ఇంటర్వ్యూలో బిజీగా ఉన్నాడని అర్థం అయ్యింది.

జాహ్నవికి ఉన్న బలం, బలహీనత రెండూ అదే. ఏదైనా అర్థం కాకపోతే అది అర్థం అయ్యే వరకు వదలదు. అందుకే, ఒకేసారి విహాంగ్ తో మాట్లాడి వెళ్దాం అని అక్కడే కూర్చుంది.

ఇంటికి ఫోన్ చేసి అమ్మతో మాట్లాడాలనిపించి కాల్ చేసింది. ఫోన్ స్విచ్ ఆఫ్ వస్తుంటే.. నాన్నకి కాల్ చేసింది.

ఫోన్ లిఫ్ట్ చేసి "ఏంటిరా! కాయా, పండా" అన్నారు ఆయన.

"పండే నాన్న.. నెక్స్ట్ వీక్ లోగా నేనే డిసైడ్ చేసి చెప్పాలి. అమ్మకి చెబుదాం అంటే ఫోన్ స్విచ్ ఆఫ్..! అమ్మ ఫోన్ కి ఏదో అయ్యింది. అస్తమానం స్విచ్ ఆఫ్ అవుతుంది. సరే నేను ఒక గంటలో వస్తాను. మీరు అమ్మకి ఏమి చెప్పకండి, నేనే చెబుతా" అని ఫోన్ కట్ చేసింది.

విహంగ్ బయటికి వస్తూ కనిపించాడు "సర్.." అంటూ వెళ్ళింది జాహ్నవి.

"ఓహ్! మీరు ఇంకా వెళ్ళలేదా?" అని అడిగాడు విహంగ్.

"లేదు మిమ్మలిని ఒక విషయం అడగాలి" అంది జాహ్నవి.

"చెప్పండి" అన్నాడు విహంగ్.

"విశాల్ రాజవంశీ అంటే.. మీ బ్రదరా సర్?" అని అడిగింది.

విహంగ్ కళ్ళు ఒకింత పెద్దవి చేసి "వాట్..! ఆయన మా ఫాదర్, మీకు ఎలా తెలుసు?" అన్నాడు.

ఇప్పుడు ఆశ్చర్యపోవటం జాహ్నవి వంతు అయ్యింది.

"సర్.. మీరు జోక్ చేస్తున్నారా!? ఆయన కూడా మీ ఏజ్ లోనే ఉన్నారు. కాకపోతే, కొంచెం డ్రెస్సింగ్ తేడా ఉంది" అంది జాహ్నవి.

"జోక్.. మీరు చేస్తున్నారు. ఎక్కడైన ఆయన ఫోటో చూసారా?" అని క్యూరియస్ గా అడిగాడు.

"లేదు, ఇందాక వస్తుంటే లిఫ్ట్ లో కలిశారు" అంది జాహ్నవి.

కాసేపు మౌనంగా ఉన్న తరువాత విహంగ్ "జాహ్నవి మీరు కొద్దిగా ఎక్సైట్మెంట్ లో ఉన్నారు అనుకుంటా, ఇంటికి వెళ్ళండి నెక్స్ట్ వీక్ కలుద్దాం" అని అక్కడి నుండి కదిలాడు విహంగ్.

వెళ్తున్న అతని వైపే చూస్తూ.. 'ఇప్పుడు నేను ఏమన్నాను అని అంత కోపం!' అనుకుంది.

అది అంతా గమనిస్తున్న.. అక్కడే ఉన్న ఆఫీస్ ఎగ్జిక్యూటివ్ దగ్గరికి వచ్చి "మేడం! విహంగ్ సర్ ఫాదర్ పోయి చాలా కాలం అవుతుంది. మీరు ఆయనని చూసానని ప్రాక్టికల్ జోక్ వేయడం ఆయనకి నచ్చలేదు అనుకుంట" అంది.

'ఏంటి ఆయన పోయారా? మరి ఇందాక లిఫ్ట్ లో కలిసింది ఎవరు? ఆయనకు తన పేరు ఎలా తెలుసు?' అని రకరకాల ఆలోచనలతో.. జాహ్నవికి తల తిరిగింది.

***

# PART 2

విహంగ్ డ్రైవ్ చేస్తున్నాడు. శుక్రవారం కావడం వల్ల ఈవెనింగ్ రోడ్స్ ట్రాఫిక్ తో నిండిపోయి ఉన్నాయి. బెల్లం దగ్గరికి వెళుతున్న ఎర్ర చీమల్లా రోడ్ పైన కార్స్ అన్నీ మెల్లగా వెళుతున్నాయి.

'ఆ అమ్మాయి నాన్నని చూసిందా? అదెలా సాధ్యం? చూసినా కూడా ఆయనకి నా వయసు ఉండడం ఏంటి? తాను నిజమే చెపుతుందా? లేక నన్ను ఇంప్రెస్స్ చేయడానికి ఏమైనా జిమ్మిక్కా?' అనుకున్నాడు విహంగ్.

అతను అంతగా ఆలోచించడానికి కారణం వుంది. తన ఇరువై ఏళ్ళ వయసులో.. వాళ్ళ నాన్న విశాల్ రాజవంశీ.. ఒక రోజు తన స్నేహితుడి దగ్గరికి వెళ్ళి వస్తా అని చెప్పి వెళ్ళి.. ఇక తిరిగి రాలేదు. అన్ని చోట్లా వెతికారు కానీ.. జాడ లేదు. ఆయన వెళ్ళిపోయిన రోజుకి.. దాదాపు ఆయనకి 45 సంవత్సరాలు వరకు ఉంటాయి. అప్పటికి తనకి ఇంకా కాలేజీ డేస్, స్నేహితులతో కలసి ఊరు ఊరంతా వెతికాడు విహంగ్ కానీ, ఏమి లాభం లేకపోయింది. ఆయన ఇప్పటికీ ఎక్కడో ఉన్నారని విహంగ్ ప్రగాఢ విశ్వాసం, ఈరోజు జాహ్నవికి ఆయన కనిపించారు అనగానే.. చాలా సంతోషం వేసింది కానీ, అంతలోనే కనిపించిన వ్యక్తికి తన వయస్సు అనగానే చాలా డల్ గా అనిపించింది.

'అయినా ఇంకొద్దిగా వివరాలు అడగాల్సింది' అని మనసులో అనుకున్నాడు.

కానీ, ఇంతకు ముందు కూడా ఇలా చూశామని చెప్పిన వాళ్ళు ఉన్నారు. తరువాత తెలిసింది.. వాళ్ళంతా డబ్బు కోసం ఏవో కాకమ్మ కథలు చెప్పారు అని. జాహ్నవి విషయంలో ఒకే ఒక్క ప్రత్యేక విషయం ఏంటంటే.. విహంగ్ నాన్నకి.. విహంగ్ వయసు ఉండటం.

విహంగ్ కి తండ్రి గుర్తుకు రాగానే ఆయన స్నేహితుడు సత్యమూర్తి గుర్తుకు వచ్చారు. వెంటనే కాల్ చేసాడు.

మూర్తి గారి నౌకరు ఫోన్ లిఫ్ట్ చేసాడు.

"రామయ్య.. నేను విహంగ్ ని మాట్లాడుతున్నాను. మూర్తి అంకుల్ ఎలా ఉన్నారు?" అని అడిగాడు.

"ఇప్పుడు కొంచెం పర్లేదు బాబు. కళ్ళు తెరిచి చూస్తున్నారు, డాక్టర్స్ ఇంకొద్ది కాలానికి మనుషుల్ని గుర్తు పడతారని చెప్పారు" అన్నాడు రామయ్య.

"ఓ.. గుడ్ న్యూస్, ఆరోజు రావాలని కోరుకుంటున్నాను. ఆయన ఎంత మాత్రం గుర్తు పట్టినా.. నాకు వెంటనే కాల్ చెయ్యి, డబ్బులు బ్యాంక్ లో డిపాజిట్ చేశాను. ఇంకా కావాలంటే ఫోన్ చెయ్యి" అని చెప్పాడు విహాంగ్.

"అలాగే సర్.." అని ఫోన్ కట్ చేసాడు రామయ్య.

సత్యమూర్తి విశాల్ కి ప్రాణ స్నేహితుడు, సరిగ్గా విశాల్ కనిపించకుండా పోయిన రోజునే.. ఆయన తన ఇంట్లో కోమా స్టేజ్ లో కనపడ్డాడు.

విశాల్ ఆఖరిసారిగా వెళ్ళింది కూడా సత్యమూర్తి దగ్గరకే, విశాల్ ఏమయ్యాడో తెలియాలంటే సత్యమూర్తి స్పృహలోకి రావాలి. ఆయన బ్యాంక్ ఉద్యోగి కావడం వలన 12 ఏళ్ళ నుండి అతని వైద్యం ఇన్సూరెన్సు పై నడుస్తుంది. సత్యమూర్తికి వెనుకా ముందు ఎవరు లేరు కాబట్టి, విశాల్ కుటుంబమే రామయ్యని పెట్టి అతని బాగోగులు చూస్తుంది. సిటీలో వైద్యం కాస్ట్లీ కనుక, సత్యమూర్తిని తన సొంత ఊరిలో ఉంచారు.

విహంగ్ తన సెక్రెటరీకి కాల్ చేసాడు.

"రజని.. ఈరోజు మార్నింగ్ మనం సెలెక్ట్ చేసిన జాహ్నవి మొబైల్ నెంబర్ ఉందా!" అని అడిగాడు.

"నా దగ్గర లేదు సర్.. ఆఫీస్ లో వుంది. నేను ఇప్పుడే ఇంటికి రీచ్ అయ్యాను. ఏమైనా అర్జెంటా?" అని అడిగింది.

"లేదులే, రేపు చూద్దాం" అని ఫోన్ కట్ చేసాడు విహంగ్.

కార్ స్పీడ్ అందుకుంది.

***

కాబ్ లో ఇంటికి చేరింది జాహ్నవి, అపార్ట్మెంట్ లోకి ఎంటర్ అవుతుంటే, లిఫ్ట్ దగ్గరకి పరిగెడుతూ వచ్చింది వాచ్మాన్ భార్య అలివేలు.

“అమ్మ.. మీకు ఈ పేపర్ ఇమ్మని ఎవరో ఇచ్చి వెళ్ళారు” అని ఒక పేపర్ ఇచ్చింది.

“అలివేలు.. ఇది ఎవరు ఇచ్చారు? ఎప్పుడు ఇచ్చారు? అని అడిగింది జాహ్నవి.

“నాకు తెలియదమ్మ, సాయంత్రం నాలుగు గంటలకు నేను బజారుకి వెళ్ళాను. అప్పుడు మా పిల్లోడికి ఎవరో ఇచ్చారు అంట, 204 జాహ్నవి గారికి ఇమ్మని చెప్పారంట” అని చెప్పింది.

జాహ్నవికి మార్నింగ్ నుండి జరుగుతున్నవి అన్నీ.. చాల విచిత్రంగా అనిపిస్తున్నాయి, చాలా అయోమయానికి గురి చేస్తున్నాయి.

‘ఇందులో విషెస్ వరకు ఓకే, మరి కుందేలు బొమ్మ ఏంటి? నాకు జాబ్ వస్తే కుందేలు హ్యాపీ ఏంటి!?’ అనుకుని చింపి పారేద్దాం అనుకుంది. ఎందుకో మనసు ఒప్పలేదు. చూడడానికి కూడా చాల అందంగా వుంది.

“అలివేలు.. ఈసారి ఇలా ఎవరైనా ఇస్తే మా ఫ్లాట్ కి వచ్చి ఇమ్మన్నామని చెప్పు, నువ్వు తీసుకోకు” అంది జాహ్నవి.

“సరే అమ్మ..” అని ఒకింత సణుగుతూ వెళ్ళిపోయింది అలివేలు.

డోర్ బెల్ కొట్టగానే జాహ్నవి తండ్రి తలుపు తెరిచారు.

చెప్పులు స్టాండ్ లో పెడుతూ “అమ్మ లేదా..?” అని అడిగింది.

“లేదు రా, పక్కింటి ఆంటీతో షాపింగ్ కి వెళ్ళింది” అన్నారు ఆయన.

“అదేమిటి నాన్న మీరే ఏదో ఒకటి చెప్పి అమ్మని ఆపొద్దా..” అని కొంచెం బుంగమూతి పెట్టుకుంది.

“సరే వచ్చాక చెపుదాం, నువ్వు డ్రెస్ మార్చుకో.. నేను ఫుడ్ రెడీ చేస్తా” అన్నారు.

దిగాలుగా తన రూమ్ లోకి వెళ్ళింది. లైట్ వేయగానే ధన్.. ధన్.. మని బెలూన్స్ పేలాయి.

“కంగ్రాట్స్..” అంటూ, అమ్మ, పిన్నులు ఇద్దరు, తమ్ముళ్ళు, చెల్లెల్లు అందరూ మూకుమ్మడిగా విష్ చేసారు.

అమ్మ దగ్గరికి వచ్చి నుదుట పై ముద్దు పెట్టుకుంది.

“నువ్వు ఎక్కడికెళ్ళినా తిరుగులేదు, నాకు ముందె తెలుసు నువ్వు సెలెక్ట్ అవుతావు అని, అందుకె ఈ సర్ప్రైజ్ పార్టీ” అని నవ్వుతూ అంది అమ్మ.

‘అమ్మ నిజంగా ఒక దేవత, తాను కూడా ఇంట్లో పెద్ద కూతురు. మెట్టినిల్లు కూడా పెద్ద కుటుంబం అయినా.. ఇటు పుట్టినిల్లుని అటు మెట్టినిల్లుని అర్జునుడిలా హేండిల్ చేసే సవ్యసాచి అమ్మ. మొత్తం రెండు కుటంబాలలోను అమ్మకి తెలీకుండా, తన అభిప్రాయం తీసుకోకుండా ఎవరూ ఏమి చేయరు. అమ్మని సర్ప్రైజ్ చేయాలనుకోవడం నా వెర్రితనం’ అని నవ్వుకుంది.

జాహ్నవి అమ్మ పేరు.. జాహ్నవి పేరుకన్నా లేటెస్ట్ గా ఉంటుంది. ఆమె పేరు వినీష, పెద్ద పిన్ని పేరు మనిషా, చిన్న పిన్ని హరీష. ముగ్గురూ దాదాపు ఒకే రంగులో చూడడానికి కవలల్లా వుంటారు.

అందరం డిన్నర్ చేసారు. ఎక్కడి వాళ్ళు అక్కడ వెళ్ళిపోయారు. జాహ్నవి చెల్లి తమ్ముడు నిద్రలోకి జారుకున్నారు.

తల్లి డిన్నర్ అయ్యాక టేబుల్ సర్దుతుంటే.. “అమ్మా.. ఈరోజు ఒక విచిత్రం.. కాదు, కాదు.. రెండు విచిత్రాలు జరిగాయి” అంది జాహ్నవి.

“అవును, నువ్వు ఫస్ట్ ఇంటర్వ్యూలో సెలెక్ట్ అవ్వడం ఒకటి, ఇంకోటేంటి అబ్బా..” అంది తల్లి.

“అమ్మ.. అమ్మా.. ఏడిపించకే చెప్పేది విను” అంది జాహ్నవి.

“సరే చెప్పు..” అంది తల్లి.

మార్నింగ్ లిఫ్ట్ లో కలిసిన వ్యక్తి గురించి టూకీగా చెప్పింది జాహ్నవి.

“బాగుందే.. ఏదో థ్రిల్లర్ కథలాగా, ఇంతకీ అతని పేరు ఏంటి?” అంది వినీష.

“విశాల్ రాజవంశీ” అంది జాహ్నవి.

ఆ పేరు వినగానే, “ఏంటి ఇంకోసారి చెప్పు అంది” తల్లి.

"విశాల్ రాజవంశీ అంట" అంది మరోసారి జాహ్నవి.

హృదయం తలుపులను ఎవరో తట్టినట్లు.. వినీషకి గుండె వేగం పెరిగిపోయింది. ఆకాశం నుండి హఠాత్తుగా గులాబీ రేకుల వర్షం పడుతున్నట్లు, గండు తుమ్మెదలు మకరందాన్ని మధువుగా చేసి అందిస్తున్నట్లు, సీతాకోక చిలుకలు సుగంధాన్ని విసురుతున్నట్టు.. ఆ పేరు వినగానే తనలో కలిగిన పులకరింపు, అన్నీ కలిపి ఆక్సిటోసిన్ ని టన్నుల కొద్దీ రిలీజ్ చేసినట్లు ఉన్నాయి. ఆ ఆనందం నవ్వు, ఏడుపు రూపంలో కంటి నుండి జలజలా రాలుతుంది.

"అమ్మా.. అమ్మా.." అని జాహ్నవి..

"వినీ.. ఏమైంది?" అని భర్త పిలిస్తే గాని ఈలోకం లోకి రాలేదు వినీష. కొద్దిగా తడబాటు పడుతూ.. అక్కడే కుర్చీలో కూలబడింది.

"జానూ అమ్మకి ఏమి చెప్పావ్!? తను చాలా సెన్సిటివ్ అని తెలుసుగా, ఏమైనా ఉంటే నాకు చెప్పు అని తండ్రి మందలించడంతో.. "అమ్మా సారీ.." అని చెప్పి తన గదిలోకి వెళ్ళింది జాహ్నవి.

"ఏమైంది వినీ.." అన్నాడు ఈశ్వర్.

ఏమిలేదు లెండి నన్ను కాసేపు వదిలేయండి అదే సర్దుకుంటుంది" అంది వినీష.

"సరే.." అని కదిలాడు ఈశ్వర్.

ఎఫ్.ఎమ్ రేడియోలో వాన సినిమా పాట వస్తుంది. "నిజం లాంటి ఈ స్వప్నం ఎలా పట్టి ఆపాలి, కలైపోతే ఈ నిజం ఎలా తట్టుకోవాలి" అంటూ..

వినీష మోములో ఒక చిన్న దరహాసం.. మనసు గదుల్లోని జ్ఞాపకాల అరల్లో దాచిన గతం పుస్తకంలోకి ప్రాణం వెళ్ళింది.

***

# PART 3

వసంత కాలాన్ని సాగనంపి శీతలం జగానికి మంచు చీర కప్పుతున్న రోజులు. గోరు వెచ్చని సూరీడు, పచ్చని ఆకులపైన పరుచుకున్న మంచు ముత్యాలను ముద్దాడుతుంటే.. అల సిగ్గున బుగ్గలు దాచుకుంటూ అవి భూదేవి ఒడిలోకి దూకి దొంగాట ఆడుతున్నాయి. డిస్కో సైకిల్ పై పసిడి మొగ్గకు లంగా వోణి చుట్టినట్టు, నగుమోమున నవ్వు ఒకటి అలకరించుకుని, అలవోక చూపుతో, మయూరం కదులుతుందా అన్నట్లు మెల్లగా ట్యూషన్ కి వెళుతుంది వినీష.

శామ్యూల్ గారు కెమిస్ట్రీలో దిట్ట, దాదాపు ఆ చిన్న టౌన్ లో ఆయన అందరికీ తెలుసు. స్టాండ్ వేసి వెను తిరిగి చూసే సరికి ఎదురుగుండా నిలుచున్నాడు మోహన్. చేతిలో లెటర్, గత నెల రోజుల నుండి ఇదే కథ, ఎన్నిసార్లు తిట్టినా.. లెటర్ చింపినా.. బుద్ధి రాలేదు. మరల వినీష దగ్గరికి వస్తున్నాడు.

అతను రావడం చూసి త్వరత్వరగా అడుగులేసి లోపలి వెళ్ళిపోయింది. క్లాస్ స్టార్ట్ అయ్యింది. ఆ వెనుకే మోహన్ వచ్చాడు. అంతా నేల మీదే కూర్చునే వాళ్ళు. అబ్బాయిలంతా ఒక పక్క, అమ్మాయిలంతా ఇంకో పక్క.

మోహన్ గుర్రం మొఖం వేసుకుని ఎదురుగా కూర్చున్నాడు.

వినీష పక్కనే ఉన్న ఉమ, "ఏంటే మీ వోడు ఈరోజు కూడా ట్రై చేశాడా?" అని అడిగింది.

"ఊరుకోవే.. మా వాడు ఏంటి, అసలే ఒళ్ళు మండుతుంటే" అంది వినిషా.

"అమ్మాయిలు.. సైలెన్స్ ప్లీజ్" అన్నారు మాస్టారు.

క్లాస్ అయ్యింది.

"ఇప్పుడు బయటకి వెళ్ళాలి అంటే భయం వేస్తుంది. వెనుకే మరలా మరలా వస్తున్నాడు" అంది వినీష.

"మరి మాస్టారికి చెప్పు" అంది ఉమ.

"అమ్మో వద్దు, మరల అందరిలో హైలైట్ అయిపోతాను" అంది వినీష.

"సరే పోనీ ఇంట్లో నైనా చెప్పు" అంది ఉమ.

"నాన్న జాబ్ కోసం వేరే ఊరులో వుంటారు. ఇక్కడ ఉండేది నేను, అమ్మ ఇంకా చెల్లెల్లు. ఇలాంటి విషయాలు చెపితే అమ్మ చదువు మానేసి ఇంట్లో కూర్చో అంటుంది" అంది వినీష.

"అమ్మో! తల్లి ఇంక వదిలేయ్. దీనికి ఒకటే పరిష్కారం, ఎవరైనా బాడీ గార్డ్ ని పెట్టుకో.. వాడి లాంటి వాడిని" అంది ఉమ.

ఒకతను వైట్ కలర్ షర్ట్ లో వెనుతిరిగి కూర్చుని ఏదో నోట్స్ కాపీ చేసుకుంటున్నాడు.

"ఎవరతను?" అంది వినీష.

"న్యూ అడ్మిషన్, బాయ్స్ కాలేజ్ అంట, నిన్ననే నలుగురు గ్రూప్ గా జాయిన్ అయ్యారు" అని చెప్పింది ఉమ.

***

ట్యూషన్ అయిపోయాక, ముందు రోజు ఆబ్సెంట్ అయితే, అక్కడే నోట్స్ కాపీ చేసుకునే వాళ్ళు. వినీష అంతకు ముందు రోజు రాలేదు నోట్స్ వంకతో కాసేపు ఉంటే.. ఆ మోహన్ గాడు వెళ్ళి పోతాడు అనుకుంది వినీష.

ఉమ వెళ్ళి వైట్ షర్ట్ అబ్బాయి దగ్గర నుంచుంది. అతను ఏమి కావాలి అన్నట్టు తల ఎత్తి చూసాడు.

"నోట్స్.." అంది ఉమ.

ఈలోపు శ్యామ్యూల్ సర్ కాఫీ కప్ తో బయటకి వచ్చారు.

"ఉమా.. నిన్న నువ్వు క్లాస్ కి వచ్చావ్ కదా! అతను న్యూ గా జాయిన్ అయ్యాడు కాబట్టి, నోట్స్ కాపీ చేసుకోవడానికి కొంచెం ఎక్కువ టైమ్ పడుతుంది" అన్నారు.

"నాకు కాదు సర్, నిన్న వినీష క్లాస్ ఆబ్సెంట్, తనకి నోట్స్. నేను ఈరోజు నోట్స్ మర్చిపోయి వచ్చా సర్ అంది ఉమ.

ఆ మాట వినగానే అతను తల తిప్పి వెనుక్కి చూసాడు.

కళ్ళకి కలకండలా, ముగ్ధ మనోహరంగా కనిపించింది వినీష.

వెనుతిరిగిన అతన్ని చూసి, 'అబ్బో.. పర్లేదు, ఈ టౌన్ లో కూడా అందగాళ్ళు ఉన్నారు' అనుకుంది వినీష.

అతను తిరిగి తిరిగి చూడటం లోపల సంతోషం అనిపించినా.. కళ్ళు కలిపితే వీడూ జీడిపాకంలా తగులు కుంటాడు అని ఉమ వైపు చూసింది.

"సరే నోట్స్ మీరు తీసుకోండి, నేను రేపు రాసుకుంటాను" అన్నాడు ఆ వ్యక్తి.

"ఓకే విశాల్" అన్నారు శామ్యూల్ సర్.

అతను బ్యాగ్ తీసుకుని వెళ్ళి పోయాడు. వెళ్ళే ముందు మరల ఒకసారి చూస్తాడని ఎక్స్పెక్ట్ చేసింది వినీష కానీ, విశాల్ చూడలేదు.

వినీషకి కొంచెం అహం దెబ్బతింది. శామ్యూల్ సర్ గమనిస్తున్నారేమో అని సర్దిపుచ్చుకుంది.

వినీష నోట్స్ రాస్తుంటే.. ఎందుకో కళ్ళ ముందు విశాల్ మెదులుతున్నాడు.

ఇంతలో ఉమ, "నీ బాడీ గార్డ్ పేరు విశాల్, నీకు మాచింగ్ వినీష" అంది.

"హే ఊరుకోవే.. వాడు వాడి స్టైల్, మొఖం అద్దంలో చూసుకున్నాడా!" అంది వినీష.

"హమ్మా.. నేను వాడికి ఫస్ట్ లుక్ లోనే పడిపోయానే, నువ్వు మన ట్యూషన్ బ్యూటీ కదా! వాడు నిన్ను ఎక్కడ లైక్ చేస్తాడో..! నువ్వు వాడిని లైక్ చెస్తావో..! అని భయపడి చచ్చా..! అసలె పేర్లు కూడా మాచింగ్" అంది ఉమ.

"బొగ్గుకి, డైమండ్ కి కెమికల్ ఫార్ములా 'c'. అంత మాత్రాన్న రెండూ ఒకటేనా!?" అంది వినీష.

"అబ్బో పర్లేదే.. అమ్మగారు కెమిస్ట్రీ పికప్ చేసారు" అంది ఉమ.

ఇద్దరు నవ్వుకుంటూ బయటకి వచ్చారు.

మోహన్ గాడు బయట వెయిటింగ్. "భగవంతుడా.." అనుకుంది వినీష.

ఉమ వెళ్ళి, "హాయ్ మోహన్" అంది.

'ఇది ఒక్కత్తి, అబ్బాయి కనపడితే పళ్ళు ఇకిలిస్తాది' అని లోపలే అనుకుంది వినీష.

"ఏంటి అమ్మగారు నిన్న రాలేదు?" అన్నాడు మోహన్.

"నేను వచ్చాను కదా నిన్న.." అంది ఉమ.

'ఈ వెధవ దాని సాకుతో నన్ను అడుగుతున్నాడు' అని విసురుగా సైకిల్ తీసి బయలు దేరింది వినీష.

కొద్దిగా ముందుకి వెళ్ళాక ఒక మలుపు తిరిగింది. అక్కడా సైకిల్ అద్దంలో మోహన్ కనిపించాడు. 'వెధవ వెనుకాలే వస్తున్నాడు, పూర్వజన్మలో కుక్క అయి ఉంటాడు. ఛీ..! అన్నా సిగ్గులేదు' అనుకుంటూ వేగం పెంచింది.

***

# PART 4

ఎంత ఫాస్ట్ గా తొక్కినా మోహన్ వెనకాల వస్తూనే ఉన్నాడు. రోడ్ బాగాలేదు, ఇంకా ఫాస్ట్ గా వెళితే పడిపోవడం ఖాయం. ఉమా ఏ నిమిషంలో అందో తెలీదు కానీ, కొద్దీ దూరంలో విశాల్ వెళుతూ కనిపించాడు. వినీష వెంటనే సైకిల్ స్పీడ్ పెంచి.. విశాల్ సైకిల్ పక్కకు చేరింది. అతనితో మాట్లాడకుండా అతనికి దగ్గరగా సైలెంట్ గా వెళ్ళింది.

ఏదో పరధ్యానంలో ఉన్న విశాల్ కొంచెం సేపటికి వెనక్కి తిరిగి చూసాడు. తన వెనకే వస్తున్న వినీషని చూసాక కళ్ళు సూర్యకాంతాలై విచ్చుకున్నాయి. పలకరింపుగా నవ్వాడు.

అనవసరంగా వచ్చానేమో, ఇప్పుడు ఇతను ఏమనుకుంటాడో అనుకుంటూ.. తిరిగి ఒక మందహాసం పడేసింది.

“ఏంటి మీ ఇల్లు కూడా ఇటు వైపేనా..!” అని అడిగాడు.

అవునన్నట్లు తల ఊపింది.

“నోరు తెరిచి చెప్పండి, ముత్యాలు రాలితే నేను పట్టుకుపోను” అన్నాడు విశాల్.

“రాలితే తీసుకు వెళ్ళిపోండి, నాకు బంగారం అంటేనే ఇష్టం” అని సన్నగా నవ్వింది.

“అంటే మీరంటే మీకే ఇష్టం అన్నమాట” అన్నాడు.

“అబ్బో.. మీతో మాట్లాడడం కష్టం. మా ఇల్లు ఉమెన్స్ కాలేజ్ దాటాక కుడివైపు రెండో సందు, మరి మీ ఇల్లు?” అంది.

“ఉమెన్స్ కాలేజ్ కి ఎదురుగా ఉన్న.. స్ట్రీట్ లో” అన్నాడు విశాల్.

"ఓహో.. అయితే ప్లాన్ చేసి మరీ తీసుకున్నారన్న మాట" అని ఆట పట్టిస్తూ అంది.

"అవునండి, మా సిస్టర్ ఉమెన్స్ కాలేజ్ లో చదువుతుంది. దగ్గరగా ఉంటుందని ప్లాన్ చేసాం" అన్నాడు విశాల్.

ఈలోపు ఉమెన్స్ కాలేజ్ వచ్చింది.

"ఉంటానండి, రేపు కలుద్దాం" అని రైట్ సైడ్ కి టర్న్ అయ్యాడు విశాల్.

ముక్తసరిగా తల ఊపి, వినీష ఒక్క క్షణం స్లో చేసి వెనక్కి తిరిగి చూసింది. మోహన్ గాడి జాడ కనపడలేదు. 'హమ్మయ్య..' అనుకుంటూ ముందుకు వెళ్ళిపోయింది.

వెళుతున్న వినీష మనసులో ఆగి ఆగి వస్తున్నాయి ఆలోచనలు. 'ఏంటి.. వీడు చాల జెంటిల్ గా ఉన్నాడు, ఒరిజినల్ అంతేనా..! లేక యాక్ట్ చేస్తున్నాడా!? వాడి నవ్వు కూడా బాగుంది. అయినా మనకెందుకు, ఈరోజు మోహన్ గాడిని తప్పించుకోవడానికి ఉపయోగపడ్డాడు అంతే' అని తన పోజిటివ్ ఫీలింగ్ ని అణచి వేసుకుంది.

అయితే టర్న్ తీసుకుని వెళ్ళిన విశాల్ ఆలోచనలు ఇంకోలా ఉన్నాయి. 'ఏంటీ ఈ లక్ నాకు, వినీష లాంటి బ్యూటీ తనంతట తానే వచ్చి మాట్లాడం ఏంటి..? పైగా చాలా జోవియల్ గా ఎన్నో ఏళ్ళ నుండి తెలిసినట్లు మాట్లాడ్డం.. చాల ఆశ్చర్యం, ఆనందం కలిగిస్తుంది' అనుకున్నాడు.

ఇంట్లోకి వెళ్ళి బుక్స్ బ్యాగ్ పక్కన పెట్టి, "అమ్మా.. టిఫిన్ పెట్టు కాలేజ్ కి వెళ్ళాలి అన్నాడు. టీవీలో నాగార్జున నిర్ణయం సాంగ్ వస్తుంది. "హలో గురూ.. ప్రేమ కోసమే రో.. జీవితం.." అని బాలు శ్రావ్యంగా పాడుతుంటే, తానూ గొంతు కలిపి పాడాడు విశాల్.

ఈలోపు అక్కడికి వచ్చింది అతని చెల్లెలు స్వప్న, "ఏంటి సర్ మంచి మూడ్ లో ఉన్నారు" అంది.

"పోవే అన్నీ నీకు చెప్పాలా!?" అన్నాడు.

"సరే అమ్మకి చెప్పుదువు" అంటూ "అమ్మ.. అన్నయ్య.. హలో గురు ప్రేమ కోసమే రో.. జీవితం.. అంటున్నాడు" అంది.

"ఒసేయ్ రాక్షసి.. పాట పాడటం కూడా తప్పేనా! ఈసారి నువ్వు పాడినప్పుడు చెప్తా" అన్నాడు విశాల్.

"ఎలా పాడానో చెపుతావా!" అని కొంటెగా అంది స్వప్న.

"హా.. నీ గాడిద గొంతుకు మరలా ఫీడ్ బ్యాక్ ఒకటి" అన్నాడు విశాల్.

"అమ్మా చూడే వీడు.. నన్ను గాడిద అంటున్నాడు" అంది స్వప్న.

ఇంతలోపు విశాల్ తల్లి.. అనంత బయటకు వచ్చింది, "పొద్దునే మొదలైందా! ఒరే.. ఇదిగో టిఫిన్! టేబుల్ పై పెట్టాను తిని కాలేజీ కి వెళ్ళండి" అంది.

అలా తిట్టుకుంటారు గాని.. వాళ్ళిద్దరికీ ఒకరంటే ఒకరికి ఎంత అభిమానమో అనంతకి తెలుసు.

టిఫిన్ తింటున్నాడు గాని, కనురెప్పల లోపల ఫోటో అంటించినట్టు వినీషే.. కనపడుతుంది.

'ముత్యాలు రాలితే తీసుకెళ్ళిపోండి' అని ఆమె అన్న మాట.. గంటు పడిన గ్రామ్ ఫోన్ లాగా మరలా మరలా రిపీట్ అవుతుంది.

"ఏరా.. అంతా బాగానే ఉందా!? ఏంటి అదోలా ఉన్నావ్?" అంది స్వప్న.

"ఏమి లేదులే.. కాలేజ్ కి టైమ్ అవుతుంది వెళ్తాను" అని ఈ విషయం సత్యమూర్తికి చెప్పాలి అనుకుంటూ బయటపడ్డాడు.

***

సత్యమూర్తి, విశాల్ కి ప్రాణ స్నేహితుడు. చాలా ప్రాక్టికల్ పర్సన్. విశాల్ అంటే తనకి ప్రాణం, అలాగే విశాల్ కి కూడా. వీళ్ళిద్దరి మధ్య ఏమి దాపరికాలు వుండవు. తనకి తల్లి తండ్రి లేరు, వాళ్ళ మామయ్య అతన్ని పెంచి పెద్ద చేసాడు. మంచి ఆస్తి పరుడు, విశాల్ కి ఇంచు మించుగా వుండే వ్యక్తి.

కాలేజ్ కి వెళ్ళేసరికి, యధావిధిగా సన్యాసమ్మ టీ కొట్టు దగ్గర గ్యాంగ్ అంతా టీ తాగుతున్నారు.

సత్యమూర్తి కనిపించలేదు, వాడు ఆరోజు కాలేజ్ కి రాలేదు. రెండు క్లాసులు విన్నాక, 'వీడు ఈరోజు ట్యూషన్ కి కూడా రాలేదు, ఆరోగ్యం బాలేదా!?' అనుకుంటూ సత్యమూర్తి ఇంటికి బయలు దేరాడు.

విశాల్ వెళ్ళే సరికి సత్యమూర్తి, ఇంట్లోనే ఉన్నాడు, స్టోర్ రూమ్ లో ఏదో సర్దుతున్నాడు.

"ఏరా.. ఆరోగ్యం బాగానే ఉందా?" అని పలకరించాడు విశాల్.

"బాగానే ఉందిరా.." అన్నాడు సత్యమూర్తి.

"మరి ఎందుకు రాలేదు" అని అడిగాడు విశాల్.

"ఒరేయ్ నువ్వు నమ్మవు గాని.. నేను ఒక అద్భుతం చూసాను ఈరోజు" అన్నాడు సత్యమూర్తి.

"అవునా రా..! మనిద్దరికీ ఈరోజు బాగున్నట్టు వుంది. నేను కూడా ఒక అద్భుతం చూసాను" అన్నాడు విశాల్.

"నీ మొహం.. నేను చెప్పేది వింటే నువ్వు ఆశ్చర్యపోతావు" అన్నాడు సత్యమూర్తి.

'ఏంటది? వాడు చాలా అంటే చాలా ప్రాక్టికల్ పర్సన్, వాడు అద్భుతం అన్నాడు అంటే.. అది నిజంగా ఏదో స్పెషల్ అయ్యి వుంటింది' అనుకుని.. "ఏంటిరా అది?" అన్నాడు విశాల్.

"నువ్వు వీధి గది తలుపు వేసిరా" అన్నాడు సత్యమూర్తి.

"ఇంట్లో ఎవరు లేరా..!" అని అడుగుతూ స్టోర్ రూమ్ లోకి వెళ్ళాడు విశాల్.

అక్కడంతా పాత కాలపు పరికరాలు ఉన్నాయి. hmv గ్రామ్ ఫోన్, ఒక మైక్రోస్కోప్, పాత మరఫీ రేడియో, రంగూన్ రోజ్ వుడ్ బాక్స్ మొదలైనవి.

"ఏంటిరా ఇవన్నీ.." అన్నాడు విశాల్.

"మా ఊర్లో ఇల్లు రీమోడల్ చేస్తున్నాం, అందుకని ఇవి ఇక్కడ పెట్టాము. మా తాతల కాలం నాటి వస్తువులు ఇవి. ఆయన బ్రిటిషర్ల తరుపున హిట్లర్ పై

యుద్ధంలో పాలొగొన్నారు. రెండవ ప్రపంచ యుద్ధం తరువాత ఆయన జర్మనీ నుండి తెచ్చిన వస్తువులు" అని గర్వంగా చెప్పాడు సత్యమూర్తి.

"ఓహ్! నిజంగా అద్భుతం" అన్నాడు విశాల్.

"ఓయ్, ఇవన్నీ చాలా మంది దగ్గర ఉంటాయి కానీ, ఆ ప్లాస్టిక్ కవర్ కింద ఒకటి వుంది అది నేను చెప్పిన అద్భుతం" అన్నాడు సత్యమూర్తి.

విశాల్ వెళ్ళి ఆ కవర్ తీసాడు, దాని కింద ఒక పాత సినిమా ప్రొజెక్టర్ వుంది.

"ఓహ్! ప్రొజెక్టరా..!" అన్నాడు విశాల్.

"కాదు.. అది అది.." అని నసిగాడు సత్యమూర్తి.

"హో ఏంటో చెప్పారా?.. అన్నాడు విశాల్.

"టైమ్ మెషీన్.." అన్నాడు సత్యమూర్తి.

***

# PART 5

"ఏరా.. మొన్ననే కదా ఆదిత్య 369 సినిమా చూశాం, ఇంకా హాంగోవర్ దిగలేదా!" అని పకపకా నవ్వాడు విశాల్.

"నిజం రా.. మా ఫాదర్ చాలా సార్లు చెప్పే వారు, హిట్లర్ దగ్గర ఇలాంటి కళాకృతులు చాల ఉండేవంట, మా తాత గారు జర్మనీ నుండి వచ్చాక దీనిని ఎలా వాడాలో తెలీదని కానీ, ఇది పనిచేయడం చూసానని చెప్పారంట. ఆయన దీన్ని ఎలా వాడాలో ట్రై చేస్తూ.. చేస్తూ.. మధ్యలో కాలం చేసారు. ఆ తరువాత మా ఫాదర్ కి ఇలాంటి వాటి మీద నమ్మకం లేదు. అయితే ఆయన పోయే ముందు ఇది ఎవ్వరికి ఇవ్వద్దని.. ఇది చాలా ప్రమాదం అని చెప్పారంట.

అది మా మామయ్య నాకు ఒకసారి చెప్పారు. అయితే ఆయన కూడా దీన్ని పెద్దగా పట్టించుకోలేదు. మాకెవ్వరికి ఆ రూమ్ లోకి ప్రవేశం లేదు. ఇప్పుడు మామయ్య కూడా వెళ్ళిపోయారు. మా అన్నయ్య ఊరిలో ఇల్లు రీ-మోడెలింగ్ చేయిస్తున్నాడు. అందుకే ఇవన్నీ ఇక్కడికి షిఫ్ట్ చేసారు. నాకు తప్ప దీని గురించి మామయ్య ఎవరికీ చెప్పలేదు" అంటూ గడగడా చెప్పాడు సత్యమూర్తి.

"ఐతే ఇది నిజంగా అద్భుతం రా! మనం ట్రై చేద్దాం" అన్నాడు విశాల్.

ఆ మాట తథాస్తు దేవతలు విన్నట్లు ఉన్నారు, విశాల్ కి ఆ క్షణం తెలీదు, తన జీవితం పూర్తిగా మారిపోతుంది అని.

"అదే ట్రై చేద్దాం, అని ఈరోజు కాలేజ్ డుమ్మా కొట్టాను" అన్నాడు సత్యమూర్తి,

"ఏంటి నాకు తెలీకుండానే?" అన్నాడు విశాల్.

"లేదురా నీకు చెప్పకుండానా! ఎలా చేస్తాను?" అన్నాడు సత్యమూర్తి.

ఇద్దరూ కలిసి దాని వైర్ లు.. ప్లగ్ కి కనెక్ట్ చేసి స్విచ్ ఆన్ చేసారు. ఎటువంటి అలికిడి లేదు, చాల రోజులు అయ్యింది కదా..! వైర్లు పాడై ఉంటాయి, అందుకే ఆన్ కావడం లేదు అనుకున్నారు.

“ఎవరైనా ఎలక్ట్రీషియన్ ని పిలుద్దామా!” అన్నాడు విశాల్.

“వద్దు.. వద్దు.. ఇది ఉన్నట్టు ఎవరికీ తెలీకూడదు. మనమే ట్రై చేద్దాం” అన్నాడు సత్యమూర్తి.

***

ఆ మరునాడు శనివారం! ట్యూషన్ ఎనిమిదిన్నరకి అని విశాల్ ఆరు గంటలకే లేచాడు.

స్వప్న, చీపిరుతో రూమ్ లోకి వచ్చింది.

“అబ్బా.. పొద్దున్నే చీపిరి కట్ట, చింపిరి జుట్టుతో నీ దర్శనం.. బయటికి పో” అన్నాడు.

“ఒరేయ్.. నేను రోజూ.. ఈ టైమ్ కే రూమ్ ఊడుస్తాను. నువ్వే కొత్తగా ఈ టైమ్ కి లేచావ్! రేపటి నుండి ఫుల్ మేకప్ వేసుకుని వస్తాలే” అని నవ్వుతూ అంది స్వప్న.

“మేకప్ కాకపోతే.. మేక తోలు కప్పుకుని రా! అవతలికి పో ఇప్పుడు..” అని కసురు కున్నాడు విశాల్.

“ఉండు అమ్మకి చెప్తా..” అంటూ విసురుగా వెళ్ళింది స్వప్న.

ఆ తర్వాత టకటకా లేచి ట్రిమ్ గా తయారయ్యాడు. వాళ్ళ నాన్నగారు హైదరాబాద్ చెర్మాస్ నుండి తెచ్చిన జీన్ ప్యాంటు, జాకెట్ బయటకి తీసాడు. షూ వేసుకుంటుంటే..

“అబ్బో ఏదో వుంది సంగతి! నిన్నటి నుండి చూస్తున్నాను, ఎవరు రా ఆ అమ్మాయి?” అంది స్వప్న.

“హేయ్.. అమ్మాయి ఏంటి?” అన్నాడు విశాల్.

అలా అన్నాడు కానీ.. వినీష కళ్ళ ముందు కదిలి, సన్నగా నవ్వు వచ్చింది.

"అదిగో.. అదిగో.. ఎవరు లేకపోతే ఆ ముసి ముసి నవ్వు ఎందుకు?" అని ఆటపట్టిస్తూ అంది స్వప్న.

"ఏంటే నీ గోల, ఏమి లేని నాకు ఏదో ఒకటి అంట గట్టేలా ఉన్నావ్! అయినా ఎప్పుడు చూసినా అదే యాంగిల్ లో ఆలోచస్తున్నావ్!? ఏంటి సంగతి? మా బావని ఏమన్నా సెలెక్ట్ చేసావా?" అన్నాడు విశాల్.

"ఇదిగో మాట మార్చకు" అంది స్వప్న.

ఈ లోపు అనంత లోపలి నుండి వచ్చింది. "ఒరేయ్ గట్టిగా అరవకండి, నాన్నగారు నిద్ర పోతున్నారు" అంది.

"నాన్న మార్నింగ్ వచ్చారా!? అయినా అంతా దీని వల్లే..! అమ్మా నేను ఇంట్లో ఉండగా దీన్ని మరల అనాధ ఆశ్రమం నుండి ఎందుకు తెచ్చారు?" అన్నాడు విశాల్.

స్వప్న ముఖం ఎర్రగా మారింది, "నన్ను కాదు నిన్నే తెచ్చారు. అమ్మా.. నువ్వు చెప్పు" అంది.

"అబ్బా.. మీరిద్దరూ నా పిల్లలు కాదే! ఇద్దరినీ అనాధ ఆశ్రమం నుండి తెచ్చాం" అంది అనంత.

"పోమ్మా.. నువ్వు ఎప్పుడూ దాని పార్టీనే" అంటూ సైకిల్ తీసుకుని బయటకి వెళ్ళిపోయాడు విశాల్.

వెళుతున్న విశాల్ ని చూసి, "అన్నయ్య హీరో లా ఉన్నాడు కదే" అంది స్వప్న.

అనంత నవ్వుతూ "ఆ విషయం వాడికే చెప్పు" అంది.

"ఇంకా నయం, నెత్తినెక్కి కూర్చుంటాడు" అంటూ లోపలి వెళ్ళింది స్వప్న.

"ఏంటో వీళ్ళ ప్రేమ.." అంటూ మురుసుకుంటూ తలుపేసుకుంది అనంత.

***

టైమ్ ఎనిమిది దాటి పదిహేను నిముషాలు, సరిగ్గా.. నిన్న వినీషని వదిలి టర్నింగ్ తీసుకున్న చోట నిలబడి ఎదురు చూస్తున్నాడు విశాల్.

ఇంతలో దూరంగా సైకిల్ పైన వినీష! పిల్ల తెమ్మరకు, విరబోసుకున్న కురులు పైకి లేచి.. దిష్టి తగులుతుందని కాబోలు ఆమె ముఖారవిందాన్నీ కప్పడానికి ప్రయత్నం చేస్తున్నాయి. ఆమె కోమలమైన చేయి వాటిని వారిస్తూ పక్కకి త్రోసి బుచ్చుతుంది.

దూరంగా నిలబడి ఉన్న విశాల్ కనిపించాడు. అది ఎక్స్పెక్ట్ చేసిన విషయమే, ఇంతకు ముందు ఎంత మందిని చూడలేదు అని కొంచెం గర్వంగా ఫీల్ అయ్యింది వినీష.

తనని చూసి కూడా చూడనట్లు వెళ్తున్న వినీషని చూసి, 'అవునులే నీ గ్లామర్ కి.. ఆ మాత్రం గర్వం ఉండాలి' అని అనుకుని, వెనుకే ఫాలో అయ్యాడు విశాల్.

'పక్కకి చేరుకుని "గుడ్ మార్నింగ్, మీ డ్రెస్ బాగుంది" అన్నాడు.

"హో థాంక్స్" అంది.

"మీ డ్రెస్ బాగుంది అన్నాను, మీరు కాదు" అని నవ్వుతూ అన్నాడు.

"అర్థం అయ్యింది, దానికి నోరు లేదు కదా! అందుకే.. దాని తరుపున నేను చెపుతున్నా" అంది.

"అబ్బో వకాల్తా నా..!" అన్నాడు.

"కాదు భరోసా..!" అంది.

ఇంతలో ట్యూషన్ వచ్చింది. అందరూ బయట ఉన్నారు.

'ఏంటిది టైమ్ అయిపోయాక కూడా అందరూ బయట ఉన్నారు?' అనుకున్నాడు విశాల్.

అయితే విశాల్, వినీష కలిసిరావడం, అక్కడున్న ఉమకి, మోహన్ కి ఎంత మాత్రం నచ్చలేదు. మోహన్ ముఖం కంద గడ్డలా మారింది.

సత్యమూర్తి దగ్గరికి వెళ్ళి, "ఏంటిరా ఇంకా బయట ఉన్నారు?" అని అడిగాడు విశాల్.

"శ్యామ్యూల్ సర్ బ్రదర్.. ఎడ్వర్డ్ వచ్చారంట, ఆయన వెళ్ళే వరకు వెయిట్ చెయ్యమన్నారు" అని చెప్పాడు సత్యమూర్తి.

"ఓహ్! ఆయన కూడా ప్రొఫెసరా?" అని అడిగాడు విశాల్.

"హా.. బట్, ఫిజిక్స్ లో అంట, ఆయన Inter–University Centre for Astronomy and Astrophysics, పూణే లో ఆస్ట్రో ఫీసిస్ట్ అన్నాడు సత్యమూర్తి.

'నోరు తిరగని పదాలు' అనుకున్నాడు విశాల్!

ఇంతలో శామ్యూల్ సర్.. తన బ్రదర్ తో బయటకి వచ్చారు.

"గైస్.. ఈయన నా తమ్ముడు ఎడ్వర్డ్, ఆస్ట్రో ఫీసిస్ట్! త్వరలో నాసాకి వెళ్ళబోతున్నారు" అని చెప్పారు.

అందరూ క్లాప్స్ కొట్టారు. దూరంగా వినీష, ఉమ ఉన్నారు. వాళ్ళు క్లాప్స్ కొట్టడం లేదు. విశాల్ కొట్టండి అన్నట్టు సైగ చేసాడు.

ఉమ మూతి తిప్పింది, వినీష క్లాప్స్ కొట్టింది.

"ఓకే.. ఓకే.. థాంక్స్ ఫర్ యువర్ applause, ఇక్కడ టూ వీలర్ లైసెన్స్ ఎవరికి వుంది?" అని అడిగారు శ్యామ్యూల్.

విశాల్ కి, సత్యమూర్తి కి తప్ప ఎవరి దగ్గరా లేదు. వాళ్ళు ఇద్దరూ చెయ్యి ఎత్తడం చూసి, "సత్యమూర్తి నాకో హెల్ప్ చెయ్యాలి. మా బ్రదర్ ని కొద్దిగా రైల్వే స్టేషన్ లో డ్రాప్ చెయ్యాలి" అని అడిగారు.

"అలాగే సర్.." అంటూ సత్యమూర్తి ముందుకి కదిలాడు.

"ఒరేయ్.. నాకు ఆయనతో పని వుంది నేను వెళ్తాను" అన్నాడు విశాల్.

సత్యమూర్తి ఎందుకు ఏమిటి అని అడగలేదు.

"సర్ విశాల్ వెళ్తాడు. వాడు నాకన్నా బాగా డ్రైవ్ చేస్తాడు" అన్నాడు.

అదే సత్యమూర్తిలో ప్రతేకత, విశాల్ ఏమి చేసినా, ఏమి అడిగినా.. ఏరోజూ కాదనడు.

శ్యామ్యూల్ సర్ వెస్పా తీసుకుని బయలుదేరాడు విశాల్.

***

"సర్ ఆస్ట్రో ఫిజిక్స్ అంటే ఏంటి?" అని అడిగాడు విశాల్.

"Astrophysics is a branch of physics, that deals with the study of celestial objects, their properties, and the physical processes that govern them" అన్నారు ఎడ్వర్డ్.

అది అటు ఇటు అర్థం అయ్యింది విశాల్ కి, "ఇంకో ప్రశ్న అడిగనా సర్?" అన్నాడు.

"ఎస్ వై నాట్.." అన్నారు ఎడ్వర్డ్.

"టైమ్ మెషిన్ నిజంగా ఉందా సర్? అసలు టైమ్ లో ట్రావెల్ చేయచ్చా?" అని అడిగాడు విశాల్.

"మంచి ప్రశ్న!" అని ఎడ్వర్డ్ చెప్పడం స్టార్ట్ చేసాడు.

***

# PART 6

ఎడ్వర్డ్ చెప్పడం మొదలు పెట్టాడు.

"టైమ్ ట్రావెల్ అంటే కాలంలో ప్రయాణం అన్నది తప్పకుండా సాధ్యం, అయితే అది ఎలాగో ఇంకా మనకి తెలీదు" అన్నాడు.

"తెలియనిది సాధ్యం ఎలా అవుతుంది సర్" అన్నాడు విశాల్.

"సరే, నీకు కార్ డ్రైవింగ్ వచ్చా?" అని అడిగాడు ఎడ్వర్డ్.

"లేదు సర్, ఇంకా నేర్చుకోలేదు" అన్నాడు విశాల్.

"అంటే ఈరోజు నీకు డ్రైవింగ్ రాదు కాబట్టి, అసలు కార్ డ్రైవింగ్ అన్నది అసాధ్యం అంటే ఒప్పుకుంటావా? విశాల్.. మనకు తెలిసే వరకు అన్నీ మనకు వింత, తెలిసాక అదొక పాత రోత" అన్నాడు ఎడ్వర్డ్.

"కానీ, కార్ డ్రైవింగ్ సాధ్యమని అందరికి తెలిసిన విషయం కదా! సర్" అన్నాడు విశాల్.

"అవును, టైమ్ ట్రావెల్ కూడా సాధ్యమని నిరూపించే సిద్ధాంతం, ఐనస్టీన్ స్పెషల్ థియరీ అఫ్ రిలేటివిటీ. దీని ద్వారా టైమ్ బెండింగ్, టైమ్ డైలేషన్ ఎలా సాధ్యమో! సిద్ధాంత పరంగా నిరూపించవచ్చు" అని చెప్పాడు ఎడ్వర్డ్.

ఈలోపు రైల్వే స్టేషన్ వచ్చింది, విశాల్ వెళ్ళి టూ వీలర్ పార్క్ చేసి వచ్చాడు. ట్రైన్ రెండు గంటలు లేట్. ఇద్దరు స్టేషన్ లో కూర్చున్నారు.

"సర్, ఇది నాకు అర్థం కాని విషయం. కొద్దిగా వివరంగా చెపుతారా?" అని అడిగాడు విశాల్.

"సరే! మనిద్దరం ఈ రైల్వే స్టేషన్ లోకూర్చున్నాం, ఇదే టైమ్ కి. ఇంకో ఇద్దరు సరిగ్గా మన వయసు వారే.. ఒక రాకెట్ లో అంతరిక్షం లోకి వెళ్ళారు అనుకుందాము. వాళ్ళ రాకెట్ కాంతి వేగంతో ప్రయాణించింది అనుకో.. సరిగ్గా ఒక ఐదు సంవత్సరాల తరువాత వాళ్ళు భూమి మీదకు వచ్చారు అనుకుందాం.

అప్పుడు భౌతికంగా వాళ్ళ వయసు.. మనకన్నా తక్కువ ఉంటుంది. దీనినే ట్విన్స్ పారడాక్స్ అంటారు'' అన్నాడు ఎడ్వర్డ్.

"చాలా వింతగా వుంది సర్! అదెలా సాధ్యం?'' అని ఆశ్చర్యంగా అడిగాడు విశాల్.

"మనం భూమి మీద ఉన్నాం కాబట్టి, భూమి యొక్క గురుత్వాకర్షణ మన వయసుని నిర్దేశిస్తున్నది కానీ, అంతరిక్షంలో.. ఒకొక్క ప్రదేశంలో గురుత్వాకర్షణ ఒకొక్క రకంగా ఉంటుంది. దానిని బట్టి మన భౌతిక దేహం పైన మార్పులు ఉంటాయి. ఐనస్టీన్ సిద్ధాంతం భూమిపై మరియు అంతరిక్షంలో అత్యంత ఖచ్చితమైన పరమాణు గడియారాలతో కూడిన ప్రయోగాల ద్వారా ఈ ప్రభావం నిర్ధారించబడింది.

దీని ఆధారంగా గురుత్వాకర్షణను, మన భౌతిక వేగాన్ని కంట్రోల్ చేస్తూ.. కాలంలో ముందుకి వెనక్కి వెళ్ళచ్చు అన్నది నిజం. ఐతే పైన చెప్పిన రెండిటినీ.. ఎలా మేనేజ్ చెయ్యాలో అని ఎన్నో ప్రయోగాలు చేస్తున్నారు. అది వీలైన రోజున.. మనం టైమ్ ట్రావల్ చూస్తాం'' అన్నారు ఎడ్వర్డ్.

'అబ్బా ఈయన ఎంత జీనియస్..' అనుకున్నాడు విశాల్

"సర్.. నాకు ఇంకొక్క ఆఖరి డౌట్ వుంది'' అన్నాడు విశాల్.

ఎడ్వర్డ్ నవ్వుతూ "ఏంటి.. నువ్వే ఒక టైమ్ మిషీన్ కనిపెడతావా?'' అన్నాడు.

"అయ్యో.. నాకు అంత బుర్ర లేదు సర్! ఎవరో చెపితే విన్నాను, హిట్లర్ దగ్గర టైమ్ మిషీన్ ఉండేదని, అది నిజామా?'' అని అడిగాడు విశాల్.

"ఆ విషయం నాకు తెలీదు కానీ, రెండో ప్రపంచ యుద్ధం గెలవడానికి హిట్లర్ చాలా ఎక్సపరమెంట్స్ చేసిన మాట నిజం.

"ది నాజీ డాక్టర్స్: మెడికల్ కిల్లింగ్ అండ్ ది సైకాలజీ ఆఫ్ జెనోసైడ్, రాబర్ట్ జే లిఫ్టన్ లాంటి పుస్తకాలు చదివితే ఇంకా ఎక్కువ విషయాలు తెలియవచ్చు'' అని సలహా ఇచ్చాడు ఎడ్వర్డ్.

"చాలా చాలా థాంక్స్ సర్, మరి ఈ ఎక్సపరమెంట్ ఎలా పని చేస్తాయో మిగతా వాళ్ళకి ఎలా చెప్పేవారు?" అని అడిగాడు విశాల్.

"సింపుల్.. ప్రతి ప్రయోగానికి ఓక Gebrauchsanleitung (సూచన పట్టిక instruction manual) పుస్తక రూపంలో ఉంటుంది. అయితే అది కొంత మందికి మాత్రమే పరిమితం" అన్నాడు ఎడ్వర్డ్.

ట్రైన్ రావడంతో ఎడ్వర్డ్ ట్రైన్ ఎక్కి వెళ్ళిపోయాడు.

విశాల్ స్కూటర్ బయటకి తీసి, 'అంటే అది ఎలా వాడాలో చెప్పే పుస్తకము ఉందన్న మాట, మూర్తి గాడికి ఇది చెప్పాలి' అనుకుంటూ బయలు దేరాడు.

***

కాలేజ్ లో సత్యమూర్తి కలిసాడు, జరిగిందంతా చెప్పాడు విశాల్.

"బుక్ లాంటిది ఏది ఉన్నట్టు నాకు తెలీదు, ఒకసారి ఊరు వెళ్ళి చూస్తా" అన్నాడు సత్యమూర్తి.

"ఎప్పుడో ఎందుకు? రేపు సండే కదా వెళ్దాం" అన్నాడు విశాల్.

ఇద్దరూ ఈవెనింగ్ ప్రియ స్కూటర్ మీద బయలుదేరి వెళ్ళారు.

ఊరు వెళ్ళే సరికి, రాత్రి ఎనిమిది అయ్యింది. భోజనాలు అయ్యాక మేడ పైన ఉన్న రూమ్ కి వెళ్ళారు, అంతా ఖాళీగా వుంది.

"బుక్స్ ఏమి లేవురా!" అన్నాడు సత్యమూర్తి.

దాంతో దిగులుగా పడుకున్నారు. పైన దూలానికి పాత ఫ్యాన్ గిర్ గిర్ సౌండ్ చేస్తూ తిరుగుతుంది. స్పీడ్ పెంచితే ఊడి కింద పడేలా వుంది. కాసేపు అది ఇది మాట్లాడిన తరువాత, విశాల్.. వినీష గురించి చెప్పాడు.

అంతా విన్న సత్యమూర్తి "ఒరేయ్ నువ్వు అసలే ఎమోషనల్ ఫూల్ వి, ఆమె రేపు నీ ప్రేమ కాదు అంటే తట్టుకోగలవా?" అని అడిగాడు సత్యమూర్తి.

"తాను కాదు అని అనదురా! తనకి నేను అంటే ఇష్టమే" అన్నాడు విశాల్.

"అమ్మాయిలు అంతే రా.. చివరికి వచ్చే వరకు ఏమి మాట్లాడారు. లాస్ట్ లో హ్యాండ్ ఇస్తారు. మీ కులం వేరు వాళ్ళ కులం వేరు.. నువ్వు మీ ఇంట్లో ఒప్పించడం కల్ల" అన్నాడు సత్యమూర్తి.

"అది నిజమే రా! కానీ, నాకు తనే గుర్తు వస్తుంది. ఇన్నాళ్ళు నా జీవితంలో చాల మంది అమ్మాయిలను చూసినా.. ఈమె విషయం వేరు" అన్నాడు విశాల్!

"ఒకసారి ఆలోచించారా! ఇలాంటి వాటిలో పడితే.. చదువు కూడా అటకెక్కుతాది" అన్నాడు సత్యమూర్తి.

విశాల్ నవ్వుతూ "ఒరేయ్ అటక అంటే గుర్తు వచ్చింది. ఈ గదికి అటక ఉంది కదా!" అన్నాడు.

"హా వుంది, పక్క గదిలో నుండి పైకి ఎక్కాలి" అన్నాడు సత్యమూర్తి.

ఇద్దరూ అనుకున్నదే తడవగా గబాగబా అటక ఎక్కారు. చీకటిగా వుంది. సత్యమూర్తి లాంతరు వెలిగించాడు. బాగా బూజు, మట్టి వుంది.

"పాత ఫొటోస్, కొన్ని ఇత్తడి సామాను, విరిగిన చెక్కలు ఉన్నాయి. బుక్స్ ఏమి లేవురా!" అన్నాడు సత్యామూర్తి.

"ఒక్కసారి ఆ చెక్క తీసి చూద్దాం" అన్నాడు విశాల్.

మెల్లగా చెక్క పైకి లేపారు, అక్కడ ఏవో బుక్స్ కనపడ్డాయి. ఒక దాని మీద అచ్చు ప్రొజెక్టర్ పైన ఉన్న గడియారం గుర్తు లాంటిది వుంది. విశాల్ దాన్ని పట్టుకుని లాగాడు. దుమ్ము లేచింది, కాస్త దగ్గుతూ దాన్ని కిందకి విసిరాడు.

అటక దిగి పుస్తకం ఓపెన్ చేసి చూసారు. అంతా వేరే బాషలో వుంది. బహుశా..! జర్మన్ అనుకుంటా! ఏదో బొమ్మలు మాత్రం ఉన్నాయి. అంతా వింతగా వుంది.

"ఏరా..! నీకు జర్మన్ అర్థం అవుద్దా? అన్నాడు మూర్తి.

"ఏంటి వెటకారమా! మనకి ఇంగ్లీషే సరిగ్గా రాదు, ఇక జర్మన్ ఒకటా! కానీ, ఒకటి మాత్రం చెప్పగలను. ఆ ప్రొజెక్టర్ పైన ఉన్న బొమ్మ.. ఈ బొమ్మ ఒకటే! అంటే ఇది దానికి సంబంధించినదే! మనకి జర్మన్ రాదు, పోనీ తెలిసిన వాళ్ళకి ఇది ఇవ్వలేము. ఇప్పుడు ఎలాగరా అన్నాడు విశాల్!

"ఒక మార్గం వుంది" అన్నాడు సత్యమూర్తి!

***

# PART 7

ఆదివారం సాయంత్రం నాలుగు గంటలకి తిరిగి టౌన్ చేరుకున్నారు. కాసేపు వ్యాయామం చేసి అమ్మ ఇచ్చిన టీ కప్ పట్టుకుని మేడ పైకి వెళ్ళాడు విశాల్, బనియన్ పై ఉన్నాడు కాబట్టి తన మజిల్స్ కనపడుతున్నాయి.

ఇంతలో ఎక్కడి నుంచి వచ్చిందో స్వప్న వచ్చి "ఏంటిరా కండలు చూపించడానికి మేడ ఎక్కుతున్నావా?" అంది.

"అవునే.. నాకున్నాయి చూపెట్టుకుంటా నీకేంటి బాధ" అన్నాడు విశాల్.

"వుండు అమ్మతో చెప్తా.." అంది స్వప్న.

"హా.. అమ్మమ్మకి కూడా చెప్పు అన్నాడు విశాల్.

వాళ్ళు వుండే ఇల్లు కరెక్ట్ గా నాలుగు రోడ్ల కూడలిలో ఒక మూల ఉంటుంది. మేడ పైకి ఎక్కితే.. అటు ఇటు వెళ్ళే వాళ్ళతో బోలెడు కాలక్షేపం, అటు ఇటూ చూస్తూ టీ ఎంజాయ్ చేస్తున్నాడు విశాల్.

ఇంతలో వెనుక నుండి చల్లని ఒక పిల్ల తెమ్మెర, 'అబ్బా.. చలి మొదలు' అనుకుంటూ వెనుకకు తిరిగాడు.

రోడ్ పైన తన ఇంటి కూడలి వైపు నడచి వస్తూ వినీష కనపడింది. తాను ఒక్కతే కాదు, కూడా ఇంకో ఇద్దరు చెల్లెల్లు. ముగ్గురూ లైట్ బ్లూ కలర్ డ్రెస్ లో ఉన్నారు. దాదాపు రోడ్ పైన వెళుతున్న అందరూ వాళ్ళనే చూస్తున్నారు.

చెవుల పిల్లుల్లా చూడ చక్కగా ఉన్నారు. ముద్దుగా నడచి వెళుతున్నారు. విశాల్ మేడ పైన ఉండడం వల్ల వినీష చూడలేదు కానీ, పెద్ద చెల్లి మనీష చూసింది. ఆమె చూస్తుందని తెలిసినా విశాల్ రెప్ప వేయడం లేదు. ఉప్పు అందడంతో వినీష తల ఎత్తి చూసింది. ఒక నవ్వు విసిరింది.

కాగితపు రాకెట్ ఇసుకలోకి దిగినట్టు.. అది వచ్చి విశాల్ వాడి గుండెల్లో దిగింది. తిరిగి పలకరింపుగా ఒక నవ్వు నవ్వాడు. వాళ్ళు ముగ్గురు వాళ్ళలో వాళ్ళే నవ్వుకుంటున్నారు.

సీతాకోక చిలుకలు తామర పూవు పై ఆడుకున్నట్లు ఉన్న.. ఆ దృశ్యం పిట్ట గోడను మరచి వంగి చూస్తున్నాడు. ఇంకొద్దిగా ఉంటే జారిపోతాడు అనగా స్వప్న వెనుక నుండి గట్టిగా "ఒరేయ్.." అంటూ లాగింది.

దెబ్బకి, ఈ లోకం లోకి వచ్చాడు.

"ఇక్కడ నుండి పడితే ఇంకేమైనా ఉందా, ఇంతకీ ఏమి చూస్తున్నావ్" అంది స్వప్న.

ఆ టైమ్ కి వాళ్ళు సందు తిరిగి వెళ్ళిపోయారు.

"ఏంటే నీ గోల!" అన్నాడు విశాల్.

"అమ్మ పకోడీలు వేసింది. నేను తిన్నాక మిగిలినవి కుక్కకి వేయిమంది. నువ్వు ఏమైనా తింటావేమోనని అని వచ్చా" అంది స్వప్న.

"నిన్ను.." అంటూ తరిమాడు.

పక పకా నవ్వుతూ పారిపోయింది స్వప్న.

ఒక పదిహేను నిమిషాల తరువాత మరల వెనుకకు వెళ్ళారు వాళ్ళు ముగ్గురూ. చీకటి పడింది చలిలో వెన్నల కింద వాళ్ళ నడక చూసి 'చందమామ క్రింద చెవుల పిల్లులు' అని నవ్వుకున్నాడు.

***

మరునాడు లేచేసరికి లేట్ అయ్యింది. లేట్ అవ్వడం వల్ల, ట్యూషన్ కి వెళ్ళే టైమ్ లో వినీష కనిపించలేదు.

ట్యూషన్ అయ్యాక మోహన్ దగ్గరికి వచ్చాడు. "నీతో కొంచెం మాట్లాడాలి సోదరా..!" అన్నాడు.

"చెప్పు.." అన్నాడు విశాల్.

"వినీష, నేను త్వరలో పెళ్ళి చేసుకుంటున్నాం" అన్నాడు మోహన్.

"నువ్వు తనతో మాట్లాడడం తనకి ఇష్టం లేదు" అన్నాడు విశాల్.

"నువ్వు మర్యాదగా ఉంటే సరి. అలా కాదు అంటే.. ఎక్కడ కావాలంటే అక్కడ చూసుకుందాం. ఇక్కడ అందరూ ఉన్నారు" అన్నాడు మోహన్.

"లేకపోతే..? లేకపోతే ఏంటి..?" అంటూ వెనుక నుండి వచ్చాడు సత్యమూర్తి.

వాడు ఆరు అడుగుల ఆజానుబాహుడు, వాడిని చూడగానే మోహన్ గాడి గుండెలు ఎగిరాయి.

"మూర్తి.. నీకు తెలీదు నీకు సంబంధం లేని విషయం" అన్నాడు మోహన్.

"ఆడు నేను వేరువేరు కాదు. వాడిని కొట్టాలంటే ముందు నన్ను దాటాలి" అన్నాడు మూర్తి.

మోహన్ ముఖం మాడింది. "నీకు విషయం తెలుసో లేదో..! వీడు నా లవర్ వెనుకాల పడుతున్నాడు" అన్నాడు మోహన్.

"సరే నీకు ఒక విషయం తెలీదు ఏమో..! మా వోడు కాదు, తనే మా వాడి వెనుక పడుతుంది. ఏం చేసుకుంటావో చేసుకో, వాడు కూడా ఏది మానడు. నీ దిక్కు ఉన్న చోట చెప్పుకో" అన్నాడు మూర్తి.

ఈలోపు వెనుక ఉన్న వినీష ఆ మాట విన్నది.

"ఒరేయ్ ఊరుకో.." అన్నాడు విశాల్.

వినీష ఆ మాట విని, "ఛీ.. మీ జాతి అంతా ఇంతేనా! మంచివాడివి అని మాట్లాడితే.." అని వస్తున్న కన్నుళ్ళు తుడుచుకుంటూ.. గద్గద స్వరంతో "అయినా తప్పు నాది" అంది.

"వినీష నేను చెప్పేది విను.." అంటున్నాడు విశాల్.

అవేమి పట్టనట్టు రుసరుసా సైకిల్ తీసుకుని కన్నుల నుండి ధారగా కన్నీరు కారుస్తూ వెళ్ళిపోయింది.

అగ్నికి ఆజ్యం పోసినట్టు వెనుక నుండి "ఏంటి వినీష.. నువ్వు వీడి వెనకాల పడుతున్నావా!? ఇంత పూర్ టేస్ట్ ఆ.. నీది" అన్నాడు మోహన్.

విశాల్ కి ఏమి చెయ్యాలో తెలియని పరిస్థితి.

మూర్తి ఫుల్ రెయిజ్ అయిపోయాడు. "ఇంకోసారి మావాడికి వార్నింగ్ ఇస్తే రఫ్ ఆడిస్తా.." అని చిరంజీవి డైలాగ్ తో సరిపెట్టి.. శామ్యూల్ సర్ బయటకి వచ్చే లోపల మూర్తిని తీసుకుని కాలేజ్ కి వెళ్ళాడు విశాల్!

***

ఇద్దరూ టీ తాగుతూ, "ఏరా ఏంటి ఇలా కొంప ముంచావ్! వినీష ఎంత బాధపడుతుంది? ఆమె నా వెనుక పడుతుందని, నేను చెప్పనా! నోటికి ఎంత వస్తే అంత వాగేస్తావా? చికాకుగా ముఖం పెట్టి" అన్నాడు విశాల్.

"పోరా వాడు వార్నింగ్ ఇస్తుంటే.. నువ్వో మూగోడిలా ఉండి పోయావ్! వాడు ఏంటి..? వాడి కథ ఏంటి? నీకు వార్నింగ్ ఇస్తే తొక్క తీస్తా! నేను కావాలని వెనుక వినీష ఉందని మాట్లాడ లేదురా!" అన్నాడు మూర్తి.

"ఇంతలోపు నువ్వు అలా అనేసావ్, ఆ అమ్మాయి ఏడుస్తూ వెళ్ళిందిరా" నొచ్చుకుంటూ అన్నాడు విశాల్.

మూర్తి కొంచెం వెటకారం ముఖం పెట్టి, "పోనిలే.. రేపు నవ్వుతూ వస్తాది. నీలాంటి వాళ్ళని ఎందరిని చూసి ఉంటుంది" అన్నాడు.

చెంప చెల్లు మనిపించాడు విశాల్. అవాక్కైపోయాడు మూర్తి.

"ఛీ.. బండ వెధవ! నీకు ఇవన్నీ ఏం అర్థం అవుతాయిరా? తన పరిస్థితి తలుచుకుంటే నాకెంత ఏడుపొస్తుందో..! అమ్మాయి కనుక ఆమె ఏడవగలదు. నేను ఆపుకున్నాను, ఆపి ఆపి గొంతు నొప్పి వస్తుందిరా! ఇంక నా ముఖం చూస్తుందా!?" అన్నాడు. జీరపోయిన గొంతుతో కట్టలు కట్టుకుంటూ వచ్చిన.. మనసు ద్రవాన్ని రెప్పల ఆనకట్ట ఆపలేకపోయింది.

మూర్తి కదిలి పోయాడు. "ఒరేయ్ నన్ను క్షమించు, నువ్వు ఇంత బాదపడతావు అనుకోలేదు" అన్నాడు.

"పోరా.. ఇంక నాకు నీకు ఏ సంబంధం లేదు" అంటూ మూర్తిని తోసి అక్కడ నుండి వెళ్ళబోయాడు విశాల్.

"వెనుక నుండి, సరే నేను బండ వెధవనే..! నిన్నగాక మొన్న జీవితంలోకి వచ్చిన, ఆ అమ్మాయి కోసం అంత బాధపడుతున్నావు! నువ్వు తప్ప ఇంకెవ్వరూ

లేని నేను.. నిన్ను వాడు అన్ని మాటలంటే ఎంత బాధపడాలి? ప్రేమకి అర్థం తెలిసిన నీకు.. స్నేహానికి పరమార్థం తెలీదా! ఇంత మాత్రానికి నన్ను వదిలేస్తావా? సరే, వెళ్ళే ముందు ఒక్క మాట విని వెళ్ళు" అన్నాడు మూర్తి.

మంచు రాళ్ళతో కొట్టినట్టు తగిలాయి మూర్తి మాటలు.

విశాల్ ఎక్కడి వాడు అక్కడ శిలైపోయాడు ఇంకా ఏడుపు వచ్చింది. 'నిజమే కదా..! వాడు ఏం చేసినా నా కోసమే! ఏంటి ఇంత తొందర పాటు' అంటూ తనలో తాను నొచ్చుకున్నాడు.

మూర్తి దగ్గరికి వెళ్ళి "ఏంటో చెప్పు?" అన్నాడు విశాల్.

సత్యమూర్తి కళ్ళు తుడుచుకుంటూ.. "సన్యాసమ్మకి టీ డబ్బులు ఇవ్వ నా దగ్గర లేవు" అన్నాడు.

వాడి అమాయకత్వానికి విశాల్ కి నవ్వు ఏడుపు కలిసి వచ్చాయి. "నేను వెళ్ళిపోయినా పర్లేదు కానీ, టీ డబ్బులు ముఖ్యం నీకు" అన్నాడు విశాల్.

ఇద్దరూ నవ్వుకున్నారు.

***

# PART 8

టౌన్ లైబ్రరీ..

సత్యమూర్తి ఎదురుగా ఉన్న లైబ్రేరియన్ లింగరాజు దగ్గరికి వెళ్ళాడు.

"సర్! జర్మన్ టూ ఇంగ్లీష్ డిక్షనరీ ఉందా!" అని అడిగాడు.

"ఒక్క నిమిషం.." అని లెడ్జర్ ఓపెన్ చేసి చూసాడు లింగరాజు.

"ఒకటే వుంది కానీ, అది బయట వుంది. ఎవరో తీసుకెళ్ళారు" అన్నాడు.

"ఎప్పుడు రిటర్న్ చేస్తారు ఏమైనా తెలుసా మీకు?" అని అడిగాడు మూర్తి.

"జనరల్ గా పాత పుస్తకాలు రెసెర్చ్ కోసం తీసుకెళతారు, అంత తొందరగా వెనక్కి రావు" అన్నాడు లింగరాజు.

గాలి తీసిన బుడగలాగా అయిపోయాడు మూర్తి.

"ఏమైంది నాయనా, అంత అర్జెంటా!" అన్నాడు లింగరాజు.

"అవును సర్.. కొద్దిగా అర్జెంట్" అన్నాడు.

"సరే నేను ఆయన అడ్రస్ ఇస్తాను. నువ్వు వెళ్ళి తీసుకో, తీసుకున్నాక తిరిగి ఇక్కడకి తీసుకురా! నేను పంపా అని చెప్పు" అన్నాడు లింగరాజు.

అడ్రస్ తీసుకుని బయటికి వస్తుంటే.. విశాల్ వచ్చాడు.

"ఏరా దొరికిందా..!" అన్నాడు.

"ఎవరో ఇంగ్లీష్ ప్రొఫెసర్ అంట, ఆయన దగ్గర వుంది. అడ్రస్ తీసుకున్నాను, వెళ్ళి తెచ్చుకోవాలి" అన్నాడు మూర్తి.

టూ వీలర్ పై పక్కనే ఉన్న పల్లెటూరుకి ఇద్దరూ బయలుదేరారు. పల్లెటూరు మొదట్లోనే వుంది, ప్రొఫెసర్ లక్ష్మణ రావు గారి ఇల్లు.

గేట్ కి 'కుక్క ఉన్నది జాగ్రత్త' అని రాసి ఉన్న బోర్డు వుంది. టక్కున ఆగి పోయారు ఇద్దరూ.

"ఏవండీ.. ఏవండీ..! సార్.. ఇంట్లో ఎవరైనా ఉన్నారా?" అని అరిచాడు సత్యమూర్తి.

ఎటువంటి శబ్దం లేదు. ఐదు నిముషాలు గడిచాయి.

అంతలో అటుగా సైకిల్ పైన ఒక ముసలాయన వెళుతూ ఆగాడు.

"ఎవరు కావాలి బాబు" అన్నాడు.

"లక్ష్మణ రావు గారు.." అన్నాడు విశాల్.

"లోపలి వెళ్ళండి. ఆయనకు కొద్దిగా చెముడు" అన్నాడు ముసలాయన.

"కుక్క వుంది" బోర్డు చూపిస్తూ అన్నాడు విశాల్.

"ఆడే ఒక కుక్క.. ఆడి నోటికి భయపడి ఎవరూ వెళ్ళరు. మీరు వెళ్ళండి" అన్నాడు ముసలాయన.

"మరి బోర్డు.." అన్నాడు సత్యమూర్తి.

"ఓహ్.. ఆ కుక్క పోయి ఏళ్ళు అవుతుంది, ఆ బోర్డు మాత్రం ఉండిపోయింది" అన్నాడు ముసలాయన.

"ఇన్ని విషయాలు మీకెలా తెలుసు?" అని అడిగాడు మూర్తి.

"నేను ఆ పిసినారి ఇంట్లో పని చేశాను" అని వెళ్ళి పోయాడు పెద్దాయన.

పెదవి విరిచి, "పుర్రెకో బుద్ధి.." అంటూ కదిలాడు విశాల్.

లోపల గార్డెన్ పాడుపడి వుంది. ఇల్లు కూడా ఎవరూ శుభ్రం చేయడం లేదు అనుకుంటా పాచి పట్టి వుంది.

"సర్.. లక్ష్మణ రావు గారు" అంటూ పిలిచాడు మూర్తి.

ఎన్ని సార్లు పిలిచినా నో రెస్పాన్స్.

"ఏంటిరా.. ఇంట్లో ఎవరు లేరు" అన్నాడు మూర్తి.

"చెవిటి మేళం అని చెప్పాడుగా.." అంటూ మూర్తి తలుపు పై కొట్టాడు, ఎవరు రాలేదు.

ఇంతలో "మూర్తి.. ఒరేయ్ అటు చూడు" అన్నాడు విశాల్.

అక్కడ బుక్ షెల్ఫ్, దాని ఎదురుగా టేబుల్ కనిపించింది. టేబుల్ పై ఒక డిక్షనరీ వుంది. విశాల్ సన్నగా ఈల వేసాడు. "ఇదిగో దొరికింది ఇక్కడే వుంది" అని ఆనందంగా అన్నాడు.

"సర్.. సర్.." అని ముక్త కంఠంతో మళ్ళీ పిలిచారు.

"ఆయన బయటకి వెళ్ళారేమో కాసేపు వెయిట్ చేద్దాం" అంటూ కూర్చున్నారు.

గంట గడిచింది ఎవరూ రాలేదు.

"ఒరేయ్ ఒక పని చేద్దాం" అన్నాడు విశాల్.

ఏమిటి అన్నట్టు చూసాడు మూర్తి.

"ఈ బుక్ పట్టుకెళ్ళి లావణ్య xeroxలో ఫోటో కాపీ తీయిద్దాం" అన్నాడు విశాల్.

"వద్దు బాగోదేమో..! ఆయన ఏం పని మీద ఉన్నారో.!" అన్నాడు మూర్తి.

"అబ్బా.. సాయంత్రం నాలుగయ్యింది. మనం రేపు మార్నింగ్ వచ్చి మరల ఇచ్చేద్దాం" అన్నాడు.

కొంత అయిష్టం గానే బయలుదేరాడు మూర్తి. గేట్ దగ్గర కింద, ఒక పాత జర్మన్ లెటర్ దొరికింది. విశాల్ తీసి అది డిక్షనరీలో పెట్టాడు.

సరాసరి లావణ్య xerox కి వెళ్ళి వాళ్ళ క్లాస్మేట్ మాణిక్యానికి ఇచ్చారు.

వాడు రేపు సాయంత్రం ఇస్తా అన్నాడు.

"బాబ్బాబు.. కొద్దిగా అర్జెంటు మార్నింగ్ ఇయ్యారా!" అన్నాడు మూర్తి.

"సరే చాల పేజీలు ఉన్నాయి, ఖర్చు అవ్వుద్ది" అన్నాడు మాణిక్యం.

"సరే మన అకౌంట్ లో రాసుకో" అన్నాడు విశాల్.

"ఇదిగో.. ఇందులో ఏదో పేపర్ వుంది తీసుకో" అని లక్ష్మణరావు ఇంటి దగ్గర దొరికిన పేపర్ ఇచ్చాడు మాణిక్యం.

***

తెల్లవారింది ట్యూషన్ కి కావాలనే లేట్ గా వెళ్ళాడు విశాల్. మూర్తి కనిపించలేదు.

'వీడు నిద్రపోయాడా ఏంటి!?' అనుకున్నాడు విశాల్.

ఓర చూపుతో అమ్మాయిలు కూర్చునే దిక్కుగా చూసాడు. వినీష ఏదో రాసుకుంటుంది. పక్కనే ఉన్న ఉమ.. విశాల్ వంక చూసి పలకరింపుగా నవ్వింది.

జీవం లేని నవ్వు ఒకటి విసిరాడు విశాల్.

ఇంకో ఐదు నిమిషాల్లో ట్యూషన్ అయిపోతుంది అనగా, వినీష హడావిడిగా లేచి వెళ్ళిపోయింది.

అందరితో పాటు బయటకి వచ్చి షూ వేసుకుంటున్నాడు విశాల్.

ఈలోపు ఉమ దగ్గరికి వచ్చింది.

"పాపం.. నీ తప్పులేకపోయినా.. వినీష నీ మీద కోపం పెంచుకుంది. నాకు చాలా బాధ గా వుంది" అంది.

"తాను అనని మాట అన్నది అని అంటే ఎవరికైనా కోపం వస్తుంది. నేను చేసింది తప్పే" అన్నాడు విశాల్.

"అన్నది నువ్వు కాదుగా మూర్తి కదా!" అంది ఉమ.

"వాడికి నేనే అలా చెప్పింది" మూర్తిని చిన్నబుచ్చడం ఇష్టం లేక అబద్ధం చెప్పాడు విశాల్.

సైకిల్ తీసి బయలు దేరుతుంటే, ఉమ పరిగెత్తుకుంటూ వచ్చింది.

"విశాల్.. శామ్యూల్ సర్ వినీషకి ఈ కవర్ ఇమ్మన్నారు" అంది.

"ఏంటిది?" అన్నాడు విశాల్.

"వాళ్ళ సిస్టర్ కి.. కాలేజ్ లో సీట్ కోసం రికమండేషన్ లెటర్ అనుకుంటా, తను వెళ్ళి పోయిందని చెప్పాను, నీకిస్తే తనతో మాట్లాడడానికి ఛాన్స్ ఉంటుంది కదా! అని నీకిచ్చాను" అంది ఉమ.

ఒక్కసారిగా.. ఉమ దేవతలా కనిపించింది.

"చాల చాలా థాంక్స్ ఉమ" అని బయలుదేరాడు విశాల్.

పక్కనే గోడ చాటు నుండి మోహన్ వచ్చాడు.

"ఈసారితో మనకి అన్ని ప్రోబ్లెమ్ లు తీరిపోతాయి" అన్నాడు మోహన్.

"పర్లేదు అంటావా!" అంది ఉమ.

"ఏమి పర్లేదు, నేను ఉన్నాగా" అన్నాడు మోహన్.

విశాల్ స్పీడ్ గా సైకిల్ తొక్కాడు. దూరంగా తన కలల సుందరి, ఆశల పందిరి.. ఇప్పుడు ఏమంటుందో..?

***

లింగరాజు నిద్ర లేచి కాఫీ తాగుతూ పేపర్ తెరిచాడు. మైన్ పేజ్ లో పెద్ద అక్షరాలతో.. 'ప్రెసిడెంట్ అవార్డు గ్రహీత ఇంగ్లీష్ ప్రొఫెషర్ శ్రీ లక్ష్మణ రావు దారుణ హత్య' అని ఉంది.

లింగరాజు, పోలీస్ స్టేషన్ కి కాల్ చేసాడు. "సర్, ప్రొఫెసర్ గారి హత్య విషయంలో నాకు ఒకడి పై అనుమానం ఉంది" అన్నాడు.

లింగరాజు కళ్ళ ముందు లక్ష్మణ రావు అడ్రస్ తీసుకున్న సత్యమూర్తి కదులుతున్నాడు.

విశాల్ కి, సత్యమూర్తి కి రాబోయే గండం గురించి తెలియదు పాపం.

***

# PART 9

జీప్ లోనుండి దిగాడు ఏసీపీ సుందర్ ప్రతాప్ IPS. టౌన్ లో ఛార్జ్ తీసుకున్నాక ఇది రెండో మర్డర్, విసుగ్గా ఉన్నాడు. లోపలికి వెళ్ళేసరికి.. సిఐ వెయిట్ చేస్తున్నాడు. సుందర్ ప్రతాప్ ని చూసి సెల్యూట్ చేసాడు.

“ఏంటి పొసిషన్ అని అడిగాడు సుందర్ ప్రతాప్.

“బాడీని పోస్ట్ మార్టంకి పంపాము సర్! ఈవెనింగ్ రిపోర్ట్ వస్తుంది” అని చెప్పాడు సిఐ.

“మోటివ్ ఏమై ఉండచ్చు” అని అడిగాడు సుందర్ ప్రతాప్.

“ఇంకా తెలీదు సర్! దొంగతనం మాత్రం కాదు. ప్రొద్దుట పనిమనిషి వెళ్ళి తలుపు కొట్టిందంట, ఎవరూ తీయలేదంట. తలుపు దగ్గరకి వేసి ఉండటం చూసి, తాను లోపలి వెళ్ళేసరికి.. రక్తపు మడుగులో ఆయన కనిపించాడంట, వెంటనే 2 టౌన్ కి ఫోన్ చేసారు. ఆయన ఒక్కడే ఇంట్లో ఉంటాడు. ఫామిలీ అంతా అబ్రాడ్ లో సెటిల్డ్. ఇరుగు పొరుగు వారితో మంచి సంబంధాలు లేవు. చాల కోపిష్టి అని చెప్పారు. మిగిలిన డీటెయిల్స్..” అని అంటూ సిఐ చెప్తూ ఉండగా లింగరాజు వచ్చాడు.

“నమస్తే సర్” అన్నాడు.

ఎవరన్నట్టు చూసాడు సుందర్.

“సర్ నిన్న..” అంటూ తన దగ్గరికి వచ్చిన సత్యమూర్తి గురించి చెప్పాడు లింగరాజు.

“అతను మీకు తెలుసా!?” అన్నాడు సిఐ.

“తెలుసు సర్, మా లైబ్రరీ లో మెంబెర్ సర్, కాలేజీ స్టూడెంట్” అన్నాడు లింగరాజు.

“ఎంత వయసు ఉంటుంది?” అని అడిగాడు సిఐ.

"ఇరవై, ఇరవై ఒకటి వరకు ఉంటుంది" అన్నాడు లింగరాజు.

సుందర్ కళ్ళు చిట్లించి "అంత చిన్న పిల్లాడు మర్డర్ చేస్తాడా?" అంటూ.. సీఐ వంక చూసి,

"మీరు ఆయనతో వెళ్ళి వాడిని పట్టుకురండి" అన్నాడు.

***

సత్యమూర్తి ఇంట్లో సత్యనారాయణ స్వామి వ్రతం జరుగుతుంది. అందుకే తను ట్యూషన్ కి వెళ్ళలేదు. వ్రతంలో మూడో కథ చెపుతున్నారు. ఇంతలో డోర్ బెల్ మోగింది. అక్క బావ పీటలపై ఉన్నారు, సత్యమూర్తి గబా గబా వెళ్ళి తలుపు తీసాడు. బహుశా విశాల్ వచ్చివుంటాడని అతని ఆశ!

ఎదురుగా సిఐ రఘుపతి, లైబ్రేరియన్ లింగరాజు ఉన్నారు.

"నమస్తే సర్, నేను బుక్ తీసుకుని సాయంత్రం వస్తాను" అన్నాడు.

సిఐ సివిల్ డ్రెస్ లో ఉండడం వల్ల మూర్తికి అతను ఎవరో తెలియలేదు.

"ఏమి అక్కర లేదు బయలుదేరు స్టేషన్ కి" అన్నాడు సిఐ.

"ఎందుకు సర్.. బుక్ కోసమా!" అన్నాడు మూర్తి.

"లేదు ప్రొఫెసర్ లక్ష్మణ రావుని మర్డర్ చేసినందుకు" అన్నాడు సిఐ.

సత్యమూర్తికి ఏమి అర్థం కావడం లేదు. లోపలికి వెళ్ళి వాళ్ళ బావకి చెప్పాడు. ఆయన బయటకి వచ్చాడు.

సత్యమూర్తి బావ వెంకట్.. రూలింగ్ పార్టీ యూత్ లీడర్.

సిఐ.. వెంకట్ ని గుర్తు పట్టాడు.

"నమస్తే, వెంకట్ గారు. మీరు ఏంటి ఇక్కడ?" అన్నాడు.

"అదే నా ప్రశ్న కూడా? మీరేంటి ఇక్కడ" అన్నాడు వెంకట్.

"సత్యమూర్తి.." అన్నాడు సిఐ.

"ఆడు నా బావమరిది. చదువుకునే కుర్రాడు, వాడితో ఏం పని" అన్నాడు వెంకట్.

లింగరాజు జరిగిందంతా చెప్పాడు.

"అంటే వాడు మీకంటికి ఎలా కనపడుతున్నాడు? 200 ఎకరాలకు వారసుడు, హత్య చేసే కర్మ వాడికి ఏంటి?" అన్నాడు.

"కాదు ఏసీపీ సుందర్ ప్రతాప్ తీసుకురమ్మన్నారు. జస్ట్ ఎంక్వయిరీ కోసం" అన్నాడు.

"సరే మీరు వెళ్ళండి, పూజ అయ్యాక నేనే తీసుకు వస్తా" అన్నాడు వెంకట్.

"అలా కాదు సర్.." అన్నాడు సిఐ.

"ఎలా కాదు? నేను వ్రతంలో ఉన్నాను. వ్రతం అవ్వకుండా కుటుంబ సభ్యులు బయటకు వెళ్ళకూడదు మీరు వెళ్ళండి" అని కోపంగా అన్నాడు వెంకట్.

రఘుపతి, లింగరాజు వెను తిరిగారు.

"ఏంటి సర్.. అతను అంత డాబు చేస్తున్నాడు?" అన్నాడు లింగరాజు.

"రూలింగ్ పార్టీలో మంచి హోల్డ్ వుంది. నెక్స్ట్ టర్మ్ లో ఎమ్మెల్యే గాని, ఎంపీ గాని అవుతాడు. వాడెవడో చస్తే మనం ఎందుకు ఇరుకున పడటం?" అన్నాడు సిఐ.

"ఐతే ఎంక్వయిరీ చేయలేమా?" అన్నాడు లింగరాజు.

"వాడు మర్డర్ చేసినా.. ఏమి చేయలేము" అన్నాడు నవ్వుతూ సిఐ.

***

విశాల్.. వినీష దగ్గరికి చేరుకున్నాడు.

వినీష చూసింది కానీ, చూడనట్టు వెళుతుంది.

"వినీష.. నాకు తెలుసు నాపై చాల కోపంగా ఉన్నావని. చెప్పే పరిస్థితి నాది కాదు, వినే పరిస్థితి నీది కాదు. అందుకీ ఈ లెటర్ రాసా చదువు" అని సైకిల్ ఆపి కొంచెం ఆటపట్టిద్దాం అని.. ఉమ ఇచ్చిన కవర్ ఇచ్చాడు.

"నాకు అవసరం లేదు. ఇంకెప్పుడూ నాతో మాట్లాడడానికి ట్రై చెయ్యకు మర్యాదగా వెళ్ళు" అంది వినీష.

"నీ కోపానికి దీపపు పురుగులా కాలిపోతాను, దయచేసి కోపం తగ్గించుకోకు.. బుగ్గలకు కూడా లిప్స్టిక్ రాసినట్లు అయిపోయినాయి" అని నవ్వుతూ అన్నాడు విశాల్.

లోపల కొంచెం ఆనందంగా ఉన్నా.. "అవసరం లేదు" అంటూ మరల సైకిల్ ఎక్కింది వినీష.

"ఓయ్.. సారీ.. సారీ.. ఈ లెటర్ శామ్యూల్ సర్ నీకు ఇమ్మన్నారు చూసుకో.." అన్నాడు.

కను రెప్పలు ముడివేసి "శామ్యూల్ సర్ నాకు ఇమ్మన్నారా?" అంటూ కవర్ ఓపెన్ చేసింది.

పేపర్ చూసి నవ్వుతాది అనుకున్న వినీష వెక్కివెక్కి ఏడ్చింది.

"ఏమైంది..? ఏమైంది..?" అని కంగారుగా అడిగి "వినీష.." అని చెయ్యి పట్టుకున్నాడు విశాల్.

"ఛీ.." అని చెయ్యి విదిలించి, గట్టిగా ఒక్కటి లాగి పెట్టి కొట్టింది వినీష.

విశాల్ కి ఏమీ అర్థం కాలేదు.

"ఇప్పటి వరకు నా వెనుక పడిన పోకిరి వెదవలు ఎవ్వరూ.. నీ అంత దిగజారుడు మనుషులు కాదు. నువ్వు మనిషివివా! పశువ్వా..!?" అని పేపర్ ముఖాన విసిరి కొడుతూ అంది.

వినీష మాటలకి రోడ్ పైన జనం అట్రాక్ట్ అయ్యారు. పేపర్ ఓపెన్ చేసి చూస్తే.. అందులో అర్ధ నగ్నంగా ఒక అమ్మాయి బొమ్మ, కింద "నిన్ను దేవతా వస్త్రాలలో చూడాలని వుంది. రాత్రికి రానా ఎంత తీసుకుంటావ్" అని రాసి వుంది.

విశాల్ "ఛీ.." అంటూ పేపర్ ని దూరంగా విసిరాడు.

ఈలోపు జనం మూగారు.

వినీష వేగంగా వెళ్ళిపోయింది.

"ఏమైంది..?" అని ఎవడో అన్నాడు.

"ఏముంది, అమ్మాయి పై ఎక్కడో అసభ్యంగా చేయి వేసి ఉంటాడు, పాపం ఏడుస్తుంది" అన్నాడు.

"ఇటువంటి వాళ్ళని వదల కూడదండి" అని ఒకడు.

"వాడితో మాటలేంటి? రెండు తగలనివ్వక.." అని వెనుక నుండి ఒక తన్ను తన్నాడు గుంపులో ఉన్న మోహన్.

విశాల్ బొక్క బోర్లా పడ్డాడు.

విశాల్ కి ఇవన్నీ వినిపించడం లేదు. 'ఉమ ఎంత పని చేసింది! అది చూస్తే తనకే అసహ్యంగా వుంది. పాపం వినీషని ఎంత బాధ పెట్టానో..!' అనుకున్నాడు.

ఈలోపు అటుగా వెళుతున్న పోలీస్ వచ్చాడు. విషయం కనుక్కున్నాడు.

ఎవరికి తోచిన కథ వాళ్ళు చెప్పారు.

"సర్లెండి, అయినా కొట్టడానికి మీరు ఎవరు? మేమున్నాంగా.." అంటూ..

"పద పోలీస్ స్టేషన్ కి" అన్నాడు పోలీస్.

వినీష వెళ్ళిన దారి వంక చూస్తూ మెల్లగా పోలీస్ తో కదిలాడు విశాల్.

స్టేషన్ కి వెళ్ళే సరికి, బయట సత్యమూర్తి బావ వెంకట్ కార్ చూసి, ఊపిరి పీల్చుకున్నాడు విశాల్.

లోపలి వెళ్ళే సరికి సత్యమూర్తి కనిపించాడు. "ఏరా విశాల్.. నేనే నీకు కబురు పెడదాం అనుకున్నాను, నువ్వే వచ్చావ్" అన్నాడు వెంకట్.

వెంకట్.. విశాల్ తో మాట్లాడ్డం చూసి.. విశాల్ ని తీసుకొచ్చిన పోలీస్ సైడ్ అయిపోయాడు.

"ఏరా.. ఈ బట్టలేంటి, ఆ దుమ్ము ఏంటి? ఏమైంది రా..?" అన్నాడు సత్యమూర్తి.

"నా సంగతి సరే, నువ్వేంటి ఇలా స్టేషన్ లో.." అన్నాడు విశాల్.

మూర్తి కొంచెం ఆశ్చర్యంగా "అదేంటి రా, నీకు తెలీదా! ప్రొఫెసర్ లక్ష్మణ రావుని ఎవరో నిన్న చంపేశారు అంట! ఆ వార్త పేపర్ లో చూసి లైబ్రేరియన్ లింగరాజు నా పై ఫిర్యాదు చేసాడు. పోలీస్ మా ఇంటికి వచ్చారు" అన్నాడు.

"ఏంటి చంపేసారా..?" నిర్ఘాంత పోయాడు విశాల్!

"మీ ఏసీపీ ఎప్పుడు వస్తారు" అని విసుగ్గా అన్నాడు వెంకట్.

ఈ లోపు వచ్చాడు సుందర్.

విశాల్, సత్యమూర్తి జరిగిందంతా చెప్పారు. అంతా విని "ప్రస్తుతానికి మీరు వెళ్ళండి, అవసరం ఐతే పిలుస్తాను" అన్నాడు సుందర్.

"థాంక్స్ సర్.." అని చెప్పి వెనుతిరిగారు ముగ్గురు.

"ఒక్క నిమిషం.." అన్నాడు సుందర్.

'మరలా ఏంటి?' అని వెనక్కి తిరిగారు.

"అసలు మీకు జర్మన్ డిక్షనరీ ఎందుకు?" అన్నాడు సుందర్.

ఇద్దరూ ఒకరి ముఖాలు ఒకరు చూసుకున్నారు.

"చెప్పండి! ఎందుకు కొద్దిగా అరిచినట్టు అన్నాడు సుందర్.

సత్యమూర్తి "అది.. టైమ్.. టైమ్.." అన్నాడు.

***

# PART 10

"హో టైమ్? ఏంటి టైమ్.." అన్నాడు సుందర్.

విశాల్ కల్పించుకుని "అవును సర్.. టైమ్ బాలేదు మాది. అందుకె వెళ్ళాం" అన్నాడు.

"ఈ వేదాంతము నాకొద్దు, ఒక్కటే మాట అడుగుతున్నాను. మీకు జర్మన్ టూ ఇంగ్లీష్ డిక్షనరీ ఎందుకు?" అని కొద్దిగా కటువుగా అన్నాడు సుందర్.

విశాల్ ముందుకు వచ్చి "నేను చెపుతా సర్, మా మూర్తి వాళ్ళ తాతగారు ఫ్రీడమ్ ఫైటర్! ఆయన బ్రిటిష్ వారి తరుపున జర్మనీలో యుద్ధం చేసారు. ఆ టైమ్ లోని కొన్ని ఉత్తరాలు వాడి ఇంట్లో ఉన్నాయి. అవి తర్జుమా చేద్దాం.. అని అనుకున్నాం అందుకే" అన్నాడు.

"ఎందుకు? ఆ లెటర్స్ లో అంత ఇంపార్టెంట్ ఏమి వుంది?" అన్నాడు.

"ఏమి లేదు సర్.. అవి హిట్లర్ టైమ్ లోవి కదా! ఇంట్రెస్టింగ్ గా ఏమైనా మేటర్ ఉంటుందేమో..!" అని కుతూహలం అన్నాడు సత్యమూర్తి.

"అసలే.. మా వాడికి హిస్టరీ అంటే ఇష్టం సర్" అన్నాడు విశాల్.

"హిస్టరీ అంటే వాడికి ఇష్టమేమో, నాకు స్టోరీలు అంటే అసహ్యం. మీరు చెప్పేది నమ్మబుద్దిగా లేదు" అన్నాడు సుందర్.

"సరే.. ఇదిగో లెటర్ ఒకటి నాదగ్గర వుంది చూడండి" అని తీసి ఇచ్చాడు విశాల్.

అది ప్రొఫెసర్ లక్ష్మణ్ రావు ఇంటి దగ్గర దొరికిన పేపర్.

సుందర్ అది చేతిలోకి తీసుకుని, ఒక్క క్షణం చూసి, "రఘుపతి.. క్లూస్ టీమ్ కి ఇచ్చి దీని సంగతేంటో చూడండి" అన్నాడు.

వాళ్ళు విశాల్, సత్యమూర్తి వేలి ముద్రలు తీసుకుని పంపారు.

"ఇంక మీరు వెళ్ళండి" అన్నాడు సుందర్.

ఇద్దరూ వెంకట్ కార్ లో కూర్చున్నారు. తెల్లటి అంబాసిడర్ కారు హంసలా కదిలింది.

***

"ఇప్పుడు చెప్పండిరా అసలు నిజం" అన్నాడు వెంకట్.

"నిజంగా ఏమి లేదు బావ, అక్కడ జరిగిందంతా ముక్క తేడా లేకుండా చెప్పాము. దయచేసి నమ్మండి" అని బతిమాలుతున్నట్టు అన్నాడు మూర్తి.

"నేను నమ్మటం నమ్మక పోవటం అటుంచి.. మీరు నిజంగా ఏమైనా చేసి ఉంటే సుందర్ వదలడు. ఎంత కాదన్నా.. మీరు నా కుటుంబం రా! అందుకే ఏమి దాయకండి" అన్నాడు వెంకట్.

"లేదు బావ ఒట్టు.." అన్నాడు సత్యమూర్తి!

సత్యమూర్తి ఇంటికి కారు వెళ్ళగానే, సత్యమూర్తితో కలిసి తన ఇంటికి వెళ్ళాడు విశాల్.

అదృష్టం ఏంటంటే ఇంట్లో ఎవరూ లేరు. పోలీసులు వచ్చి తాళం చూసి వెళ్ళి పోయారని తెలిసింది.

మేడ మీద కూర్చున్నారు. ఒకరికి ఒకరు జరిగిందంతా చెప్పుకున్నారు.

సత్యమూర్తి కోపంగా లేచి, "దాని ఇంటికి వెళ్ళి రెండు పీకి వద్దాం" అన్నాడు.

"వద్దురా తొందర పడకు, ఉమని కొట్టినంత మాత్రం చేత.. ఈ సమస్య పరిష్కారం కాదు. ఇప్పుడు మనం ఆలోచించాల్సింది మర్డర్ కేసు గురించి, వెంకట్ బావ ఉన్నాడు కాబట్టి, మనం ప్రస్తుతానికి బయట పడ్డామ్" అన్నాడు విశాల్.

"టైమ్ మెషిన్ ఒక్కటే దీనికి పరిష్కారం.." ఇద్దరూ ఒక్కసారే అన్నారు.

విశాల్ బట్టలు మార్చుకుని, నైట్ కంబైన్డ్ స్టడీస్ కి వెళుతున్నా అని ఇంట్లో చెప్పి సత్యమూర్తితో బయలుదేరాడు.

ఇద్దరూ భోజనం చేసి టీవీ చూస్తూన్నారు. రాత్రి 8 అవుతుంది. గీతాంజలిలో 'ఓ ప్రియా.. ప్రియా..' పాట వస్తుంది.

'ఏల గాలి మేడలు, రాలు పూల దండలు నీదో లోకం నాదో లోకం నింగి నేల తాకేదేలాగా..' అని వినిపిస్తుంది. కళ్ళు మూసుకున్నా.. తనను తిట్టి వెళ్ళిపోతున్న వినీష కనపడుతుంది. ఇళయరాజా మనసు పిండేసే సంగీతం చెవులకు తాకుతుంది. మూసి ఉన్న రెప్పల మాటు నుండి మెల్లగా బయటికి వస్తుంది ఒక అశ్రు బిందువు. నెమ్మదిగా నిద్రలోకి జారుకున్నాడు.

"విశాల్.. ఒరే విశాల్.." అంటూ లేపుతున్నాడు సత్యమూర్తి.

కళ్ళు తెరిచాడు. "టైమ్ పన్నెండు, అక్క బావ పడుకున్నారు. ఇంక మొదలు పెడదామా" అన్నాడు సత్యమూర్తి.

మెల్లగా స్టోర్ రూమ్ లోకి వెళ్ళారు. లైట్ వెయ్యలేదు, కొవ్వొత్తి వెలుగులో డిక్షనరీ తీసి తర్జుమా మొదలు పెట్టారు.

మొదటి అరగంట కష్ట పడితే "పోర్టల్ ప్రొజెక్టర్: Instruction Manual and Do's and Don'ts" అంటే ఇందులో అది ఎలా వాడాలో వాడేటప్పుడు ఏమి చెయ్యాలో, ఏమి చెయ్యకూడదో ఉన్నది అన్న మాట. కానీ ఎన్ని రోజులు పడుతుంది? అంతా చదవడానికి అనుకున్నారు. ఇద్దరూ తర్జుమా కొనసాగించారు.

***

మొదటి పది పేజీలలో అతి ముఖ్యమైన సూత్రాలు ఉన్నాయి.

1. పోర్టల్ ప్రొజెక్టర్ స్టార్ట్ చేసాక ౩౦ నిముషాలు వరకు లోపల ఉన్న లెన్స్ వేడెక్కిన తరువాత పనిచేస్తుంది.

2. పోర్టల్ ద్వారా భూతకాలానికి 48 గంటల వరకు మాత్రమే వెళ్ళగలరు.

3. పోర్టల్ ద్వారా భవిష్యత్తు లోనికి సగటు మనిషికి మిగిలి ఉన్న ఆయుష్షు కాలం మాత్రమే వెళ్ళ గలరు. ఒక మనిషి ఆయుష్షు 60 అనుకుంటే, అతని

ప్రస్తుత వయస్సు 40 అనుకుంటే, అతను భవిష్యత్తు లోనికి కేవలం 20 ఏళ్ళు వెళ్ళగలడు. బలవంతంగా వెళ్ళడం వల్ల టైమ్ గ్యాప్ లో శాశ్వతంగా వుండి పోతాడు.

4. పోర్టల్ ద్వారా భూత, భవిష్యత్తు కాలముల లోకి ప్రయాణం చేసిన మనిషి, అక్కడ తనకి తెలిసిన, తనని గుర్తు పట్టే వాళ్ళతో ఎట్టి పరిస్థితిలో మాట్లాడకూడదు, అలా చేసిన పక్షంలో మరణిస్తారు.

5. భౌతిక విలీనం: భూత కాలంలో తప్పని సరి పరిస్థితులలో తనని తాను చూసుకున్నప్పుడు, భౌతిక విలీనం (physical merge) కావచ్చు, అలా అవడం వల్ల పెద్ద విస్ఫోటనం జరిగే ప్రమాదముంది. విలీనం తరువాత ఒక గంట వరకు ఎవ్వరితో మాట్లాడకూడదు. ఒక్క విలీనం వల్ల 5 సంవత్సరాల ఆయుష్షు కోల్పోతారు.

6. పోర్టల్ ద్వారా భూత, భవిష్యత్తు కాలముల లోకి ప్రయాణం చేసిన మనిషి అక్కడ ఎవరినీ చంప లేడు, పుట్టించలేడు.

7. భూతకాలం బ్లూ రంగు పోర్టల్ లోను, భవిష్యత్తు ఎరుపు రంగు పోర్టల్ గాను కనిపిస్తోంది.

8. లోపలికి వెళ్ళటానికి ప్రొజెక్టర్ లో అడుగు భాగంలో ఉన్నా స్విచ్ ఉపయోగించాలి. రెడ్ కలర్ లోపలి వెళ్ళడానికి, గ్రీన్ కలర్ బయటకు రావడానికి, స్విచ్ కోల్పోతే టైమ్ గ్యాప్ లో శాశ్వతంగా వుండిపోతాడు.

గబా గబా ప్రొజెక్టర్ క్రింద భాగం వెతికారు, స్విచ్ దొరికింది.

ఇద్దరికీ చాల ఉత్కంఠగా వుంది. సమయం ఉదయం ఆరు అయ్యింది.

“పాలవాడు వచ్చినట్టు ఉన్నాడు అక్కయ్య లేచింది” అన్నాడు.

మెల్లగా లోపలి వచ్చారు. ఏమి తెలియనట్టు దుప్పటి కప్పుకుని పడుకున్నారు.

***

పోస్ట్ మార్టమ్ రిపోర్ట్ వచ్చింది. ప్రొఫెసర్ లక్ష్మణరావు కత్తితో పొడవడం వల్ల చనిపోయారు. చుట్టుపక్కల ఉన్న వారిని చేసిన విచారణలో విశాల్,

సత్యమూర్తి అక్కడకి వచ్చినట్టు, కుక్క గురించి అడిగినట్టు తెల్సింది. క్లూస్ టీం రిపోర్ట్ మాత్రం వేరేగా వుంది.

హతుడి వొంటి పై విశాల్, రాంమూర్తి వేలి ముద్రలు లేవు. హత్యకు వాడిన ఆయుధం దొరక లేదు, ఐతే వీళ్ళిద్దరి వేలి ముద్రలు బయట ఉన్న టేబుల్ పై, డెస్క్ పైనా, గేట్ పైన దొరికాయి.

అన్నిటికన్నా ముఖ్యంగా విశాల్ ఇచ్చిన జర్మన్ పేపర్ వెనుకాల ఉన్న రక్తపు మరక ప్రొఫెసర్ లక్ష్మణ రావు రక్తంతో మ్యాచ్ అయ్యింది. ఆ పేపర్ పైన విశాల్ చేతి ముద్రలు పుష్కలంగా ఉన్నాయి.

“దొరికాడు రా దొంగ..! వాడిని పట్టుకురండి అన్నాడు సుందర్ ప్రతాప్.

పోలీస్ విశాల్ కోసం బయలుదేరారు టైమ్ 7.

***

# PART 11

"ఒరేయ్ లేవండి.. మూర్తి, విశాల్ లేవండి.." అని గట్టిగా అరిచాడు వెంకట్.

ఇద్దరూ తుళ్ళి పడిలేచారు.

కళ్ళు నులుముకుంటూ "ఏంటి బావా!?" అన్నాడు మూర్తి.

"త్వరగా లేచి డ్రైవర్ తో మా ఊరు వెళ్ళండి. ఇప్పుడే పోలీస్ స్టేషన్ నుండి కాల్ వచ్చింది. విశాల్ ఇచ్చిన లెటర్ పైన.. చనిపోయిన వాడి రక్తపు మరక ఉందంట. ఇప్పుడు మర్డర్ చేసింది వీడే అని అరెస్ట్ చేయడానికి వస్తున్నారు. వాడితో పాటు.. నిన్ను కూడా లోపల వేస్తారు. సమయానికి నేను కూడా అర్జెంట్ గా క్యాంపు వెళ్ళాలి. రెండు రోజుల్లో వస్తాను. అప్పటి వరకు మీరు మా ఊరిలో వుండండి. బయట తిరగకండి" అంటూ హడావిడిగా వెళ్ళిపోయాడు వెంకట్.

ఇద్దరికీ వెన్నులో నుండి చలి పుట్టింది. సమయం 8:30 అయ్యింది. విశాల్ స్టోర్ రూంలోకి వెళ్ళి ప్రొజెక్టర్ స్విచ్ ఆన్ చేసాడు.

"ఇప్పుడు ఎందుకు?" అన్నాడు మూర్తి.

"మనకి ఇదొక్కటే మార్గం. నేను చెప్పింది విను" అన్నాడు విశాల్.

డ్రైవర్ పిలుస్తుంటే.. మూర్తి బయటికి వెళ్ళి.. "బట్టలు వేసుకుని వస్తాం, కాసేపు వుండు" అన్నాడు.

ఈలోపు మూర్తి అక్కయ్య వచ్చింది. తనకు జరిగింది ఏమి తెలియదు.

"ఏరా నిద్ర బాగా పట్టిందా? స్నానం చేసిరండి, టిఫిన్ పెడతా" అంది.

"అలాగే.." అని గది తలుపు వేసాడు మూర్తి.

స్టోర్ రూమ్ కి దారి.. ఆ గది లోనే వుంది. కాబట్టి పోలీసులు వచ్చినా అలాగే రావాలి.

"దేముడా.. రక్షించు" అనుకుంటూ ఇద్దరూ బట్టలు వేసుకున్నారు. సమయం 8: 50 అయ్యింది.

"నీ దగ్గర కెమెరా ఉందా?" అన్నాడు విశాల్.

మూర్తి "లేదురా.." అన్నాడు.

"పోనీ అక్క వాళ్ళ దగ్గర ఏమైనా ఉందా?" అని అడిగాడు విశాల్.

మూర్తి వెళ్ళి ఒక పాత కెమెరాతో వచ్చాడు.

"ఏంటిది ఇలా వుంది?" అన్నాడు విశాల్.

"పోలరాయిడ్ కెమెరా! వెంటనే ఫోటో వస్తుంది. అయినా మనం వెళ్ళేది ఏమైనా పిక్నిక్ కా..! ఇదెందుకు?" అన్నాడు మూర్తి.

"ఇప్పుడు చెప్పే టైమ్ లేదు" అన్నాడు విశాల్.

టైమ్ సరిగ్గా తొమ్మిది అయ్యింది. సన్నని ఈల లాంటి శబ్దంతో ప్రొజెక్టర్ స్టార్ట్ అయ్యింది. దాని మీద ఉన్న మీటర్ ని తిప్పుతూ –48 కి సెట్ చేసాడు. పక్కనే ఉన్న కీ ని తిప్పుతూ "same location" అని సెలెక్ట్ చేసాడు.

"అంటే ఇప్పుడు ఇది మనల్ని 48 గంటల ముందు ఎక్కడ ఉన్నామో..! అక్కడికి తీసుకు వెళుతుంది అన్నమాట" అన్నాడు మూర్తి.

"హా.. మనం అనుములూరు తొమ్మిది తరువాత వెళ్ళాం. దీని ప్రకారం మనం మరల అనుములూరు దగ్గరలోకి వెళ్తాము" అన్నాడు విశాల్.

బయట పోలీస్ జీప్ సౌండ్ వినిపించింది. బయట ఎవరో.. "ఎవరు లోపల..?" అని గట్టిగా అరుస్తున్నారు.

"ఒరేయ్.. వాళ్ళు వచ్చినట్టు ఉన్నారు" అన్నాడు మూర్తి.

గోడ మీద బ్లూ రంగులో కాంతి పడుతుంది. అది వలయకారములో తిరుగుతుంది.

***

"ఎవరండీ.." అంటూ బయటకు వెళ్ళింది మూర్తి అక్కయ్య.

"ఏమ్మా.. విశాల్ ఇక్కడ ఉన్నడా!?" అడిగాడు పోలీస్.

"హా.. ఉన్నాడు, ఎందుకు?" అని అడిగింది మూర్తి అక్కయ్య.

"ఏమి లేదు చిన్న ఎంక్వయిరీ, ఏసీపీ సర్ తీసుకురమ్మన్నారు" అన్నాడు పోలీస్.

"వాడు స్నానం చేస్తున్నాడు కూర్చోండి" అంది మూర్తి అక్కయ్య.

"లేదు మేము వెళ్ళాలి" అన్నాడు పోలీస్.

***

బ్లూ కలర్ వలయం పెద్దగా అవుతుంది కానీ, మనిషి అంత ఎత్తులేదు. విశాల్, మూర్తి వెయిట్ చేస్తున్నారు.

మూర్తి అక్కయ్య తలుపు కొట్టి పిలుస్తుంది.

"ఒరేయ్.. అక్క పిలుస్తుంది" అన్నాడు మూర్తి.

"నోరుమూసుకో.. ఇప్పుడు వెళ్తే ఇంక అంతే సంగతులు" అన్నాడు విశాల్.

ఈలోపు డ్రైవర్ వచ్చాడు. పోలీస్ వంక కంగారుగా చూస్తూ "రూమ్ లో ఎవరూ లేరమ్మ! వాళ్ళిద్దరూ బయటికి వెళ్ళారు" అన్నాడు.

"ఏమిలేదు ఇప్పుడే చూసాను. రూమ్ లోపల గడియ వేసి వుంది. అంటే, వాళ్ళు లోపలే ఉన్నారు" అని అమాయకంగా అంది మూర్తి అక్కయ్య.

"ఏంటి పరాచికాలా, తప్పుకోండి" అంటూ పోలిస్ గబాగబా లోపలికి వచ్చాడు.

***

పోర్టల్ దాదాపు ఆరడుగులు ఏర్పడింది.

పోలిస్ తలుపు పై గట్టిగా కొడుతున్నాడు. "ఏయ్ మర్యాదగా తలుపు తీయండి. మీరు ఇంక తప్పించుకోలేరు" అంటూ..

ఇంతలో ఇంకొకడు వచ్చి "అటు నుంచి దారి ఉంటే పారిపోతారు, తలుపు బద్దలు కొట్టండి" అన్నాడు.

"ఒరేయ్.. ఇందులోకి వెళ్ళాక మనకి ఏమైనా ఐతే? వినీష ఏడుస్తూతుందేమో!" అన్నాడు విశాల్.

"ముఖం చూడు.. అమ్మ, నాన్న, చెల్లి గుర్తుకు రాలేదా నీకు?" అన్నాడు మూర్తి.

"బయట తలుపు బద్దలు కొడుతున్నారు. లేదురా! అమ్మని, చెల్లిని చూసుకోవడానికి నాన్న ఉన్నారు" అన్నాడు విశాల్.

"అఘోరించకపోయావ్, పోలీస్ లోపలి వస్తే.. మనల్ని ఎవరు చూసుకుంటారు?" అన్నాడు మూర్తి.

ఈలోపు తలుపు తెరుచుకుంది. గదిలో ఎవరూ లేరు.

తలుపు వేసి ఉన్న స్టోర్ రూమ్ చూపిస్తూ "అందులో ఉన్నారేమో..! చూడు" అన్నాడు హెడ్ పోలిస్.

ఇద్దరు అటుగా వెళ్ళారు.

"సరే దేముడిని తలుచుకో.. స్విచ్ మాత్రం వదలకు, కెమెరా నేను వదలను. ఏదైనా జరిగితే మాత్రం నన్ను క్షమించరా!" అన్నాడు విశాల్.

"పర్లేదురా, నాతో పాటు నువ్వు ఉన్నావ్ గా! చావుకైనా రెడీ" అని భయం ఆనందం ఉద్వేగం అన్ని కలిసి రాగా.. గుసగుసగా అన్నాడు మూర్తి.

డోర్ తెరుచుకుంది.

వలయంలోకి వెళ్ళి.. గ్రీన్ స్విచ్ నొక్కారు. జాప్.. అని సౌండ్ చేస్తూ వలయం మాయమైంది.

తలుపులు తెరిచిన పోలీస్ కు ఎవరూ కనిపించలేదు. అంతా చీకటి.

"ఇదేంటి..? ఇప్పటి వరకు తలుపు సందులో నుంచి ఏదో లైట్ కనిపించింది. ఇప్పుడు లేదు" అనుకున్నారు.

"అది స్టోర్ రూమ్, పాత సామాను తప్ప ఏమి ఉండదు అని చెప్పగా అంది మూర్తి అక్కయ్య.

లైట్ వేసి చూసారు. ఏమి కనిపించలేదు.

"మరి లోపల గడియ ఎలా?" అన్నాడు ఒక పోలీస్.

డ్రైవర్ వచ్చి "ఆ గడియ కొద్దిగా పాడైంది సర్" అన్నాడు.

మూర్తి అక్కయ్య అయోమయంగా చూసింది.

***

# PART 12

గిర్ గిరా గిరా తిరుగుతున్న అనుభూతి, రోలర్ కోస్టర్ లో ఎక్కినట్టు ఉంది ఫీలింగ్. శరీరం బరువు కోల్పోయింది. చల్లని గాలి మాత్రం వుంది. అదోరకమైన వింత అనుభూతి, భయంతో.. మూసిన కళ్ళు భారంగా తెరిచారు.

అనమలూరుకి వెళ్ళే దారిలో.. రోడ్ కి ఎడమవైపు ఒక పొదలో, ఇద్దరూ.. విశాల్ స్కూటర్ పైన ఉన్నారు.

"మనం పొదలో ఎప్పుడు ఉన్నాం? వెళ్ళింది రోడ్ మీదగా!?" అన్నాడు మూర్తి.

"కొంచెం ఆగరా! నాకు కూడా కొత్త కదా! ఇందులో ఏదో లాజిక్ వుంది" అన్నాడు విశాల్.

"అసలు మనం ఉన్న ప్లేస్ ఎక్కడ?" అని చుట్టూ చూసాడు మూర్తి.

"హా.. గుర్తు వచ్చిందిరా! టైమ్ 9:10 అయ్యింది. మనం వంతెన దగ్గర ఆగి కాకా హోటల్ లో టిఫిన్ చేసాం" అన్నాడు మూర్తి.

కొద్దిగా పొదలో నుండి తల బయట పెట్టి చూసారు. రోడ్ కి అవతల పక్క హోటల్ లో విశాల్, మూర్తి కనిపించారు. తమని తాము చూసుకోవడం చాలా థ్రిల్లింగ్ గా వుంది.

"మనం ఎక్కువ టైమ్ వేస్ట్ చెయ్యద్దు, వెళ్దాం పద" అన్నాడు విశాల్.

ఇద్దరూ బండి మీద బయలుదేరారు.

"చాలా ఆనందంగా వుంది. హిట్లర్ ని అందరూ తిట్టుకుంటారు. మనకి మాత్రం అతను హీరోనే" అన్నాడు మూర్తి.

తెలిసిన ఇల్లు కావడంతో.. ఎవరూ చూడకుండా వెనుక నుండి వెళ్ళారు. లక్ష్మణ రావు ఇల్లు ఊరు బయట ఉండటం వల్ల ఎవరూ చూడలేదు. స్కూటర్ పక్కన ఉన్న ఒక పొదలో పెట్టారు. వెనుక పిట్ట గోడ మీద నుండి దూకి తొంగి చూసారు. డెస్క్ దగ్గర ఉన్న కుర్చీలో కూర్చుని ఏదో రాస్తున్నారు ప్రొఫెసర్. ఈలోపు గేట్ అలికిడి అయ్యింది. లోపలికి వచ్చిన వ్యక్తిని చూసి విశాల్, మూర్తి నోరు వెళ్ళ బెట్టారు.

అతను.. అతను.. లింగరాజు.

'లింగరాజు ఎందుకు వచ్చాడు?' అనుకున్నారు.

"మళ్ళీ ఎందుకు వచ్చావ్?" అన్నాడు ప్రొఫెసర్.

లింగరాజు చుట్టూ చూసి "కొద్దిగా మాట్లాడాలి లోపలి వస్తారా?" అన్నాడు.

మెల్లగా కుర్చీ లోంచి లేచి.. లోపలికి లింగరాజుని తీసుకుని వెళ్ళారు ప్రొఫెసర్.

"ప్రొఫెసర్ మీకు కావాల్సినంత డబ్బు ఇస్తాం, దయ చేసి ఆ నిధి తాలూకు వివరాలు మాకు ఇవ్వండి" అన్నాడు లింగరాజు.

"ముందె చెప్పగా.. అది మా ఫాదర్ సంపాదించిన పత్రం. దాని రహస్యం ఛేదించాను. ఇప్పుడే డైరీలో రాస్తున్నాను. అయినా తెలిసిన వాడివని చెపితే.. ఇలా నన్ను సతాయించడం భావ్యం కాదు" అన్నారు ప్రొఫెసర్.

"సరే మీరు అది పూర్తి చేసి ఏమి చేస్తారు?" అన్నాడు లింగరాజు.

అది భారతదేశం ఆస్తి, ఇండియన్ గవర్నమెంట్ కి హ్యాండ్వర్ చేస్తాను. వారిచ్చే సత్కారం చాలు నాకు. కావాలంటే నీ పేరు కూడా జత చేస్తాను. పురస్కారంలో నీకు వాటా ఉంటుంది" అన్నాడు ప్రొఫెసర్.

"అయ్యో.. లక్ష్మణ రావు గారు! అవి కొన్ని కోట్లు విలువ చేసే వజ్రాలు అని మీరే చెప్పారు. ప్రభుత్వ పురస్కారం నాలుక గీసుకోవడానికి కూడా పనిచేయదు. దయచేసి నా మాట వినండి. అవి ఎక్కడ ఉన్నాయో..! ఎలా తేవాలో నాకు చెప్పండి. నేను తీసుకు వస్తా! అందుకు కావలిసిన మనుషులు నా దగ్గర ఉన్నారు" అన్నాడు లింగరాజు.

"అది చాలా తప్పు. ఈ దేశానికి ద్రోహం చేసిన వాడిని అవుతాను. నేను పిసినారి అవ్వచ్చు కానీ, దేశద్రోహిని మాత్రం కాదు. కావాలంటే పురస్కారంలో 90% మీరు తీసుకోండి, నాకు 10% చాలు. ఈ డిస్కషన్ చాలు దయచేసి నువ్వు వెళ్ళొచ్చు" అన్నాడు ప్రొఫెసర్.

"సరే మీ ఇష్టం" అని వెనక్కి తిరిగినట్లు తిరిగి, మళ్ళీ ప్రొఫెసర్ వైపు తిరిగి.. ప్రొఫెసర్ చేతిలో డైరీ లాక్కుని పరిగెత్తాడు లింగరాజు.

పెద్ద వయసు వల్ల పరిగెట్టలేని ప్రొఫెసర్.. కిందకు పడి లింగరాజు కాలు పట్టుకున్నాడు.

లింగరాజు బొడ్డులో నుండి ఒక పిడిబాకు తీసాడు.

ఇదంతా కిటికీ నుండి చూస్తున్న మూర్తి లోపలికి వెళ్ళబోయాడు.

"ఒరేయ్.. ఆగు మర్చిపోయావా! మనకి తెలిసిన వాళ్ళతో ఫిసికల్ మెర్జ్ కాకుండా మాట్లాడినా, తాకినా..! అది మనకి చావు తెస్తుంది" అన్నాడు విశాల్.

"మరి వాడు ఆయన్ని చంపేస్తాడు రా!" అన్నాడు మూర్తి.

"తప్పదు, రూల్స్ లో వుంది కదా! మనం ఏది ఆపలేము, మార్చలేము" అన్నాడు విశాల్.

ఇంతలో జరగాల్సిన దారుణం జరిగిపోయింది. లింగరాజు ప్రొఫెసర్ గొంతులో పొడిచాడు.

విశాల్ కెమెరాతో ఫోటో క్లిక్ అనిపించాడు. ఫ్లాష్ లైట్ కి కిటికీ వంక చూసాడు లింగరాజు.

అప్పటికే ఇద్దరూ కిటికీ కింద నక్కారు. లింగరాజు బయటకి వస్తాడని పసిగట్టి డెస్క్ కింద దాక్కున్నారు.

లింగరాజు వచ్చి చుట్టూ చూసాడు. అక్కడ ఉన్న కొన్ని జర్మన్ లెటర్స్ చూసి, అవి తీసుకున్నాడు. గబగబా అడుగులేస్తూ గేట్ దగ్గరికి వెళ్ళాడు.

అక్కడ గేట్ అవతల పక్క తలుపు చప్పుడైంది. ఆ టైమ్ కి విశాల్ మూర్తి వచ్చారన్న మాట.

కంగారుపడిన లింగరాజు వెనక్కి తిరిగి పరుగు పెట్టాడు. ఆ కంగారులో ఒక పేపర్ జారీ గేట్ దగ్గర పడింది. అది చూసి కూడా.. ఏమి చేయలేక, పరుగున వెనుక పక్కకి వెళ్ళి గోడ దూకి వెళ్ళి పోయాడు.

విశాల్ మూర్తి లోపలి వచ్చి పిలుస్తుండగా.. భవిష్యత్తు కాలం నుంచి వచ్చిన ఆ ఇద్దరూ, డెస్క్ కిందే ఉన్నారు.

వాళ్ళు డెస్క్ దగ్గరికి వస్తున్న సమయంలో టైమ్ స్విచ్ లో రెడ్ బటన్ నొక్కారు. ఇద్దరూ అక్కడ నుండి అదృశ్యమయ్యారు. వారితో పాటు.. వారు తెచ్చిన స్కూటర్ కూడా మాయం అయ్యింది.

కళ్ళు తెరిచే సరికి స్టోర్ రూమ్ గోడకి ఆనుకుని కూర్చుని ఉన్నారు.

వాచ్ లో టైమ్ చూసాడు మూర్తి 11:00 అయ్యింది.

"అంటే.. మనం భూతకాలంలో దాదాపు రెండు గంటలు ఉన్నాం అన్నమాట" అన్నాడు మూర్తి.

***

బెడ్ రూమ్ లోకి వచ్చి "ఎందుకో తల నొప్పిగా వుంది అక్కా.. కొద్దిగా టీ ఇవ్వు" అన్నాడు మూర్తి.

"ఏరా. ఏమై పోయారు? ఎప్పుడు వచ్చారు? తలుపు వేసాను ఎవరు తీశారు?" అని వరుస ప్రశ్నలు వేసింది మూర్తి అక్కయ్య.

వాళ్ళ అక్క అడుగుతున్న ప్రశ్నలకు.. సమాధానం ఇవ్వడానికి సత్యమూర్తి పడుతున్న పాట్లు చూసి నవ్వుకున్నాడు విశాల్.

***

# PART 13

మూర్తి చెప్పే సమాధానాలకు, వాళ్ళ అక్కయ్య కొంచెం అయోమయ పరిస్థితిలో పడింది. "సరే టీ ఇస్తా గాని.. విశాల్ కోసం పోలీస్ లు ఎందుకు వచ్చారు? ఏరా ఏం చేసావ్ నువ్వు?" అని అడిగింది మూర్తి అక్కయ్య.

"నేను ఏమి చెయ్యలేదు అక్కా! ఏదో గొడవ జరిగితే అందులో నన్ను ఇరికించాలని చూస్తున్నారు. వెంకట్ బావకి కూడా తెలుసు" అన్నాడు విశాల్.

బావ పేరు చెప్పగానే అక్క మెత్తబడింది. ఆమె వెళ్ళగానే 'హమ్మయ్య..' అని ఊపిరి తీసుకున్నారు.

దిగాలుగా కూర్చున్నాడు మూర్తి.

"ఏమైంది రా!? అలా ఉన్నావ్?" అన్నాడు విశాల్.

"మన కళ్ళ ఎదురుగా ఒక మనిషిని చంపేస్తే.. కళ్ళు అప్పగించి చూసాం. కనీసం కాపాడడానికి ప్రయత్నం కూడా చెయ్యలేదు. ఏం మనుషులం రా మనం" అని బాధపడ్డాడు మూర్తి.

మామూలు పరిస్థితిలో అయితే అదే మాట కానీ, ఎదురుగా ఉన్నది లింగరాజు. వాడు నిన్ను గుర్తుపడతాడు. ఆ కోపంలో నువ్వు చిన్న తప్పు చేసినా.. అది నీ ప్రాణానికే ముప్పు. తనకు మాలిన ధర్మం మొదలు చెడ్డ బేరం. అయినా ఆయన టైమ్ అయిపోయింది వెళ్ళిపోయాడు. ఇప్పుడు మనం ఇందులో నుండి బయటపడటమే తక్షణ కర్తవ్యం" బోధ చేస్తున్నట్టు అన్నాడు విశాల్.

మూర్తి ఏదో రాస్తుంటే.. "ఏంటిరా అది?" అని అడిగాడు విశాల్.

"మన మొదటి టైమ్ ట్రావెల్ లో గమనించిన ముఖ్య విషయాలు రాస్తున్నాను" అన్నాడు మూర్తి.

***

1. భూతకాలం లోకి వెళ్ళినప్పుడు మనం samelocation సెలెక్ట్ చేసుకుంటే, మనం ఉన్న ప్రదేశానికి సరిగ్గా 180 డిగ్రీల్లో దాదాపు 100 మీటర్స్ దూరంలో విడిచి వేయబడతాం.

2. మనం ఆ కాలమానంలో కలిగి ఉన్న వస్తు వాహనాలు అన్ని తిరిగి పొందుతాం. తిరిగి వెన్నక్కి వచ్చినప్పుడు మనం తీసుకెళ్ళిన వస్తువులతో మాత్రమే వెనుకకు వస్తాం.

***

"రాసింది బాగుంది గాని, ఈ పుస్తకం గాని.. మనం తర్జుమా చేసిన కాగితాలు గాని.. ఎవరికైనా దొరికితే చాలా ప్రమాదం. వీటిని మన ఇద్దరికీ తెలిసిన చోట మాత్రమే దాచాలి" అని అన్నాడు విశాల్.

"నా పరుపు కింద పెడదాం. ఎవరూ చూడరు" అన్నాడు మూర్తి.

"నీ మొహం, బీరువా తాళాలు దిండు కింద దాచినట్టు ఓపెన్ సీక్రెట్ లా కాక.. ఏదైనా సేఫ్ ప్లేస్ లో పెట్టు" అన్నాడు విశాల్.

"దేముడు గూడు వెనకాల పెడదాం. మా ఇంట్లో ప్రతి ముక్కోటి ఏకాదశికి తప్ప.. దేముడి గూటిని కదపరు" అన్నాడు మూర్తి.

షటిల్ కాక్ లు అమ్మే పొడవాటి అట్ట గొట్టం తీసుకుని అందులో పేపర్ లు అన్నీ పెట్టారు. అది తీసుకెళ్ళి దేముడి గూటికి వెనకాల పెట్టారు. అది కింద పడకుండా బీరువా వెనకాల గాల్లో వేలాడుతుంది.

***

మూర్తి అక్క టీ తీసుకొచ్చింది.

టీ తాగిన తర్వాత "ఇప్పుడు చెప్పారా ఏంటి ప్లాన్?" అన్నాడు మూర్తి.

"మనం ఇంకో సారి నిన్నటి రోజుకి వెళ్ళాలి. ఒకటి నేను వినీషకి లెటర్ ఇవ్వడం ఆపాలి. రెండు పోలీస్ స్టేషన్ లో లింగరాజు ఫోటో ఇవ్వాలి. దాని కోసం నిన్నటి రోజుకి వెళ్ళాలి" అన్నాడు విశాల్.

"నువ్వు నీ రూపాన్ని చూస్తే ముప్పురా!" అన్నాడు మూర్తి.

"హ చూడకుండా ఫిసికల్ మెర్జ్ అవ్వాలి" అన్నాడు విశాల్.

"దాని వల్ల ఆయుష్షు తగ్గుతుంది అని ఉందిగా" అన్నాడు మూర్తి.

వినీష దృష్టిలో వ్యక్తిత్వం కోల్పోయి జీవచ్ఛవంలా బతకడం కన్నా.. కొంత ఆయుష్షు తగ్గినా.. నా వ్యక్తిత్వం కాపాడుకోవడం మేలు" అన్నాడు విశాల్.

"సరే ఒప్పుకుంటా కానీ, ఆ విషయం మనం వెళ్ళి చెపితే నమ్మదంటావా? హా చాన్సు వుంది కానీ, ఆమె పడ్డ బాధ.. అది ఎలా తీరుతుంది? ఆమె క్షోభ ఎలా పోతుంది? అది ఉమా రాసినా..! నేను రాసినా..! తాను బాధ పడటం మాత్రం నిజం. అసలు ఆ బాధే.. ఆమె జీవితంలో నుండి తీసేస్తే..! అదే నా లక్ష్యం. ఆమె కొట్టిన చెంప దెబ్బకన్నా.. కలువల్లాంటి ఆ కళ్ళు కన్నీరు కారుస్తుంటే నాకు ఎక్కువ బాధ వేసిందిరా!" అన్నాడు. అలా అంటున్నప్పుడు విశాల్ కి తెలీకుండానే గొంతు గద్గదమైంది.

మూర్తి భుజం మీద చెయ్యి వేసి "ఇదంతా ఏంటో నాకు అర్థం కావట్లేదురా!" అని కళ్ళు తుడుచుకుంటూ "దీనినే ప్రేమ అంటారురా! ప్రేమకోసం ఇవన్నీ చెయ్యాలా! పైగా ఆ అమ్మాయి నిన్ను ప్రేమిస్తుందో లేదో తెలీదు" అన్నాడు మూర్తి.

"నన్ను ప్రేమించడం పోకపోవడం.. ఆ రెండూ.. తన ఇష్టానికి చెందిన విషయాలు. నేను ప్రేమిచాను కాబట్టేగా.. ఆ అమ్మాయి ఈరోజు ఇటువంటి పరిస్థితిని ఎదుర్కొంది. ఆమె బాధని, ఆనందాన్ని.. నేను అనుభవించకపోతే నాది ప్రేమ ఎలా అవుతుంది రా?" అన్నాడు విశాల్.

మూర్తి.. విశాల్ ని దగ్గరికి తీసుకున్నాడు. భుజం తట్టి "నీలాంటి వాడికి ఫ్రెండ్ అయ్యినందుకు నాకు చాల గర్వంగా ఉందిరా" అన్నాడు.

"ఆ మాట నేను అనాలిరా" అన్నాడు మూర్తి భుజం తడుతూ విశాల్.

"ఏదీ ఏమైనా.. నాకు ఒక మాట ఇవ్వాలి" అన్నాడు మూర్తి.

"చెప్పు.." అన్నాడు విశాల్.

"నువ్వు బయటికి ఎంత ధృడమో..! మనసు అంత సున్నితం. ఒకవేళ వినీష కాదన్నా..! నువ్వు బాధ పడనని మాట ఇవ్వు" అన్నాడు మూర్తి.

"ఏరా.. వినీష కాదంటుంది అని శాపనార్థం పెడుతున్నావా!" అని మాట మార్చి నవ్వుతూ అన్నాడు విశాల్.

"అదేం లేదురా.." అన్నాడు మూర్తి.

"సరే, ఇంక నేను వెళతాను" అన్నాడు విశాల్.

"హా.. నేను వస్తా" అన్నాడు మూర్తి.

"నీకేమైనా మతిపోయిందా? నువ్వు ఎందుకు? అన్నాడు విశాల్.

"నువ్వు భౌతిక విలీనం అంటున్నావ్!" అన్నాడు మూర్తి.

"అక్కడ నీకు ఏదైనా అయితే..?" అన్నాడు విశాల్.

"ఐతే అవ్వచ్చు దాని కోసం నన్ను రావద్దు అనకు" అన్నాడు మూర్తి.

మూర్ఖంగా ఆలోచించకు అన్నాడు విశాల్.

మూర్తి కోపంగా "ఒరేయ్ నువ్వు వినీష కోసం ఏమైనా చేయచ్చు, దానికి నీ దగ్గర ఒక లాజిక్ ఉంటుంది. నీకోసం నేను ఏదైనా చేస్తే ఎటువంటి లాజిక్ ఉండదు కదా! నాది మూర్కత్వం అయితే నీది ఏంటి?" అని అడిగాడు.

మూర్తి అడిగిన ఆ ప్రశ్నకి విశాల్ దగ్గర సమాధానం లేదు. అందుకే మోనంగా ఉండిపోయాడు.

"అయినా ఈ మర్డర్ విషయం ఏదో తేలుద్దాం! అసలు ఫస్ట్ మీట్ లోనే పోలీసులు మనల్ని హీరోలు చూసేలా చేద్దాం. నేను కూడా నిన్నటి రోజులో భౌతిక విలీనం అయిపోతాను. అప్పుడు ఇద్దరం కలిసి చేయాల్సిన పనులు చెయ్యవచ్చు" అన్నాడు మూర్తి.

ఆ తర్వాత "అక్కా.." అని పిలిచాడు మూర్తి.

"వంటలో ఉన్నా ఏంటి చెప్పు?" అంది అక్కయ్య.

"మేము బయటకి వెళుతున్నాం, ఒక గంటలో వస్తాం" అన్నాడు మూర్తి.

విశాల్ చెయ్యవలిసిందంతా చెప్పాడు. ముందురోజు సరిగ్గా 8:45 కి వినీషతో గొడవ జరిగింది. ప్రొజెక్టర్ టైమ్ ని దానికి తగినట్టు సర్దుబాటు చేసారు. మరలా జాప్ అన్న సౌండ్ తో టైమ్ ట్యూబ్ లోకి వెళ్ళారు.

కళ్ళు తెరిచే సరికి విశాల్ లెటర్ పట్టుకుని సైకిల్ పైన ఉన్నాడు. దూరంగా ఇంకో విశాల్.. అతనికి ముందు వినీష కనపడ్డారు. “అయ్యో కొంచెం టైమ్ ముందుకు సెట్ చేయవల్సింది” అనుకుంటూ వేగం పెంచాడు విశాల్.

సత్యమూర్తి కళ్ళు తెరిచే సరికి తన రూమ్ లోనే ఉన్నాడు లోపల సత్యనారాయణ స్వామి వ్రతం మంత్రాలూ వినపడుతున్నాయి. తొంగి చూసాడు, తాను అక్క బావ పక్కన కూర్చుని ఉన్నాడు. పోలీసులు వచ్చే వరకు వెయిట్ చెయ్యాలి అనుకుంటూ స్టోర్ రూమ్ లో కూర్చున్నాడు.

***

# PART 14

విశాల్ ఫాస్ట్ గా తొక్కుతున్నాడు. ముందున్న తన రూపం కూడా ఫాస్ట్ గా వెళ్తుంది.

'నాతోనే నేను పోటీ పడుతున్నాను' అనుకున్నాడు.

ముందున్న విశాల్.. వినీషని ఆపాడు. వెనుకున్న విశాల్ ముందు వెనుక చూసాడు. ఎవరూ లేరు. కేవలం భవిష్యత్తు నుంచి వచ్చిన విశాల్.. విశాల్, వినీష! ఆమెకు ముందు మెల్లగా నడిచి వెళుతున్న ఒక పెద్దాయన.

ముందున్న విశాల్.. వినీషని ఆపుతున్న సమయంలో, వెనుకున్న విశాల్ వెళ్ళి వెనుక నుండి సైకిల్ ని ఢీకొట్టాడు. చేతితో విశాల్ ని టచ్ చేసాడు.

ఒక్క క్షణంలో పెద్దగా సుడిగాలి రూపంలో దుమ్ము లేచింది. వినీష కళ్ళు మూసుకుంది. ఇద్దరు విశాల్ లు ఇప్పుడు ఒకటైపోయారు.

చిత్రం ఏంటి అంటే.. రెండు సైకిల్స్ ఒకటిగా అయిపోయాయి. కళ్ళు మూసుకున్న వినీష నడిచి వెడుతున్న పెద్దమనిషిని సైకిల్ తో గుద్ది పడిపోయింది. పెద్దాయన కిందపడి లబో దిబో అంటున్నాడు.

విశాల్ వెళ్ళి.. వినీషని పైకి లేపాడు.

పెద్దాయన్ని లేపుతూ “సారీ సర్ చూసుకోలేదు” అన్నాడు.

మెల్లగా లేచి “ఈ ఇంగ్లీషోడు వచ్చి మన మొఖాన.. ఈ ముక్క ఒకటి పడేసి పోయాడు. పక్కనే ఆడపిల్ల ఉంటే కళ్ళు ఎక్కడ కనపడతాయి? నెత్తిన ఎక్కి ఉంటాయి” అన్నాడు.

“తప్పు చేసింది నేను! నన్ను తిట్టండి, లేకపోతే కొట్టండి. అంతే గాని మధ్యలో ఆమె ఏమి చేసింది?” అన్నాడు విశాల్.

ఈలోపు ఎక్కడి నుండి వచ్చారో జనం మూగారు. వినీషకి ఏమి అర్థం కావడంలేదు.

'నేను కదా గుద్దింది. విశాల్ ఎందుకు మీద వేసుకున్నాడు?' అనుకుంది.

వచ్చిన జనం తలో మాట మొదలు పెట్టారు.

"ఈ కాలం కుర్రకారుకి మరీ స్పీడ్ ఎక్కువైపోయిందండి. పక్కనే ఆడపిల్ల వుండే సరికి ఒళ్ళూ పై తెలియదు" అన్నారు.

విశాల్ కి బుర్ర తిరుగుతుంది 'physical merge అయ్యాక.. అరగంట మాట్లాడకూడదు అన్న మాట మరిచి మాట్లాడినందుకా!' అనుకున్నాడు.

ఒక చేత్తో వినీషకి వెళ్ళిపొమ్మని సైగ చేసాడు. విశాల్ ని అందరూ అలా అనడం చూసి వినీషకి ఏడుపొస్తుంది కానీ, విశాల్ చెప్పడంతో బయలుదేరింది. వెనుక నుండి ఎవరో తన్నడంతో.. విశాల్ ముందుకి పడ్డాడు. పక్కకి తిరిగి చూస్తే.. మోహన్ కనిపించాడు.

పైకి లేచి తిరిగి తన్నాడు విశాల్. మోహన్ కింద పడ్డాడు, కసి కొద్దీ వాడిని తంతూనే ఉన్నాడు.

విశాల్ తిరగబడటం చూసి అక్కడ ఉన్న జనాలు తప్పుకున్నారు.

మోహన్ "వదిలేయ్ ప్లీజ్.. వదిలేయ్.." అని బ్రతిమాలుకున్నాడు.

అటుగా వెళ్తున్న పోలీస్ వచ్చి.. విశాల్ ని ఆపి "ఏంటి పెద్ద హీరోవా! వాడు చస్తాడు" అన్నాడు.

"వీడు నన్ను తన్నాడు సర్" అన్నాడు విశాల్.

"అప్పుడు మాకు రిపోర్ట్ చెయ్యాలి. చట్టాన్ని నీ చేతిలోకి ఎలా తీసుకుంటావ్? పద స్టేషన్ కి" అన్నాడు పోలీస్.

విశాల్ పోలీస్ తో కలిసి గర్వంగా బయలుదేరాడు.

***

కాలం చాలా విచిత్రమైనది. ముందు సారి విశాల్ పై కోపంతో వినీష ఏడ్చింది. ఇప్పుడు జాలితో ఏడ్చింది. మొత్తానికి ఆమె ఏడ్వాలని కాలం డిసైడ్

చేసింది. ముందు సారి మోహన్ గాడు తన్నాడు. ఇప్పడు కూడా తన్నాడు. అప్పడు వినీషకి సానుభూతి చూపిస్తూ.. ఇప్పడు పెద్దాయనకి సానుభూతి చూపిస్తూ.. ఇక్కడ తాను తన్నులు తినడం కామన్ పాయింట్! అప్పుడూ పోలీస్ తీసుకెళ్ళాడు ఇప్పుడూ తీసుకెళ్ళుతున్నాడు. విశాల్ కి కర్మ అంటే ఏంటో అర్థం అయ్యింది.

'మరి మోహన్ గాడి కర్మని నేను మార్చనా!' అనుకున్నాడు.

***

"తొందరగా తొక్కు పెళ్ళికి వెళ్ళడం లేదు" అన్నాడు పోలీస్.

"సుందర్ సర్ మనకి తెలుసు పర్లేదు" అన్నాడు విశాల్.

పోలీస్ కొద్దిగా తగ్గి "ఎవరి తాలూకా!" అన్నాడు.

"యూత్ ప్రెసిడెంట్ వెంకట్ గారి బామర్దిని" అన్నాడు.

"అయ్యో.. ముందే చెప్పొద్దా! వెంకట్ గారు నాకు కావాల్సిన మనిషి, నువ్వు ఇంటి కెళ్ళు" అన్నాడు పోలీస్.

"లేదు నాకు స్టేషన్ లోపని వుంది" అన్నాడు విశాల్.

పోలీస్ కొద్దిగా బెదురుగా చూసాడు.

***

సత్యమూర్తి అనుకున్నట్టే డోర్ కొట్టారు పోలీస్.

పూజలో నుండి లేచి ముందు గది లోకి వచ్చాడు సత్యమూర్తి.

ఈలోపు లోపల ఉన్న మూర్తి వెనుక నుండి వచ్చి తన రూపాన్నీ పట్టుకున్నాడు. డబ్ అన్న సౌండ్ తో ఒకటై పోయాడు.

డోర్ తెరిచాడు. పోలీస్ ఏదో మాట్లాడుతున్నాడు. తాను ఏమి మాట్లాడకూడదని గుర్తు ఉన్న సత్యమూర్తి.. ఎదురుగా ఉన్న సోఫాలో చతికిల పడ్డాడు. వెంకట్ వచ్చి మాట్లాడాడు.

***

వినీష ఇంటికి చేరుకుంది కింద పడటం వల్ల సైకిల్ ఫెడల్ కి తగిలి వోణి చిరిగింది.

సైకిల్ పార్క్ చేస్తుంటే.. ఇంటి ఓనర్ కొడుకు కన్నారావు "ఏమైంది బట్టలులంతా మట్టి, దుమ్ము దులపనా?" అన్నాడు.

"అబ్బే అక్కరలేదు.." అని 'పాచి పళ్ళ వెదవ..' అనుకుంటూ.. మేడ మీద తన పోర్షన్ లోకి వెళ్ళింది.

ఎదురైన మనీష "ఎవడే.. ఆ విశాల్ గాడినేనా తిడుతున్నావు?" అంది.

"ఏయ్.. గాడు గీడు అనకు, తాను మంచి వాడే! నేనే అపార్థం చేసుకున్నాను. ఈరోజు నాకోసం ఏం చేసాడో తెలుసా!" అని జరిగిందంతా చెప్పింది.

ఈలోపు హరీష వచ్చింది మరలా స్టోరీ రిపీట్ అయ్యింది.

"ఈ అబ్బాయిలు అంతా ఇంతే, నిన్ను ఇంప్రెస్స్ చెయ్యడానికి వాడే ఆ ముసలోడిని ఏరెంజ్ చేసాడేమో!" అంది హరీష.

"నీ మొహం సినిమాలు చూసి నీకు అతితెలివి ఎక్కువైంది" అంటూ విరుచుకుపడింది వినీష.

హరీష వెనుకకి తిరిగి ఉన్న.. వినీషని ఉద్దేశించి "ఏది మేడం.. కొంచెం ఫేస్ టర్నింగ్ ఇచ్చుకోండి" అని చిరు డైలాగ్ కొట్టింది.

కోపం నటిస్తున్న వినీషకి నవ్వు వచ్చింది.

"అబ్బో.. బావ మాట వినేసరికి నవ్వు కూడా.." అంది కొంటెగా హరీష.

"నిన్ను.." అంటూ తరిమింది వినీష.

ఎందుకో విశాల్ తనవాడే, అన్న ఫీలింగ్ వచ్చింది. తన లైఫ్ లో ఫస్ట్ టైమ్ అటువంటి ఫీలింగ్..! అప్పుడు తనకి తెలీదు, ఆ ఫీలింగ్ పేరు ప్రేమ అని. పట్టపగలే తారలు కనపడుతున్నాయి. హృదయం లయ బద్ధంగా సంగీతమై కొట్టుకుంటుంది. వివిధభారతిలో చిత్ర.. కోకిల గానము చేసిన ప్రేమ లోని పాట వస్తుంది "ఈనాడే.. ఏదో అయ్యింది.. ఏ నాడు.. నాలో జరగంది.." అని.

ఇదే కాలానికి ఉన్న శక్తి! ఒక్క క్షణంలో ప్రపంచానికి అధిపతిని చేయగలదు.

***

# PART 15

విశాల్ పోలీస్ స్టేషన్ లోకి అడుగు పెట్టాడు.

"రారా విశాల్.. నేనే నీకోసం డ్రైవర్ ని పంపుదాం అనుకున్నాను. నువ్వే వచ్చావ్" అన్నాడు వెంకట్.

సత్యమూర్తి అన్నీ తెలిసిన వాడిలా నవ్వాడు.

"ఇదిగో సర్.. నిన్న వీడు కూడా ఉన్నాడు. వాడితో కలిసి ఇద్దరూ అడ్రస్ తీసుకుని ప్రొఫెసర్ లక్ష్మణరావు ఇంటికి వెళ్ళారు. ఏ డబ్బుకో ఆశపడి చంపేసి వుంటారు" అన్నాడు లింగరాజు.

విశాల్ ముందుకు వెళ్ళి లింగరాజుతో "కుక్కలా వాగకు, లింగరాజు అంటే పెద్దమనిషి అని అర్థం. నీలాంటి వాడికి ఆ పేరు సూట్ కాదు" అన్నాడు.

"నోర్మూయ్యి కుర్ర కుంకా.." అన్నాడు లింగరాజు.

సుందర్ కి ఒళ్ళు మండింది. "ఇద్దరు కాసేపు నోరు ముయ్యండి" అన్నాడు.

విశాల్.. సుందర్ దగ్గరికి వెళ్ళి జేబులోని ఫోటో తీసి ఇచ్చాడు.

ఇప్పుడు ఆశ్చర్యపోవడం సుందర్ వంతు అయ్యింది.

లింగరాజుకి ఏమి అర్థం కావడం లేదు.

"ఏముంది సర్! ఆ ఫోటోలో.." అన్నాడు.

"నీ శోభనం రోజు తీసిన ఫోటో.. చూస్తావా?" అన్నాడు సుందర్.

లింగరాజు కాస్త దగ్గరకి రాగానే లాగి పెట్టి కొట్టాడు. ఆ దెబ్బకి కింద పడ్డాడు.

"ప్రొఫెసెర్ ని హత్య చేసి.. దాన్ని ఆ కుర్రాళ్ళ పై తొద్దామని చూస్తున్నావా?" అంటూ కాలితో తన్నాడు.

పోలీస్ ట్రీట్మెంట్ తగలగానే "కొట్టద్దు.. నన్ను కొట్టద్దు.." అని, "ఆ ఫోటోలో వుంది నేను కాదు, ఆ హత్య నేను చెయ్యలేదు" అన్నాడు లింగరాజు

"మళ్ళీ కొత్త కథా!" అన్నాడు విశాల్.

"లేదు నిజం! నాకు చంపే అంత ధైర్యం లేదు. ఇది చేసింది నా తమ్ముడు వహీద్! వాడు నేను కవల పిల్లలము" అన్నాడు.

అందరూ ఒక్కసారి నిర్ఘాంత పోయారు.

సుందర్ మాత్రం "ప్రొఫెసర్ ని ఎందుకు చంపారు?" అన్నాడు.

"చెపుతా.. కొద్దీగా మంచి నీళ్ళు" అని అడిగాడు సుందర్.

నీళ్ళు తాగి ఒకసారి చుట్టూ చూసాడు లింగరాజు.

సుందర్ తో "మీకు మాత్రమే చెపుతా" అన్నాడు.

కొంచెం అయిష్టంగా ఒప్పుకున్నాడు సుందర్.

"మీరందరు ఇక వెళ్ళండి" అన్నాడు సుందర్.

విశాల్, మూర్తికి ఇంకా తెల్సుకోవాలని వుంది కానీ.. సుందర్ పొమ్మని అనేసరికి బయలుదేరారు.

వెనుక నుండి "ఆగండి.. ఇంతకీ జర్మన్ డిక్షనరీ మీకేందుకు?" అన్నాడు సుందర్.

విశాల్ కి చాన్సు ఇవ్వకుండా "మేము డిగ్రీ అయ్యాక జర్మనీలో పిజి చేద్దాం అనుకుంటున్నాం సర్! దాని కోసం ఇప్పటి నుండి ప్రాక్టీస్" అన్నాడు మూర్తి.

"సరే, మరి అనుములూరు వెళ్ళేటప్పుడు కెమెరా ఎందుకు తీసుకెళ్ళారు?" అన్నాడు సుందర్.

"నాకు ఫోటోగ్రఫీ అంటే పిచ్చి సర్" అన్నాడు విశాల్.

సుందర్ కి ఇదంతా మళ్ళీ రిపీట్ అవుతున్నట్లు అనిపించింది. "డిజావు (DEJAVU)" అన్నాడు సుందర్.

విశాల్ నవ్వాడు. "సరే సర్ మేము వస్తాం" అని ఇద్దరు బయలుదేరారు.

"DEJAVU అంటే ఏంటిరా?" అన్నాడు సత్యమూర్తి.

"DEJAVU అనేది ఫ్రెంచ్ పదం దీని అర్థం ఇప్పటికే చూసింది, మీరు అనుభవించలేదని.. మీకు తెలిసినప్పటికీ మీరు ఇప్పటికే అనుభవించిన అనుభూతి. ఇది చాలా సాధారణ అనుభవం మరియు చాలా మంది వ్యక్తులు తమ జీవితంలో కనీసం ఒక్కసారైనా దీనిని అనుభవిస్తారు.

డెజావుకి కారణమయ్యే అనేక విభిన్న సిద్ధాంతాలు ఉన్నాయి. ఇది మెదడు జ్ఞాపకశక్తి వ్యవస్థలో లోపం అని ఒక సిద్ధాంతం. మనం ఏదైనా కొత్త అనుభూతిని పొందినప్పుడు మన మెదడు దాని జ్ఞాపకశక్తిని సృష్టిస్తుంది. అయితే కొన్నిసార్లు మెదడు తప్పుడు జ్ఞాపకశక్తిని సృష్టించవచ్చు మరియు ఇది DEJAVU భావనకు దారి తీస్తుంది.

మరొక సిద్ధాంతం ఏమిటంటే.. DEJAVU అనేది మానసిక సామర్థ్యానికి సంకేతం. DEJAVU అనేది గత జీవితం యొక్క సంగ్రహావలోకనం లేదా భవిష్యత్తు యొక్క సూచన అని కొందరు నమ్ముతారు. అయితే ఈ వాదనలకు మద్దతు ఇవ్వడానికి శాస్త్రీయ ఆధారాలు లేవు. DEJAVU సాధారణంగా హానిచేయనిది" అన్నాడు విశాల్

"ఇది.. సైన్సు మాస్టారు సోషల్ చెపుతున్నట్టు వుంది. సరిగా చెప్పి ఏడువు" అని విసుక్కున్నాడు సత్యమూర్తి.

"మనం అక్కతోనో అమ్మతోనో మాట్లాడుతున్నప్పుడు.. ఈ సన్నివేశం ఇంతకు ముందే చూసాం కదా! మళ్ళీ రిపీట్ అవుతుంది ఏంటి? అనుకోవటం చాల పరిపాటి. అలాగే ఎక్కడో ఉన్న గుడికి వెళ్ళాం అనుకో.. అది మనం ఎప్పుడూ చూడకపోయినా ఇది చూసాం కదా! చాలా పరిచయమైనది అనిపిస్తుంది. ఇప్పుడు సుందర్ కి అదే అనిపించింది. అంటే అతని బ్రెయిన్ ముందుసారి మనతో డిస్కషన్ ని రికార్డు చేసింది. అందుకే అతను DEJAVUకి గురయ్యాడు" అన్నాడు విశాల్

***

అసలు అక్కడ ఏం జరిగిందో తెలుసుకోవాలి అనుకుని ఇద్దరూ స్టేషన్ వెనక్కి చేరారు.

స్టేషన్ పాతది కావడం వల్ల సరిగ్గా సుందర్ రూమ్ కి వెనకాల పిట్టగోడ విరిగింది. దాని మీద ఎక్కి కూర్చున్నారు. లోపల నుండి లింగరాజు మాటలు వినపడుతున్నాయి వెంకట్ కూడా లోపలే ఉన్నాడు.

“లక్ష్మణరావు తండ్రి నారాయణ ఒక బ్రిటిషుదొర ఇంట్లో పని చేసేవాడంట. అతనికి పుట్టుకతోనే అంగవైకల్యం, ఒక్క కాలు మాత్రమే ఉండేది. ఆ దొరకి భారత దేశంలో ఉన్న నిధి నిక్షిప్తాలపై చాల మక్కువ. ఒకసారి దేగల కొండ అన్న ప్రాంతంలో ప్రతి అమావాస్యకి ఒక యక్షిణి వస్తుందని.. ఆమె ఒంటినిండా వజ్ర వైడూర్యాలు ఉంటాయి అని తెలుసుకుని అక్కడికి నారాయణతో కల్సి వెళ్ళాడట. అక్కడ ఏమి జరిగిందో తెలియదు. తిరిగి వచ్చాక బ్రిటిష్ దొరకి ఒక కాలు పోయింది. నారాయణకు పోయిన కాలు తిరిగి వచ్చింది. బ్రిటిష్ దొర తరువాతి కాలంలో ఇంగ్లాండ్ వెళ్ళిపోయాడు.

విచిత్రమేమిటంటే.. అతను వెళ్ళాక నారాయణ లక్షాధికారిగా మారిపోయాడు. కాలక్రమేణా ఆ విషయం అందరూ మర్చిపోయారు. అయితే యక్షిణి దగ్గర నుండి నారాయణ వజ్రాలు పొందాడని.. అందుకే లక్షాధికారి అయ్యాడని అందరూ అనుకునే వారు.

బ్రిటిష్ దొరకి ఒక జర్మన్ స్నేహితుడు ఉండేవాడు. అతని పేరు హన్స్. ఈ యక్షిణి గురించి తెలిసిందంతా అతనికి చెప్పాడు బ్రిటిష్ దొర. ఆయన గుర్తుగా.. హన్స్ Diamonds – Hidden treasures అన్న పుస్తకాన్ని జర్మన్ లో రాసాడు. దాని ప్రతి ఒకటి సంపాదించాడు ప్రొఫెసర్ లక్ష్మణరావు. దానిని తెలుగు లోకి తర్జమా చేసే ప్రయత్నంలో నాకు చెప్పాడు. ఆశ చావక నేను దాని వివరాలు అడిగాను. బ్రతిమాలాను, తిట్టాను.. ఆఖరికి కొట్టాను కానీ, లక్ష్మణరావు ఆ రహస్యం భారత జాతికి అంకితమని.. ఎవ్వరికి ఇవ్వనని చెప్పేవాడు. నిన్నటి రోజు వహీద్ ని వెళ్ళి మాట్లాడి రమ్మని చెప్పాను. వాడు కాస్తా ఇంత పని చేసాడు. ఇంతలో ఈ కుర్రాళ్ళు వెళ్ళడం గుర్తు వచ్చింది. ఒక్క దెబ్బకి రెండు పిట్టలు అనుకున్నాను. ఐతే వీళ్ళు నాకన్నా ఘటికులు” అన్నాడు లింగరాజు

"మరి నిధి వివరాలు వహీద్ దగ్గర ఉన్నాయా?" అన్నాడు సుందర్.

"హా.. ఉన్నాయి. కానీ.. కానీ.." అని నసిగాడు లింగరాజు.

సుందర్.. లింగరాజు కాలర్ పట్టుకుని "ఏంటి కానీ.." అన్నాడు.

"అందులో అన్ని విషయాలు ఉన్నాయి కానీ, అసలు ఆ ప్రదేశం ఎక్కడుందో ఉన్న పేపర్ మిస్సింగ్" అన్నాడు లింగరాజు.

బయట నుండి ఇదంతా వింటున్న విశాల్ సత్యమూర్తి ఒకరి మొహాలు ఒకరు చూసుకున్నారు.

విశాల్ చెయ్యి కుడి చేతి వైపు పాకెట్ లోకి వెళ్ళింది. అందులో ప్రొఫెసర్ లక్ష్మణ రావు ఇంట్లో దొరికిన పేపర్ వుంది.

***

# PART 16

ఇంతలో సిగరెట్ కాల్చడానికి ఒక పోలీస్ అటువైపు వచ్చాడు.

"ఏరా ఇంకా ఇక్కడ ఉన్నారు?" అన్నాడు.

"మా బావగారు ఇంకా లోపల ఉన్నాడు. ఆయన కోసం వెయిటింగ్" అన్నాడు మూర్తి.

"మరి ముందు కూర్చొచ్చుగా" అన్నాడు పోలీస్.

"తెలిసిన వాళ్ళకి కనపడితే.. స్టేషన్ కి ఎందుకొచ్చాం? అని డౌట్ పడతారు. ఏం ఇక్కడ కూర్చుంటే తప్పా బాబాయ్!" అన్నాడు విశాల్

పోలీస్ బాబాయ్ మెల్లగా ముందుకు వెళ్ళాడు. ఇద్దరూ వడివడిగా నడుస్తూ కార్ దగ్గరకి వెళ్ళారు. విశాల్ వెళ్ళి కార్ వెనుక స్టేఫినీకి తన సైకిల్ ని వేలాడగట్టాడు. వెంకట్ రాగానే కారు కదిలింది.

వెంకట్ ముందు సారి అడిగిన ప్రశ్నలే మరల అడుగుతున్నాడు. మూర్తి సమాధానం చెపుతూ విశాల్ వంక చూసి నవ్వుతున్నాడు.

విశాల్ ఇంటికి వెళ్ళారు. ఇల్లు తాళం వేసి వుంది. తెలిసినదే కదా! కాసేపటకి అనంత, స్వప్న వచ్చారు.

"ఏరా.. పోలీస్ నిన్ను వెతుక్కుంటూ వచ్చారని తెల్సింది" అని కంగారుగా అంది అనంత.

"ఏమిలేదమ్మా..! ఏదో ఒక గొడవలో మమ్మలిని సాక్ష్యం అడిగారు అంతే, అయినా ఈ విషయం నీదాకా ఎలా వచ్చింది?" అన్నాడు విశాల్.

"ఇదిగో.. ఈ లౌడ్ స్పీకర్ చెప్పి ఉంటుంది" స్వప్న వైపు చూస్తూ అన్నాడు మూర్తి.

"నేను కాదు అన్నలూ.. పక్కింటి ముసల్ది" అంది స్వప్న.

అప్పటికే తొంగి చూస్తున్న పక్కింటి పిన్నిగారు టక్కున గోడ చాటు నక్కింది.

స్వప్నకేసి కొరాకొరా చూస్తూ "ఏయ్.. పెద్ద చిన్న లేకుండా ఏంటా మాటలు?" అంది అనంత

"లేకపోతే ఏంటమ్మా.. అన్నయ్య ఏమైనా దొంగా! ఆవిడ ఆలా అడుగుతుంది" అంది స్వప్న.

"అమ్మ.. కొద్దిగా టీ పెట్టు" అన్నాడు విశాల్.

"నువ్వు వెధవ్వి రా! మొన్న ఫస్ట్ టైమ్ ట్యూబ్ లోకి వెళ్ళినప్పుడు.. నువ్వంటే ఇంత ప్రేమ పెట్టె చెల్లెలు, అమ్మ గుర్తు రాలేదు. ఆ వినీష గుర్తు వచ్చింది" లోపలి వెళుతున్న అమ్మ చెల్లి ని చూస్తూ విశాల్ ని తిట్టాడు మూర్తి.

"అమ్మ, నాన్న, చెల్లి వీళ్ళందరూ నన్ను ప్రేమించే వ్యక్తులురా! నేను వద్దన్నా..! కాదన్నా..! వాళ్ళు నా వెనుకాలే! వాళ్ళని తిరిగి ప్రేమించడం నా బాధ్యత కానీ, నన్ను నేను ప్రేమించుకోవడం తప్పు కాదుగా" అన్నాడు విశాల్

"ఏరా.. పైత్యం నషాళానికి అంటిందా! నేను వినీష గురించి మాట్లాడుతున్నాను" అన్నాడు మూర్తి.

"నీకు ఇంకా అర్థం కాలేదురా! వినీష ఒకటి విశాల్ ఒకటీనా..! నేను తనని చూసిన క్షణమే.. ఆమె నాలో సగం అయిపోయింది. శరీరంలో ఎక్కడుందో తెలియని మనసు అంతా నిండిపోయిన మనిషిని.. కొత్తగా తలుచు కోవాలా? తనకు నేను, నాకు ఆమె" అన్నాడు విశాల్.

కళ్ళు అప్పగించి ఒక అద్భుతాన్ని చూస్తున్నట్టు చూసాడు మూర్తి.

"నీ భావోద్వేగ తీవ్రత అంటే నాకు భయం రా! ఎంత సంతోషపడతావో..! అంత బాధ పడతావు. తొందరగా ఈ విషయం ఆ వినీషకి చెప్పు" అన్నాడు మూర్తి.

ఈ లోపు స్వప్న టీ తీసుకువచ్చింది.

"బయలుదేరుదామా!" అన్నాడు మూర్తి.

"లేదురా..! నేను ఉంటా నువ్వు వెళ్ళు" అన్నాడు విశాల్.

"ఏంటి ఉండేది? పొద్దున్న జరిగిన వ్రతం కోసం అక్క కష్టపడి చాల వంటలు చేసింది. అవన్నీ ఎవడు తింటాడు? పద.. పద.. అసలే పొద్దున్న జరిగిన పోలీస్ సంఘటన వలన బ్రాహ్మలను భోజనానికి కూడా పిలవలేదు" అన్నాడు.

"పోనీ లేరా.. మూర్తి అన్నయ్య మిగిలినివి తినడానికి పిలుస్తున్నాడు. సిగ్గు లేకుండా వెళ్ళి పందిలా మెక్కి రా" అంది పక్కనే ఉన్న స్వప్న.

విశాల్ "ఏయ్.." అంటూ లేవడంతో లోపలి పరుగు పెట్టింది.

***

తిన్న తరువాత టీవీ చూస్తున్నారు. మరలా గీతాంజలి పాట కాని, ఈ సారి వింటూ ఉంటే ఉల్లాసంగా వుంది.

"ఒరేయ్ ఒకటి గమనించావా! మనం గతం లోకి వెళ్ళినా.. చిన్న చిన్న మార్పులు చేసినా సంఘటనల క్రమం మాత్రం (order of events) మారలేదు. అంటే కాలం చేసే పనులు ఒకటో రెండో మార్చవచ్చు గాని, సంఘటనల క్రమం మాత్రం మార్చలేము. ఉదాహరణకి వినీష కన్నీళ్ళు, నాకు తగిలిన దెబ్బలు, పోలీస్ నన్ను స్టేషన్ కి తీసుకువెళ్ళడం.. ఇలా వినీష కన్నీళ్ళకి కారణం మారింది అంతే" అన్నాడు విశాల్.

"ఇవన్నీ పక్కన పెట్టు ఇంతకీ నీ ప్రేమ సంగతి వినీషకి ఎప్పుడు చెపుతావ్?" అన్నాడు మూర్తి.

"చెపుతా రా! దానికి టైమ్ మెషిన్ ఏమైనా పని చేస్తుందా! అని చూస్తున్నాను" అన్నాడు విశాల్.

"అదెలా పని చేస్తుంది?" అన్నాడు మూర్తి.

"మనం వెనుకకి వెళ్ళాం. ఒకసారి ముందుకు కూడా వెళ్ళాలి. ఇంకా same location కాక, వేరు ఏదైనా location కి వెళ్ళాలి" అన్నాడు విశాల్.

మూర్తి అక్క బావ పడుకున్నారు అనుకున్నాక స్టోర్ రూమ్ లోకి వెళ్ళారు.

"ఒరేయ్ అట్లాస్ ఉందా?" అన్నాడు విశాల్.

"హా వుంది" అని తీసుకువచ్చాడు మూర్తి.

"ఏదైనా ఒక ప్లేస్ పేరు చెప్పు?" అన్నాడు విశాల్.

"లండన్.." అన్నాడు మూర్తి.

"అట్లాస్ లో దాని అక్షాంశం మరియు రేఖాంశం చెప్పు" అన్నాడు విశాల్.

సెక్స్టాంట్ తీసి లెక్కిస్తున్నాడు మూర్తి?

"ఏంటది?" అన్నాడు విశాల్.

"దీన్ని సెక్స్టాంట్ అంటారు. దీనితో భూమి అంతరిక్షంలో ఉన్న ఏ ప్రదేశాన్నైనా.. అక్షాంశం మరియు రేఖాంశం దూరం కొలవవచ్చు. లండన్ యొక్క అక్షాంశం మరియు రేఖాంశం లెక్కిస్తున్న తీసుకో" అంటూ – 51.507401 0.127758 ఇచ్చాడు మూర్తి.

***

ఇక్కడే ఒక తప్పు జరిగింది. లండన్ కోఆర్డినెట్స్ 51.507401 – 0.127758 మూర్తి పొరపాటున వాటిని తిరగేసి లెక్కించాడు –51.507401 0.127758.

విశాల్ కోఆర్డినెట్స్ ని ఫీడ్ చేసాడు +10 గంటలకు టైమ్ సెట్ చేసాడు. ప్రొజెక్టర్ ఆన్ అయ్యింది. అరగంట తరువాత ఎరుపురంగు వలయం ఏర్పడింది.

ఇద్దరూ గ్రీన్ బటన్ ప్రెస్ చేసారు. జాప్.. అంటూ సౌండ్! ఆ తరువాత కళ్ళు తెరిచి చూస్తే.. అంతా నీరు, ఎదురుగా విశాల్ మునిగి పోతున్నాడు. పక్కనే చేపలు కనిపించాయి. ఊపిరి ఆడటం లేదు.

***

# PART 17

విశాల్ కి హఠాత్తుగా మెలుకువ వచ్చింది. ఊపిరి ఆడటం లేదు ఎదురుగా మూర్తి కనపడుతున్నాడు. స్విచ్ ఏది అని సైగ చేసాడు.

మూర్తి కిందికి జారి పోతున్న స్విచ్ వంక చూపించాడు.

విశాల్ కిందకు వెళ్ళడానికి ప్రయత్నం చేసాడు ఈలోపు ఎక్కడి నుండి వచ్చిందో.. ఒక పెద్ద చేప కన్ను.. ఎరుపు ఆకుపచ్చ రంగులో ఉన్న స్విచ్ మీద పడింది, గబాగబా వచ్చి దాన్ని మింగింది. రెడ్ బటన్ నొక్కుకోవడంతో.. విశాల్, మూర్తి చేపతో పాటు స్టోర్ రూమ్ లో పడ్డారు.

విశాల్ దగ్గుతూ మూర్తి దగ్గరికి వెళ్ళి చూసాడు. స్పృహలో లేడు, వెంటనే పొట్ట పైన చేతులు వేసి నొక్కాడు. వాటర్ కక్కుతూ లేచాడు మూర్తి.

చేప మాత్రం గిలాగిలా కొట్టుకుంటుంది. పెద్దది కావడం వల్ల ఏమి చెయ్యలేకపోయారు.

"పాపం మనల్ని కాపాడ్డానికి అది బలైపోయింది" అన్నాడు మూర్తి.

"అందుకే రేపు అక్కతో పులుసు పెట్టించి, దాని ఋణం తీర్చుకుందాం. అయినా సెక్స్టాంట్ కాలికులేషన్. అని చెప్పి సముద్రం లో పడేస్తావా అన్నాడు విశాల్.

"నాకు అదే అర్థం కాలేదురా!" అన్నాడు మూర్తి.

బట్టలు మార్చుకుని ఇద్దరూ పడకేసారు.

"బుక్ ప్రకారం మనం చంపలేము, పుట్టించలేము కదా! మరి చేప ఎలా పోయిందంటావ్?" అన్నాడు మూర్తి.

"మనం చంపలేదు కాదురా! దానికి ఆయుష్షు అయిపోయింది, పోయింది. ఇక పడుకో" అన్నాడు విశాల్.

కళ్ళు మూసుకోగానే వినీష కనిపించింది. విశాల్ కి పెదాలపై చిన్న చిరునవ్వు వచ్చింది.

అది చూసిన మూర్తి "ఏంటి డ్యుయేట్ ఆ..! సౌండ్ కొద్దిగా తక్కువ పెట్టుకోండి. లేకపోతే నాకు ఇక్కడ నిద్ర రాదు" అన్నాడు.

***

తెల్లవారింది.

"ఒరేయ్ లేవండి.." అని వెంకట్ బావ అరుస్తున్నాడు.

'ఇదేంటి..? మరల సేమ్ రిపీట్..' అనుకుని ఇద్దరూ లేచారు.

"నేను అర్జెంట్ గా క్యాంప్ కి వెళుతున్నాను. కొద్దిగా మా ఊరు వెళ్ళి ఈ పేపర్స్ MRO ఆఫీస్ లో ఇచ్చి రండి" అన్నాడు.

"సరే బావ.. ఈవెనింగ్ కాలేజ్ అయ్యాక వెళ్తాము" అన్నాడు మూర్తి.

వెంకట్ వెళ్ళిపోయాడు.

అక్కయ్య వచ్చి "ఏరా.. స్టోర్ రూమ్ అంతా ఆ తడి ఏమిటి? అంత పెద్ద చేప ఎక్కడిది?" అంది.

మూర్తి నోటికొచ్చిన కథ చెప్పాడు.

పొద్దున్నే నదికి వెళ్ళాం అని.. ఈత కొడుతుంటే దొరికిందని చెప్పాడు. ఈలోపు పనిమనిషి అప్పాయమ్మ వచ్చింది.

"అది సవుద్రం సేప! మీకు నదిలో ఎట్టా దొరికింది?" అంది.

విశాల్ కల్పించుకుని "మేము నదిలో మొదలెట్టి సవుద్రం వరకు ఈదాం కథేటీ.." అన్నాడు.

"ఓలమ్మో.. ఓలమ్మో.. ఈ గుంటడు కమ్మ కడతండు" అంది అప్పాయమ్మ.

అక్కయ్య కోపంగా “ఒరేయ్ మీ పద్ధతి నాకు అర్థం కావడం లేదు. ఎప్పుడు చూసినా ఆ రూమ్ లోగాని.. స్టోర్ రూంలో గాని వుంటున్నారు. తొందరగా తిని కాలేజ్ కి పొండి” అని లోపలి వెళ్ళింది.

కళ్ళు అప్పగించి నోరు తెరిచి చూస్తున్న అప్పాయమ్మని “నోట్లోకి ఈగలు వేగిరం పోతాయి ముయ్యి..” అన్నాడు విశాల్.

మూర్తి నవ్వుతూ లోపలి వెళ్ళాడు.

***

ట్యూషన్ కి లేట్ అయ్యింది. లోపలి వెళ్ళగానే వినీష కనిపించలేదు. ‘రాలేదా ఏంటి?’ అనుకున్నాడు విశాల్.

ఉమ మాత్రం తన వంక చూడటం గమనించాడు. ట్యూషన్ అయ్యాక బయటికి వచ్చాడు విశాల్.

“నువ్వు ఇంటికెళ్ళు నాకు కొంచెం పని వుంది” అన్నాడు మూర్తి.

“నాకు తెలీని పని ఏంటిరా?” అన్నాడు విశాల్.

“ఏం అన్నీ నీకు తెలియాలా!?” అన్నాడు మూర్తి.

‘ఎందుకు వీడు ఇలా మాట్లాడుతున్నాడు?’ అనుకుని విశాల్ బయలుదేరాడు.

రోడ్ టర్నింగ్ తిరుగగానే వెనుక నుండి ఇంకో సైకిల్ వెనుకగా వచ్చింది.

వినీష పీచ్ రాస్బెరితో కలిసిన మల్లెల గుబాళింపు “హాయ్.. వినీష” అన్నాడు.

వెనుకకు తిరగకుండానే “హాయ్.. ఏంటి? మీకు వెనుక కూడా కళ్ళు ఉన్నాయా?” అంది వినీష.

“హా.. కావాల్సిన వాళ్ళ కోసం ఒళ్ళంతా కళ్ళే” అన్నాడు విశాల్.

“ఎంతమందికి చెప్పారు ఈ డైలాగ్!?” అంది వినీష.

“మీరు వాడేది Guess for Women పెర్ఫ్యూమ్ కదా!” అన్నాడు విశాల్.

వినీష ఆశ్చర్యంగా "అవును మీరు.. మామూలు వాళ్ళు కాదు, బాగా ముదురు" అంది.

"అదేం లేదండి, ఒక మల్లెపూవు.. మల్లెపూవు లాంటి డ్రెస్ వేసుకుని మల్లెల సెంట్ కొట్టుకొస్తే, ఎవరికైనా తెలుస్తుంది అన్నాడు విశాల్.

వినీష క్రీగంట చూసి నవ్వుకుంది.

ఈలోపు వెనుక సైకిల్ పైన వచ్చిన ట్యుషన్మేట్ ఆనంద్.. "విశాల్.. అక్కడ మూర్తి.. మోహన్ ని కొట్టి చంపేశాలా ఉన్నాడు" అన్నాడు.

'అనుకున్నా.. వీడు ఇలాంటిది ఏదో చేస్తాడని' కంగారుగా సైకిల్ టర్న్ చేసి ఫాస్ట్ గా వెళ్ళాడు విశాల్.

ట్యూషన్ కి కొద్దీ దూరంలో అందరూ మూగి ఉన్నారు.

మోహన్ కింద పడి ఉన్నాడు. మూర్తి కాలు వాడి పీక మీద వుంది.

విశాల్ వెళ్ళి "ఒరేయ్.." అని వెనుకకు లాగబోయాడు.

"నువ్వు ఆగరా.. వీడు ఉమాకి ఏం లెటర్ రాసాడో చూడు.." అన్నాడు మూర్తి.

అప్పుడు అర్థం అయ్యింది మూర్తి గాడు మోహన్ ని ఇరికించాడని. ఉమ ఒక పక్కన నిలుచుని ఏడుస్తుంది.

"సరే.. సరే.. ఇంకా కొడితే చస్తాడు వదిలేయ్" అన్నాడు విశాల్.

మోహన్ లేచి బట్టలు దులుపుకుంటున్నాడు.

ఏదో మాట్లాడబోయాడు, "ఇంకో మాట మాట్లాడితే చెప్పుతో కొడతా!" వెళ్ళు అన్నాడు మూర్తి.

వినీష కూడా అక్కడ వుండే సరికి మోహన్ అహం దెబ్బతింది. "మీ ఇద్దరినీ ఊరికె వదలనురా..!" అనుకుంటూ వెళ్ళిపోయాడు.

మిగిలిన అంతా ఎవరికి వాళ్ళు వెళ్ళిపోయారు.

వినిషా.. ఉమ దగ్గరకు వెళ్ళి "ఏమైంది?" అని అడిగింది.

విశాల్ కంగారుగా "అది.." అని ఏదో చెప్పబోయాడు.

మూర్తి పర్లేదు అన్నట్టు సైగ చేసాడు.

"మోహన్ ఇందులో ఏవో బూతులు రాసి అది విశాల్ కి ఇచ్చి.. నీకు అందేలా ప్లాన్ చేసాడు. సమయానికి మూర్తి అడ్డుపడ్డాడు" అంది ఉమ.

"ఏం రాసాడు?" అని పేపర్ తీసుకుంది వినీష.

విశాల్ వెళ్ళి అది లాక్కుని "బూతులు అని చెప్పిందిగా.. ఇంకా అవసరమా!" అంటూ చింపేసాడు.

వినీష కళ్ళలో విశాల్ పై ఆరాధన కనబడింది. ఉమకి మాత్రం లోపల మండుతున్నా.. మోహన్ ని కొట్టినట్టు మూర్తి తననీ కొడతాడని భయం వేసింది.

ఈలోపు మూర్తి "ఏరా.. వీడిని కొట్టాలని ప్లాన్ చేసింది నువ్వు, మరి మధ్యలో వెళ్ళిపోతావా!? అవునులే ఆవిడ పక్కన ఉంటే ప్రపంచం అంతా మరుపే" అన్నాడు.

"విశాల్ చాలా చాలా థాంక్స్..! మొన్న సైకిల్ మీద, ఈరోజు ఇక్కడ నన్ను సేవ్ చేసావ్! రేపు కలుద్దాం" అని చెప్పి సైకిల్ వైపు వెళ్ళింది వినీష.

"ఇప్పుడు చూడు తిరిగి చూస్తాది" అన్నాడు మూర్తి.

సైకిల్ దగ్గరికి వెళ్ళాక తిరిగి చూసింది. మల్లెపూవు లాంటి తెల్ల డ్రెస్ లో మందార మోము వెలిగి పోతుంది.

మూర్తి వెనుక నుండి ఏదో కామెంటరీ ఇస్తున్నాడు.

వినీష వెళ్ళిపోయింది.

విశాల్ గుండె జారీ పోయింది.

***

"అయినా వాడిని కొడుతున్నట్టు నాకు కూడా చెప్పలేదు. నేను ప్లాన్ చేశానంటావేంటి రా!?" అన్నాడు విశాల్.

"నీ హీరోయిన్ దగ్గర, నా హీరోయిజం ఎందుకురా?" అన్నాడు మూర్తి.

'అబ్బా.. మళ్ళీ కొట్టాడు మనసు మీద' అనుకున్నాడు విశాల్.

అప్పుడు చూసాడు ఇంకా అక్కడే ఉన్న ఉమని.

విశాల్ దగ్గరికి వస్తుంటే భయపడి ఏడుస్తుంది.

“ఊరుకో ఉమ.. నేను నిన్ను ఏమి అన్నాను అని ఏడుస్తున్నావ్? నువ్వు ఏడవాలంటే తోటి ఆడపిల్ల మీద నువ్వు ప్లాన్ చేసింది తలచుకుని.. నీ బుద్ధి హీనతకు ఏడువు. తెలిసి చేసావో..! తెలియక చేసావో..! నాకు తెలీదు కానీ, ఇది నీకే జరిగితే ఎలా ఉంటాదో ఆలోచించు. శారీరక హింస కన్నా మానసిక హింస దారుణమైనది” అన్నాడు విశాల్.

ఆ మాటలకూ ఏడుపు ఇంకా ఎక్కువైంది. ఏడుస్తున్న ఉమని చూస్తే విశాల్ కి జాలి వేసింది. “చెయ్యి పట్టుకుని ఊరుకో” అన్నాడు.

విశాల్ ని గట్టిగా హత్తుకుని వెక్కివెక్కి ఏడ్చింది ఉమ.

ఎవరో ఆ సీన్ ని క్లిక్ మనిపించారు.

***

# PART 18

వినీష వెళుతూ వెళుతూ ఆలోచించింది. కళ్ళ ఎదురుగా విశాల్ కనపడుతున్నాడు. 'ఛీ.. నేనేనా..! ఇలా ఐపోయాను? మూర్తి కరెక్ట్ చెప్పాడు. నేనే వెనుక పడుతున్నాను. అసలు తన మనసులో ఏముందో..?' మరల మరలా.. అదే ఆలోచనలుతో కొమ్మల మధ్య ఉన్న పువ్వులా తడబడింది. 'మనసు కదా మరి వినదు. ఇలాంటివి నాన్నకి అమ్మకి ఇష్టం వుండవు కాబట్టి, మనం స్ట్రాంగ్ గా ఉండాలి' అనుకుంది.

***

మరునాడు విశాల్ కనిపించినా మాట్లాడలేదు.

"ఏమైంది.. మేడం కోపంగా ఉన్నారు?" అన్నాడు విశాల్.

"ఏదో లెండి మీకెందుకు?" అంది వినీష.

"అయ్యో.. రామా! ఏమన్నానని ఇప్పుడు?" అన్నాడు విశాల్.

"దయచేసి వెళ్ళండి. ఏదో హెల్ప్ చేసారని మాట్లాడితే, ఇలా రోజూ వెనుకబడటం సబబు కాదు" అంది.

తొక్కుతున్న సైకిల్ ఆపి అలా ఉండిపోయాడు విశాల్.

కదిలి వెళ్ళిపోయింది వినీష.

'ఏంటో ఈ అమ్మాయిలు అర్థం కారు. కోపంలో కూడా.. ఆ వాలు కనుల్లో సొగసు తగ్గలేదు. ఆ అందం చూసుకునే అంత పొగరు?' అనుకుని సన్నని నవ్వుతో కదిలాడు.

ఇంకొకడు అయితే ఎలా రియాక్ట్ అయ్యేవాడో..!

***

కాలేజ్ లో మూర్తి కలిసాడు. కొద్దిగా డల్ గా ఉన్నాడు.

"ఏమయిందిరా? అలా ఉన్నావ్?" అన్నాడు విశాల్.

"వెంకట్ బావ వెళ్ళి నాలుగు రోజులు అయ్యిందిరా! ఎక్కడికైనా వెళితే తప్పకుండా రాత్రి ఫోన్ చేస్తాడు కానీ, ఈసారి ఒక్క ఫోన్ కూడా లేదు. అక్క కంగారు పడుతుంది" అన్నాడు.

"ఏమైనా పని మీద దూరం వెళ్ళారేమో?" అన్నాడు విశాల్.

"ఎంత దూరము వెళ్ళినా చెప్పి వెళ్తారు" అన్నాడు మూర్తి.

"పోనీ టైమ్ మెషిన్ లో ట్రై చేస్తే..!" అన్నాడు విశాల్.

"ఫలితం లేదు ఆయన వెళ్ళి నాలుగు రోజులు అయ్యింది. మనం వెన్కక్కి రెండు రోజులు మాత్రం వెళ్ళగలం" అన్నాడు మూర్తి.

"పార్టీ ఆఫీస్ కి వెళ్దాం పద" అన్నాడు విశాల్.

"అక్కడ కూడా ఏమి సమాచారం లేదు" అన్నాడు మూర్తి.

ఇద్దరూ ఇంటికి వచ్చారు.

మూర్తి అక్క దిగులుగా వుంది.

"ఏమి దిగులు పడకు అక్క, బావ వచ్చేస్తారు" అన్నాడు విశాల్.

"ఏమోరా..! భయంగా వుంది" అంది అక్క.

కార్ డ్రైవర్ వచ్చాడు.

"వెంకట్ బావ ఎక్కడికి వెళ్ళారు? ఆయన కూడా.. నువ్వు ఎందుకు వెళ్ళలేదు?" అని అడిగాడు విశాల్.

"మూర్తి గారితో కలిసి వాళ్ళ వూరు వెళ్ళమని చెప్పి, ఆయన తన స్నేహితుడు రాజు గారితో కలిసి వెళ్ళారు" అన్నాడు డ్రైవర్.

వెంటనే రాజుగారికి కాల్ చేసారు. ఇద్దరూ కలిసి వెళ్ళిన మాట వాస్తవం అని, ఐతే దారిలో కారు ఆగిపోవడం వల్ల వెంకట్ దిగి ఎవరిదో స్కూటర్ లిఫ్ట్

అడిగి వెళ్ళాడని.. ఐతే వెళ్ళేటప్పుడు తాను పని మీద హైదరాబాద్ వెళ్తున్నాని చెప్పాడు అని రాజు గారు చెప్పాడు.

“ఆ స్కూటర్ పైన వ్యక్తి ఎలా ఉన్నాడు?” అని అడిగాడు విశాల్.

“అతనెవరో ముస్లిం వ్యక్తి అని, పిల్లిగడ్డం ఉంది” అని చెప్పాడు రాజు గారు.

ముస్లిం వ్యక్తి అనగానే లింగరాజు గుర్తు వచ్చాడు. అదే మాట అడిగాడు అతనిని. పేరు తనకు తెలీదని.. కాకుంటే వెంకట్ తెలిసిన మనిషిలా పలకరించాడని చెప్పాడు.

“దయచేసి వాళ్ళ మధ్య సంభాషణ చెప్పగలరా?” అడిగాడు విశాల్.

రాజుగారు సరిగ్గా గుర్తు లేదు అన్నాడు.

“సర్.. కొద్దిగా గుర్తు తెచ్చుకుని చెప్పండి. బావ నాలుగు రోజులైంది ఫోన్ చేసి” అన్నాడు మూర్తి.

“నాకు పెద్దగా గుర్తు లేదు కానీ, ‘సుందర్ నిన్ను వదిలారా! మీ బ్రదర్ దొరికాడా?’ అని వెంకట్ అన్నాడు” అని చెప్పారు రాజు గారు.

ఇద్దరూ రాజు ఫోన్ కింద పడేసి పరిగెత్తారు.

వెనుక డ్రైవర్ వచ్చాడు. “పోలీస్ స్టేషన్ కి పోనీ..” అన్నారు.

స్టేషన్ కి వెళ్ళే సరికి సుందర్ ప్రతాప్ లేడు. హెడ్ ని అడిగితే లింగరాజు ఉన్న సెల్ కి తీసుకెళ్ళాడు.

“వచ్చావా కుర్రకుంకా.. నువ్వు వస్తావని నాకు తెలుసు” అన్నాడు లింగరాజు.

“ఒరేయ్.. వయసులో పెద్ద వాడివని నీకు మర్యాద ఇస్తున్నాను. మర్యాదగా చెప్పు మా బావ ఎక్కడ?” అన్నాడు మూర్తి.

“మీరు చేసిన పనికి పోలీసులు నన్ను వదలరు. నా తమ్ముడు వహీద్ మిమ్మల్ని వదలడు” అన్నాడు లింగరాజు.

“నీకు, నీ తమ్ముడికి.. మా పై కోపం! ఇందులో మా బావ ఏం చేసాడు?” అన్నాడు మూర్తి.

"హత్య చేసింది వహీద్! నన్ను ఎందుకు జైలులో పెట్టారు? ఇది అలాంటిదే" అన్నాడు లింగరాజు.

"సరే మేము ఏమి చెయ్యాలో చెప్పు" అన్నాడు విశాల్.

"ఈ హత్య చేసింది మీరని ఒప్పుకోండి. అప్పుడు బతుకుతాడు మీ బావ, లేకపోతే ప్రొఫెసర్ లానే మీ వెంకట్ బావ కూడా.." అన్నాడు లింగరాజు.

మూర్తి కదిలాడు.

"ఏమైంది?" అన్నాడు విశాల్.

"సుందర్ సర్ కి చెప్పి వీడి తొక్క తీయిస్తా" అన్నాడు మూర్తి.

లింగరాజు నవ్వుతూ.. "వారం నుండి నన్ను కొడుతూనే ఉన్నారు. మీ బావ విషయం వాళ్ళతో చెప్పిన తక్షణం.. వహీద్ అతన్ని చంపుతాడు" అన్నాడు.

విశాల్ ముందుకు వచ్చి "సరే, నేను ఈ హత్య చేశా అని లొంగిపోతాను కానీ, దానికి ముందు మా బావ ఎలా ఉన్నాడో మా కళ్ళతో చూడాలి" అన్నాడు.

"ముందు నువ్వు లొంగిపో.." అన్నాడు లింగరాజు.

"సమస్య నీది, మేము నీకులాంటి గుంట నక్కలం కాదు. ముందు వెంకట్ బావని చూడాలి. తరువాత నేను లొంగిపోవాలి" అన్నాడు విశాల్.

లింగరాజు కొద్దిగా మెత్తబడ్డాడు. "సరే ఈరోజు సాయంత్రం లైబ్రరీ వెనుకాల చింత చెట్టు కింద సరిగ్గా నాలుగు గంటలకు వుండండి. మా మనిషి ఒకడు మిమ్మలిని తీసుకు వెళ్తాడు. ఏమాత్రం అతి తెలివి చూపినా.. పోలీస్ కి చెప్పినా! వెంకట్ శాల్తీ గల్లంతే" అన్నాడు లింగరాజు.

"సరే.." అని ఇద్దరూ బయలు దేరారు.

***

"ఒరేయ్.. వీడు మాటలే కానీ, వాడు చేతలు హంతకుడు. మనం పులి బోనులో తల పెడుతున్నాం! దీని కన్నా సుందర్ కి చెప్పడం బెటర్" అన్నాడు మూర్తి.

"నీకు మతి పోయిందా? పోలీస్ చేసే హడావిడికి వాడు దేనికన్నా తెగిస్తాడు. దీన్ని మనమే డీల్ చేద్దాం అన్నాడు విశాల్.

మూర్తికి ఇష్టం లేకపోయినా విశాల్ మీద నమ్మకంతో కదిలాడు.

***

# PART 19

సాయంత్రం మూడు అయ్యింది. విశాల్ మూర్తి లైబ్రరీ దగ్గరకు బయలు దేరారు. లైబ్రరీ దగ్గర టీ షాప్ పక్కన ఉన్న బెంచ్ పై కూర్చున్నారు.

"ఒరేయ్.. ఇంకోసారి ఆలోచించు, మనం డీల్ చేయబోయేది ఒక హంతకుడితో! తేడా వస్తే మనం కూడా అవుట్. పోలీస్ డీల్ చేస్తే బెటర్" అన్నాడు మూర్తి.

"అక్కడ ఉన్నది బావరా! ఆయన ఈ విషయంలో దూరింది మన కోసం. ఇప్పుడు ఆయనకి ఏమైనా ఐతే అక్కకి సమాధానం ఏమి చెపుతాం? మనకి ఏమి కాదు" అన్నాడు విశాల్.

"ఏమైనా ప్లాన్ ఉందా!" అడిగాడు మూర్తి.

వెనుక ఎవరో ఉన్నారని సైగ చేస్తూ "ఏమి లేదు, వహీద్ ని బ్రతిమాలడమే" అన్నాడు.

మూర్తికి వెనుక ఎవరో ఉన్నారని అర్థం అయ్యింది.

సరిగ్గా నాలుగుకి ఐదు నిమిషాలు ఉందనగా.. వెనుక కూర్చున్న మనిషి లేచి వెళ్ళాడు.

విశాల్, మూర్తి కూడ లేచి లైబ్రరీ బ్యాక్ కి వెళ్ళారు.

చింత చెట్టు బాగా పెద్దది కావడం వల్ల.. దాని కింద పగలే చీకటిగా ఉంది. వెనుక భాగానికి ఎవరూ రారు కాబట్టి, నిర్మానుష్యంగా వుంది. సరిగ్గా విశాల్

అనుకున్నట్లే, టీ షాప్ దగ్గర వ్యక్తి వచ్చాడు. వాడు కళ్ళకి ఒక గుడ్డ కట్టుకున్నాడు. రెండు ముతక గుడ్డలు తీసి "తలకి కట్టుకోండి" అన్నాడు.

ఇంకో ఇద్దరు వెనుక నుండి వచ్చారు. ఇప్పుడు విశాల్, మూర్తికి ఏమి కనిపించడం లేదు.

ఇద్దరినీ గిరాగిరా.. ఆత్మ ప్రదక్షిణం చేసినట్లు తిప్పారు.

"ఇప్పుడు ముందుకు నడవండి" అన్నారు.

అలా ఒక పది నిముషాలు నడిచారు. ఏవో మెట్లు దిగుతున్నారు. ఒక చోటకి వచ్చాక ఆగారు. ఇద్దరి తలకి ఉన్న గుడ్డ తొలగించారు.

ఒక సిక్స్టీ కాండిల్ లైట్ వుంది. ఒక పాత సోఫా, దాని పైన గ్రీన్ కలర్ గుడ్డ, ఒక కుర్చీ, ఒక చిన్న టేబుల్ ఉన్నాయి.

సోఫాలో లింగరాజు లాగానే ఉన్న ఒక మనిషి చూడగానే.. వహీద్ అని గుర్తు పట్టారు.

"ఇప్పుడు చెప్పండి, నేను ప్రొఫెసర్ ని చంపుతుంటే ఫోటో ఎందుకు తీశారు?" అన్నాడు వహీద్.

"ఆ కేసులో మమ్మలిని ఇరికించారు కాబట్టి! ఆ ఫోటో బయట పెట్టాల్సి వచ్చింది" అన్నాడు విశాల్.

"అయినా నాకో విషయం అర్థం కాలేదు. నేను ప్రొఫెసర్ ఇంటి నుండి వచ్చేటప్పుడు మీరు నాకు గేట్ దగ్గర కనిపించారు. అలా ఎలా ఫోటో తీశారు?" అన్నాడు.

"మేము ముందే వచ్చాం. ప్రొఫెసర్ డిక్షనరీ ఇవ్వలేదు. కాసేపు ఆగమన్నాడు. మేము ఇంటి చుట్టూ ఉన్న గార్డెన్ చూస్తున్నాం. ఈలోపు నువ్వు వచ్చావు. తరువాత నువ్వు బయటకి వాస్తావని గేట్ బయట వెయిట్ చేసాం. నువ్వు తప్పించుకున్నావ్" అన్నాడు మూర్తి.

వహీద్ కళ్ళు చిట్లించి "కానీ.. గేట్ బయట నేను ఏ స్కూటర్ చూడలేదు" అన్నాడు.

"తప్పించుకునే కంగారులో మిస్ అయ్యివుంటావ్" అన్నాడు విశాల్.

"ఇంతకీ మా బావ ఎక్కడ?" అన్నాడు మూర్తి.

పక్కనే ఉన్న గది నుండి వెంకట్ ని తీసుకొచ్చారు. తన ముఖానికి ముసుగు వుంది.

పక్కన ఉన్న వహీద్ అనుచరుడితో "ముసుగు తియ్యి.." అన్నాడు మూర్తి.

"ఇది చాలు మీకు, ఇప్పుడు నువ్వు ఇక్కడ ఉండి మీ బావకు తోడుగా వుండు. వాడు వెళ్ళి పోలీస్ కి లొంగుతాడు. లింగరాజు బయటకు వచ్చాక మిమ్మలిని ఏం చెయ్యాలో ఆలోచిస్తాను" అన్నాడు వహీద్.

మూర్తి మాట విని వెంకట్ "ఒరేయ్ మూర్తి.. నువ్వు ఎందుకు వచ్చావ్? అక్కకి తెలుసా!" అని అడిగాడు.

"నువ్వు కంగారు పడకు బావ" అన్నాడు మూర్తి.

"చాలు చాలు.. మీ కుశల ప్రశ్నలు, లోపలికి వెళ్ళి మాట్లాడుకోండి. మీ ఇష్టం" అన్నాడు వహీద్.

విశాల్ గట్టిగా నవ్వాడు.

"ఎందుకు నవ్వుతున్నావ్?" అన్నాడు వహీద్.

"నిన్ను చూస్తే జాలి వేస్తుంది" అన్నాడు విశాల్.

వహీద్ కి ఒక్క క్షణం అర్థం కాలేదు. "ఏంటి జాలా..!?" అన్నాడు.

"అవును జాలే..! నీకు ధైర్యం వుంది కానీ, బుర్ర లేదు" అన్నాడు.

వహీద్ వెంటనే పైకి లేచి విశాల్ మెడపై కత్తి పెట్టాడు.

"వహీద్.. ప్లీజ్ వద్దు, వాడిని ఏం చెయ్యకు" అన్నాడు మూర్తి.

విశాల్ ఇంకా నవ్వుతున్నాడు.

'ఏంటి ఈ కుర్ర నాయాల కుత్తుక పై కత్తి ఉంటే నవ్వుతున్నాడు!' అనుకున్నాడు వహీద్.

"కత్తి తీస్తే చెపుతా" అన్నాడు విశాల్.

వహీద్ మెత్తబడ్డాడు. "సరైన సమాధానం చెప్పు లేకపోతే నువ్వు ఖతం" అన్నాడు.

"నువ్వు ఈ హత్య ఎందుకు చేసావ్?" అన్నాడు విశాల్.

"నీకు చెప్పాలా..? అన్నాడు వహీద్.

"నాకన్నీ తెలుసు. నువ్వు చెపితే నీకు ఒక క్లారిటీ ఇస్తా" అన్నాడు విశాల్.

"ఒక ముఖ్యమైన సమాచారం కోసం" అన్నాడు వహీద్.

"హా.. ఆ సమాచారంలో మిస్ అయిన ఆఖరు పేజీ నా దగ్గర వుంది" అన్నాడు విశాల్.

వహీద్ కి కళ్ళు బైర్లు కమ్మాయి.

విశాల్ కాలర్ పట్టుకుని "ఎక్కడ.. అది ఎక్కడ..!" అన్నాడు.

విశాల్ రెండు చేతులు కిందకి దించుతూ "ఫస్ట్ మా బావ మొహం మీద ఆ ముసుగు తీయ్యి" అన్నాడు.

వహీద్ సైగ చేసాడు. వెంకట్ ముఖానికి ఉన్న ముసుగు తీశారు.

"నీకు ఆ పేపర్ కావాలా?" అన్నాడు విశాల్.

"కావాలా ఏంటిరా? అది నా సొంతం, ప్రాణం తీస్తా ఇవ్వకపోతే" అన్నాడు వహీద్.

"సరే వెంకట్ బావని వదిలేయ్, నేను ఆ పేపర్ ఇస్తా" అన్నాడు విశాల్.

ఏంటి నాతో బేరాలా..? నిన్ను చంపి అది తీసుకుంటా" అన్నాడు వహీద్.

"హా.. దర్జాగా తీసుకో, నేను చస్తే అది ఎక్కడ ఉందొ నీకు తెలిసే చాన్సే లేదు" అన్నాడు విశాల్.

"సరే తీసుకెళ్ళు కానీ, నా దగ్గర బేరం ఒకటికి ఒకటే పేపర్ ఇచ్చి.. ఈ ఇద్దరిలో ఎవరినో ఒకరిని తీసుకెళ్ళు. రెండో వాడు పోలీస్ కి నువ్వు లొంగాక విడుదలవుతాడు" అన్నాడు వహీద్.

"మూర్తి నువ్వు వెళ్ళు నేను ఉంటా" అన్నాడు వెంకట్.

"లేదు బావా..! నేను ఉంటా నువ్వు వెళ్ళు" అన్నాడు మూర్తి.

"ఓరి బాబు.. త్యాగాలతో కొవ్వత్తుల్లా కరిగిపోకండి. అందరం వెళదాం" అన్నాడు విశాల్.

విస్మయంగా చూసారు విశాల్ ని.

“ఏరా.. నీకు మైండ్ ఉందా! చెప్పగా ఒకటికి ఒకటి” అన్నాడు వహీద్.

“హా.. ఆ కాగితం జర్మన్ లో ఉంది. ఇద్దరినీ వదిలేస్తే.. దాన్ని తెలుగు లోకి తర్జుమా చేసి ఇస్తా” అన్నాడు విశాల్.

“అక్కరలేదు, నేను చేసుకోగలను” అన్నాడు వహీద్.

“ఇక్కడే చిన్న ట్విస్ట్! డిక్షనరీ ఒక్కటే వుంది. అది నా దగ్గర సేఫ్ గా వుంది” అన్నాడు విశాల్.

తనది పైచెయ్యి లేకపోవడంతో వహీద్ కి పిచ్చి ఎక్కింది.

“పోరా.. నేను ఇంకో డిక్షనరీ బొంబాయి నుండి తెప్పిస్తా” అన్నాడు.

“హా తప్పకుండా.. కానీ, దానికి టైమ్ పడుతుంది. ఈలోపు ఎవరైనా ఆ రహస్యం ఛేదించి వజ్రాలు కొట్టేస్తే..” అన్నాడు విశాల్.

వహీద్ కళ్ళు చింత నిప్పుల్లా మారాయి. “ఒరేయ్ నిన్ను చంపి పాతేస్తా” అన్నాడు.

విశాల్ నువ్వుతూ “అయ్యో వహీద్ భయ్యా..! నీకు నేను ఒక్కడినే మార్గం నన్ను నమ్ము” అన్నాడు.

వహీద్ ఆలోచనలో పడ్డాడు. ‘ఇరవై ఏళ్ళ కుర్రాడైన వీడు చెపుతుంది నిజం’ అనుకున్నాడు.

వెనుకగా వచ్చిన విశాల్ “చూడు.. ఫోటో సాక్ష్యం వుంది కాబట్టి పోలీస్.. నేను లొంగిపోయినా నమ్మరు. ఒక్కసారి వజ్రాలు వచ్చాక నువ్వు టాటా బిర్లాలా కోటీశ్వరుడివి అయిపోతావు. మంచి లాయర్ ని పెట్టి లింగరాజుని బయటకు రప్పించవచ్చు. అప్పుడు నేను సాక్ష్యం కూడా చెప్పను. దీని వల్ల నీకు మూడు లాభాలు:

1. నువ్వు ఇంకో హత్య చేయనక్కర లేదు.

2. వజ్రాలు నీ సొంతం.

3. నువ్వు నీ తమ్ముడు చేసిన తప్పుల నుండి బయట పడవచ్చు” అన్నాడు.

ఇదంతా వింటున్న వహీద్ కి చాల సంతోషం అనిపించింది. ‘ఇంత చిన్న కాలేజీ కుర్రోడు.. ఇంత తెలివి గా ఆలోచించాడు?’ అనుకుని.. “భేష్ రా తమ్ముడు, నీ ఐడియా నాకు నచ్చింది” అన్నాడు.

"సరే మేము వెళ్ళి తర్జుమా తరువాత వస్తాం" అన్నాడు విశాల్.

"నువ్వు ఇంత తెలివైన వాడివి.. ఇందులో ఏమి ప్లాన్ లేదని ఎలా నమ్మాలి?" అన్నాడు వహీద్.

"నమ్మాలి, నమ్మితీరాలి. ఎందుకంటే నేను అనుకుంటే మిమ్మలిని పోలీస్ కి పట్టించేవాడిని" అన్నాడు విశాల్.

"అది ఎలా..?" అని అడిగాడు వహీద్.

"నేను పోలీస్ కి లొంగిపోతా అని చెప్పి వెళ్ళి.. పోలీస్ ని వెంటపెట్టుకోచ్చే వాడిని" అన్నాడు.

"హ.. హ.. నీకు మనం ఎక్కడ ఉన్నామో తెలీదు కదా! ఎలా పట్టిస్తావ్?" అన్నాడు వహీద్.

"ఏంటి నాకు తెలీదా! మనం ఇప్పుడు లైబ్రరీ కి అండర్ గ్రౌండ్ రూమ్ లో ఉన్నాం" అన్నాడు విశాల్.

'ఏరా కళ్ళకు గంతలు కట్టలేదా..!" అని అరిచాడు వహీద్.

"ఓయ్.. వాళ్ళది తప్పులేదు. కట్టారు కానీ, బుర్ర లేని పని ఏంటి అంటే.. చింత చెట్టు కింద నుండి మూడే దార్లు, ఒకటి వెనుక నుండి బయటకి అక్కడంతా గడ్డి వుంది. రెండోది టీ షాప్ దారి. మూడోది లైబ్రరీ వెనుక నుండి వచ్చేది. టీ షాప్ కి వెళ్ళే దారి అంతా ఇసుక వుంది కానీ, మేము వచ్చిన దారిలో గడ్డి, ఇసుక లేవు. అంటే లైబ్రరీ లోపలికి వచ్చాం అన్నమాట. పైగా మెట్లు దిగాం.. సో ఇప్పుడు చెప్పు ఇది గుర్తు పట్టడం ఒక పనా!?" అన్నాడు విశాల్.

"ముద్దొస్తున్నావ్ రా తమ్ముడు, జేమ్స్ బాండ్ సినిమాలా వుంది నాకు. వెళ్ళు.. వెళ్ళి నిధి వివరాలతో రా" అన్నాడు వహీద్.

ముగ్గురూ బయట పడ్డారు. "ఒరేయ్.. ఇదంతా ఓకే గాని, మనం టీ షాప్ దగ్గర ఉన్నప్పుడు వాడు వహీద్ మనిషి అని ఎలా గుర్తు పట్టావు?" అన్నాడు మూర్తి.

"బ్యాక్ పాకెట్ లో నైఫ్ ఉందిరా! లైబ్రరీలో దాని పని ఎవరికి ఉంటుంది? అందుకే వైల్డ్ గెస్" అన్నాడు విశాల్.

"మంచి వాడితో స్నేహం రా బామర్ది" అన్నాడు వెంకట్

"అంటే నేను బామర్దిని కాదా!" అలక మొఖం పెట్టాడు విశాల్.

“నువ్వు నాకు దేముడిచ్చిన బామర్దివిరా!” అన్నాడు వెంకట్

***

# PART 20

ముగ్గురూ వెంకట్ ఇంటికి చేరుకున్నారు.

మూర్తి అక్కయ్య ముఖం వెలిగిపోయింది.

‘అసలు ఇంట్లో నేను ఒక దాన్ని ఉన్న అని గుర్తువుందా! మీ పాటికి మీరు వెళ్ళి ఫోన్ చేయకపోతే.. ఎంత కంగారు పడ్డామో!” అంది.

“నేను వచ్చేసాగా లక్ష్మి.. కొద్దిగా పని మీద వుండి ఫోన్ చెయ్యలేదు” అన్నాడు వెంకట్.

“వంట చేసేస్తా వుండండి. ఎప్పుడు తిన్నారో ఏమో..” అంటూ లోపలికి వెళ్ళింది లక్ష్మి.

“బావా మీతో మాట్లాడాలి కొద్దిగా మేడ పైకి వెల్దామా?” అన్నాడు విశాల్.

ముగ్గురూ కలిసి మేడ మీదకి వెళ్ళారు.

“వహీద్ గాడిని మనం తక్కువ అంచనా వెయ్యలేము. దయచేసి ఈ గొడవ అంతా అయ్యే వరకూ.. మీరు, అక్క మీ ఊరు వెళ్ళండి. కొంచెం పరిస్థితి సర్దుకున్నాక మరలా రావచ్చు. మూర్తి మాఇంట్లో ఉంటాడు” అన్నాడు విశాల్.

“ఎందుకంత భయం, సుందర్ కి ఈ విషయం చెపితే వహీద్ గాడి పని అయిపోయినట్లే” అన్నాడు వెంకట్.

“ఒకవేళ సుందర్ నుండి వహీద్ తప్పించుకుంటే..!” అన్నాడు విశాల్.

“వాడు చెప్పింది కరెక్టే బావా! ఇప్పుడు మనం వహీద్ అడిగింది ఇచ్చి చేతులు దులుపు కోవడమే! అనవసరంగా పోలీస్ లు కలుగ చేసుకుంటే.. అది తిప్పితిప్పి మన తలకు చుట్టుకుంటుంది” అన్నాడు మూర్తి.

"సరే అలాగే కానీయండి" అన్నాడు వెంకట్.

మరునాడు ప్రొద్దున్నే వెంకట్.. లక్ష్మిని తీసుకుని తన ఊరు పయనమయ్యాడు.

విశాల్ మూర్తి ట్యూషన్ కి వెళ్ళారు.

ట్యూషన్ అయ్యాక "మనం ఇంక ఇయర్ ఎండింగ్ కి వస్తున్నాం. మీ బ్యాచ్ తో నాకు ప్రత్యేక అనుబంధం కాబట్టి, మీతో కలిసి ఈ ఆదివారం పిక్నిక్ కి వెళదాం అనుకుంటున్నాను, ఏమంటారు?" అన్నాడు శామ్యూల్ సర్.

అబ్బాయిలంతా ఎగిరి గంతులు వేసారు. అమ్మాయిలు మాత్రం ఇంట్లో అడిగి చెపుతాం అన్నారు.

వినీష రియాక్షన్ కోసం చూస్తున్నాడు విశాల్.

ఎంటువంటి రియాక్షన్ లేకుండా ఆ వాలు కన్నులతో పుస్తకంలో ఏదో చూస్తుంది.

విశాల్ ఆ కళ్ళను చూస్తూ ట్రాన్స్ లోకి వెళ్ళిపోయాడు.

"ఒరేయ్.." అన్న మూర్తి పిలుపుకి,

ఉలిక్కిపడి "ఏంటి..?" అన్నాడు విశాల్.

"అందరూ వెళ్ళిపోయారు. గోడ మీద ఏమి చూస్తున్నావు?" అన్నాడు.

ఎదురుగా వినీష ఉండవలసిన చోట లేదు. "ఏమిలేదు రా! వాల్ పెయింట్ బాగుందని చూస్తున్నా" అన్నాడు విశాల్.

"ఏంటి.. పెయింటా! పాడా! అది సున్నం. కవర్ చేసింది చాలు" అని బయటకి నడిచాడు మూర్తి.

"బయట వినీష దగ్గరికి వెళ్ళి మీరు పిక్నిక్ కి వస్తున్నారా?" అని అడిగాడు మూర్తి.

"ఏమో తెలియదు. మా ఫాదర్ ఈ రోజు నైట్ వస్తారు. అడిగి రేపు చెపుతాను" అంది.

"తప్పక రండి. లేకపోతే చాలామంది రారు" అని, విశాల్ వంక చూస్తూ అర్థమైంది అనుకుంటా అన్నాడు మూర్తి.

"ట్రై చేస్తా లెండి" అని బయలుదేరింది వినీష.

మూర్తి "నవ్వింది మల్లె చెండు.. నచ్చింది గర్ల్ ఫ్రెండు.. అని, యురేకా.. తకామికా..' అంటూ చిరు పాట అందుకున్నాడు.

విశాల్ రెండు చేతులతో దండం పెడుతూ "ఒరేయ్.. నీకు ఆకలేస్తే టిఫిన్ పెట్టిస్తా నన్ను తినకు" అన్నాడు.

***

ఆదివారం వచ్చేసింది. అందరూ టౌన్ పక్కన కొమ్మూరులో ఉన్న పార్క్ కి వెళ్ళారు. రాము.. రాము.. అన్నా అమ్మాయి లంతా వచ్చారు. కొంతమంది అబ్బాయిలు మిస్సింగ్.

విశాల్, మూర్తి ఫుడ్ అరెంజ్మెంట్స్ చూస్తున్నారు. అందువల్ల వెళ్ళే సరికి లేట్ అయ్యింది. అందరూ ఏదో ఆటలు ఆడుతున్నారు.

"నీతో ఉంటే ఈ పెంట పనులన్నీ చేయిస్తావ్! ఆ వెధవలు అమ్మాయిలతో హ్యాపీ గా ఆడుకుంటున్నారు. మనం మాత్రం వీళ్ళకి టిఫిన్, కాఫీ మోసుకు రావాలి" అని విసుక్కున్నాడు మూర్తి.

విశాల్ కి అదేమీ వినిపించలేదు. కళ్ళు చకోర నేత్రాలై వినీష కోసం వెతుకుతున్నాయి.

వినీష కనిపించలేదు.

శామ్యూల్ సర్ దగ్గరికి వెళ్ళి "ఫుడ్ తీసుకొచ్చాం సర్! కానీ చాలామంది రాలేదు అనుకుంటా" అన్నాడు విశాల్.

"ఏమి లేదు. అమ్మాయిలు అందరూ వచ్చారు. అబ్బాయిలు ఐదుగురు రాలేదు అంతే! కొంతమంది లోపల ఉన్న చెరువు దగ్గర ఉన్నారు" అన్నాడు.

విశాల్ వడివడిగా నడుస్తూ చెరువు దగ్గరికి వెళ్ళాడు. ఆ వెనకే మూర్తి.

సూరీడు తన మాయతో పార్క్ అంతా బంగారు రంగులోకి మార్చేశాడు. చెరువు చివరలో కూర్చుని ఉన్న వినీషని చూసాడు విశాల్.

"బహుశా రాలేదేమో.." అన్నాడు మూర్తి.

"అదిగో ఆ చెరువు చివరిలో ఉందిరా!" అన్నాడు విశాల్.

"ఏదో చిన్న నీడలా కనపడుతుంది. ఆమే అంటావా?" అన్నాడు మూర్తి.

"నా కన్నులు నన్ను మోసం చేయచ్చు కానీ, మనసు మాత్రం చెయ్యదు" అన్నాడు విశాల్.

"సరే రా బాబు, నువ్వు వెళ్ళు నేను సర్ దగ్గరికి వెళ్తా!" అని వెనుతిరిగాడు మూర్తి.

తనకి ప్రైవసీ ఇవ్వడానికి వాడు వెళ్తున్నాడని తెలుసు. చిన్నగా నవ్వుకుంటూ.. అక్కడ నుండి కదిలాడు విశాల్.

***

ధ్యానంలో ఉన్న శకుంతల వలే నీటి లోని రాయి పై కూర్చుని ఆడుతుంది వినీష. ఆమె రూపాన్ని మోస్తున్న నీటి తెర పై అసూయ పుట్టింది విశాల్ కి.

'ఏమి నా చెలి అందం!' అనుకుని నిశ్చేస్టుడు అయ్యి చూస్తున్నాడు.

నీటిలో అతని ప్రతిబింబం.. చూసీ చూడనట్లు అలానే నీటి లోనే చూస్తుంది వినీష.

'ఇంత దొంగ చూపులు ఎందుకో..? పక్కన వచ్చి కూర్చుంటే బాగుండు' అనుకుంది.

మధువు గ్రోలే తుమ్మెదని కుసుమ కన్య నుండి విడదీసె జోరు గాలిలా..

"విశాల్.. శామ్యూల్ సర్ పిలుస్తున్నారు" అంటూ వచ్చింది ఉమ.

'అలో.. లక్ష్మణా..' అంటూ వెను తిరిగాడు విశాల్.

'చుప్పనాతి చుంచు..' అని ఉమని తిట్టుకుంది వినీష.

'అయినా పిలవగానే వెళ్ళాలా..! కాసేపు ఆగి వస్తా అని చెప్పచ్చుగా! అయినా వాడికి బాగుంటాడని పొగరు' అనుకుంది వినీష.

ఆ క్షణం ఇద్దరికీ తెలియనిది ఒకరి కోసం ఒకరు ఒకేలా ఆలోచిస్తున్నారని.

అంతా ఒక చోట గుమిగూడారు. అందరూ వారి వారి పేరు వివరాలు చెప్పారు. కొంత మంది పాట పాడారు. ఇంకొందరు ఏకపాత్రా అభినయం చేసారు. లంచ్ అయ్యింది. రింగ్ ఆట ఆడదానికి సర్కిల్ గా కూర్చున్నారు.

అందులో దొంగగా ఉన్న వ్యక్తి చేతిలో ఒక నాప్కిన్ ముక్కని దాచుకుని, సర్కిల్ చుట్టూ తిరుగుతాడు. తాను సెలెక్ట్ చేసిన వ్యక్తి వెనుకాల.. ఆ నాప్కిన్ వదిలేస్తాడు. నాప్కిన్ తన చేతిలోనే ఉన్నట్లు నటిస్తూ ఒక రౌండ్ తిరిగి ఆ నాప్కిన్ ముక్క ఉన్న వ్యక్తిని నాప్కిన్ తో కొడుతూ లేపుతాడు. ఈ ఆటకి అంతం ఉండదు ఓపిక ఉండాలి.

మొదటి దొంగ ఉమ. తాను విశాల్ వెనుక నాప్కిన్ వేసింది. విశాల్ పరిగెడుతున్నాడు ఉమ వెనకాల.. వినీషకి మండిపోతుంది.

ఉమ కూర్చున్నాక విశాల్.. వినీష వెనకాల నాప్కిన్ వేస్తాడు అనుకున్నది కానీ, తాను మూర్తిని టార్గెట్ చేసాడు. అలా సాగిపోతుంది ఆట.

కాసేపటికి మోహన్ ఇంకా కొంత మంది వినీష ని టార్గెట్ చేసారు. ఇష్టం లేకపోయినా ఆట కాబట్టి తానూ పరిగెత్తింది. కొంతసేపటికి అందరూ అలసిపోయారు. చెట్టు కింద కూర్చున్నారు. ఉమ్మెత్త ఒకటి కనిపిస్తే.. దాని దగ్గరకు వెళ్ళింది వినీష. దానికి అవతల పక్క ఉన్నారు మూర్తి, విశాల్.

వినీషకి చిరాకు వేసింది. తిరిగి వద్దాం అనుకుంటుండగా..

“రింగ్ ఆటలో వినీషని ఎందుకు టార్గెట్ చెయ్యలేదు?” అన్నాడు మూర్తి.

“తనని పువ్వులతోనే కొట్టలేను నేను, ఇంక నాప్కిన్ తోనా.. అయినా, నేను తప్ప అందరూ ఆమెని పరిగెత్తించారు. నేను కూడా అదే చేస్తే వాళ్ళకి నాకు తేడా ఏంటి రా?” అన్నాడు విశాల్.

అది విన్న వినీషకి ఆనందం, నవ్వు ఏడుపు అన్ని కలిసి వచ్చాయి.

***

# PART 21

పిక్నిక్ అయిపోయింది. కొంతమంది బస్సు ఎక్కి వెళ్ళిపోయారు. తెచ్చిన సామాను తిరిగి ఇవ్వాలి కాబట్టి, మూర్తిని పార్క్ లో ఉండమని.. విశాల్ టూ వీలర్ పైన ఆటో కోసం బయలుదేరాడు.

బస్టాండ్ లో కొంతమంది వెయిట్ చేస్తున్నారు. అందులో ఉమ కూడా ఉంది.

విశాల్ ని చూసి పరిగెత్తుకు వచ్చింది.

"ఏంటి.." అన్నట్టు చూసాడు.

"విశాల్ నేను రెండు బస్సులు మారి మా ఊరు వెళ్ళాలి, కొద్దిగా టౌన్ లో డ్రాప్ చేస్తావా?" అంది.

"వినీషని చూసావా?" అన్నాడు విశాల్.

"ఏమో నాకు కనిపించలేదు" అంది.

"కొంతమందే ఉన్నారు" అన్నాడు విశాల్.

"హా.. ఇప్పుడే కొంత మంది బస్సులో వెళ్ళారు. ప్లేస్ లేకపోవడంతో.. కొంతమంది నెక్స్ట బస్సు కోసం వెయిట్ చేస్తున్నారు అంది ఉమ.

'బహుశా వెళ్ళిపోయిందేమో..!' అనుకుంటూ, "సరే ఎక్కు.." అన్నాడు.

ఉమ ఎక్కి కూర్చుంది.

టూ వీలర్ ముందుకు కదిలింది.

ఉమ.. విశాల్ ని వెనుక నుండి పట్టుకుంది. "హేయ్.. ఏంటది?" అన్నాడు విశాల్.

"ఏమి అనుకోకు విశాల్.. నాకు బండి అంటే భయం, రెండు సార్లు పడిపోయాను. మా డాడీని కూడా ఇలానే పెట్టుకుంటాను" అంది.

డాడీ అనగానే విశాల్ లైట్ తీసుకున్నాడు.

శామ్యూల్ సర్ వైఫ్ కూడా పిక్నిక్ వచ్చారు. ఆవిడకి సర్దడంలో హెల్ప్ చేస్తూ లోపలే ఉండిపోయింది వినీష. కరెక్ట్ గా గేట్ బయటకి వచ్చేసరికి.. విశాల్, ఉమ బండి మీద, అదీ వాటేసుకుని మరీ వెళ్ళడం కంట పడింది.

ఏదో ఆలోచిస్తూ అలా చూస్తూ ఉంది.

మోహన్, ఆనంద్ వచ్చారు.

"బస్ స్టాండ్ నుండి మీ ఇల్లు దూరం కదా! ఎలా వెళ్తావ్?" అన్నాడు ఆనంద్.

"పర్లేదు వెళతాను, నాకు అలవాటే" అని ముక్తసరిగా అంది.

"నెక్స్ట్ బస్ ఎప్పుడు వస్తుందో కనుక్కుని రా..!" అని ఆనంద్ ని పంపాడు మోహన్.

"ఏంటి అలా ఉన్నావ్? ఓహో.. ఉమ, విశాల్ బండి మీద చెట్టపట్టాలు వేసుకుని వెళ్ళడం చూసావా? అది వాళ్ళ మధ్య చాల కామన్! లవర్స్ కదా!" అన్నాడు మోహన్.

వినీషకి ఏడుపు వస్తుంటే.. చేతి రుమాలు ఆఫర్ చేసాడు మోహన్.

వినీష తీసుకోలేదు.

"నాకు తెలుసు వినీష.. నువ్వు నమ్మవని, ఇదిగో ఈ ఫోటో చూడు" అని మూర్తి.. మోహన్ ని కొట్టిన రోజు తీసిన విశాల్ ని ఉమ కౌగిలించుకున్న ఫోటో ఇచ్చాడు.

అది చూసి మౌనంగా ఉండిపోయింది. "వాళ్ళిద్దరి విషయం ఇంట్లో కూడా తెలుసంట, మూర్తి చెప్పాడు" అన్నాడు.

వినీష 'ఏంటి.. మూర్తి నీకా..' అన్నట్లు చూసింది.

కాస్త తత్తర పడ్డ మోహన్, "నాకు కాదు, ఆనంద్ కి చెప్పాడంట" అన్నాడు.

ఈలోపు బస్సు వచ్చింది. ఎక్కి టౌన్ లో దిగారు.

"మీ ఇంటి దాక వచ్చి.. నిన్ను వదిలిపెట్టి వెళ్తాము" అని ఇంకో ముగ్గురు అమ్మాయిలు, అబ్బాయిలు వచ్చారు.

చివరికి మోహన్, వినీష మిగిలారు.

"ఒక్క మాట గుర్తు పెట్టుకో.. నేనంటే నీకు ఇష్టం లేకపోవచ్చు కానీ, ఒక ప్రేమించిన వ్యక్తిగా నీ క్షేమం ఆలోచిస్తాను. విశాల్ నీకు సరిపోడు, వాడు పచ్చి తాగుబోతు, తిరుగుబోతు" అన్నాడు మోహన్.

వినీష ఇల్లు ఇంకా వంద అడుగుల దూరంలో వుంది.

మోహన్ వంక తిరిగి ఒక్క మాట అంది.

మొత్తనికి చెడగొట్టాం అని మోహన్ కి చాలా ఆనందంగా వుంది, తిరిగి చూసాడు గూబ గుయ్యగుయ్యిమంది.

వినీష అపరాకాళిలా కనపడింది.

"ఆడపిల్లని కాబట్టి బూతులు తిట్టలేక పోతున్నాను. నీ లాంటి కుక్క విశాల్ లాంటి ఐరావతాన్ని చూసి మొరగడం సహజం, తన సంగతి నీకు ఏం తెలుసురా! వచ్చిరాని భాషలో పచ్చి పచ్చి మాటలతో.. పక్కవాడితో రాయించిన ప్రేమ లేఖలని.. కనిపించిన ప్రతీ అమ్మాయికి పంచే.. నీ లాంటి వాడికి నెమలి పించం లాంటి నా విశాల్ విలువ ఎక్కడ తెలుస్తుంది రా!" అని ఊగిపోతున్న వినీషని చూసి మోహన్ కి దడ పుట్టింది.

"ఇప్పటి వరకు విశాల్ కి కూడా చెప్పని విషయం నీకు చెపుతా చూడు, వాడే నా సర్వస్వం, వాడే నా ప్రాణం. ఇంకా ఉమ విషయం అంటావా! సాలిపురుగు పాకినంత మాత్రాన పుత్తడి బూజు ఎక్కదు" అంటూ వెళ్ళిపోతున్న వినీష వంక చేష్టలుడిగి చూస్తుండిపోయాడు మోహన్.

బయట సిగరెట్ కాల్చడానికి వచ్చిన వినీష ఇంటి ఓనర్ కొడుకు కన్నారావు.. కన్నులార్పకుండా మొత్తం జరిగిన విషయం చూసాడు. 'ఎవడీ విశాల్..! వీడి అంతు చూడాలి' అనుకున్నాడు.

***

ఇవేమి తెలియని విశాల్, మూర్తి ఇంటికి లేట్ గా చేరుకున్నారు. ఫ్రెష్ అయ్యాక, కూర్చుని టీవీ చూస్తున్నారు. డోర్ సౌండ్ అయ్యింది, బయటకి వెళ్ళారు.

వహీద్ అనుచరుడు బాల "పని ఎంతవరకు వచ్చింది?" అన్నాడు.

"హా చేస్తున్నాం, ఇంకొక వారం పడుతుంది" అన్నాడు విశాల్.

"అయ్యినంత వరకు తీసుకు రమ్మన్నాడు వహీద్" అన్నాడు బాల.

ఇద్దరికీ పచ్చి వెలక్కాయ గొంతులో పడింది.

"హ వుండు తెస్తాను" అని లోపలి వెళ్ళాడు విశాల్.

లోపల నుండి జర్మన్ పేపర్ తీసుకు వచ్చి, బాలా చేతిలో పెట్టాడు.

"దీని తెలుగు ప్రతి ఏది?" అని అడిగాడు బాల.

"చెప్పానుగా టైమ్ పడుతుంది, కంగారుగా ఉంటే మీరే తర్జుమా చేసుకోండి" అన్నాడు విశాల్.

"సరే, నేను వహీద్ కి ఇంకో వారం పడుతుంది అని చెపుతాను, ఈసారి మాత్రం లేట్ చేయకండి" అన్నాడు బాల.

'హమ్మయ్య..' ఇద్దరూ అనుకున్నారు.

"ఒరేయ్.. రోజు కొంచెం కొంచెం తర్జుమా చేస్తే బెటర్" అన్నాడు మూర్తి.

లోపలికి వెళ్ళి వెంటనే కంగారుగా బయటకి వచ్చాడు విశాల్.

"ఏమైంది, ఏంటా కంగారు?" అన్నాడు మూర్తి.

"డిక్షనరీ ఎక్కడ పెట్టావ్?" అన్నాడు విశాల్.

"అక్కడే టేబుల్ మీద.." అన్నాడు మూర్తి.

లోపలికి వెళ్ళి అన్నీ వెతికారు డిక్షనరీ మిస్సింగ్.

రూమ్ కొద్దిగా నీట్ గా వుంది.

"ఈ రూమ్ ఎవరు సర్దారు?" అన్నాడు విశాల్.

"నేను కాదురా! సండే కదా, పనిమనిషి అయ్యి ఉంటుంది" అన్నాడు మూర్తి.

"పొద్దునే అడుగుదాం" అని అలసట వల్ల ఎక్కడి వాళ్ళు అక్కడే పడిపోయారు.

***

తెల్లవారింది పనిమనిషి అప్పాయమ్మ వచ్చి తలుపు కొట్టింది.

మూర్తి పరుగున వెళ్ళి తలుపు తీసాడు. "స్టోర్ రూమ్ లో పుస్తకాలు తీసావా?" అని అడిగాడు.

"హా.. మొన్న అమ్మగారు ఎళ్ళినప్పుడు, 'ఆ రూమ్ లో ఉన్న పుస్తకాలు అన్నీ అమ్మేయ్ మన్నారు.' నాను తెలివిగా ఎక్కువ రేటుకి అమ్మినాను" అంది అప్పాయమ్మ.

"ఎవరికి అమ్మావు? వీధి చివర కిరాణా కొట్లోనా..!?" అన్నాడు.

"నేదు, ఎవడో కొత్త ముఖం వీధిలోకి వత్తె అమ్మసాను" అంది.

అప్పుడే వచ్చిన విశాల్ కూడా ఆ మాట విన్నాడు. ఇద్దరూ కూలబడ్డారు.

విశాల్, మూర్తి ఆలోచనలో పడ్డారు.

"ఇంకొక వారంలో తర్జుమా చేసి ఇవ్వకపోతే వహీద్ గాడితో గొడవ, అదీగాక టైమ్ ప్రొజెక్టర్ సూచనా పట్టిక ఇంకా పూర్తిగా తెలుగులోకి రాయలేదు. ఎటుచూసినా, డిక్షనరీ చాలా అవసరం. పేపర్స్ కొనేవాళ్ళు వాటిని ఎక్కడో అక్కడ అమ్మాలి కదా!" అన్నాడు మూర్తి.

"హా.. మన టౌన్ లో చాలా మందే ఉన్నారు, వెళ్దాం" అని బయలుదేరారు.

"అవును.. లావణ్య జిరాక్స్ మాణిక్యాన్ని అడుగుదామా! వాడు వాడి దగ్గర వేస్ట్ పేపర్స్ రోజూ అమ్ముతాడు" అనుకుని మాణిక్యం దగ్గరకి వెళ్ళారు.

"టౌన్ లో అందరికన్నా పెద్ద వేస్ట్ బయ్యర్ ఎవరు?" అని అడిగారు.

"చాలామంది ఉన్నారు రా! కానీ, సోమరాజు కంపెనీ అందరికన్నా పెద్దది" అని దాని అడ్రస్ చెప్పాడు మాణిక్యం.

ఇద్దరూ బయలు దేరుతుండగా, "ఒరేయ్.. డిక్షనరీ జిరాక్స్ తీయించి నా దగ్గరే వదిలేసారు. మా నాన్న రోజుకోసారి తిడుతున్నాడు డబ్బు వేస్ట్ అయ్యిందని, తీసుకెళ్ళే ఉద్దేశ్యం ఉందా!" అన్నాడు మాణిక్యం.

విశాల్, మూర్తి ఇద్దరూ ఒకే సారి వెనక్కి పరిగెత్తారు.

మాణిక్యాన్ని పైకి లేపి ఆనందంతో గిరా గిరా తిప్పారు.

"వదిలేయండి రా, వద్దులె మీరు తీసుకోవద్దు. నేనే ఏదో చెప్పి మేనేజ్ చేస్తా" అని అమాయకంగా అన్నాడు మాణిక్యం.

"మాకు కావాల్సింది ఆ పేపర్సే రా! ఎంతైందో చెప్పు" అని డబ్బులు కట్టి కాపీ తీసుకుని వచ్చారు.

ఆరోజు కాలేజీ ఎగ్గొట్టి, తర్జుమా స్టార్ట్ చేసారు.

***

# PART 22

తర్జుమా మొదలు పెట్టారు. వరుసగా ఐదురోజులు కష్టపడి చాలావరకు తర్జుమా చేశారు. ఆఖరి లైన్ లో రక్తం మరక పడటం వల్ల కొంచెం కష్టమైంది, మొత్తానికి అర్థమైనంత వరకు పూర్తి చేసారు.

"హమ్మయ్య.. అయ్యింది రా బాబు" అనుకున్నారు ఇద్దరు.

రెండు గోల్డ్ స్పాట్ కూల్ డ్రింక్స్ తీసుకుని కూర్చున్నారు.

"ముక్కలు ముక్కలుగా చదవడం వల్ల నాకు సరిగా అర్థం కాలేదు, ఒకసారి పూర్తిగా చదువు" అన్నాడు మూర్తి.

విశాల్ చదవడం మొదలు పెట్టాడు.

***

శాపగ్రస్త హరాళి మా కన్నుల ముందే ఆకాశం నుండి కిందకు దిగింది. అమావాస్య అయినా.. ఆమె రాకతో అడివి అంతా వెలుగు నిండింది. నీలి వర్ణంలో ఉన్న ఆమె దేహం అర్దనగ్నంగా వుంది. శరీరం అంతా ఎర్రని పగడాల దండలతో అలంకరించి వుంది. జడలో వజ్రాలు, వైడూర్యాలు పొదిగి ఉన్నాయి. అవి అన్నీ కొన్ని కోట్ల విలువ ఉంటాయి. మేము దాక్కుని ఉన్న చెట్టు వంక చూసింది.

కళ్ళకు పెట్టుకున్న కాటుక వల్ల మా కనులకు ఏమి కాలేదు. మా వెనుక ఉన్న చెట్టు పైన ఉన్న పక్షులు గట్టిగా అరుస్తూ వెళ్ళిపోయినాయి. తలలో చెయ్యి పెట్టి.. వజ్రాలు తీసి ఒక్కక్కటిగా విసురుతూ వెళుతుంది. ఆ వెలుగులో మెల్లగా నడుస్తూ వెళుతుంది. అలా అడివి మధ్యలో ఉన్న శివాలయం వరకు వెళ్ళింది.

హరాళి శివాలయం లోకి వెళ్ళగానే.. నేను, నారాయణ కింద పడిన వజ్రాలు ఏరడం మొదలు పెట్టాం. దాదాపు యాభై కి పైగా ఏరుకున్నాం. ఈ కంగారులో సాధు చెప్పిన మాట మరచి గుడికి వంద అడుగుల దూరం లోకి వెళ్ళి పోయాం. అక్కడ నుండి గుడి వరకు ఉన్న వజ్రాలు తాక కూడదని సాధు చెప్పాడు కానీ, చేతికి అందే దూరంలో ఒక పెద్ద వజ్రం, వదల్లేక పోయాను.

నారాయణ 'వద్దు దొరా.. వద్దు..' అని అరుస్తున్నాడు కానీ, నేను వినలేదు. ఒక కర్రతో వజ్రాన్ని దగ్గరికి లాగాను.

చేతిలో మెరుస్తున్న వజ్రాన్ని చూసి ఆనందపడే లోపు, గుండెలు అదేరేలా ఒక పెద్ద అరుపు.

कः स, यदि मम हीरकान् स्पृशसि, त्वं ज्ञातव्यः यत् त्वं मृत्युं आलिंगितवान्

(ఎవరు అక్కడ? నా వజ్రాలను తాకితే.. మరణాని కౌగిలించుకున్నట్లె..) అని సంస్కృతంలో వినపడింది.

నాకు సంస్కృతం తెలుసు కాబట్టి, వెంటనే పరుగు పెట్టాను. నా వెనుక కుంటి వాడైన నారాయణ పరిగెడుతున్నాడు. ఏరిన వజ్రాలు అన్నీ ఎక్కడివక్కడ వదిలి పరిగెడుతున్నాం.

పారిపోవడానికి అది మానవ వనిత కాదు యక్షిణి! క్షణంలో మా ఎదురుగా నిలిచింది.

ఉగ్రమైన ఆమె రూపానికి గుండె ఆగి పోయింది. నేను కళ్ళు తిరిగి పడిపోయాను.

***

# PART 23

కళ్ళు తెరిచి చూసే సరికి నారాయణ ఎదురుగా ఉన్నాడు, తెల తెల వారుతున్నది.

యక్షిణికి ఆమె వజ్రం తిరిగి ఇచ్చినందుకుగాను.. తనకు కాలు ప్రసాదించింది అని, నాకు శిక్షగా కాలు తీసివేసిందని.. ఆ రోజు దీపావళి అమావాస్య కాబట్టి, ప్రాణాలు తీయలేదని చెప్పాడు. ఆమె రూపం నాకు ఇంకా గుర్తు ఉంది. అన్ని వజ్రాలూ.. ఆమెతో పాటు మాయం అయిపోయాయి.

నాకు కాలు ఒకటి కనిపించకుండా పోయింది కానీ, నొప్పి లేదు. నారాయణ కింద పడి ఉన్న (ఇక్కడ రక్తపు మరక వల్ల పదం కనిపించలేదు) చేతి కర్రను తీసాడు.

దాని కింద ఒక వజ్రం వుంది, గోలీ కాయ అంత.. 'అన్నీ మాయం అయినాయి, ఇదొక్కటి ఎలా వుంది?' అనుకున్నాం.

నారాయణ 'దేవత కానుక..' అన్నాడు.

నాకు జరిగిన దానికి కర్మ సిద్ధాంతం పై ఎనలేని గౌరవం ఏర్పడింది. నేను హిందువుగా మారిపోయాను. ఈ వజ్రాల మాయలో పడి ఇంకా ఎంతో మంది ప్రాణాలు పోగొట్టుకుంటారని.. ఈ కథ ఇప్పటి వరకు ఎవరికీ చెప్పలేదు. నాకు వయసు మళ్ళింది కాబట్టి, ఇది నేను నా మిత్రులతో పంచుకోవాలని అనుకుంటున్నాను. దయచేసి ఎవరూ డేగల దీవికి వెళ్ళే సాహసం చేయవద్దు. దీనిని కథ అనుకున్న వారికి నేను కోల్పోయిన కాలు సాక్ష్యం.

సర్వే జనామ్ సుఖినోభవంతు.

***

చదువుతున్న విశాల్ స్వరం వణికింది. "అంటే.. ఆ రోజు అక్కడ దొరికిన వజ్రం వల్ల ప్రొఫెసర్ లక్మణరావు తండ్రి నారాయణ కోటీశ్వరుడు అయ్యాడు అన్నమాట" అన్నాడు మూర్తి.

"హా.. అలాగే అనిపిస్తుంది" అన్నాడు విశాల్.

"దీని ముందు కథ కూడా తెలుసుకోవాలని వుంది" అన్నాడు మూర్తి.

"అంటే.." అన్నట్టు మొహం పెట్టాడు విశాల్.

"అసలు ఈ రహస్యం.. ఆ బ్రిటిష్ దొరకి ఎవరు చెప్పారు? నారాయణ ఎందుకు వెళ్ళాడు? ఈ హరాళి ఎవరు? దేగల దీవి ఎక్కడ? ఇలా చాల సందేహాలు ఉన్నాయి" అన్నాడు మూర్తి.

"ఏరా.. వజ్రాలు మాట వినగానే నువ్వు కూడా ఆశ పడుతున్నావా?" అన్నాడు విశాల్.

"లేదురా.. జస్ట్ క్యూరియస్" అన్నాడు మూర్తి.

"ఆ బాలా గాడిని పిలిచి ఈ ప్రతి ఇవ్వు" అన్నాడు విశాల్.

***

# PART 24

చెప్పినట్లే బాలా వచ్చాడు. అతనికి తెలుగు ప్రతిని, జర్మన్ పేపర్ ని రెండిటిని ఇచ్చారు.

"ఇప్పటితో మీకు మాకు ఎటువంటి సంబంధం లేదు. ఇంకెప్పుడూ మా జోలికి గాని, మా కుటుంబం జోలికి కానీ రావద్దని వహీద్ కి చెప్పు" అన్నాడు మూర్తి.

***

విశాల్ ఇంటికి వెళ్ళాడు. ఆదివారం కావడం వల్ల ఇంట్లో వాళ్ళ నాన్న కూడా ఉన్నారు. మెల్లగా తలుపు తోసాడు, స్వప్న కనిపించింది.

"ఇంట్లో టైగర్ వుందా?" అని అడిగాడు.

"హా.. ఇప్పుడే బకరా గురించి అడిగి లోపలి వెళ్ళింది" అని విశాల్ ని ఆట పట్టిస్తూ అంది.

రూమ్ లోకి వెళ్ళి డ్రెస్ చేంజ్ చేస్తున్నాడు.

"ఏరా.. ఇల్లు గుర్తు వచ్చిందా?" అని అంటూ గుమ్మం దగ్గర నుంచున్నారు విశాల్ నాన్న.

"రాత్రి మూర్తి గాడు సినిమా అంటే వెళ్ళి లేట్ అయ్యిందని అక్కడే పడుకున్నాను" అన్నాడు విశాల్.

"ఏం సినిమా..?" అని అడిగారు.

"ముఠా మేస్త్రి.." అని చిన్నగా అన్నాడు విశాల్.

"ఏంటది.." అన్నారు.

"చిరంజీవి ముఠా మేస్త్రి" అని మళ్ళీ చెప్పాడు.

"భేష్.. నీకు తగ్గ సినిమాలు చూస్తున్నారు. చూడు బాగా చూడు, రేపు డిగ్రీ ఫెయిల్ అయితే.. ఆ పనైనా చేసుకోవచ్చు" అన్నారు.

విశాల్ ఏమి మాట్లాడలేదు. ఈలోపు అనంత వచ్చింది. అమ్మని చూడగానే విశాల్ కి ధైర్యం వచ్చింది.

"నేను బాగానే చదువుతున్నాను నాన్నగారు, ఈ వీక్ అంతా నైట్ రెండు వరకు చదివాను. కావాలంటే అమ్మని అడగండి" అన్నాడు.

అనంత ఏదో సైగ చేసింది.

"ఓహో.. పిల్లికి ఎలక సాక్షం, నేను నాలుగు రోజుల నుండి టౌన్ లో ఆఫీస్ పని ఉండి ఇక్కడే ఉన్నాను. అయ్యగారు ఒక్క రోజు నా కంటికి కనిపించలేదు. మీ అమ్మకి మాత్రమే కనిపించవా!?" అని అడిగారు విశాల్ నాన్న.

"ఏదో పని వుంది అని చెప్పి వెళ్ళాడు. అయినా మూర్తి ఇంట్లోనే కదా.." అంటూ సర్దబోయింది అనంత.

"నువ్వు నోరుముయ్యి, నీ అండ చూసుకునే వీడు ఇలా తయారయ్యాడు. వీడి కోసం పోలీస్ కూడా వచ్చారని విన్నాను. బస్టాండులో జేబులు కొడుతున్నాడా?" అన్నారు.

"నాన్న.. టిఫిన్ చల్లారుతుంది తొందరగా రండి" అని పిలిచింది స్వప్న.

"హా వస్తున్నారా.." అంటూ వెళ్ళారు.

"హమ్మయ్య.. వర్షం వెలిసింది" అన్నాడు విశాల్.

"నీ చెల్లెలు లేకపోతే తూఫాన్ అయ్యేది" అంది అనంత.

"దాని మొహం.. అదే నా మీద ఎక్కించి చెప్పి ఉండి వుంటుంది" అన్నాడు విశాల్.

"అయినా పోనిలే అని ఊరుకుంటే.. ఊర్లో ఉంటూనే.. నాలుగు రోజులు ఇంటికి రావా! మేము ఇద్దరం ఆడవాళ్ళం..! నువ్వు ఉన్నావనే కదా.. నాన్నగారు వేరే ఊర్లో ఉద్యోగం అయినా.. ఇక్కడ చదివిస్తున్నారు

కొంచెం అయినా ఆలోచించారా!" అంది అనంత.

"అబ్బా.. తిట్లతోనే కడుపు నింపుతావా! లేక అట్లు కూడా పెడతావా?" అని నవ్వుతూ అడిగాడు.

***

సోమవారం ప్రొద్దున్నే ట్యూషన్ కి బయలుదేరాడు విశాల్.

దారిలో కలిసింది వినీష.

"ఏంటి వారం రోజులు కనపడలేదు" అంది.

"ఎందుకు కంగారుపడ్డారా!" అన్నాడు విశాల్.

"నాకెందుకు కంగారు! స్కూటర్ మీద ఎవరితోనో కలిసి ఏదో టూర్ కి వెళ్ళి వుంటారు అనుకున్నాను" అంది వినీష.

ముద్దబంతి మీద కుంకుమ పడినట్లు ఎర్రగా మారి పోయినాయి ఆమె బుగ్గలు.

ఉమని, తనని బండి మీద చూసిందని విశాల్ కి అర్థం అయ్యింది..

"ఓహ్.. అదా!" అది అని చెప్పబోయాడు.

"అవసరం లేదు, నేను మిమ్మలిని సంజాయిషీ అడగలేదు. మీ బండి మీ ఇష్టం" అంది.

"అబ్బో.." అనుకున్నాడు విశాల్.

***

ట్యూషన్ అయ్యాక బయటికి వచ్చిన విశాల్ కి.. ఉమ చాకోలెట్ ఇచ్చింది.

"ఏంటి స్పెషల్.." అని చుట్టుపక్కల వినీష ఉందేమో అని చూసుకుంటూ అన్నాడు.

"ఈరోజు నా పుట్టిన రోజు" అంది ఉమ.

"ఓహ్.. హ్యాపీ బర్త్ డే" అన్నాడు విశాల్. ఉమ సిగ్గుపడుతూ "ఇప్పుడు నేను మేజర్ ని" అంది.

"అవునా.. ఇంకే ఇంట్లో పెళ్ళి చేసేయమని చెప్పు" అన్నాడు విశాల్.

చుట్టూ ఎవరు లేరు అని గమనించి ఉమ "అవును నీతో పెళ్ళి చేయమని అడుగుదాం అనుకుంటున్నాను" అంది.

"జోక్ చేసింది చాలు ఇంటికెళ్ళు, నాకు కాలేజ్ టైమ్ అవుతుంది" అన్నాడు విశాల్.

"ఏం నీకు చెప్తే అర్థం కాదా! నువ్వంటే ఇష్టం అని.. నీకు అర్థం అయ్యేలా ఎలా చెప్పను? ఆడపిల్లలు మీకులా బయట పడలేరు. మేము పరోక్షమైన చేష్టల ద్వారా మాటల ద్వారా చెపుతాం. నీకు తెలిసి కూడా నన్ను ఏడిపిస్తున్నావ్" అని ఉమ ఏడుస్తూ అంది.

విశాల్ అటు ఇటు చూసి "ఏడవకు వెళ్ళి కాఫీ తాగుదాం పద" అన్నాడు.

సైకిల్ ని నడిపించుకుంటూ ఉమ పక్కన నడుస్తూ కాఫీ షాప్ కి వెళ్ళాడు.

అక్కడ కూర్చున్నాక "ఇప్పుడు చెప్పు" అన్నాడు.

"ఎన్నిసార్లు చెప్పించుకుంటావ్!" అంది ఉమ.

"చూడు ఉమ, నేను ఎప్పుడైనా.. తెలిసో తెలియకో నీకు నా పై ఇష్టం కలిగేలా ప్రవర్తించి ఉంటే నన్ను క్షమించు. ప్రేమ అనేది ఇద్దరి మధ్యా పోటా పోటీగా ఉండాల్సిన ఫీలింగ్. నీకు నాపై ఆ ఫీలింగ్ కలగడం నా అదృష్టం కానీ, ఆ ఫీలింగ్ నాకు ఉండాలిగా" అన్నాడు విశాల్.

ఉమ కన్నీరుమున్నీరుగా ఏడుస్తుంది.

"ఉమ.. ప్లీజ్ కళ్ళు తుడుచుకో, ఎవరైనా గమనిస్తే నేను నిన్ను ఏదో చేసానని పట్టుకుని కొట్టగలరు" అన్నాడు విశాల్.

కళ్ళు తుడుచుకుని, "నీకు ఆ ఫీలింగ్ రావాలంటే ఏమి చెయ్యాలి చెప్పు" అంది ఉమ.

"పిచ్చిదానా.. భావాలు, భావోద్వేగాలు వర్షం లాంటివి. మనం సృష్టిస్తే అవి రావు, అవి వచ్చే టైమ్ కి అవి వస్తాయి. నీకు నేనంటే ఇష్టమని తెలిసినా.. నేను బయట పడనిది, నేను పట్టించుకోవడం లేదని అర్థం అయ్యి.. నువ్వు మనసు మార్చు కుంటావని" అన్నాడు.

విశాల్ చెయ్యి పట్టుకుంది ఉమ "ఇదిగో ఈ మాటలే, నన్ను పిచ్చిదాన్ని చేస్తాయి. నీ మీద ఇష్టం ఇంకా పెంచేస్తాయి. వినీష అంటే నీకు ఇష్టం అని తెలుసు. ఒకవేళ తను నిన్ను కాదంటే.. అప్పుడు నాకు ఓకే చెపుతావా!" అంది.

"ఛీ.. నోర్ముయ్యి! ఇంకో వ్యక్తి తత్వాన్ని ఆకట్టుకునేందుకు నీ వ్యక్తిత్వం బలిచేస్తావా? దయచేసి ఇంకా ఎక్కువ మాట్లాడి నా దృష్టిలో దిగజారిపోకు" అన్నాడు.

ఉమకి ఏడుపు ఆగడం లేదు.

"వినీష మీద నా కున్నది ప్రేమ కాదు. కొన్ని ఫీలింగ్స్ కి పేరు పెట్టలేము. ఎండకాలం అయిన తరువాత మొదటి వానచుక్క పడినప్పుడు వచ్చే వాసనకి మట్టి తినాలనిపిస్తుంది, ఆ ఫీలింగ్ ఆకలా..! ఎవరో తెలియని బోసినవ్వుల చిన్న బాబుని చూస్తే దగ్గరకి తీసుకోవాలనిపిస్తుంది, ఆ ఫీలింగ్ ప్రేమా..! నాకు వినీషని చూడగానే కలిగే ఫీలింగ్ అదే! కలిస్తే మాట్లాడాలని అనిపిస్తుంది. కలిసాక మాటరాదు. తాను కదిలిపోయాక మరుపురాదు. ఒక స్వర్గం లాంటి నరకం ఆ ఫీలింగ్" అని మైమరపుగా అన్నాడు.

ఉమకి కన్నీళ్ళు వస్తున్నాయి కానీ, ఇప్పుడు తనని రిజెక్ట్ చేసాడని కాదు.. తన వర్ణన చూసి. "సారీ విశాల్ నిన్ను బాధపెట్టి ఉంటే" అంది.

"అదేం వద్దు ఉమ, మనం మంచి ఫ్రెండ్స్! మన మధ్య ఇటువంటి సారీలు వద్దు. మంచి ఫ్రెండ్ గా.. నువ్వు ఎప్పుడూ నా మనసులో ఉండిపోతావ్" అన్నాడు.

ఈ మాటలు విన్న ఇంకో వ్యక్తి కూడా చాటుగా.. కనుల నీరు కురిపిస్తుంది.

సర్వర్ ని పిలిచి "బిల్.." అన్నాడు విశాల్.

"పే చేసారు సర్.." అన్నాడు సర్వర్.

"ఎవరు?" అన్నాడు విశాల్.

"ఏమో సర్.. ఈ చీటి మీకు ఇవ్వమన్నారు అన్నాడు సర్వర్.

చీటీ ఓపెన్ చేసాడు విశాల్.

పుట్టినరోజు శుభాకాంక్షలు ఉమ

ఇట్లు

నీ స్నేహితుడి పేరు, తెలియని భావాలకు కారణం.

విశాల్ ముఖంలో చిరునవ్వు, ఉమ కన్నుల్లో ఏదో తెలియని తృప్తి.

***

# PART 25

మరునాడు, ట్యూషన్ కి వెళ్ళే టైమ్ లో మరలా కలిసింది వినీష.

ఒక చిన్న నవ్వు నవ్వి పక్కనే సైకిల్ తొక్కుతున్నాడు విశాల్.

వినీష కూడా ఏమి మాట్లాడలేకపోతుంది, విశాల్ కన్నులలోకి చూసి మాట్లాడడానికి అవస్థ పడుతుంది.

"ఏంటి.. అమ్మాయిగారు ఈ రోజు సైలెంట్ గా ఉన్నారు?" అన్నాడు విశాల్.

"ఏమిలేదు. అది ఒక పేరు లేని ఫీలింగ్" అంది వినీష.

"అవునా.. నన్ను పేరు పెట్టమంటారా?" అని అడిగాడు విశాల్.

"మీకు తెలిస్తే కదా నాకు చెప్పడానికి" అంది వినీష.

"ఏరు ఒరవడిని బట్టి.. అది ప్రవహించే దిశను చెప్పవచ్చు, దానికి ఏరు గురించి మనకి పెద్దగా తెలియాల్సింది లేదు" అన్నాడు విశాల్

"ఐతే చెప్పండి" అంది వినీష.

"ఇక్కడ చెప్పడం కష్టం, అది నేను చెప్పలన్నా.. మీరు వినాలన్నా.. మనం ఒక ప్రదేశానికి వెళ్ళాలి వస్తారా?" అని అడిగాడు విశాల్.

'నువ్వు అడిగితే.. వేరే లోకానికైనా వస్తా' అని లోపల అనుకుంది.

బయటికి మాత్రం "అమ్మో నాకు భయం. మా ఇంట్లో తెలిసిందంటే ఇంకేం లేదు" అంది.

"అంటే.. తెలియకపొతే పర్లేదా?" అన్నాడు విశాల్.

చిన్నగా నవ్వింది.

"ప్లీజ్.. ఒక్కసారి, నేను ఎక్కువ టైమ్ తీసుకోను" అన్నాడు విశాల్.

"దేనికి..? అంది అమాయకంగా వినీష.

"ఫీలింగ్ చెప్పడానికి" అన్నాడు విశాల్.

"ఎక్కడికి వెళ్ళాలి?" అన్నట్టు చూసింది వినీష.

ఎక్కడ నుంచో మైక్ లో.. 'మాటే రాని చిన్నదాని.. కళ్ళు పలికే ఊసులు.. అందాలన్నీ పల్లవించి.. ఆలపించే ఊసులూ..' అని బాలూ పాడుతున్న పాట వినపడుతుంది.

ఇంకా ఆలస్యం చేస్తే మంచిది కాదని, "నన్ను ఫాలో అవ్వండి" అంటూ ముందు వెళ్ళాడు విశాల్.

తిన్నగా మూర్తి ఇంటికి వెళ్ళారు. ముందే చెప్పడం వల్ల మూర్తి బయటకి వెళ్ళి పోయాడు. ఇద్దరూ సైకిల్ స్యాండ్స్ వేసి, ఇంటి లోపలికి వెళ్ళారు.

విశాల్ లోపల గడియ వేసాడు. వినీషకి ఏదో మూల భయం.

రెండో గదిలోకి వెళ్ళి "రండి.." అన్నాడు విశాల్.

కొద్దిగా తట పటాయించింది వినీష!

విశాల్ కి అర్థం అయ్యింది, ఒక పెళ్ళికాని ఆడపిల్ల ఇంకొక మగాడితో ఒంటరిగా ఎవరూ లేని ఇంట్లో ఉంటే.. ఏం ఆలోచిస్తుందో!

"దయచేసి లోపలి రండి. ఈ ఇల్లు కడుపుతో ఉన్న అమ్మ గర్భాలయం లాంటిది. ఇక్కడ రక్షణే తప్ప అపాయం లేదు" అన్నాడు విశాల్.

ఒక్కసారి కదిలిపోయింది వినీష.

'ఛీ.. ఎదురుగ ఉన్నది ఎవరు? నే ఎందుకు భయపడుతున్నాను?" అనుకుంటూ లోపలి వెళ్ళింది.

***

# PART 26

స్టోర్ రూమ్ లో ప్రొజెక్టర్ ఆన్ అయ్యి వుంది. గోడ మీద పింక్ కలర్ పోర్టల్ వుంది. ఇద్దరూ దాని ఎదురుగా నిలుచున్నారు.

"ఏంటిది..?" అంది వినీష.

"కొంచెం సేపట్లో నీకు తెలుస్తుంది" అని చెయ్యి పట్టుకున్నాడు.

మొదటి కర స్పర్శకి కరిగిపోయింది వినీష.

"కళ్ళు మూసుకో.." అన్నాడు విశాల్.

చెప్పగానే కళ్ళు మూసుకుంది వినీష.

ఏదో చల్లని పిల్ల తెమ్మెర కళ్ళు మూసుకుని వుంది.

"ఇప్పుడు కళ్ళు తెరువు" అన్నాడు విశాల్. ఎదురుగా ఒక పిరమిడ్, అద్భుతంగా వుంది. దాని వెనుక పున్నమి చంద్రుడు.

"ఏంటిది విశాల్, మనం ఎక్కడ ఉన్నాం..?" అంది వినీష.

"గ్రేట్ పిరమిడ్ ఆఫ్ గిజా! ఈజిప్ట్‌లో ఉంది. ఇది గిజా నెక్రోపోలిస్ లోని పిరమిడ్‌లలో పురాతనమైనది మరియు అతిపెద్దది" అన్నాడు విశాల్.

"మనం ఇక్కడికి ఎందుకు వచ్చాం?" అంది వినీష.

ఇది ప్రపంచం లోని ఏడు వింతలలో ఒక వింత, దీనికి ఎనిమిదో వింత అయిన.. నా వినీషని చూపించాలని తీసుకొచ్చాను. ఐ లవ్ యు వినీ.." అన్నాడు విశాల్.

వినీష మనసు నాట్యం చేస్తుంది, చేతిలో ఉన్న విశాల్ చెయ్యిని గట్టిగా నొక్కి వదిలింది.

"కనులు మూసుకో.." అన్నాడు.

ఏదో అర్థం కాని ఒక ప్రదేశం, బహు సుందరంగా వుంది.

"ఏంటి ఇది?" అంది వినీష.

"హాంగింగ్ గార్డెన్స్ ఆఫ్ బాబిలోన్! ఈ తోటలు పురాతన బాబిలోన్, ప్రస్తుత ఇరాక్‌లో ఉన్నాయి. ప్రపంచ వింతలలో రెండవ వింత, నిన్ను చూపించి దానికన్నా అందం ఉందని చెప్పాలని తీసుకొచ్చాను. ఐ లవ్ యు వినీ" అన్నాడు విశాల్.

వినీషకి అది కలో నిజమో..! అర్థం కావడం లేదు.

ఈసారి తనే వినీష కళ్ళని సున్నితంగా మూసాడు విశాల్.

కళ్ళు తెరిచే సరికి ఎదురుగా పెద్ద విగ్రహం.

"ఏంటది..?" అని ఆశ్చర్యంగా అంది వినీష.

మూడవ ప్రపంచ వింత, ఒలింపియాలో జ్యూస్ విగ్రహం! ఈ విగ్రహం గ్రీకు దేవతల రాజు జ్యూస్ యొక్క పెద్ద కూర్చున్న వ్యక్తి. ఇది గ్రీస్ లోని ఒలింపియాలోని జ్యూస్ ఆలయంలో ఉంది. ఆయనకి నా ప్రేయసిని పరిచయ చేద్దామని తీసుకువచ్చాను. ఐ లవ్ యు వినీ.." అన్నాడు విశాల్.

వినీషకి ఏదో తెలియని ఉద్వేగం.

ఈసారి తానే కనులు మూసుకుంది.

విశాల్ నవ్వుతూ "ఇప్పుడు తెరువు, ఇది ఎఫెసస్‌లోని ఆర్టెమిస్ ఆలయం. నేటి టర్కీలోని ఎఫెసస్‌లో ఉన్న ఆర్టెమిస్ దేవతకు అంకితం చేయబడిన పురాతన గ్రీకు ఆలయం. నేటికి కొన్ని శిథిలాలు మాత్రమే మిగిలి ఉన్నాయి. ఇది ప్రపంచం లోని నాలుగవ వింత, నిన్ను ఎప్పటికీ ఇలానే ప్రేమిస్తానని సాక్ష్యం చెప్పడానికి తీసుకుని వచ్చాను. ఐ లవ్ యు వినీ.." అన్నాడు.

వినీషకి ఇంద్రధనుస్సు పైన కూర్చున్న ఫీలింగ్ కలిగింది.

"ఇప్పుడు ఎక్కడికి?" అంది వినీష.

కన్ను మూసి తెరిచే సరికి..

"హాలికర్నాసస్ వద్ద సమాధి. సమాధి అనేది ప్రస్తుత టర్కీలోని బోడ్రమ్‌లో కారియా రాజు మౌసోలస్ కోసం నిర్మించిన పెద్ద సమాధి. ఇది విస్తృతమైన మరియు ఆకట్టుకునే వాస్తుశిల్పానికి ప్రసిద్ధి చెందింది" అని చెప్పాడు.

"సమాధి దగ్గరకు ఎందుకు వచ్చాము?" అంది వినీష.

"ఇది ప్రపంచ వింతలలో ఐదవది, కేవలం చావు మాత్రమే.. నాకు నీ పై ప్రేమను ఆపగలదని చెప్పడదానికి, ఐ లవ్ యు వినీ.." అన్నాడు.

ఈసారి వినీష మౌనంగా ఉండి పోయింది.

"కళ్ళు తెరువు?" అన్నాడు విశాల్.

"కోలోసస్ ఆఫ్ రోడ్స్, ఒకప్పుడు గ్రీస్ లోని రోడ్స్ నగరంలో ఉన్న గ్రీకు దేవుడు హీలియోస్ విగ్రహం. ఇది పురాతన ప్రపంచంలోని ఎత్తైన విగ్రహాలలో ఒకటి కానీ, భూకంపం కారణంగా ధ్వంసమైంది. ఎంటువంటి భూకంపం.. నాకు నీపై ఉన్న ప్రేమని ధ్వంసం చెయ్యలేవని చెప్పడానికి ప్రపంచంలోని ఆరవ వింత అయిన ఈ ప్రదేశంకి తీసుకు వచ్చాను. ఐ లవ్ యు వినీ.." అన్నాడు.

"నాకు తెలుసు ఇప్పుడు ఏడవ వింత చూపుతావ్!" అంది.

విశాల్ నవ్వి రెండు చేతులతో ఆమె కన్నులు మూసాడు, కనురెప్పలను తెరుస్తూ మూస్తూ విశాల్ చేతిని స్పృశిస్తుంది వినీష.

"అదిగో చూడు అలెగ్జాండ్రియా యొక్క లైట్‌హౌస్! దీనిని ఫారోస్ ఆఫ్ అలెగ్జాండ్రియా అని కూడా పిలుస్తారు, ఇది ఈజిప్ట్‌లోని అలెగ్జాండ్రియాలోని ఫారోస్ ద్వీపంలో నిర్మించిన పొడవైన లైట్‌హౌస్. ఇది ఆ సమయంలో మానవ నిర్మిత నిర్మాణాలలో ఎత్తైనది. మన ప్రేమ దేనికైనా ఉన్నత మైనది అని చెప్పటానికి నిన్ను తీసుకు వచ్చాను. ఐ లవ్ యు వినీ.." అన్నాడు.

విశాల్ ని గట్టిగా కౌగిలించుకుంది వినీష. గాలి వారి మధ్యలో దూరడానికి సర్వ ప్రయత్నాలు చేస్తుంది.

ఆమె నుదిటిపై మృదువుగా తన పెదవులతో తాకాడు విశాల్.

తన్మయం, విస్మయం, అయోమయం, ఇప్పుడు ఆ ఫీలింగ్ పేరు ఏంటి?

***

# PART 27

సమయం మధ్యాన్నం మూడు కావొస్తోంది. కూర్చున్న వినీష టక్కున లేచింది. "బయలుదేరుదామా!" అంది.

అప్పుడేనా అన్నట్టు చూసాడు విశాల్.

"ఇంటికి వెళ్ళే సరికి నాలుగు అవుతుంది, ఈరోజు కాలేజ్ మానేసానని తెలిస్తే ఇంట్లో నాకు ప్రాబ్లెమ్. కాలేజ్ అయ్యే టైమ్ కి వెళ్ళిపోవాలి" అంది వినీష.

ఇద్దరు బయలుదేరారు.

విశాల్ ఇంటికి చేరుకునే సరికి ఇల్లంతా హడావిడి. పక్కింటి పిన్ని గారు, ఎదురింటి మామ్మగారు కనిపించారు.

"ఏమైంది..? ఏంటి హడావిడి.." అన్నాడు.

అనంత.. విశాల్ ని చూసి "వచ్చావా..! కొద్దిగా వెళ్ళి అరటిపళ్ళు, స్వీట్స్ పట్టుకుని రా!" అంది.

లోపలికి వెళ్ళాడు, స్వప్నని తయారు చేస్తున్నారు. విశాల్ కి అర్థం అయ్యింది, చెల్లికి పెళ్ళి చూపులని.

స్వప్న వెనుక్కి తిరిగి, "ఏరా ఎలా ఉన్నాను?" అంది.

"సూపర్.. నీకేంటి గంగిరెద్దుకి నగలు పెట్టినట్టు ఉన్నావు. రెండు కొమ్ములు, కొన్ని పువ్వులు తప్ప, అంతా పర్ఫెక్ట్" అన్నాడు విశాల్.

"అమ్మా చూడవే వీడు.. నన్ను గంగిరెద్దు అంటున్నాడు" అంది స్వప్న.

"అబ్బబ్బా.. మీ ఇద్దరితో పడలేక పోతున్నాను. మరలా మొదలు పెట్టారా..!" అంది అనంత.

లోపలికి వస్తూ, "అయినా నిన్ను బజారుకు వెళ్ళమంటే ఇక్కడేం పని?" అంటూ విశాల్ భుజం పట్టుకుని బయటకు లాకొచ్చింది.

బయటకు వచ్చాక, "అమ్మా.. దాని బుగ్గ పైన చిన్న దిష్టి చుక్క పెట్టు, దిష్టి తగలకుండా" అన్నాడు విశాల్.

అనంత ముఖంలో సన్నని చిరునవ్వు, "మీ ఇద్దరి మధ్య ఈ ప్రేమ ఏంటో నాకు అర్థం కాదురా! కనపడితే కొట్టుకుంటారు, ఒకళ్ళు లేకుండా ఒకళ్ళు ఉండలేరు" అంది అనంత.

చిన్నగా నవ్వి, "భూమి, చందమామ ఒకరికి ఒకరు దూరంగా ఉనట్టు వుంటుంది కానీ, అవి ఎప్పుడూ.. ఒకదాన్ని వదిలి ఇంకొకటి పోదు. చందమామ దూరంగా ఉండి భూమిని స్థిరంగా ఉండేలా చేస్తుంది. భూమి దాన్ని ఎప్పుడూ తన రక్షణలో ఉంచుతుంది" అన్నాడు విశాల్.

"అబ్బో, చాలా సైన్సు నేర్చుకున్నావు రా! మరి నేను, నాన్న..?" అని అడిగింది.

"నాన్న సూర్యుడు, నువ్వు ఆయన వెలుగు. నేను మీ చుట్టూ ఉంటే అది నా చుట్టూ ఉంటుంది" అన్నాడు విశాల్.

"నీ మాటలతో మాయ చేస్తావ్! తొందరగా వెళ్ళి స్వీట్స్ పట్టుకుని రా! మీ నాన్న పెళ్ళి వారిని ఆరు గంటలకు తీసుకు వస్తానన్నారు" అంది అనంత.

కిటికీలో నుండి చూస్తున్న స్వప్న నవ్వుకుంది.

***

పెళ్ళివారు వచ్చారు. విశాల్ నాన్న అందరినీ పరిచయం చేసారు. స్వప్న పెళ్ళికొడుకుకి నచ్చింది. కాసేపు అవి ఇవి మాట్లాడి వాళ్ళు వెళ్ళిపోయారు.

విశాల్, వాళ్ళని బయటకు వెళ్ళి రిక్షా మాట్లాడి పంపించాడు. వెనుకకు వచ్చిన విశాల్ కు.. మధ్యవర్తిగా వచ్చిన కుటుంబం ఎదురయ్యాడు.

విశాల్ ని చూసి "చేతిలో డబ్బు లేకుండా ఎందుకయ్యా మీరు మా టైమ్ వేస్ట్ చేస్తారు?" అన్నాడు.

విశాల్ కి అర్థం కాలేదు. "ఏమైంది సర్..?" అన్నాడు.

"వెళ్ళి మీ నాన్నని అడుగు?" అంటూ రుసరుసా వెళ్ళిపోయాడు.

ఇంటి లోపల ఉన్న వాతావరణం గంభీరంగా వుంది.

"ఏమైంది అమ్మా.." అని అడిగాడు.

ఎవరూ మాట్లాడలేదు.

గది లోకి వెళ్ళాడు. స్వప్న కిటికీ నుండి బయటకి చూస్తుంది.

"ఏమైందో నువ్వైనా చెప్పవే..!" అన్నాడు.

అన్నయ్యను పట్టుకుని బావురుమంది స్వప్న!

"ఏంటిరా.. నువ్వు ఏడుస్తున్నావా? ఏమైంది చెప్పు?" అన్నాడు విశాల్.

"నాకు పెళ్ళి వద్దు అన్నయ్యా, నేను చేసుకోను" అంది.

"ఎందుకమ్మా..! ముందు ఏడుపు ఆపు" అన్నాడు విశాల్.

అనంత లోపలి వచ్చింది.

"ఏమ్మా.. వాళ్ళకి స్వప్న నచ్చలేదా?" అన్నాడు.

"లేదు నచ్చింది, ఐతే వాళ్ళు లక్ష రూపాయిలు కట్నం, ఇంకో లక్ష రూపాయిలు లాంచనాలు మధ్యవర్తి కుటుంబంతో అడిగించారు. దానికి నాన్న, తాను ఒక సాధారణ ప్రభుత్య ఉద్యోగినని అంత ఇచ్చుకోలేమని చెప్పారు. దానికి ఆ కుటుంబం.. 'బాగా పై సంపాదన ఉండే ఉద్యోగం, సంపాదన ఏం చేసావని అడిగారు.' మీ నాన్న ఎంత నిజాయితీ గలిగిన మనిషో నీకు తెలుసు, ఈయనకి చిర్రెత్తుకొచ్చి ఆ కుటుంబంకి, ఈ పెళ్ళి అవసరం లేదని గట్టిగా చెప్పి పంపారు. ఐతే ఆ వెళ్ళే వాడు వెళ్ళక.. స్వప్నతో 'మీ నాన్న లాంటి వాడు తన పెళ్ళి చేయలేడనీ.. ఎవరినైనా తీసుకుని లేచిపో' అని అన్నాడు" ఆఖరి మాట చెపుతుండగా అనంత గొంతు మారడం గమనించాడు విశాల్.

విసురుగా బయటికి వెల్లబోయాడు.

డోర్ దగ్గర విశాల్ నాన్న.. "ఎక్కడికి ఇప్పుడు? వెళ్ళి ఆ కుటుంబంతో గొడవ పెడతావా?" అన్నారు.

"నన్ను ఆపకండి నాన్నా..! నా కుటుంబం జోలికొస్తే ఎవడినీ వదలను" అన్నాడు విశాల్.

"హా.. పెద్ద హీరో బయలుదేరాడు. నోరు మూసుకుని లోపలికి వెళ్ళు" గట్టిగా అరిచారు విశాల్ నాన్న.

విశాల్ కోపం ఇంకా ఎక్కువ అయ్యింది.

“అంటే ఎవడో రోడ్డున పోయేవాడు నా చెల్లెలిని నోటికొచ్చిన మాటలంటే.. విని ఊరుకోవాలా?” అన్నాడు.

“ఏం నీ చెల్లికన్నా ముందు నాకు ఇది కూతురు! నేను ఊరుకోలేదా?” అన్నారు.

“నాన్న.. మీరు మీ కూతుర్ని అంటే ఊరుకుంటారు ఏమో! నా చెల్లిని అంటే వాడి తాట తీస్తా..!” అన్నాడు.

విశాల్ నాన్న కోపంతో ఒక్క లెంపకాయ ఇచ్చారు.

“పళ్ళు రాలిపోగలవ్, నీకున్న కోపం నాకు లేకా! వాడిని ఒక్కమాట అన్నా చిలువలు పలువులు చేసి.. ఇక ముందు వచ్చే పెళ్ళి సంబంధాలు కూడా చెడగొడతాడు. నీకు నీ చెల్లి అంటే నాకన్నా ఎక్కువ ప్రేమ ఉండచ్చు కానీ, ఒక తండ్రిగా నాకు బాధ్యత కూడా ఉంటుంది. ఎడ్లబండిలో కూర్చున్న వాళ్ళకి ఏం తెలుసు..? ఎద్దుకి ఉన్న నెప్పి” అని బయటికి వెళ్ళిపోయారు.

అమ్మ ఒక వైపు, చెల్లి ఒక వైపు.. మధ్యలో అసహాయ స్థితిలో విశాల్.

***

వినీష ఇంటికి చేరుకునే సరికి గేట్ దగ్గర కన్నారావు, “ఏంటి బుల్.. బుల్.. కాలేజీ ఎగ్గొట్టి ఎక్కడికి వెళ్ళావ్?” అన్నాడు.

వినీష కోపంగా “నా ఇష్టం, నీకు చెప్పల్సిన అవసరం నాకు లేదు, మర్యాదగా అడ్డులే” అంది.

“హా సరే నాకు చెప్పొద్దు, మీ నాన్న పైన వెయిటింగ్ ఆయనకి చెప్పు” అన్నాడు కన్నారావు.

వినీష పై ప్రాణం పైనే పోయింది.

“విశాల్ వచ్చాడా..!” అని వెనుక నుండి అడుగుతున్నాడు కన్నారావు.

“వీడికి నిజం తెల్సిపోయిందా! నాన్న నిజంగా వెయిట్ చేస్తున్నారా..!’ బుక్స్ తో మెట్లు ఎక్కుతూ ఆలోచించింది.

***

# PART 28

వినీష లోపలికి అడుగు పెట్టె సరికి ఎదురుగా వినీష తండ్రి శ్యామ్ సుందర్ గారు ఉన్నారు.

“ఏమ్మా ఎక్కడికి వెళ్ళావ్?” అన్నారు.

“ఏదో నోట్స్ పని ఉంటే కాలేజీలో ఈ రోజు క్లాసులు లేవని, మా ఫ్రెండ్ ఇంటికి వెళ్ళాను నాన్నా” అంది వినీష.

ఆయన చిరునవ్వుతో “ఒక్క ముక్క అమ్మతో చెప్పి వెళ్ళచ్చుగా, కాలేజ్ టైమ్ లో నువ్వు బస్టాండ్ దగ్గర కనిపించావు అంట, అది కన్నారావు వచ్చి కంప్లెయింట్ చేసి వెళ్ళాడు. వాడికి చెప్పాను, నువ్వు నా కూతురువని” అన్నారు.

తండ్రి అలా అనేసరికి వినీషకి కొంచెం బాధ వేసింది. ‘నేను వారి నమ్మకాన్ని వమ్ము చేస్తున్నా అనుకుంది.’ తలవంచుకుని గదిలోనికి వెళ్ళింది.

మనీష, హరీష ఎదురు చూస్తున్నారు. “ఎక్కడికి వెళ్ళావే..” అన్నారు.

“చెప్పగా ఫ్రెండ్ ఇంటికి వెళ్ళాను” అంది.

“ఎవరు ఆ ఫ్రెండ్..!” అని అడిగింది మనీష.

వినీషకి, ఏం చెప్పాలో అర్థం కాలేదు “ఉమ..” అంది.

హరీష కలిపించుకుని, “నువ్వు ఉమ ఇంటికి వెళితే, అది కాంటీన్ లో నువ్వు కాలేజ్ కి రాలేదేంటని నన్ను అడిగింది ఏంటి?” అని చిలిపిగా మొహం పెట్టి అంది.

“అబ్బా వదిలేయండి బాబు..” అంది వినీష.

హరీష దగ్గరికి వచ్చి “బావ ఎక్కడికి తీసుకు వెళ్ళాడు?” అని అడిగింది.

"నిన్ను చంపుతా..!" అని కోపం నటించి అక్కడికి నుండి లోపలి వెళ్ళిపోయింది వినీష.

"దీన్ని చూస్తే నాకు భయం వేస్తుంది" అంది మనిషా.

"ఏం భయం లేదు. దాని సంగతి అది చూసుకోగలదు" అంది హరీష.

వాళ్ళ అమ్మ వచ్చి చెప్పాక తెలిసింది వినీషకి, తమ దూర బంధువైన ఈశ్వర్ తను అంటే ఇష్టపడుతున్నాడు అని.

"అప్పుడే పెళ్ళి ఏంటి అమ్మా! నేను ఇంకా చదువు కోవాలనుకుంటున్నాను" అంది వినీష.

"ఒకసారి మనం సరే అంటే, ఈశ్వర్ నీకోసం ఇంకో రెండు ఏళ్ళు అయినా వెయిట్ చేస్తా అంటున్నాడు. మనకి తెలిసిన కుటుంబం, ఆస్తి బాగా వుంది. సంఘంలో మంచి పేరు వుంది. చిన్ననాటి నుండి చూస్తున్నాను, చాలా సాత్మికుడు, గోవులాంటి మనిషి" అంది వినీష తల్లి.

వినీషకి కూడా ఈశ్వర్ గురుంచి తెలుసు కానీ, అతను పెళ్ళి ప్రపోసల్ వరకు వస్తాడని తెలియదు. అది కూడా విశాల్ ప్రపోజ్ చేసిన రోజే!

***

తెల్లవారింది.

ట్యూషన్ దారిలో ఒకరికి ఒకరు నిన్న ఇంట్లో జరిగిన విషయాలు చెప్పుకున్నారు. కావాలనే వినీష.. విశాల్ కి ఎలా రియాక్ట్ అవుతాడో అని ఈశ్వర్ విషయం చెప్పలేదు.

కన్నారావు విషయం విన్నాక, "వాడి సంగతి నేను చూసుకుంటా వదిలేయ్" అన్నాడు విశాల్.

"బాబు.. వాడిని ఏమి అనకు, మమ్మల్ని రక్షించే పెద్దమనిషిలా మా అమ్మనాన్నల దగ్గర వాడు బిల్డుప్ ఇస్తాడు. వాళ్ళు వాడిని అమాయకంగా నమ్ముతారు. వాడు నీకు యాంటిగా ఏమైనా చెబితే.. రేపు నేను నిన్ను పరిచయం చేయాలంటే ఇబ్బంది పడాలి" అంది వినీష.

"సరే, నేను డైరెక్ట్ గా ఇన్వాల్వ్ కాను ఓకే.." అన్నాడు విశాల్.

***

కాలేజ్ కి వెళ్ళాక టీ షాప్ దగ్గర టీ సిప్ చేస్తూ, మూర్తికి విషయం చెప్పాడు.

మూర్తి కూర్చున్న వాడు పైకి లేచాడు.

విశాల్ చెయ్యి పట్టుకుని కిందగి గుంజాడు.

"నువ్వు తొందర పడకు, నాన్నగారు చెప్పింది కరెక్ట్, అనవసరంగా కుటుంబాన్ని ఏమైనా అంటే అది లేని పోనీ ప్రాబ్లెమ్స్ తీసుకు వస్తుంది. ఇందులో మన కోపంకన్నా నాన్నగారి అనుభవానికి మనం పెద్దపీట వెయ్యాలి" అన్నాడు మూర్తి.

"సరే కుటుంబాన్ని వదిలేయ్! ఆ కన్నారావు సంగతి ఏంటి?" అన్నాడు విశాల్.

"వాడు నీపేరు వాడి ప్రతి సారి వినీషని బెదిరించాడు అని చెప్పావ్. మరి వాడి సంగతి ఏంటి?" అన్నాడు మూర్తి.

"సరే కానీ వాడిని ఏం చేస్తావో నీ ఇష్టం" అన్నాడు విశాల్.

"వాడి డీటెయిల్స్ చెప్పు.." అన్నాడు మూర్తి.

"నాకూ పెద్దగా తెలియదు. పేరు కన్నారావు, ఇన్సూరెన్స్ ఏజెంట్. రోజూ మార్నింగ్ 9కి ఆఫీస్ కి వెళ్ళి ఈవెనింగ్ 5 కి వస్తాడు" అని చెప్పాడు విశాల్.

"ఇది చాలు, రేపు నేను కాలేజ్ కి రాను. నువ్వు అటెండెన్స్ మేనేజ్ చెయ్యి" అని కన్ను కొట్టి వెళ్ళిపోయాడు మూర్తి.

***

కన్నారావు బస్సు స్టాప్ కి వచ్చాడు. కొద్దిగా లేట్ అయ్యింది. రోజు వెళ్ళే బస్సు వెళ్ళిపోయింది. ఆరోజు ఎందుకో బస్ స్టాప్ కొద్దిగా ఖాళీగా వుంది. ఇంతలో ఆరడుగుల వ్యక్తి ఒకడు వచ్చి పక్కన నుంచున్నాడు.

"త్రీ నెంబర్ బస్సు వెళ్ళిందా!" అన్నాడు.

మర్యాద లేకుండా మాట్లాడుతున్న వాడి వంక కొద్దిగా చిరాగ్గా చూసాడు కన్నారావు.

"త్రీ నెంబర్ బస్సు వెళ్ళిందా!" మళ్ళీ అడిగాడు.

"ఏమో ఏ బస్సు ఎటు వెళ్ళిందో నాకు ఏం తెలుసు?" అన్నాడు కన్నారావు.

"మరి ఏ అమ్మాయి ఎక్కడికి వెళ్ళిందో తెలిసినప్పుడు.. ఏ బస్సు ఎలా వెళ్ళిందో నీకు తెలియలిగా..!" అన్నాడు ఆరడుగుల వ్యక్తి.

కన్నారావుకి అర్థం అయ్యింది. "హా.. కావాల్సిన వాళ్ళు ఉన్నప్పుడు కనుక్కుంటాం! తప్పు ఏంటి?" అన్నాడు.

"అందుకే అడిగా, పనికిమాలిన విషయాలు నీకు తెలుస్తాయని" అన్నాడు ఆరడుగుల వ్యక్తి.

"ఏయ్ మర్యాదగా మాట్లాడు, కోపం వస్తే నేను మనిషిని కాదు" అన్నాడు కన్నారావు.

"అవునా.. కోపం లేనప్పుడు నువ్వు మనిషివని ఎవరన్నారు?" అన్నాడు ఆరడుగుల వ్యక్తి.

కన్నారావుకి లోపల కొద్దిగా భయం వేసింది. ఈ లోపల కొంతమంది ప్రయాణీకులు వచ్చి నిలబడ్డారు. కొంచెం ధైర్యం వచ్చింది. వాళ్ళ మధ్యలోకి వెళ్ళి నుంచున్నాడు.

పాన్ పరాగ్ తీసి కొంచెం నోట్లో వేసుకున్నాడు. కాసేపటికి మరలా ఆరడుగుల వ్యక్తి పక్కన వచ్చి నుంచున్నాడు.

తల తిప్పుకున్నాడు కన్నారావు.

"ఓయ్.. ఏంటి కళ్ళు కనిపించడం లేదా! గుట్కా నమిలి మీద ఊసావ్" అన్నాడు ఆరడుగుల వ్యక్తి.

ఒక్క క్షణం కన్నారావుకి ఏం అర్థం కాలేదు. "నేను ఎప్పుడు ఊసాను?" అన్నాడు.

గ్యాప్ ఇవ్వకుండా రెండు మూడు లాగిపెట్టి కొట్టాడు ఆరడుగుల వ్యక్తి.

"కుయ్యో.. మొర్రో.." అన్నాడు కన్నారావు.

చుట్టూ ఉన్న ఉన్న జనం చోద్యం చూస్తున్నారు.

ఒక పెద్దాయన వచ్చి "ఏమైంది..?" అని అడిగాడు.

"పక్కనే నుంచున్న పాపానికి మీద ఉమ్ముతున్నాడు సర్! ఏంటిది అని అడిగితె తిరగబడుతున్నాడు" అన్నాడు ఆరడుగుల వ్యక్తి.

"అది కాదు.." అని ఏదో చెప్పాలనుకున్నా కన్నారావు నోట్లోంచి గుట్కా తెంపరలు పెద్దాయన ముఖం మీద పడ్డాయి.

"ఛీ.. వెధవా.. అడిగిన పాపానికి నా మీద కూడా ఉమ్ముతావా?" అనగానే చుట్టుపక్కల ఉన్నవారు స్పందించి కన్నారావుకి దేహశుద్ధి చేసారు. మెల్లగా ఇంటి దారి పట్టాడు కన్నారావు.

ఇంటి మలుపులో ఆరడుగుల వ్యక్తి బండి మీద కూర్చుని కనిపించాడు. దగ్గరికి వచ్చి "ఇంకోక్కసారి ఆడపిల్లలు జోలికి వేస్తే ఈసారి కాలో.. చెయ్యో.." అని చెప్పి వెళ్ళిపోయాడు ఆరడుగుల వ్యక్తి కమ్ మూర్తి.

***

# PART 29

ఒక్కోసారి మనం అనుకున్నట్లు అన్నీ జరగవు. కన్నారావుకి వార్నింగ్ ఇచ్చాక మూర్తి అంతా అయిపోయింది అనుకున్నాడు కానీ, కథ మరోలా నడిచింది.

***

విశాల్ ఇచ్చిన ప్రతిని పట్టుకుని తన సహచరులతో కలిసి దేగల కొండకు బయలుదేరాడు వహీద్!

సరిగ్గా అమావాస్య ఇంకా పదిహేను రోజులు వుంది అనగా.. నల్లమల అడవులకు చేరుకున్నారు.

ఒక దట్టమైన ప్రదేశానికి వచ్చాక, "ఇక నుండి కాలి నడకనే వెళ్ళాలి" అన్నాడు జీప్ డ్రైవర్.

వహీద్ తో కలిపి ఆరుగురు దిగి నడవడం మొదలుపెట్టారు.

"ఇక్కడి నుండి ఎక్కడికి వెళ్ళాలో తెలుసా" అని అడిగాడు బాల.

"నల్లమల అడవి మధ్యలో పశుపతినాథ ఆలయం దగ్గరికి వెళ్ళాలి" అన్నాడు వహీద్. "అక్కడి నుండి.." అడిగాడు ఇంకో సహచరుడు.

"ఎందుకు వజ్రాలు మొత్తం పట్టుకుని పోతావా?" అన్నాడు వహీద్.

అందరూ మౌనంగా నడుస్తున్నారు.

"చీకటి పడుతుంది, ఇంక వెళ్ళడం మంచిది కాదు" అన్నాడు బాల.

"సరే ఏదైన మంచి ప్లేస్ చూడు" అన్నాడు.

ఒక పెద్ద చెట్టు కింద టెంట్ వేశారు. నెగడు వేసుకుని కూర్చున్నారు. తీసుకువచ్చిన దుంపలు కాల్చారు. ఒకడు అడివిలోకి వెళ్ళి రెండు కారు కోడి పిట్టలని తెచ్చాడు. వాటిని నెగడు పై కాల్చాడు.

అందరూ తినడానికి ఉపక్రమించారు. ఒక్కసారిగా ఏదో మెరుపు మెరిసింది, ఆ మెరుపు కాంతికి తట్టుకోలేక కళ్ళు మూసుకున్నారు.

కళ్ళు తెరిచే సరికి వాళ్ళు పెట్టుకున్న ఆహారం మాయం అయిపోయింది. అందరూ ఒకరి మొహాలు ఒకరు చూసుకున్నారు. మిగిలి ఉన్న దుంపలు కాల్చి, అవి కాలుతుండగానే తిన్నారు. కొంత మంది విప్పసారా తాగి పడుకున్నారు.

బాల వచ్చి "వహీద్.. ఇదేదో చాల విచిత్రంగా వుంది. తినే పదార్థం ఒక్క క్షణంలో మాయమయింది. ఇదేదో ప్రమాదాన్ని సూచిస్తుంది" అన్నాడు.

"భయమేస్తే నువ్వు ఇప్పుడే వెనుతిరిగి వెళ్ళిపోవచ్చు కానీ, శవంగా.." అని తన దగ్గర ఉన్న తపంచా(ఒక రకమైన తుపాకీ) ని తీసాడు వహీద్.

"సరేలే.. అది లోపల పెట్టు, నాకు భయం అనుకుంటే వచ్చే వాడినే కాదు. నేను అడుగుతుంది, అసలు మనం చేరుకోవాల్సిన ప్రదేశం ఏంటి? అది ఎంత దూరంలో వుంది? పూర్తిగా చెప్పు, నేను నీకు నమ్మిన బంటుని.. ఈ నిధి వివరం తెలిసినా నేను ఒక్కడినీ సాదించలేను కాబట్టి, కాస్త నీకు తెలిసినది నాకు చెప్పు" అన్నాడు.

వహీద్ ఆలోచించాడు, తన అనుచరుల్లో బాల నమ్మదగ్గ వ్యక్తి, 'వీడికి చెప్పినందు వల్ల మనకి ఏమి నష్టం లేదు' అనుకుని, చుట్టూ చూసాడు.

మిగిలిన నలుగురూ నిద్ర మత్తులో ఉన్నారు.

"ఇక్కడ నుండి పశుపతినాథ ఆలయానికి వెళ్ళి అక్కడ నుండి అమావాస్య రోజు తేజోధార త్రిశూల మార్గం గుండా వెళితే.. దేగల దీవి కనపడుతుంది. అదే రోజు హరాళి గుడిలోని దర్శనానికి వస్తుంది అని వుంది. తేజోధార త్రిశూల మార్గం అంటే నాకు తెలీదు. ఇవన్నీ ప్రొఫెసర్ లక్ష్మణరావు రాసిన పుస్తకంలో వుంది. బహుశా అది ఒక మార్గం పేరు అయ్యి ఉంటుంది. పశుపతినాథ ఆలయం దగ్గర వాకబు చేయడం ద్వారా మనకు తెలియచ్చు" అన్నాడు వహీద్.

"అయితే ఆ పుస్తకం జాగ్రత్త" అన్నాడు బాల.

ఇంతలో మరలా పెద్ద మెరుపు, కళ్ళు తెరిచి మూసే లోపు వహీద్ గ్రూప్ తెచ్చుకున్న సామాను మొత్తం మాయం అయ్యింది. వహీద్ చేతిలో ఉన్న తపంచా, పుస్తకం సహా..!

కళ్ళు తెరిచిన వహీద్, బాల పీక పట్టుకున్నాడు.

"బద్మాష్.. నా దగ్గరే నీ వేషాలా?" అన్నాడు.

వహీద్, చుట్టూ చూడు సామాను అంతా మాయం.

"నేను ఒక్కడిని అన్నీ ఎలా మాయం చేయగలను?" అన్నాడు బాల.

'అదీ నిజమే! వాడు ఒక్కడు ఎలా చేయగలడు?' అని బాలని వదిలి చుట్టూ చూడసాగాడు.

ఇద్దరికీ ఏమి కనిపించలేదు.

కానీ, వాళ్ళు మాత్రం దూరంగా ఉన్న కొంతమందికి కనపడుతున్నారు. వాళ్ళే మరుగుజ్జులు (లిలిపుట్లులు). శ్రీశైలం అడవుల్లో ఇప్పటికి ఉన్న ఒక అరుదైన మానవ జాతి, వీళ్ళు కేవలం ఆరు అంగుళాలు వుండే సూక్ష్మ జాతి.

వహీద్, బాల.. మిగిలిన నలుగురిని లేపారు.

ఒక్కొక్కరూ.. కాగడా పట్టుకుని చుట్టూ వెతికారు. ఏమి కనిపించలేదు. అందరూ వెనుతిరిగి వచ్చి.. "ఏమి కనిపించలేదు" అని పెదవి విరిచారు.

***

తెల్లవారింది. అందరూ లేచి మరలా వెతికే పనిలో పడ్డారు. తాము తీసుకు వచ్చిన బ్యాగ్స్ చిరిగి పోయి ఉన్నట్లు గుర్తించారు కానీ, అందులో ఉన్న ఒక్క సామాను కూడా దొరకలేదు.

"సర్ ఇదేదో దెయ్యాల పనిలా వుంది" అన్నాడు అందులో ఒకడు.

"బాబోయ్ దెయ్యమా..! నాకు చాలా భయం" అన్నాడు ఇంకొకడు.

"ఖామోష్.." అని అరిచి, "ఇంకొక్క మాట విన్నాను అంటే అందరిని చంపుతా అన్నాడు వహీద్.

"అలా కాదు సర్, తెచ్చుకున్న నీళ్ళు కూడా దొంగతనం చేసారు. ఎలా ముందుకి వెళ్ళడం? వెనక్కి వెళ్ళి సామానుతో మరలా వద్దాం" అన్నాడు అందులో ఒకడు. అమాంతం చేతిలో ఉన్న టవల్ వాడి గొంతుకు కట్టి పీక నులిమి చంపేశాడు వహీద్.

అది చూసి అందరూ బెదిరిపోయారు.

"ఏరా.. ఇంకా ఎవరైనా ఐడియాస్ ఉంటే చెప్పండి" అన్నాడు వహీద్.

ఎవరూ మాట్లాడలేదు.

"పశుపతి నాథ ఆలయం వరకు ఆగకుండా పదండి" అన్నాడు వహీద్.

"వహీద్ సర్.. వీడిని పూడ్చి పెట్టి వెళ్దాం" అన్నాడు బాల.

కోపంగా చూసాడు వహీద్.

"ఎంతైనా మనలో ఒకడు" అన్నాడు బాల.

"సరే చావండి.." అని చెప్పి చెట్టు కింద కూర్చున్నాడు వహీద్.

చల్లగాలికి నిద్ర పట్టింది.

"వహీద్.. వహీద్.." అని పిలిచాడు బాల.

ఉలిక్కి పడి లేచాడు వహీద్.

"మిగిలిన ముగ్గురూ ఏరి?" అన్నాడు బాల.

"నన్ను అడుగుతావేంటి? నువ్వే కదా పీనుగుని పాతి వస్తా అని వెళ్ళావ్?" అన్నాడు వహీద్.

"అవును నాకన్నా ముందు వాళ్ళు వచ్చారు" అన్నాడు బాల.

కంగారుగా చుట్టూ వెతికారు.

"వాళ్ళు పారిపోయారు" అన్నాడు బాల.

"ఛ.." అంటూ చెట్టు పై గట్టిగా కొట్టి.. 'పిరికి బందలు" అన్నాడు వహీద్.

"ఇప్పుడు ఏమిటి..!" అన్నట్టు చూసాడు బాల.

"పశుపతి నాథ ఆలయం" అన్నాడు వహీద్.

అడివిలో నడక మొదలు పెట్టారు.

అయితే పూడ్చి పెడతామని తీసుకెళ్ళిన వాడు చావలేదని.. వాడితో కలిపి అందరినీ బాల వెనక్కి పంపాడు అని వహీద్ కి కొంచెం కూడా అనుమానం రాలేదు.

***

# PART 30

కన్నారావు దెబ్బలతో ఇంటికి వెళ్ళాడు.

"ఏమయిందిరా..?" అన్నాడు తండ్రి లోకనాథం.

"కింద పడ్డాను" అన్నాడు కన్నారావు.

"ఇవి కింద పడితే తగిలిన దెబ్బలులా లేవు అన్నాడు లోకనాథం.

"హా.. అవును, ఎవడో కొట్టాడు అయితే ఏంటి..?" అన్నాడు కన్నారావు.

శ్యామ్ అప్పుడే మెట్లు దిగి వెళ్తున్నాడు.

"ఎవరు ఎందుకు కొట్టాడు?" అన్నాడు లోకనాథం.

"అదిగో వెళుతున్నాడుగా.. పెద్ద మనిషి, ఆయనకి కాబోయే అల్లుడు కొట్టించాడు" అన్నాడు.

ఈ మటలు శ్యామ్ చెవిలో పడ్డాయి.

"ఏంటి.. మరల చెప్పండి" అని అడిగాడు శ్యామ్.

"మీరు సరిగానే విన్నారు, ఒకే ఇంట్లో వుండే వాళ్ళం కదా అని.. మీ అమ్మాయిలని బాడీ గార్డ్ చేసినందుకు, రౌడీలను పెట్టి కొట్టించింది మీ పెద్దమ్మాయి" అని అక్కసుగా అన్నాడు.

"కన్నా.. నువ్వు ఏదో పొరపాటు పడుతున్నావ్, మా పిల్లలు అలాంటి పని ఎప్పటికి చెయ్యరు?" అన్నాడు శ్యామ్.

"హా.. అందరు తల్లితండ్రులు అదే అనుకుంటారు. మీ పెద్దమ్మాయి.. విశాల్ అనే వాడితో ప్రేమ వ్యవహారం నడుపుతుంది" అన్నాడు.

"నోర్మయ్.. గట్టిగా అరిచాడు శ్యామ్.

"నేను చెప్పేది నిజం, నన్ను నమ్మండి" అన్నాడు కన్నారావు.

"ఇదిగో మొన్న కూడా ఇలాగే.. ఎక్కడికో వెళ్ళిందని నింద వేసావు. ఇంకోసారి మా పిల్లల గురించి వాగితే నీ బతుకు పోలీస్ స్టేషన్ లోనే జాగ్రత్త.." అంటూ తిరిగి మేడ మీదకు వెళ్ళారు.

జరుగుతున్న గొడవ విని వసుంధర ఎదురు వచ్చి, "ఏమైందండీ..?" అని అడిగింది.

"అసలు నిన్ను కదూ అనాలి, ఇంటర్ అయ్యాక పెళ్ళి చేసేద్దాం అంటే, ఆడపిల్లకు చదువుండాలి.. పిల్లి పిల్లకు పాలు ఉండాలి.. అని నా ప్రాణం తీసావ్! ఇప్పుడు చూడు వాడు ఏం మాట్లాడుతున్నాడో..!" అన్నాడు శ్యామ్.

"మీరు ఆయాసపడుతున్నారు, కొంచెం మంచి తీర్థం తీసుకుని నిమ్మలించండి. మన పిల్లలు గురించి మీకు తెలీదా! ఇక్కడ దించిన తల కాలేజీలో ఎత్తుతారు. అలాంటిది మీరు తలవంచే పని చేస్తారా? అందులోను పెద్దది, దానికి నోట్లో నాలుకే లేదు" అని వసుంధర చెప్పిన తీరుతో శ్యామ్ కి కొంచెం శాంతి లభించింది.

"సరే, ఈ రోజు ఇంక క్యాంపు వెళ్ళను. సాయంత్రం పిల్లలు వచ్చాక మాట్లాడతాను" అన్నాడు శ్యామ్.

4 గంటల సమయానికి ఎవరినో తీసుకుని మేడ పైకి వచ్చాడు కన్నారావు.

మడత కుర్చీలో కూర్చున్న శ్యామ్ లేచి, "ఎందుకు వచ్చావ్ మరల?" అన్నాడు.

ఆ అరుపులకు లోపల ఉన్న హరీష, వసుంధర పరుగున వచ్చారు.

"సర్ దయచేసి కోప్పడకండి. ఇతని పేరు మోహన్! మీ పెద్దమ్మాయి ట్యూషన్మేట్, పోయిన ఆదివారం ఇతనితో చెపుతుండగానే నేను విన్నాను. మీరు అడగండి" అన్నాడు.

హరీషకి పై ప్రాణం పైనే పోయింది.

"నాన్న గారు వీడి మాట నమ్మద్దు, వీడు రోజూ వెనుకపడుతున్నాడని అక్క నాకు చెప్పింది" అంది.

'నువ్వు నోరుముయ్యి..' అన్నట్టు చూసారు శ్యామ్.

"అవును సర్.. కుర్రతనంతో వినీష వెనుకపడిన మాట వాస్తవం కానీ, తప్పు తెలుసుకుని క్షమాపణ చెపుదాం అని వచ్చిన నన్ను వినీష కొట్టి, అవమానించి మరీ.. ఈ విషయం చెప్పింది. ఆ విశాల్.. వాడి స్నేహితుడు మూర్తి.. ఇద్దరూ ఒట్టి జులాయి వెధవలు. నన్ను కూడా పట్టుకుని కొట్టారు" అని చెప్పాడు మోహన్.

శ్యామ్ గారు సైలెంట్ అవ్వడం చూసి, "నేను చెప్పాల్సింది చెప్పాను సర్, తరువాత మీ ఇష్టం" అంటూ కిందకి వెళ్ళిపోయారు.

హరీష లోలోపల కన్నారావుని ప్రపంచంలో ఉన్న తిట్లు అన్నీ తిట్టింది.

'ఇప్పుడెలా..! అక్క వచ్చిదంటే నాన్న ఏమి అడుగుతారో! అది ఏమి చెపుతాదో..!' అనుకుంది.

"ఈ విషయం నాకు ముందే ఎందుకు చెప్పలేదు?" అని శ్యామ్ అడిగిన ప్రశ్నకి హరీష తలవంచుకుంది.

"నిన్నే అడిగేది, ఈ కుర్రోడు అక్క వెనుకాల పడుతున్నాడని నాకు ఎందుకు చెప్పలేదు?" అని గట్టిగా అడిగారు శ్యామ్.

"ఏం చెప్పాలి నాన్న, రోడ్ నిండా ఇటువంటి వెదవలే! ఇలా మొరిగే ప్రతి కుక్క గురించి మీకు చెపితే.. మీరు మా చదువు మానిపించి పెళ్ళి చేస్తారు. అదేంటో.. మన సంస్కృతి, ఎవడో ఏదో వాగితే ఆడపిల్లను మాత్రమే తప్పుపడతారు. అందుకే ఇవన్నీ మేము మీకు చెప్పలేము, చెప్పం కూడా" అంది.

హరీష చెప్పిన దానికి విస్తుపోవడం శ్యామ్ వంతు అయ్యింది, కుర్చీలో కూలబడ్డాడు.

వసుంధర వచ్చి "చిన్నా.. పెద్దా లేదా! నాన్నగారితో మాట్లాడే పద్దతి అదేనా?" అంటూ కోప్పడింది.

***

వినీష కాలేజ్ నుండి ఇంటికి వచ్చింది. టైమ్ ఐదు అయ్యింది, తిరుపతి ప్రసాదం తీసుకుని ఇంటికి వస్తా అని విశాల్ చెప్పాడు, అంటూ వేగంగా ఇంటికి చేరుకుంది.

కింద కన్నారావు అదోలా చూసి తల తిప్పుకున్నాడు. 'వీడికి వార్నింగ్ పడిందన్నమాట' అనుకుని మెట్లు ఎక్కి లోపలకి వెళ్ళింది.

హాల్ లోనే నాన్న, అమ్మ, చెల్లిని చూసి ఏంటో అర్థం కాలేదు.

"కూర్చో.." అన్నారు శ్యామ్.

బుక్స్ పక్కన పెట్టి భయంభయంగా కూర్చుంది వినీష.

"విశాల్ ఎవరు?" అని అడిగారు.

ఏమి చెప్పలేని పరిస్థితి. హరీష వంక చూసింది.

"అడుగుతున్నది నేను, నాకు చెప్పు" అన్నారు.

సరిగ్గా అదే సమయానికి, ఇవేమి తెలియని విశాల్.. టిప్ టాప్ గా రెడీ అయ్యి ప్రసాదం వంకతో వినీష ఇంటికి వచ్చాడు.

డోర్ దగ్గర నుంచుని ఉన్న విశాల్ ని చూసి అందరూ నిశ్చేష్టులు అయిపోయారు.

"ఎవరు బాబు నువ్వు?" అని అడిగారు శ్యామ్.

"నా పేరు విశాల్ సర్" అన్నాడు విశాల్.

***

మొత్తానికి పశుపతినాథ ఆలయం చేరుకున్నారు వహీద్, బాల.

చాలా పురాతన ఆలయం, రెండు కొండల మధ్యలో వుంది. కొంతమంది సాధువులు మాత్రం ఉన్నారు. గర్భగుడిలో లింగాకారంలో ఆయన గంభీరంగా ఉన్నాడు. దీపారాధన దేనితో చేసారో కానీ.. ఆలయం అంతా సువాసన నిండి వుంది.

"ఏం నాయనా.. మీ దగ్గర మార్గమధ్యలో సర్వం దోచుకున్నట్టు ఉన్నారు" అడిగాడు ఒక సాధువు.

***

# PART 31

"మీకు ఎలా తెలుసు?" అన్నాడు బాల.

సాధువు నవ్వి, "మీ ముఖానికి ఉన్న నామాలు" అన్నాడు.

ఇద్దరూ ఒకరి మొహం ఒకరు చూసుకున్నారు.

"అవును నిజమే, అవి ఇంతకు ముందు పట్టించుకోలేదు. మాకు తెలీకుండా ఎవరు పెట్టారు స్వామి..?" అన్నాడు.

"అంగుష్టులు అనే మరుగుజ్జులు" అన్నాడు స్వామి.

"మరి వారు మాకు కనిపించలేదు" అన్నాడు బాల.

"వారు మానవులకి అంత సులువుగా కనిపించరు. మెరుపు వేగంతో ప్రయాణిస్తారు" అన్నాడు స్వామి.

"అవును, మేము తెచ్చిన సామాను, మా చేతిలో పుస్తకం పోయినప్పుడు.. మెరుపులు మెరిసి కళ్ళు మూసుకున్నాం. కళ్ళు తెరిచే సరికి అంతా మాయం అయిపోయింది" అన్నాడు వహీద్.

"ఎవరి చేతిలోని పుస్తకం, అందులో ఏముంది?" అన్నాడు స్వామి.

"నా చేతిలోనే, అదొక మ్యాప్ కలిగిన పుస్తకం" అన్నాడు.

స్వామి మౌనంగా చూసాడు.

"ఏమైంది స్వామి? మేము ఆ మరుగుజ్జులని ఎలా కలవగలం? ఆ పుస్తకం చాలా విలువైంది" అన్నాడు బాల.

"మరుగుజ్జులు కేవలం ఇక్కడకి నిధి కోసం వచ్చే వారిని మాత్రమే అడ్డుకుంటారు. వారికి నామాలు పెట్టి మా వద్దకు పంపుతారు. మేము విషయం చెప్పి వారిని తిరిగి పంపుతాం" అన్నాడు స్వామి.

"అయితే నిధి కోసం చాలా మంది వస్తారా?" అన్నాడు బాల.

"లేదు, గత పదేళ్ళుగా ఎవరూ రాలేదు. అంతకు ముందు వచ్చిన వాళ్ళు ఎక్కడో వాళ్ళు విన్న కథల ఆధారంగా వచ్చారు. మా మాట కాదని ముందుకు వెళ్ళిన వాళ్ళు తిరిగి రాలేదు. విని తిరిగి వెళ్ళిన వాళ్ళు బ్రతికి పోయారు. ఇన్నాళ్ళకు మరలా మీరు వచ్చారు" అన్నాడు స్వామి.

"అంటే ఇప్పుడు మేము తిరిగి వెళ్ళిపోవాలా?" అన్నాడు బాల.

"మీ ఇష్టం నాయనా, నేను చెప్పాల్సింది చెప్పాను. తరువాత మీ ఇష్టం" అన్నాడు స్వామి.

"ఈ పురాణం అంతా వదిలి, ఆ మరుగుజ్జులు ఎక్కడుంటారో చెప్పు" అన్నాడు వహీద్.

"నాకు తెలీదు, వాళ్ళు ఎవరికీ కనిపించరు. నాకు వాళ్ళకు ఉన్న ఒకే ఒక సాపత్యం.. ఆ శివలింగార్చన. ఉదయం మేము వచ్చే సరికే వాళ్ళు వచ్చి అభిషేకం చేసి వెళ్ళిపోతారు" అన్నాడు స్వామి.

"అయితే తెల్లవారు జాము వరకు కాపు కాస్తే వాళ్ళు దొరుకుతారు. ఒకోక్కడ్ని పట్టి పిండి చేసైనా నాది నేను దక్కించుకుంటాను" అన్నాడు వహీద్.

స్వామి మందహాసం చేసాడు.

"వద్దు నాయనా.. రౌద్రం తగదు. వాళ్ళు ఎవరికీ హాని తలపెట్టరు. సాదు జీవులు, వారితో తగాదా సబబు కాదు" అన్నాడు స్వామి.

"మా వస్తువులు, పుస్తకాలు లాక్కుని పారి పోయే వాళ్ళు.. సాదు జీవులు ఎలా అవుతారు? అన్నాడు బాల.

"అది మీ మంచికే, మీ ప్రాణాలు కాపాడుకోడానికే వాళ్ళు అలా సహాయం చేస్తారు. మీ వస్తువులు మీకు కావాలంటే నిజమైన సంకల్పంతో వెనుతిరగండి. అన్నీ తిరిగి తీసుకు వస్తారు" అన్నాడు స్వామి.

"ఈ సోది మాకు అవసరం లేదు. మేము వాళ్ళని పట్టి తీరుతాం" అన్నాడు వహీద్.

"సర్వం శివాజ్ఞ! ఒక్క విషయం.. మరుగుజ్జులు మనుషుల వస్తువులు పట్టుకుని వెళ్తారు కానీ, వారి చేతిలోవి ఏవి ముట్టరు" అన్నాడు స్వామి.

"అదేంటి? మా చేతిలో పుస్తకం లాక్కెళ్ళారు" అన్నాడు బాల.

"అందుకే నేను భయపడుతున్నాను" అన్నాడు స్వామి.

"ఎందుకు భయం?" అన్నాడు వహీద్.

"వద్దు లెండి. మీరు మీకు నచ్చినట్టు చెయ్యండి" అన్నాడు స్వామి.

"లేదు, చెప్పాల్సిందే.." పట్టుబట్టాడు వహీద్.

"కేవలం, మరణానికి అతి దగ్గర ఉన్న వారిని మాత్రమే వారు తాకుతారు" అన్నాడు స్వామి.

"అంటే ఇప్పుడు మేము.. మేము.." నసిగాడు బాల.

"అంతా ఈశ్వరేచ్ఛ నాయనా!" అంటూ కదిలి వెళ్ళాడు స్వామి.

***

వినీష ఇంటి దగ్గర..

"ఓహో.. విశాల్ అంటే నువ్వా?" అన్నాడు శ్యామ్.

"అవునండి నమస్కారం" అన్నాడు విశాల్.

"వీధిలోనే కాకుండా ఇప్పుడు డైరెక్ట్ గా ఇంటికే వచ్చేసావా?" అని కోపంగా అన్నాడు శ్యామ్.

"క్షమించండి సర్, మీరు ఎందుకు కోపడుతున్నారో నాకు అర్థం కావడం లేదు" అన్నాడు విశాల్.

"ప్రేమ.. దోమా! అని మా పిల్ల చుట్టూ తిరగడానికి సిగ్గు వేయడం లేదా!" అన్నాడు శ్యామ్.

"నేను సిగ్గుపడే పని ఏమి చేయలేదు సర్. నేను, వినీష ట్యూషన్ మేట్స్" అన్నాడు విశాల్.

"చూపించిన తెలివి చాలు, మాకు విషయం మొత్తం తెలిసింది" అన్నాడు శ్యామ్.

ఇంతలో వినీష "అది కాదు నాన్న.." అని ఏదో చెప్ప బోయింది.

"నువ్వు నోరుమూసుకుని లోపలి వెళ్ళు" అన్నాడు శ్యామ్.

మెల్లగా వెళ్ళి చెల్లితో పాటు కర్టెన్ వెనుక పిల్లి లాగా ముఖం బయటికి పెట్టి చూస్తూ.. అంత గొడవలో కూడా 'నాన్నగారు ఒప్పుకుంటే బాగుండును అనుకుంది' వినీష.

"సర్.. ఇందులో వినీషది ఏమి తప్పులేదు. ఆమెను ప్రేమించింది నేను కానీ, వెంటపడలేదు. ఇతర ప్రేమికులులాగా మేము సినిమాలకు, షికార్ లకు తిరగలేదు. మాకు ఒకరంటే ఒకరికి ఇష్టం అంతే" అన్నాడు.

"నా ముందు నుంచుని ఇలా చెప్పడానికి ఎంత ధైర్యం రా నీకు..?" అంటూ పైకి లేచాడు శ్యామ్.

"అది నా నిజాయితీ ఇచ్చిన ధైర్యం సర్! ఒక్కసారి కాదు వందసార్లు, ఇక్కడే కాదు ఎక్కడైనా ఇదే మాట ఎవరికైనా చెపుతాను" అన్నాడు.

వసుంధర.. శ్యామ్ ని వెనక్కి లాగింది.

విశాల్ ని "చూడు నాయన, కూర్చుని మాట్లాడుకుందాం కూర్చో.." అంది.

"వద్దండి, ఆయన ముందు కూర్చుని మాట్లాడే స్థోమత ఇంకా నాకు లేదు" అన్నాడు.

విశాల్ పైకి అరుస్తున్నాడు గాని శ్యామ్ కి విశాల్ నిజాయితీ, ధైర్యం నచ్చాయి. అవి బయటపడకుండా, "ఏం చేస్తూ ఉంటావ్?" అన్నాడు.

"నేను డిగ్రీ ఎగ్జామ్స్ రాసాను సర్. ఇప్పుడు పీజీ ఎంట్రన్స్ కి ప్రిపేర్ అవుతున్నాను. మా నాన్నగారు ఒక గవర్నమెంట్ ఉద్యోగి, నాకు పెళ్ళికావాల్సిన ఒక చెల్లి, మేమే ప్రాణంగా బతికే ఒక తల్లి ఉన్నారు" అన్నాడు విశాల్.

"ఎంత ఆస్తి వుంది?" అన్నాడు శ్యామ్.

"ఏమి లేదు సర్! ఉండేది అద్దె ఇల్లు. పెద్దగా స్థిరాస్తి ఏమి లేదు" అన్నాడు విశాల్.

"మరి ఏమిలేని వాడివి.. రేపు నా కూతురుని ఏమి పెట్టి పోషిస్తావు?" అని అడిగాడు శ్యామ్.

"ఇంకా పెళ్ళి వరకు ఆలోచించలేదు సర్, అందుకే మీకు చెప్పాలని రాలేదు. నిజంగానే ప్రసాదం ఇవ్వడానికి వచ్చాను. ఈ అనుకోని ఇంటర్వ్యూ నేను ఊహించలేదు" అన్నాడు విశాల్.

"ఏ కులం?" అడిగాడు శ్యామ్.

"మీకులం మాత్రం కాదు సర్ కానీ, నీతి నిజాయితీ ఉన్న కుటుంబం" అన్నాడు.

"రేపు పెళ్ళి చేస్తే.. ఆ నీతి నిజాయితీ నిన్ను పోషిస్తుందా? ప్రేమ తిని, కన్నీళ్ళు తాగుతారా?" ఒకింత వ్యంగ్యంగా అన్నాడు శ్యామ్.

విశాల్ ఏదో చెప్పాలనుకున్నాడు.

"చెప్పింది చాలు, ఇంకోక్కసారి మా ఇంటి దరిదాపులకు వచ్చినా.. నా కూతురు జోలికి వచ్చినా..! నిన్ను, నీ నీతి నిజాయితీ గల కుటుంబాన్ని.. పోలీస్ స్టేషన్ లో పెట్టించాల్సి ఉంటుంది. ఇంక బయలుదేరు" అన్నాడు శ్యామ్.

"ఒక్క నిమిషం నన్ను మాట్లాడనివ్వండి, తరువాత నేనే వెళ్ళిపోతాను" అన్నాడు విశాల్.

అసహనంగా చూసాడు శ్యామ్.

వినీష కన్నీటి తెరల చాటు నుండి విశాల్ ని చూసింది.

"సర్.. ప్రేమించడానికి నాకు ఇప్పుడున్న అర్హత సరి పోతుంది కానీ, పెళ్ళి చేసుకోవడానికి స్థోమత, తాహతు కావాలి. అవి ఇంకా నాకు లేవనే నేను పెళ్ళి గురించి మాట్లాడడానికి రాలేదు. మీరు నాకు ఉన్న అర్హతను విని, ఇంకా లేని స్థోమతని ప్రశ్నిస్తున్నారు. నేనేంటో నాకు ఫుల్ క్లారిటీ వుంది. మీకు మీరెంటో క్లారిటీ ఉందా!" అని అడిగాడు విశాల్.

సూదులు ల్లాంటి ఆ ప్రశ్నలు శ్యామ్ మనసుకు గుచ్చు కుంటున్నాయి.

"మీకు ఈరోజు ఆస్తిపాస్తులు, పెద్ద ఉద్యోగం వుండి ఉండవచ్చు. మీ ముందు తరానికి, ఆ ముందు తరానికి అవి ఉన్నాయి అని మీరు ప్రూవ్ చేయగలరా? చెయ్యలేరు, ఎందుకంటే ఆస్తి ఉన్న ప్రతివాడు.. తాను ఒక్కడే

ధనవంతుడు అని ఫీల్ అవుతాడు. ఇప్పుడు చెప్పండి, మీకు అడ్డం వచ్చిన కులం.. నేను ఆస్తి, ఉద్యోగం సంపాదిస్తే అడ్డు తొలగిపోతుందా?" అని అడిగాడు విశాల్.

విశాల్ వేసే ప్రతి ప్రశ్న ఆ గదిలో ఉన్న ప్రతి ఒక్కరికీ కరెంటు షాక్ లాగా తగులుతుంది.

"పెళ్ళి కోసం మాత్రమే మీ అనుమతి కావాలి. శివుడు తనలో తాను రమించినట్టు.. గుండెల్లో కట్టుకున్న గుడిలో వినీషని.. నేను ఎప్పుడైనా ఎక్కడైనా పూజించగలను. దానికి ప్రేమ అని పేరు పెట్టి నన్ను అడ్డగించలేరు. స్థోమత సంపాదించి మరలా వస్తా! తప్పుగా మాట్లాడి ఉంటే క్షమించండి. నాకు వ్యంగ్య ప్రయోగాలు రావు" అని అక్కడ నుంచి వెళ్ళిపోయాడు.

అలా అని వెళ్ళి పోతున్న విశాల్ ని రెప్ప ఆర్పకుండా చూసాడు శ్యామ్ సుందర్.

లోపల గదిలో హరీష గట్టిగా చప్పట్లు కొడుతూ, "అక్కా.. బావ అదుర్స్! ఏం చెప్పాడే బాబు.." అంటూ వినీషని కౌగిలించుకుంది.

***

# PART 32

చీకటి పడింది. గుడిలో నుండి దాదాపు అందరూ వెళ్ళిపోయారు. బాల, వహీద్ అక్కడే మెట్లు మీద కూర్చున్నారు. గుడిలో పెట్టిన దీపాలు, మిణుకు మిణుకు మంటున్న నక్షత్రాలు తప్ప ఇంక ఏమి కనిపించడం లేదు. కీచురాళ్ళ ధ్వని ఎక్కువైంది.

"అమావాస్య ఇంకా ఎన్ని రోజులుంది?" అన్నాడు వహీద్.

"ఇంకా పదమూడు రోజులు" అన్నాడు బాల.

"మన దగ్గర నుండి పారిపోయిన వెదవలు.. ఎవరికైనా నిధి గురించి చెపుతారంటావా?" అన్నాడు వహీద్.

"వాళ్ళకు తెలిస్తే కదా! వేరే వాళ్ళకి చెప్పడానికి?" అన్నాడు బాల.

"హా.. అదీ నిజమే! నేను చెప్పక పోవడం మంచిది అయ్యింది. ఉన్నది ఇద్దరమే.. చావో బతుకో మనమే తేల్చుకోవాలి" అన్నాడు వహీద్.

"నాకు కొంచెం వివరంగా చెపితే మంచిది" అన్నాడు బాల.

"ఆ విశాల్ గాడు ఇచ్చిన పేపర్ నువ్వు చదివావుగా.." అన్నాడు వహీద్.

"హా చదివాను కానీ, అందులో మొత్తం డీటెయిల్స్ లేవు. అది నీకు కూడా తెలుసు" అన్నాడు బాల.

"దాని ముందు తెల్లదొర.. నిధి డీటెయిల్స్ ఎలా సంపాదించాడో, ఇక్కడికి ఎలా వచ్చాడో..! ఇక్కడి నుండి దేగల దీవికి ఎలా వెళ్ళాలో వుంది" అన్నాడు వహీద్.

"ఓహో అంతే కదా! నీకు అన్నీ గుర్తు ఉన్నప్పుడు, ఇంక ఆ పుస్తకంతో పని ఏంటి?" అన్నాడు బాల.

"చాలా వుంది, వజ్రాలను చూస్తే కళ్ళు పోతాయి, దాని కోసం కళ్ళకు ఏదో రాయాలి. పట్టుకుంటే చేతులు కాలి పోతాయి, చేతులకు కూడా అదే రాసుకోవాలి. ఆ పేరు చాలా వింతగా వుంది, పుస్తకంలో ఉంది కాబట్టి ఈ అడివిలో ఉన్న ఎవరికైనా చెప్పి కనుక్కుందాం అనుకున్నాను" అన్నాడు వహీద్.

"ఇప్పుడు ఎలా?" అన్నాడు బాల.

"మనకి ఉన్నవి రెండు మార్గాలు. ఒకటి ఈ మరుగుజ్జులని పట్టి పుస్తకం సంపాదించడం, రెండు తిరిగి వెళ్ళి మన దగ్గర ఉన్న ఆ పుస్తకాన్ని.. ఆ విశాల్ గాడి సాయంతో మరల పూర్తిగా తర్జుమా చేయించడం" అన్నాడు వహీద్.

"వాడు మనకు ఎందుకు సాయం చేస్తాడు?" అన్నాడు బాల.

"అవును నిజమే చెయ్యడు కానీ, వాడి కున్న బలహీనత కుటుంబ సభ్యులో.. స్నేహితులో.. ఎవరో ఒకరు దొరుకుతారు" అన్నాడు వహీద్.

"కానీ, వాడు చాలా తెలివైన వాడు. మొత్తం కథ తెలిస్తే మనకు పోటీ వచ్చే ప్రమాదముంది" అన్నాడు బాల.

"హా తీసుకు వచ్చి అడివిలో ఫినిష్ చేద్దాం" అన్నాడు వహీద్.

కాసేపటికి..

"దాహంగా వుంది" అన్నాడు వహీద్.

"కోనేరు వుంది గుడి వెనుక వెళ్ళి తాగి వద్దాం" అన్నాడు బాల.

ఇద్దరూ కలిసి కోనేరు దగ్గరికి వెళ్ళారు.

పౌర్ణమి వెళ్ళి రెండు రోజులు అవ్వడం వల్ల.. చంద్రుడు మంచి కాంతివంతంగా ఉన్నాడు. కోనేరులో పడుతున్న నీలాకాశం నక్షత్రాల నీడ చూడడానికి ఆహ్లాదకరంగా వుంది. చల్లని గాలి వీస్తుంది.

నీరు తాగాక "స్నానం చేసి వారం అవుతుంది చేద్దామా!" అన్నాడు వహీద్.

"ఈ చలిలో స్నానం అవసరమా, ఏ దగ్గో.. జలుబో పట్టుకుంటే మరలా మనం వచ్చిన పని ఆగిపోతుంది" అన్నాడు బాల.

"ఏమి పర్లేదు, నాకు తోడుగా రా" అన్నాడు వహీద్.

చేసేది లేక నీటిలోకి దిగారు. హాయిగా వుంది.

"ఆ పుస్తకంలో అన్నీ సంపూర్ణంగా ఉన్నాయి అంటావా?" అన్నాడు బాల.

"హా అన్ని ఉన్నాయి, ఒక్కటి తప్ప!" అన్నాడు వహీద్.

"ఏంటది..?" అని కుతూహలంగా అడిగాడు బాల.

"వజ్రాలు ఏరడానికి వెళ్ళేటప్పుడు ఒక కాలు లేని వికలాంగుడిని తీసుకువెళ్ళాలి. అప్పుడు యక్షిణి జాలి పడి వదిలేస్తుంది" అన్నాడు వహీద్.

"అవునా.. మరి మనం ఎవరిని తీసుకు రాలేదు" అన్నాడు బాల.

వహీద్ వంకరగా ఒక నవ్వు నవ్వి, "తీసుకు రాకపోతే ఏమి? వచ్చిన వాళ్ళలోనే ఒకడికి కాలుపోతే.." అన్నాడు.

బాలకి అర్థం అయ్యింది.

"వహీద్ వద్దు, ఇది సరికాదు. నువ్వు ఒక్కడివే దీన్ని పూర్తి చేయలేవు" అన్నాడు బాల.

కోనేరులో ఉన్న సూది లాంటి ఒక రాయి తీసి బాల పిక్క పై పొడిచాడు వహీద్.

నీటిలో కాబట్టి అది లోతుకు దిగలేదు.

బాల వెనుతిరిగి పారిపోతుంటే.. వహీద్ వెంటపడ్డాడు.

నీటిలో పడిన రక్తపు వాసనకు ఒక్కసారి బయటకి వచ్చింది ప్రేత నాగు.

అప్పటికే బాల బయటకి పారిపోయాడు.

వెనక్కి తిరిగిన వహీద్ కి ప్రాణం పోయినంత పని అయ్యింది.

దాదాపు అరవై అడుగుల పాము.. వికృతమైన ముఖంతో.. కళ్ళు చింత నిప్పులుగా చేసి బుస కొడుతుంది.

వహీద్ భయంతో బిగుసుకు పోయాడు. చేతిలో ఉన్న రాయి దానిపై విసిరాడు. త్వరగా ఈదడానికి ప్రయత్నం చేసాడు. ఇంతలో వెనుక నుండి వచ్చి, వహీద్ కాళ్ళను పట్టి పైకి లాగింది.

ఇంక వహీద్ పని అయ్యిందని బయటకి పరిగెత్తాడు బాల.

తాను వెళ్ళి పోయారని చెప్పిన అనుచరులు ఎదురుపడ్డారు.

“వహీద్ చచ్చాడా!?” అని అడిగారు.

“హా.. నేను చంపలేదు. వాడి పాపమే వాడిని చంపింది” అన్నాడు బాల.

***

జరిగినది ఏంటి అంటే, మరుగుజ్జులు సామాను మాత్రం తీసుకెళ్ళారు. అదే అదనుగా బాల.. వహీద్ చేతిలో పుస్తకం గుంజు కున్నాడు. అక్కడే దాక్కుని ఉన్న మిగతా అనుచరులు సమయం కోసం ఎదురు చూస్తున్నారు.

వహీద్ దగ్గర అన్ని విషయాలు తెలుసుకుని వహీద్ ని చంపేయాలని బాల ప్లాన్.

అనుకున్నట్లే వహీద్ రహస్యం అంతా చెప్పేసాడు. కాగల కార్యం గంధర్వులు తీర్చి నట్టు, ప్రేతనాగు వాడి ప్రాణం తీసింది.

“బాల.. నిధి పుస్తకం ఎక్కడ?” అడిగాడు.

వారిలో ఒకడు.

అప్పుడు గుర్తు వచ్చింది బాలకి, తానూ అర్ధ నగ్నంగా ఉన్నానని. తిరిగి కోనేరు దగ్గరికి పరిగెత్తాడు. తన బట్టలు నీటిలో ఉండటం చూసి బయటకు తెచ్చాడు.

ప్రేత నాగు కానీ, వహీద్ కానీ ఎక్కడా కనిపించలేదు. కోనేరు ప్రశాంతంగా వుంది.

నిధి పుస్తకం నీళ్ళలో తడిచి, సిరా అంతా ఏకమయ్యి పాడై పోయింది.

“ఇప్పుడు ఏంటి మన మార్గం?” అన్నాడు వారిలో ఒకడు.

బాల సన్నని చిరునవ్వు ముఖంతో “విశాల్..! వాడే మన మార్గం” అన్నాడు.

***

# PART 33

“ఎవరీ విశాల్? అన్నాడు సహచరులలో ఒకడు.

“ఉన్నాడు ఒకడు. చాలా తెలివైనవాడు. వాడి లాంటి వాడు ఉంటే నిధిని చాల ఈజీగా పట్టుకెళ్ళగలం” అన్నాడు బాల.

“అది ఎంత పని, రెండు తగిలిస్తే వాడే వస్తాడు” అన్నాడు కేశవ అనబడే సహచరుడు.

“వాడు 20 ఏళ్ళ కుర్రోడు, కానీ 40 ఏళ్ళ తెలివితేటలు. వాడిని ఎలా ఒప్పించాలో ఆలోచించాలి” అన్నాడు బాల.

“ఇంక బయలుదేరుదామా..!” అన్నాడు కేశవ.

“లేదు, స్వామి చెప్పిన ప్రకారం మరుగుజ్జులు నాలుగు గంటల వేళ శివాభిషేకానికి వస్తారు. వాళ్ళ దగ్గర ఏదో మంత్రం వుంది. దానితో మెరుపులను సృష్టించి, చుట్టూ ఉన్న వారిని గుడ్డి వాళ్ళను చేస్తున్నారు. అదేంటో ఒకేసారి చూసి వెళ్దాం. ఇంకా నిధి గురించి వాళ్ళ దగ్గర ఉన్న సమాచారం సేకరిద్దాం” అన్నాడు బాల.

“ఒక్కటి మాత్రం నిజం, వాళ్ళు మనపై దాడి చేసినా..! లేక తిరగబడ్డా..! రాళ్ళతో మోది చంపేయండి” అన్నాడు బాల.

అందరూ చేతికి దొరికిన రాళ్ళు పోగు పెట్టారు. సమయం మూడు, అంతా మరుగుజ్జులు రాకకోసం ఎదురు చూస్తున్నారు.

***

అక్కడికి వంద గజాల దూరంలో పెద్ద దాల్చిన చెట్టు, దానికి ఉన్న బెరడు పెద్దవిగా ఉన్నాయి. వేకువజాము మూడు గంటలకు తలుపులు తెరుచుకున్నట్లు

చెట్టు బెరడు తెరుచుకుంది. మరుగుజ్జులు ఒక్కరి తరువాత ఒకరు బయటకు వచ్చారు.

అందరిలో నాయకుడిలా ఉన్న మరుగుజ్జు ఏదో సైగ చేసాడు. ఇరవై మంది కలిసి ఒక రైల్ లాంతరు వంటి వస్తువుని తీసుకు వచ్చారు.

"తేజో దీపానికి మొక్కండి" అన్నాడు నాయకుడు.

అందరూ, ఆ లాంతరుకు సాష్టాంగ నమస్కారం చేసారు.

***

కేశవ చెట్టు చాటు నుండి ఇదంతా చూస్తున్నాడు. లాంతరుని తీసుకెళ్ళి.. మనిషి చేతి ఆకారంలో ఉన్న ఒక వేరు మధ్యలో పెట్టారు. విచిత్రమైన ఒక శబ్దం మొదలుఅయ్యింది. పెద్ద శబ్దంతో ఒక మెరుపు, కేశవ కళ్ళు మూసుకున్నాడు.

మరుగుజ్జులు చేతిలో పూల దండలు ఉన్నాయి. అవి పోగుగా పెట్టి, లాంతరు వంక మరలా చూసారు. మరలా శబ్దంతో కూడిన మెరుపు, ఈసారి కేశవ కళ్ళు తెరిచే సరికి వారి చేతిలో దొన్నెలు నిండా నీరు వుంది.

కేశవ అడుగులో అడుగు వేస్తూ వెనక్కి వెళ్ళి బాలకి ఈ విషయం చెప్పాడు. అందరూ మరలా దాల్చిన చెట్టు దగ్గరకి వచ్చారు. చెట్ల చాటు నుండి చూసారు.

ఈ సారి మరల మెరుపు మెరిసింది. అందరి చేతిలో రకరకాల ఫలాలు.. అన్నీ చాల చిన్నవిగా ఉన్నాయి.

'ఓహో, ఇదన్నమాట ఈ మెరుపులకు కారణం, ఇది రెండే సెకండ్స్ టైమ్ లో ఎలాంటి పని అయినా పూర్తి చేస్తుంది' అనుకున్నాడు బాల.

మరుగుజ్జులు అందరూ, చేతిలో ఉన్న పళ్ళు పూలతో గుడి వైపు కదిలారు.

తేజో లాంతరు మాత్రం అక్కడే వదిలి వెళ్ళారు.

"వాళ్ళు గుడికి పూజ కోసం వెళ్ళారు. ఇదే మంచి సమయం, మనం ఈ లాంతరు పట్టుకు వెళ్ళడానికి" అన్నాడు బాల.

"అక్కడ ఒకడు కాపలా ఉన్నాడు" అన్నాడు కేశవ.

"ఆరంగుళాలు వాడు మననేమి చేస్తాడు? వాడిని కూడా పట్టుకెళ్దాం, ఎక్కడనైనా అమ్మితే బోళ్ళంత డబ్బు" అన్నాడు బాల.

"వీడీని ఎవరు కొంటారు?" అన్నాడు కేశవ.

"మరుగుజ్జుల దగ్గర మంచి వైద్య నైపుణ్యం ఉందని.. వీరు ప్రకృతికి, అడవిలోని జీవరాశులకు అనుసంధానమై ఉంటారని.. తెలుసుకున్న కొంతమంది సంపన్నులు, నిరంతరమూ వీరి కోసం గాలిస్తూ ఉంటారు. వీరి దగ్గర వెలకట్టలేని వనమూలికా సంపద ఉన్నదని వారి నమ్మకం" అన్నాడు బాల.

"చూడడానికి ఇది ఒక కాశీ మజిలీ కథలా వుంది" అన్నాడు కేశవ.

"హుష్.. మనం ఇంకా లేట్ చేస్తే వాళ్ళు గుడి నుండి వచ్చే ప్రమాదముంది" అని బాల చెప్పగానే.. అందరూ ముందుకి కదిలారు.

కాపలా ఉన్న మరగుజ్జు పరిగెత్తబోయాడు, కేశవ అమాంతం వాడిని పట్టుకుని ఒక బుట్ట లో వేసాడు. మరుగుజ్జు గిలాగిలా కొట్టుకుంటున్నాడు. వాడు గెడ్డం కలిగి అర్దనగ్నంగా. వింతగా ఉన్నాడు.

(కింద వీడియో చూడగలరు)

https://www.youtube.com/watchv=b1Z6ZBvPVuI

లాంతరు తీసుకుని, మరుగుజ్జుతో పాటుగా బాల వెనక్కి బయలుదేరాడు.

***

సరిగ్గా ఒకటిన్నర రోజు అయ్యింది విశాల్ ఏమైనా తిని. బెడ్ మీద పడుకుని ఏదో ఆలోచిస్తున్నాడు.

స్వప్న వచ్చి, "ఏమయిందిరా అన్నయ్యా, ఏదైనా తినరా?" అని అంది.

ఏమి జవాబు చెప్పలేదు విశాల్.

ప్లేట్ లో అన్నం కలిపి తీసుకొచ్చింది స్వప్న, "నా అన్న కదూ, ఒక్క ముద్ద.." అని బతిమాలుతుంది.

ఎప్పుడూ విసుకున్నట్లు విసుక్కోలేదు విశాల్, నోరు తెరిచి స్వప్న చేతి ముద్ద నోట్లో పెట్టుకున్నాడు.

'ఏంటీ బంధాలు..! నేను ఒక్క పూట తినకపోతే తల్లడిల్లె తల్లి చెల్లి, ఒకరికి కడుపున పుట్టినందుకు ప్రేమ! రెండోది తోబుట్టువు ప్రేమ. ఇన్ని ఇచ్చిన భగవంతుండు మనసా, వాచా, కర్మణా ప్రేమించిన అమ్మాయిని మాత్రం ఎందుకు దక్కనియ్యకుండా చేస్తున్నాడు?' అనుకున్నాడు విశాల్.

"అమ్మ ఎక్కడ?" అని అడిగాడు విశాల్.

అమ్మలా ఇంకో ముద్దా పెడుతూ "నీకోసం ఏదో తాయెత్తు తీసుకు వస్తా అని గుడికి వెళ్ళింది రా..!" అంది.

స్వప్న చెయ్యి పట్టుకుని బొటా బొటా ఏడ్చాడు.

స్వప్న కంగారుగా "నువ్వు ఏడిస్తే, నాకు ఏడుపొస్తుందిరా, ఏడువకురా! ఏమైంది?" అంది.

ఏం చెప్పగలడు? ఎలా చెప్పగలడు?

ఇంతలో విశాల్ నాన్న వచ్చారు.

ఎంతో సౌమ్యంగా, "ఏమయిందిరా!" అన్నారు.

ఆయన ప్రేమ.. విశాల్ ని ఇంకా బాధపడేలా చేసింది.

"ఏం లేదు నాన్న గారు..!" అన్నాడు విశాల్.

"ఏమి లేకపోతే, రెండు రోజుల నుండి రూమ్ లో ఎందుకు ఉంటావ్ రా? నాకు చెప్పు ఏదైనా చెయ్యగలనేమో చూస్తా" అన్నారు నాన్న.

"ఏమి లేదులెండి, ఎంట్రన్స్ ఎలా రాస్తానో అని కొద్దిగా భయం" అన్నాడు.

"జయాపజయాలు దైవాధీనం, నీ ప్రయత్నం నువ్వు చెయ్యి, ఫలితం భగవంతుడికి వదిలేయ్" అన్నారు నాన్న.

విశాల్ కి.. వినీష గుర్తు వస్తుంది. ఈరోజు తన పుట్టిన రోజు కలవడానికి కూడా వీలు లేని పరిస్థితి.

'నాకే ఇంత బాధ ఉంటే.. తను ఎంత బాధ పడుతుందో..! ఎక్కడో దేవలోకంలో.. దేవకన్య వైన నువ్వు నాకోసం పుట్టి, నా ప్రాణంలో ప్రాణం అయిపోయిన నీకు.. నీ తాహతుకి తగ్గట్టు ఏ బహుమతి ఇవ్వలేని ఒక పేద ప్రేమికుడు, మనసే మందారంగా, తనువే పారిజాతంగా మలచి నీకోసం చెపుతున్న పుష్ప సుగంధ చందన లేపన యుక్త జన్మదిన శుభాకాంక్షలు, తీసుకో నీకంకితమైన జీవతం.'

***

# PART 34

బాల అండ్ గ్యాంగ్ నల్లమల నుండి బయట పడి రోడ్ మీదకు వచ్చారు. బస్సు కానీ, జీప్ కానీ.. దొరుకుతుందేమో అని చూస్తూ అక్కడ ఉన్న టీ కొట్టుకు వెళ్ళారు.

"ఏం సర్.. టీ కావాలా?" అని అడిగాడు కొట్టులో ఉన్న వ్యక్తి.

ఇమ్మని సైగ చేసి "బస్సు ఏమైనా దొరుకుతుందా?" అని అడిగాడు బాల.

"సాయంత్రం ఒకటే బస్సు వుంది సర్" అన్నాడు టీ కొట్టు వ్యక్తి.

చేసేది లేక అక్కడే కూర్చున్నారు. అడవి అందులోను శీతాకాలం.. తొందరగా చీకటి పడింది.

బాల వాళ్ళ దగ్గర రెండు బాక్సులు ఉన్నాయి. ఒకదానిలో తేజో లాంతరు, మరొక దానిలో మరుగుజ్జు.

అప్పుడే నిద్ర లేచినట్టు ఉన్నాడు మరుగుజ్జు, లోపల నుండి బాక్స్ ని కొడుతున్నాడు.

ఆ సౌండ్ కి టీ కొట్టు వ్యక్తి ఏమిటన్నట్టు చూసాడు.

"ఏమిలేదు గురూ, అడివికోడి పారిపోద్ది అని అందులో పెట్టాం" అన్నాడు కేశవ.

దూరంగా బస్సు కనిపించింది. అప్పుడే లాంతరు పెట్టిన బాక్స్ నుండి వెలుగు వచ్చింది అది గ్రీన్ రంగులో ఉంది, కొన్ని క్షణాల వ్యవధిలో మరుగుజ్జు ఉన్న బాక్స్ రంగు ఎర్రగా మారింది.

బాల అండ్ గ్యాంగ్, టీ కొట్టు వ్యక్తి కళ్ళు అప్పగించి చూస్తున్నారు.

వెనుక నుండి ఏదో ఈల వేసినట్టు సౌండ్ వస్తే వెనుతిరిగి చూసారు. బాణాలతో వరుసగా నిలబడి ఉన్న మరుగుజ్జులు ఉన్నారు.

బాల ఏదో అనేలోపు 'స్స్స..' అని సౌండ్ చేస్తూ సూది సైజు లో ఉన్న ఒక బాణం బాల గొంతులో గుచ్చు కుంది.

బాల స్పృహ తప్పి కూలబడ్డాడు. అక్కడ ఉన్న వాళ్ళలో తేరుకున్న వాడు కేశవ ఒక్కడే.

బస్సు వచ్చి.. ఆగినట్టే ఆగి బయలు దేరింది.

చేతికి అందిన బాక్స్ తీసుకుని పరిగెట్టుకుంటూ వెళ్ళి బస్సు ఎక్కాడు కేశవ.

లోపలికి బాక్స్ విసిరి సర్దుకునే లోపు కాలిలో ఏదో దిగింది, బస్సులో స్పృహ తప్పి పడ్డాడు కేశవ.

బస్సు వేగం అందుకుంది. బస్సులో పెద్ద జనం లేకపోవడంతో కేశవని ఎవరూ పట్టించుకోలేదు.

బాల కూడా ఉన్న.. మరో ముగ్గురూ కిందపడ్డారు.

టీ కొట్టు వ్యక్తి తన సైకిల్ ఎక్కి పారిపోయాడు.

మరుగుజ్జులు వాళ్ళ చేతిలో ఉన్న ఏదో ద్రవం బాల మీద చల్లారు. అక్కడ ఉన్న పెట్టి తెరిచారు, లాంతరు కనిపించింది.

"నాయకా.. వాళ్ళు శౌంఠి ని పట్టుకెళ్ళారు" అన్నాడు మరుగుజ్జులో ఒకడు.

వీడిని బంధిస్తే శౌంఠి ఎక్కడ ఉన్నదో చెపుతాడు అని, నాయకుడు లాంతరు దగ్గరికి వెళ్ళి మోకరిల్లి ఏదో శబ్దం చేసాడు, పెద్ద మెరుపు వచ్చింది, బాలతో పాటు మరుగుజ్జులు అందరూ మాయం.

***

విశాల్ కనిపించి మూడు రోజులు అయ్యింది. మూర్తి ఊర్లోకి అప్పుడే దిగాడు, సరా సరి విశాల్ ఇంటికొచ్చాడు.

స్వప్న ఎదురైంది.

"ఎక్కడ వీడు" అన్నాడు మూర్తి.

"లోపల ఉన్నాడు అన్నయ్యా, మూడు రోజుల నుండి ఏంటోలా ఉన్నాడు. ఏమి తినడు, ఎవరితో మాట్లాడడు. కదిలిస్తే కళ్ళ నీళ్ళు, మాకు చాల భయం గా వుంది" అంది స్వప్న.

అది విని మూర్తి "లోపలి వెళ్ళి తట్టి లేపాడు.

"ఎవరూ.." అని తిరిగాడు విశాల్.

"నేను రా, ఏంటి సంగతి? వేషాలు వేసి ఇంట్లో వాళ్ళని భయ పెడుతున్నావా? లే బయటకు వెళ్దాం" అన్నాడు మూర్తి.

"హెల్త్ బాలేదు రా వదిలేయ్.." అన్నాడు విశాల్.

"నోరు మూసుకుని లే, కాఫీ తాగి వద్దాం" అన్నాడు మూర్తి.

ఎదురుగా ఉన్నది మూర్తి, వాడు చెప్పినా వినడు కాబట్టి, లేచి బట్టలు వేసుకుని.. మూర్తితో బయటకి వచ్చాడు.

"హమ్మయ్య..! మూర్తి అన్నయ్య ఒక్కడే రా నీకు మొగుడు" అంది స్వప్న.

సన్నగా నవ్వి బయటకు వెళ్ళారు.

***

ప్రియదర్శిని కాఫీ హోటల్ లో కూర్చున్నారు. పెద్దగా ఎవరూ లేరు.

"ఇప్పుడు చెప్పు ఏంటి సంగతి?" అన్నాడు మూర్తి.

"ఏమిలేదురా వదిలేయ్" అన్నాడు విశాల్.

"ఇదే నాకు కాలుతుంది, నువ్వు మూడు రోజులు తిండి తినలేదంటే.. ఏమి ఉండకుండా ఎలా ఉంటుంది చెప్పు?" అన్నాడు మూర్తి.

విశాల్ నవ్వి "నువ్వు ఊర్లో లేవని బెంగరా!" అన్నాడు.

"బెంగా, బొంగా.. మొహం చూడు. చెప్తావా..! వేడి వేడి కాఫీ మొహం మీద పోసెయ్యనా!?" అన్నాడు మూర్తి.

ఇంక చెప్పక తప్పదని, జరిగింది అంతా చెప్పాడు విశాల్.

మూర్తి ఊపిరి వేగంగా మారింది.

విశాల్ గట్టిగా చెయ్యి పట్టుకుని, "నీకో దండం రా బాబు! జరిగింది చాలు, ఇంకేం గొడవా వద్దు" అన్నాడు.

"అంటే ఎవడుబడితే వాడు నోటికి వచ్చింది అంటే ఊరుకుంటావా?" అన్నాడు మూర్తి.

"ఆడు ఈడు అనకురా..! ఎంతైనా పెద్దాయన, అందులోను వినీషకి ఫాదర్" అన్నాడు విశాల్.

"ఈ సెంటిమెంట్స్ కి ఏమి తక్కువ లేదు. సరే, నా దగ్గర ఒక ఐడియా వుంది" అన్నాడు మూర్తి.

'ఏంటది..' అన్నట్టు చూసాడు విశాల్.

"నా పేరు పైనా ఇరవై ఎకరాలు మాగాణి, పది ఎకరాలు కొబ్బరి తోట ఉన్నాయి, రేపే నీకు రాసేస్తాను. పేపర్స్ పట్టుకెళ్ళి చూపించు, పిల్లని ఎందుకివ్వరో చూద్దాం. కావాలంటే వెంకట్ బావని మాట్లాడడానికి పంపుదాం" అన్నాడు మూర్తి.

విశాల్ ఏం మాట్లాడలేదు.

"ఏరా ఏదో ఒకటి చెప్పు?" అన్నాడు మూర్తి.

"ఏం చెప్పానురా?" అన్నాడు విశాల్.

"ఏం అది సరిపోదు అంటే మా అమ్మ పేరు మీద బంగారం ఉండాలి, అది కూడా తెద్దాం" అన్నాడు మూర్తి.

విశాల్ మూర్తి రెండు చేతులు పట్టుకుని, "అంతకన్నా విలువైన నువ్వు నా దగ్గర ఉన్నావు. అవన్నీ ఎందుకురా?" అన్నాడు విశాల్.

"ఈ మాటలు ఏమైనా పనిచేస్తాయా! ఏదైనా అయ్యే పని చూడు" అన్నాడు మూర్తి.

"వద్దురా అక్కడ అర్హత, స్థాయి.. అని హీరో డైలోగ్స్ చెప్పి వచ్చాను. ఇప్పుడు ఇలా వేరే వాళ్ళ సొమ్ముతో వెళ్ళలేను" అన్నాడు విశాల్.

"అంటే నేను నీకు ముష్టి వేస్తున్నా అంటావా?" అన్నాడు మూర్తి.

విశాల్ మూర్తి నోరు మూసాడు.

"ఎప్పటికి కాదు, నువ్వే కాదురా.. నీ మనసూ బంగారమే! అసలు ఇటువంటి సాయం ఈ కలియుగంలో ఎవడైనా ఆఫర్ చేస్తాడా!? అలాంటిది నిన్ను తప్పు ఎలా పడతాను చెప్పు" అన్నాడు విశాల్.

మూర్తి కొద్దిగా మెత్తబడ్డాడు.

"నాకు తెలిసి ఆయన నా మీద కోప్పడినా.. నా వ్యక్తిత్వం ఆయనకు నచ్చిందని ఆయన కళ్ళని చూసి గమనించాను. ఇప్పుడు అది కోల్పోయి, వినీష ముందు కూడా దిగజారిన వాడిలా నిలబడలేను. ఇంకో దారి ఏదైనా చూడాలి" అన్నాడు విశాల్.

"సరే, వినీషని లేపుకెళ్ళి పెళ్ళి చేసుకో" అన్నాడు మూర్తి.

"ఒరేయ్.. ఇలా కమ్యునిస్టులా తయారయ్యావు ఏంట్రా? నాకు ఇంకా పెళ్ళి కావాల్సిన చెల్లి వుంది అనే మాట మర్చి పోయావా?" అన్నాడు విశాల్.

మూర్తి పెద్దగా నవ్వి "నీ ఇష్టం వచ్చిన పేరు పెట్టారా!" అని బిల్ కట్టి బయటకి వచ్చారు.

"వెళ్ళే ముందు ఒక్కమాట, నువ్వు పైకి కనిపించని సెన్సిటివ్ ఫెలోవి రా! ఈ ప్రేమ అంటూ మునిగి.. లేనిపోని అఘాయిత్యాలు చెయ్యవ్వు కదా" అన్నాడు మూర్తి.

ఆ మాటలకి విశాల్ కి కళ్ళ నీళ్ళు తిరిగాయి. "ఛీ.. ఛీ.. అదేం లేదురా! నేను లేకపోతే నా వినీష ఏమై పోతుంది?" అని కళ్ళు తుడుచుకుంటూ అన్నాడు విశాల్.

"ఇప్పుడు కూడా నేను గుర్తు రాలేదు" అన్నాడు మూర్తి

***

# PART 35

కళ్ళు తెరిచి చూసాడు బాల. చీకట్లో ఉన్నాడు. కదల బోయాడు, ఒక మర్రి చెట్టుకి కాళ్ళు కట్టి వేసి ఉన్నాయి. కొద్దిగా అతను ఇటు జరగడానికి ఆస్కారం వుంది. ఎదురుగా దుంపలు, పళ్ళు ఉన్నాయి. బాగా ఆకలి మీద ఉన్నాడు, వెంటనే వాటిని తీసుకుని తిన్నాడు. పక్కనే ఉన్న దొన్నెలోని నీళ్ళు తాగి, పైకి లేచాడు. కాళ్ళను గట్టిగా విదిలించాడు, కాలికి కట్టి ఉన్న వేర్లు ఇంకా బిగుసుకున్నాయి. అవి విడిపించుకోవడం అంత సులువు కాదని అర్థం అయ్యింది. మెల్లగా మర్రిచెట్టు ఊడపై కూర్చున్నాడు.

'అసలు వీళ్ళకి తాను ఎక్కడ ఉన్నానో ఎలా తెలిసింది? మిగతా వాళ్ళు ఏమయ్యారో..' అనుకున్నాడు.

చల్లగాలికి నిద్ర పట్టింది. హఠాత్తుగా చెవిలో ఎవరో "శౌంఠి ఎక్కడా?" అని అడిగారు.

కళ్ళు తెరిచి పక్కకి చూసాడు. ఆరు అంగుళాల మరుగుజ్జు ఒకడు భుజాలపై నుంచుని ఉన్నాడు. వాడిని పట్టుకుందాం అని చెయ్యి ఎత్తబోయాడు, చేతులు మొద్దుబారి ఉన్నాయి. చలనం లేదు. చేతిలో ఏవో ఆకులు మాత్రం కనపడ్డాయి. ఆ ఆకుల వల్ల తన చేతులు మొద్దుబారినాయి అని అర్థం చేసుకున్నాడు.

"శౌంఠి ఎక్కడా?" మరల అడిగాడు మరుగుజ్జు.

"వాడెవడు?" అన్నాడు బాల.

"మీరు తేజో ద్వీపంతో పాటు తీసుకు వెళ్ళిన మా మనిషి" అన్నాడు మరుగుజ్జు.

"నాకు తెలీదు, నేను ఎవరినీ తీసుకు వెళ్ళలేదు" అన్నాడు బాల.

"వీడు ఇలా అడిగితే చెప్పడు, ముక్కలుగా కోసి.. రోజుకో అవయవం చప్పున గద్దలకు వేద్దాం నాయక..!" అన్నాడు, కింద ఉన్న ఒక మరుగుజ్జు.

'వీడు నాయకుడు అన్నమాట' అనుకున్నాడు బాల.

"అందరికన్నా ఉన్నతమైన మానవ జన్మ ఎత్తి, ఎందుకు ఇలా అబద్ధాలు పలుకుతారు?" అన్నాడు నాయక.

"అవును మానవ జన్మ కాబట్టి, తిండి, బట్ట, గూడు మేము సంపాదించాలి. దాని కోసమే అబద్ధం చెప్పినా..! హత్య చేసినా..!" అన్నాడు బాల.

"మరి మీలో అందరూ ఇలాగే ఉన్నారా? ఎందుకు కొంతమందే ఇలా అత్యాశ కలిగి ఉన్నారు?" అన్నాడు నాయక.

"అవును అందరం ఒకేలా లేము, కొంతమంది పెత్తమదార్లు, కొందరు సామాన్యులు, ఇంకొందరు దరిద్రులు. దేముడే అందరినీ ఒకేలాగా పుట్టించనపుడు, పుట్టి ఒకేలా ఎలా ఉంటాం?" అన్నాడు బాల.

"నీ ప్రారబ్ధ కర్మ, సంచిత కర్మ! దానికి కారణం కాదా!" అడిగాడు నాయక.

"ఏమో అవి నాకు అర్థం కాని విషయాలు, నాకు తెలిసినది ఒక్కటే.. సొమ్ము ఉండే వాడే మొనగాడు, అదే లోకం తీరు" అన్నాడు బాల.

"ఇప్పటి వరకూ నేను ఎంతమంది మానవులనో చూసాను. అందులో మహనీయులని కూడా చూసాను కానీ, చూసిన దుర్మార్గులలో అందరిలోను ఒకటే లక్షణం, తప్పు చేసి దానిని సమర్థించుకోవడం. దీని వల్ల మరల ఎన్ని జన్మలు పాపం మోయాలో తెలుసా!" అన్నాడు నాయక.

"నీకు ముందే చెప్పాను. నాకు అవన్నీ తెలియవని" అన్నాడు బాల.

"సరే నీతో నాకు తర్కం అనవసరం. మా సహచరుడు శౌంఠి ఎక్కడ?" అన్నాడు నాయక.

"సరే చెపుతా కానీ.. నాకు దేగలకొండకి వెళ్ళే దారి ఎలాగో చెప్పు. అప్పుడు చెపుతా" అన్నాడు.

చేతిలో ఉన్న గంట లాంటి ఆయుధంతో బాల ముఖం పై ఒక్కటి కొట్టాడు నాయక.

"ఎన్నిసార్లు మీకు చెప్పాలనుకున్నా మీకు అర్థం కానిది, డేగలకొండ ఎంత ప్రమాదకరమో..! దాని నుండి తప్పించాలి అని మేము ప్రయత్నము చేసేది, మీ మేలు కోరి అయినా మీరు వినరు" అన్నాడు నాయిక.

"మా రక్షణ మేము చూసుకుంటాము, మీరు ఏమి రక్షించక్కరలేదు. అయినా మా కాలి కింది తొక్కితే నలిగేయిపోయే మీరు మమ్మల్ని ఏమి రక్షిస్తారు?" అని ఒకింత వ్యంగ్యంగా అన్నాడు బాల.

"చాలించు నీ వాచాలత్వం, మరి మమ్మలిని తొక్కి చంపగల నీకు ఈ గతి ఏంటి? మా ఆకారం సూక్ష్మం కావచ్చు, మా బుద్ది స్థూలం.." అని "పత్రీ.." అని పిలిచాడు నాయక.

కొంచెం పెద్దవాడిలా ఉన్న ఒక మరుగుజ్జు గుంపులో నుండి బయటకు వచ్చాడు. "నాయక.." అని వినయంగా అన్నాడు.

"వీడి మస్తిష్కం మధనం చేయండి. వచ్చిన సమాచారం నాకు చెప్పండి" అంటూ భుజం మీద నుండి దూకి వెళ్ళిపోయాడు నాయక.

పత్రి, మెల్లగా బాల తల పైకి ఎక్కి కూర్చున్నాడు. తలలోని వెంట్రుకలను పట్టి ఒక దాని తరువాత ఒకటి లాగుతూ.. ఒక క్రమంలో జుట్టు లాగ సాగాడు. చుట్టూ ఉన్న మరుగుజ్జులు ఏదో శబ్దాలు చేస్తూ, డప్పులు వంటి వాద్యాలు మోగిస్తున్నారు, ఒక్కసారి వాతావరణం బీతాహుతంగా మారింది.

https://youtu.be/pa2Ud9GBqKI

'ఇటువంటి వారి నుండి బయట పడాలంటే ఆ విశాల్ లాంటి వాడు ఉండాలి' అనుకున్నాడు బాల.

పత్రి చేస్తున్న క్రియ వాళ్ళ బాల నిద్రలోకి జారీ పోయాడు.

మస్తిష్క మధనం (బ్రెయిన్ స్ప్రింక్లింగ్ ) మొదలైంది.

***

మరుగుజ్జులు ఈ విద్యలో చాల అనుభవం కలిగి వుంటారు అని ప్రతీతి. ఇది మనం వేదాలలో, పురాణాల్లో చదివిన దివ్యదృష్టిలాంటి ఒక విద్య. ఆధునికులు దీనికే క్లైర్వాయెన్స్ (CLAIRVOYANCE) అని పేరు పెట్టారు. క్లైర్వాయెన్స్ అనేది ఎక్స్ ట్రాసెన్సరీ పర్సెప్షన్ (ESP) లేదా 'సిక్స్త్ సెన్స్' ద్వారా ఒక వ్యక్తి, వస్తువు, సంఘటన లేదా స్థానం గురించి సమాచారాన్ని పొందగల మానసిక సామర్థ్యాన్ని వివరించడానికి ఉపయోగించే పదం. 'క్లైర్వాయెన్స్' అనే పదం ఫ్రెంచ్ పదాలైన 'క్లైర్' (స్పష్టమైన) మరియు 'వాయెన్స్' (విజన్) నుండి ఉద్భవించింది, ఇది సాధారణ ఇంద్రియ సామర్థ్యాలకు మించి స్పష్టమైన దృష్టి లేదా అవగాహనను సూచిస్తుంది.

ఒక గంట గడిచాక, పత్రీ మెల్లగా దిగి వచ్చి "చిత్రక.." అని పిలిచాడు.

చేతిలో ఒక పొడవాటి బ్రెష్ వంటి పరికరం తో చిత్రకుడు వచ్చాడు. ఇంకొంతమంది జనం తామర ఆకులు వంటి ఆకులు తెచ్చారు.

పత్రి.. చిత్రకుడికి ఏదో చెప్పా సాగాడు, కొద్దీసేపటికి నాయక వచ్చాడు.

"ఏమైంది?" అన్నాడు.

మూడు ఆకులపై మూడు చిత్రాలు గీశాడు చిత్రకుడు. అందులో ఒకటి వజ్ర వైడూర్యాలు, రెండు మరుగుజ్జులు, మూడవది విశాల్ చిత్రం.

నాయక.. పత్రిని మెచ్చుకున్నాడు.

విశాల్ ని చూపించి "వాడి మెదడులో ఉన్నది వీడు.. కనుక వీడి దగ్గరే శౌంఠి వుండి ఉండాలి. వీడిని వెతికి తేజో దీపం సహాయంతో.. శౌంఠితో పాటు పట్టుకుని రండి" అన్నాడు

***

# PART 36

పత్రి విశాల్ చిత్రం ఉన్న ఆకుని తీసుకెళ్ళి, బాల ఎదురుగా పెట్టాడు.

అప్పుడే కళ్ళు తెరిచిన బాల, ఆ చిత్రం చూసి తుళ్ళిపడ్డాడు.

'వీళ్ళు నా బుర్రలో ఉన్న బొమ్మని కూడా చూడగలరా! ఏం విద్యలు రా ఇవి?' అనుకున్నాడు.

పత్రి చెవి దగ్గరికి వచ్చి, "వీడు ఎక్కడుంటాడో చెప్పు, లేకపోతే నిన్ను అడివి తేనెటీగలుకు ఆహరంగా వేస్తాం" అన్నాడు.

విశాల్ రావడం తనకి మంచిది కాబట్టి, లోపల సంతోషపడుతూ పైకి మాత్రం "వద్దు.. వద్దు.. చెపుతా" అన్నాడు.

విశాల్ వుండే ఊరు, పేరు చెప్పాడు.

పత్రి.. బాలకి అర్థం కానీ బాషలో ఏదో అరిచాడు.

నాయక కూడా బాల భుజాల పైకి వచ్చాడు. "వీడి ఇంటి దగ్గరలో ఏదైనా గుడి ఉందా!" అని అడిగాడు.

బాల ఒకసారి విశాల్ ఇల్లు ఎక్కడో గుర్తు చేసుకున్నాడు. విశాల్ ఇంటి ముందు ఒక పంచముఖ ఆంజనేయ స్వామి గుడి ఉన్నట్లు గుర్తు వుంది, అదే చెప్పాడు

నాయక గట్టిగ నవ్వి వాళ్ళ భాషలో ఏదో చెప్పాడు.

బాలకి తెలియని విషయం ఏంటి అంటే, తాను విశాల్ ది అనుకుంటున్న ఇల్లు సత్యమూర్తి ఇల్లు అని, ఇప్పుడు వీళ్ళు వెళ్ళడం వల్ల అక్కడ విశాల్ ఉండడు అని.

"నిన్ను ఒక విషయం అడగొచ్చా.?" అన్నాడు బాల.

నాయక వెను తిరిగి చూసాడు ఏంటి అన్నట్టు, “మేముండే పట్నం అంతా జనాలతోను, వాహనాలతోను నిండి ఉంటుంది. మీరు అక్కడకి వెళ్ళి విశాల్ ని తీసుకుని రావడం అసంభవం. కాదు కూడదు అని వెళితే రోడ్ మీద ఏ వాహనం కిందో పడి చనిపోయే అవకాశం వుంది” అన్నాడు బాల.

దానికి నాయక నవ్వాడు.

“మేము ఎప్పుడు చనిపోతామో మాకు తెలుసు. శౌంఠికి ఇంకా 1200 వందల ఏళ్ళు ఆయుష్షు వుంది” అన్నాడు.

“ఎంత..!” సరిగ్గా వినలేదనుకుని మళ్ళీ అడిగాడు బాల.

“వాడి వయస్సు ఇప్పుడు 800 ఏళ్ళు, అంగుష్టుల సగటు వయసు 2000 సంవత్సరాలు” అన్నాడు నాయక.

“అంటే నీకు ఇప్పుడు ఎన్ని ఏళ్ళు?” అన్నాడు బాల.

“నాకు 1900 దరిదాపు” అన్నాడు నాయిక.

“ఎవరిని వేదవలను చేస్తున్నావు?” అని పేలవంగా నవ్వుతూ అన్నాడు బాల.

నాయికకి కోపం వచ్చింది.

“మీలాంటి తుచ్ఛమైన మానవులకు తప్ప మాకు అసత్యము పలక వలసిన ఆవశ్యకత లేదు. నాకు దాదాపు వెయ్యి లోపు వయసు ఉన్నప్పుడు.. మేము మనుషులతో కలిసి ఉండేవాళ్ళం. మనిషి జాతి మెల్లగా మారసాగింది. స్వార్థం, అసత్యము, మోసం వంటి లక్షణాలు పెరిగి విచక్షణా రహితంగా మాకన్నా వారు అధికులమన్న గర్వం పెరిగింది. అంతకు ముందు మాకు సామంతులయిన వారు.. మా మీద దండెత్తి, మా ప్రజలను సైన్యాన్ని అగ్నికి ఆహుతి చేసారు. విశాలవంతమైన భవనాల్లో బ్రతికే మమ్మలిని ఈ అడవుల పాలు చేసారు. మా దగ్గర వుండే ఎంతో శక్తివంతమైన ఆయుధాలు దోచుకున్నారు. కాలక్రమేనా మా జాతి శక్తియుక్తులు సన్నగిల్లాయి. మాలో కొందరిని విదేశీయులు పట్టుకెళ్ళి బానిసలుగా, ఆట బొమ్మలుగా చేసేసారు. చివరికి రాత్రి పూట మాత్రమే సంచరించే నిశాచర జాతిగా మమ్మలిని మార్చి వేశారు” అని ఉద్వేగంతో చెప్పాడు నాయక.

బాలకి అతని మాటలలో నిజాయితీ కనిపించింది. "మీ దగ్గర ఇన్ని శక్తులు ఉన్నాయి. మీరు ఇప్పుడు తిరగబడలేరా?" అని అడిగాడు బాల.

"మేము సాత్మిక జీవులం, మా స్వీయ రక్షణకు తప్ప ఎవరికీ అపకారం తలపెట్టము. నేను ఒకప్పుడు రాజునే..! ఈరోజు ఈ అడివికి రాజుగా మిగిలాను" అన్నాడు నాయక.

పత్రీ ఒక పాత చిత్రపటం లాంటిది తీసుకువచ్చి అందించాడు.

"ఇది నా పట్టాభిషేకానికి చంద్రగుప్త మౌర్యులు వారు వచ్చినప్పుడు గీసిన పటం" అని బాల ఎదురుగా పరిచారు.

"ఆయన కుడి పాదం పక్కన ఉన్నది నేను. ఆయనతో మాకు ఎంతో అనుబంధం, నన్ను సొంత తమ్ముడివలే చూసేవారు. ఇప్పుడున్న మానవుల్లో అవన్నీ నాస్తి. ప్రతి క్షణం కేవలం ధనాపేక్ష" అన్నాడు నాయక.

"ఇక్కడ నిధిని సొంతం చేసుకుని మరలా ఇంద్ర భవనాల్లాంటి రాజ సౌధాలు కట్టుకోవచ్చుగా, కావాలంటే నేను దానికి మీకు సహాయం చేస్తాను" అన్నాడు బాల

"మాకు రాజసౌధాలపై ఎటువంటి ఆశాలేదు. ఇక నిధి అంటావా! దాని జోలికి వెళితే మరణం, అందుకే ఆ ధ్యాస ఉన్నవారిని ఎవరినైనా మేము బెదిరించి పంపివేస్తాం. మాకు తెలిసిన దల్లా, ఆ పశుపతినాధుని ఆరాధన, ఈ అడివిలో సుఖమైన జీవితం" అన్నాడు నాయిక.

ఇంకా ఏదో అనబోయాడు బాల.

"అప్రస్తుతం.. ముందు శౌంఠిని తీసుకుని రావాలి" అని కదిలి వెళ్ళాడు నాయిక.

***

బస్సులో ఉన్న కేశవకి మెలుకువ వచ్చేసరికి టౌన్ చేరుకుంది. కండక్టర్ వచ్చి, "ఏంటయ్యా బాబు? నువ్వు బతికున్నావో, పోయావో తెలీక రాత్రి నుండి టెన్షన్. మరీ అంత ఎక్కువ తాగాలా?" అన్నాడు.

'మరుగుజ్జులు కొట్టిన ముల్లుకి ఏదో రాసారన్న మాట.. అందుకే ఇలా స్పృహ తప్పింది' అనుకున్నాడు కేశవ.

చుట్టూ చూసాడు, తాను తీసుకు వచ్చిన బాక్స్ కనిపించలేదు, కండెక్టర్ ని అడిగాడు.

"ఏది.. ఆ ఎర్ర రంగు బాక్సా?" అన్నాడు కండక్టర్.

"అవును" అన్నాడు కేశవ.

"పొద్దున ఐదు గంటలకి సరిగ్గా అడివిలో లాస్ట్ స్టాప్ లో ఒకడు అది పట్టుకుని దిగాడు. అది నీదా!?" అన్నాడు కండక్టర్.

"అవునయ్యా బాబు, ఇప్పుడు ఎలాగా?" అన్నాడు కేశవ.

"నాకేం తెలుసు? నువ్వు తాగి పడుకుంటే. మేము నీ సామాను చూడాలా! సరి పోయింది. బస్సు కాంప్లెక్స్ కి వస్తుంది. టికెట్ డబ్బు లిచ్చి కిందకి దిగు" అన్నాడు కండక్టర్.

ఉసూరుమంటూ కూర్చున్నాడు కేశవ.

***

అక్కడ ఆ పెట్టె తీసుకుని కిందకు దిగిన దొంగ, ఆత్రంగా పెట్టె తెరిచాడు, లోపల ఉన్న శొంఠిని చూసి ఒక అడుగు బయటకి వేసాడు.

శొంఠి ఏవో శబ్దాలు చేస్తూ పెట్టెలో నుండి బయటికి ఉరికాడు. ఆ దెబ్బకి దొంగ భయపడి పరిగెత్తాడు.

చుట్టూ చూసాడు శొంఠి, ఎక్కడున్నాడో అర్థం కాలేదు. కనులు మూసుకుని పద్మాకారంలో చేతులు తిప్పుతూ ఏదో మంత్రం చదివాడు. అక్కడ ఉన్న చిన్న చిన్న రాళ్ళూ అన్ని కదిలి, త్రిభుజాకారంలో మార్గ సూచికగా మారి ఒక దిశను చూపించసాగాయి.

***

"ఒరేయ్.. అక్క, బావా వెళ్ళి చాల రోజులైంది, ఒకసారి బావా వాళ్ళ ఊరు వెళ్ళి వద్దాం" అన్నాడు మూర్తి.

"రేపు ఎంట్రన్స్ ఎక్సమ్ అవ్వగానే వెళ్దాం" అన్నాడు విశాల్.

అనుకున్నట్లే.. పరీక్ష అయ్యేక వెంకట్ ఊరికి బయలుదేరారు. వెంకట్ ఊరు నల్లమలని ఆనుకుని వుండే ఒక పల్లెటూరు. టౌన్ నుండి మూడు గంటలు ప్రయాణం, కొద్దిగా అడివిలో కూడా ప్రయాణం చెయ్యాలి. జంతువులు వుండే ప్రదేశం కాబట్టి, రాత్రి 9 నుండి ఉదయం 6 వరకు ప్రవేశం నిషిద్ధం. సాయంత్రం ఐదు అవ్వొస్తుంది. అడివిలోకి ఎంటర్ అయ్యారు విశాల్, మూర్తి. అదే బాటలో ముందుకు వెళుతున్నాడు శౌంఠి.

ఏవో శబ్దాలు వినపడుతున్నాయి, దూరంగా వెనుతిరిగి చూసాడు శౌంఠి, విచిత్రమైన వేషధారణలో ఉన్న మనుషులు వింత వాహనాలపై వస్తున్నారు. దూరం నుండి శౌంఠిని చూసి అందులో ఉన్న మొదటి వాహనం గట్టిగా బ్రేక్ కొట్టాడు, వెనక ఉన్న వాళ్ళు ముందు వాహనాన్ని గుద్దుకుని కింద పడ్డారు. అయితే అందరికన్నా వెనుక ఉన్న వాహనం, మాత్రం శౌంఠి వైపు దూసుకుని వచ్చింది.

శౌంఠి పరిగెడుతున్నాడు, వెనుకాల వాహనం తరుముతుంది.

https://youtu.be/5TGhLWf5W3s

***

# PART 37

శొంఠి పరిగడుతున్నాడు, వెనుకాల ద్విచక్ర వాహనం తరుముతుంది. ఇంక లాభం లేదని పక్కన ఉన్న పొదల్లోకి దూకాడు. వెనుక ఉన్న నలుగురూ.. వాహనాలు వదిలి రాళ్ళూ, కర్రలు ఆ పొదలపైకి విసురుతూ పరిగెత్తారు కానీ, వారికి దొరకలేదు. పొదలకి అవతలి వైపు ఉన్న రోడ్ పైకి మూర్తి విశాల్ అదే సమయానికి చేరుకున్నారు. శొంఠి వెనుకకు చూస్తూ పరిగెత్తడంలో మూర్తి వాహనాన్ని చూడకుండ పరిగెత్తాడు, శొంఠిని గుద్దుకుంటామని సడన్ బ్రేక్ వేసిన మూర్తి, విశాల్ బండి మీద నుండి కింద పడ్డారు. పెద్ద శబ్దంతో టూ వీలర్ రైజ్ అయ్యి, ఆగిపోయింది.

వెనుకాల నుండి వచ్చిన ఆనలుగురు, వీరి వంక అయోమయంగా చూసారు.

"ఇలా ఎవరైనా వచ్చారా?" అని అడిగాడు అందులో ఒకడు.

"హా ఎవరో రోడ్ క్రాస్ చేసారు. అది మనిషో, జంతువో..! అర్థం కాలేదు" అన్నాడు విశాల్.

"మేము అదే చూసాం, ఏదో వింత జీవిలా వుంది. పట్టుకుందామని వెంబడించాం కానీ, దొరకలేదు. ఎటు వెళ్ళింది?" అన్నాడు ఆ ఆగంతకుడు.

నేను సడన్ బ్రేక్ తో పడిపోయాను. ఆ జీవి ఎటువెళ్ళిందో నేను చూడలేదు" అన్నాడు విశాల్.

అటు ఇటు వెతికి వాళ్ళు వెళ్ళిపోయారు.

వాళ్ళు అటు వెళ్ళగానే మూర్తి "అది మన బండి ముందు చక్రానికి మడ్ గార్డ్ కి మధ్యలో దూరింది" అన్నాడు.

"తెలుసు వాళ్ళని చూస్తే నాకు చెప్పలనిపించలేదు. అందుకే చెప్పలేదు" అన్నాడు విశాల్.

బండిని నుంచో పెట్టి, ముందు చక్రానికి అటు ఇటు నుంచుని, ఒక పుల్లతో టైర్ లోపల కదిపారు. లోపల ఉన్న శౌంఠి ఒక్కసారిగా బయటకి దూకాడు.

పారిపోకుండా మూర్తి పట్టుకున్నాడు.

“వదులు నన్ను వదులు..” అన్నాడు శౌంఠి.

“మేము నిన్ను ఏమి చెయ్యం, చూడడానికి విచిత్రంగా ఉన్నావ్! అందుకునే పట్టుకున్నాం” అన్నాడు విశాల్.

“మీ మానవులని నమ్మ వద్దని, మా నాయక చాల సార్లు చెప్పాడు” అన్నాడు శౌంఠి.

“మీ నాయక ఎవరో గాని చెడ్డ మనుషులను చూసి ఉంటాడు కానీ, మాలో కూడా మంచి వాళ్ళు ఉన్నారు. లేకపోతే ఇందాక నిన్ను తరిమిన వాళ్ళకు నిన్ను అప్పచెప్పి ఉండే వాళ్ళం” అన్నాడు విశాల్.

వాళ్ళ మాటల్లో శౌంఠికి కొద్దిగా నిజాయితీ కనిపించింది.

“నువ్వు ఎక్కడి నుండి వచ్చావ్? వాళ్ళు ఎందుకు తరుముతున్నారు?” అని అడిగాడు విశాల్.

“నాకు మాట్లాడే శక్తి లేదు, అలసి పోయాను” అని కింద కూలబడుతూ అన్నాడు శౌంఠి.

“పళ్ళు ఉన్నాయి తింటావా?” అంటూ డిక్కీలో పెట్టిన అరటి పండు తీసి శౌంఠి ముందు పెట్టాడు విశాల్.

“వాజిపండు..” అంటూ దాని పై పడ్డాడు శౌంఠి.

అది కొద్దగా పెద్దది అవ్వడం వల్ల దాని పైన కూర్చుని తింటున్న వాడిని చూసి, “గమ్మత్తుగా ఉన్నాడు” అన్నాడు మూర్తి.

“ఇప్పుడు చెప్పు?” అన్నాడు విశాల్.

తన గురించి అంతా చెప్పి.. ఎక్కడ ఉంటాడో చెప్పి, బాల వాళ్ళు తీసుకొచ్చిన విషయం మాత్రం దాటేశాడు శౌంఠి.

“మీరు వుండే ప్రదేశము ఏంటి?” అడిగాడు విశాల్.

"నల్లమల పశుపతినాధ ఆలయం, దానికి పోయే దారి మీకు తెలుసా?" అన్నాడు.

"నల్లమల ఎక్కడో తెలుసు కానీ, పశుపతినాధ ఆలయం ఎప్పుడూ వినలేదు" అన్నాడు మూర్తి.

"పోనీ శ్రీశైలం ద్వారకాపురము!" అన్నాడు శౌంఠి.

"శ్రీశైలం ద్వారకాపురమా!?" అన్నాడు విశాల్.

"హ.. శ్రీశైలం! అసలు పేరు శ్రీశైలం ద్వారకాపురము. కాలక్రమేనా శ్రీశైలం అయ్యింది" అని శౌంఠి వంక చూసి నాకు తెలుసు అన్నాడు మూర్తి.

"ఎంత దూరం?" అడిగాడు శౌంఠి.

"నూట ముప్పై నుండి నూట నలబై కిలోమీటర్స్ వరకు ఉంటుంది" అన్నాడు విశాల్.

"అంటే ఏంటి..?" అన్నట్లు చూసాడు శౌంఠి.

"ఒరేయ్.. వాడికి మీటర్స్, కిలోమీటర్స్ తెలియవు" అని ఏదో లెక్క వేసి, "దాదాపు దక్షిణంగా.. ఈ అడివిలో పది యోజనాలు" అన్నాడు మూర్తి.

"అంటే ఏంటిరా?" అన్నాడు విశాల్

"యోజన అనే పదాన్ని దూరం యొక్క యూనిట్‌గా ఉపయోగిస్తారు. ముఖ్యంగా చారిత్రక మరియు సాంప్రదాయ సందర్భాలలో, యోజన అనేది దూరాన్ని కొలిచే పురాతన భారతీయ యూనిట్, మరియు దాని విలువ చారిత్రక రికార్డులు మరియు ప్రాంతీయ వైవిధ్యాల ఆధారంగా మారవచ్చు. కొన్ని గ్రంథాలలో, ఒక యోజన సుమారు 8–9 మైళ్ళు (సుమారు 13–14 కిలోమీటర్లు)కి సమానం అని చెప్పబడింది.

యోజనను ప్రామాణిక కొలత యూనిట్‌గా ఉపయోగించడం కాలక్రమేణా తగ్గిపోయిందని మరియు రోజు వారీ జీవితంలో దూరాన్ని కొలవడానికి కిలోమీటర్లు మరియు మైళ్ళ వంటి ఆధునిక యూనిట్‌లు ఎక్కువగా ఉపయోగించబడుతున్నాయని గమనించడం ముఖ్యం. అయినప్పటికీ, యోజన

అనే పదం ఇప్పటికీ తెలుగు భాషలోని ప్రాచీన గ్రంథాలు, సాహిత్యం మరియు చారిత్రక చర్చలలో చూడవచ్చు" అన్నాడు మూర్తి.

ఇలా మాట్లాడుకుని కిందకు చూసే సరికి శొంఠి కనిపించలేదు. దూరంగా పారిపోతూ కనిపించాడు. వాడి పరుగు చూసి నవ్వుకుని తమ దారిన తాము బయలు దేరారు.

"ఏంటిరా.. మన జీవితం ఇలా ఫిక్షన్ లా తయారయ్యింది?" అన్నాడు విశాల్.

"అంత ఫిక్షన్ లోనూ ట్రెడిషనల్ లవ్ స్టోరీ కూడా వుంది కదా!" అన్నాడు మూర్తి.

"నోరుమూసుకుని తొందరగా పద" అన్నాడు విశాల్.

వెళ్ళిపోయాడనుకున్న శొంఠి మరల తిరిగి వచ్చి మిగిలిన అరిటి పండు తీసుకున్నాడు. దూరంగా వెళ్ళిపోతున్న మూర్తిని, విశాల్ ని చూసి తనలో తానే 'మంచి మానవులు' అనుకున్నాడు.

పది యోజనాలకు ఎంత సమయం పడుతుందో లెక్క కట్టి చూసుకున్నాడు. 'రోజుకి ఒక యోజనమైనా..! దాదాపు పది రోజులు పడుతుంది' అనుకుంటూ దక్షిణానికి బయలుదేరాడు.

***

# PART 38

విశాల్ కలిసి వెళ్ళినప్పటి నుండి శ్యామ్ సుందర్ మనసు మనసులో లేదు. ఏదో తెలియని డిస్టర్బన్స్, ఆఫీస్ కి లీవ్ పెట్టి ఇంట్లోనే ఉన్నారు.

వినీష ఎక్కడికి వెళ్ళినా, తాను తీసుకెళ్ళి తీసుకు వస్తున్నారు.

"ఇలా ఎన్నాళ్ళు..?" చేతికి కాఫీ కప్ ఇస్తూ అడిగింది వసుంధర.

'ఏంటి..?' అన్నట్లు చూసాడు శ్యామ్.

"అదే, దానికి కాపలా కాస్తూ ఎన్నాళ్ళు..?" అంది.

"దానికి పెళ్ళి చేసే వరకు" అన్నాడు శ్యామ్.

"సరిపోయింది, ఉద్యోగానికి సెలవు పెట్టి మీరు చేసే పని ఇదా!" అంది వసుంధర.

"మరి ఏం చేయమంటావ్? అన్నాడు శ్యామ్.

"మాఘమాసంలో మంచి ముహుర్తాలు ఉన్నాయని, ఈశ్వర్ వాళ్ళ తండ్రి గారు మరలా ఫోన్ చేసారు. ఒక్కసారి మీరు వెళ్ళి మాట్లాడితే బాగుంటుంది. ఎంతైనా మగపెళ్ళి వారు కదా!" అంది వసుంధర.

"వినీషకి ఇష్టమేనా?" అన్నాడు శ్యామ్.

"దాని మొహం, దానికి మంచి చెడు ఏమి తెలుసు? ఇంకా చిన్న పిల్ల! మనం ఏది చేస్తే అదే దానికి మంచి" అంది వసుంధర.

"నువ్వు పొరబడుతున్నావ్, ఇప్పటి వరకు తనకు ఏం కావాలో అడిగి తెలుసుకుని తన ఇష్ట ప్రకారం చదివించి, జీవితంలో పెళ్ళి అనే అసలైన నిర్ణయం దానిని అడగకుండా ఎలా తీసుకుంటాం?" అన్నాడు శ్యామ్

"అయితే ఎం చేస్తారు, అది ప్రేమించిందని.. కులం తక్కువ వాడికి ఇచ్చి పెళ్ళి చేస్తారా?" అని కోపంగా అడిగింది వసుంధర.

"రోజులు మారుతున్నాయి, ఈశ్వర్ దాని మెడలో తాళికట్టడానికి చోటు ఉంటుంది కానీ, దాని మదిలో మేడ కట్టడానికి చోటు దొరుకుతుందా? మనం పడమటికి వాలిపోయే సంధ్యలో ఉన్నాం. వాళ్ళు ఇప్పుడే పొద్దుకు వస్తున్నారు, మన అహం కోసం దాన్ని బలి చేయడం ఎంత వరకు సమంజసం?" అన్నాడు శ్యామ్.

ఆ మాటలు విన్న వసుంధర, "అయ్యో.. మీకు ఏదో అయ్యింది. మడిబట్ట తడి ఆరకుండా సాదాన్ని ఆరగించే మీరు, ఇలా అభ్యుదయ వాదం చేయడం ఏం బాలేదు. పిల్లని ఇచ్చేటప్పుడు దాని మనసు ఒకటే కాదు.. ఎదుటివాడి జేబు, డాబు కూడా చూడాలి. వాడి దగ్గర ఏమి లేదు, పైగా వాడి మాటలు బట్టి పొగరుబోతులా ఉన్నాడు. కన్నారావు కూడా వాడు ఒక జులాయి వెధవని చెపుతున్నాడు" అంది వసుంధర.

శ్యామ్ మాట్లాడలేదు.

"మీ వాలకం చూస్తే కొంప ముంచేలా ఉన్నారు" అంటూ గది లోపలి వెళ్ళి ఫోన్ డయల్ చెయ్యసాగింది వసుంధర.

గోడ చాటు నుండి అన్నీ వింటున్న వినీషకి తండ్రి పట్ల గౌరవం ఇంకా పెరిగి పోయింది. కళ్ళుమూసుకుని గుర్తు వచ్చిన దేముళ్ళని అందరిని తలుచుకుని.. ఎలాగైనా తల్లి మనసు మారాలని వేడుకుంది.

వెనుక నుండి వచ్చిన హరీష "నీ సంకల్పం గట్టిదే! నాన్న గారిలో చాల మార్పు వచ్చింది" అంది.

మనసు నవ్వుతుంది, గుండె భయపడుతుంది. మిళితమైపోయిన భావోద్వేగాలతో అలా మంచం పై వాలిపోయింది వినీష.

***

ఆ రోజు పౌర్ణమి అడవి అంతా పుచ్చ పువ్వులాంటి వెన్నెల కాస్తుంది. బాలని మరుగుజ్జులు పట్టించుకోవడం మానేశారు. శంక తీర్చుకోడానికి అనువుగా

అతనికి కాలికి ఉన్న వేరులను సాగదీశారు. ఇప్పుడు మర్రిచెట్టు నుండి దాదాపు ఇరవై అడుగుల వ్యాసంలో బాల తిరగ గలుగుతున్నాడు. విచిత్రం ఏమిటంటే.. ఆ చెట్టు కిందకు ఒక్క జంతువుగాని పక్షిగాని రావడం లేదు.

మరుగుజ్జులు ఆ రోజు ఎందుకో హడావిడిగా ఉన్నారు. అందులో ఒకడిని "సంగతి ఏమిటి?" అని అడిగాడు.

"శౌంఠిని తీసుకు రావడానికి వెళుతున్నాం" అన్నాడు.

"ఈ రాత్రిలోనా..! ఎలా?" అన్నాడు బాల.

"తేజో ద్వీపం పట్టి.. శిఖర వ్యవస్థ ద్వారా" అన్నాడు మరుగుజ్జు.

"అంటే.." అడిగాడు బాల.

కొరకోరా ఒక చూపు చూసి అక్కడి నుండి వెళ్ళిపోయాడు ఆ మరుగుజ్జు.

కొంతసేపటికి నాయక కొంతమంది మరుగుజ్జులతో అక్కడికి వచ్చాడు. వాళ్ళకి మెడలో దండలు వేసి వాళ్ళ భాషలో ఏదో చెప్పాడు. తేజో ద్వీపం తీసుకుని అందరూ దేవాలయం వైపు కదిలారు.

పత్రి.. బాలకి దగ్గరా వచ్చి కూర్చున్నాడు. తేజో ద్వీపం మెరుపులు మెరిపించింది. ఆ మెరుపుల మధ్యలో ఒక నక్షత్రంలా మెరిసి మెరుపులు ఆగిపోయాయి.

నాయక వెనుకకి వచ్చాడు. "పత్రి.. వచ్చే అమావాస్య వరకు ఈ మానవుడిని కనిపెట్టి వుండు. శౌంఠి దొరికాడా సరి, లేని పక్షం వీడిని యక్షిణికి విందుగా వేద్దాం" అని వెళ్ళిపోయాడు.

బాలకి కొంచెం భయం అనిపించింది. పక్కకి తిరిగి చూసాడు. తలకి ఉన్న కిరీటం లాంటిది తీసి ఒక ఆకుపై పడుకుని ఉన్నాడు పత్రి.

"పత్రి.. పత్రి.." పిలిచాడు బాల.

"హా.. ఏంటి?" అన్నాడు పత్రి.

"నేను నీకు ఏమి కీడు చెయ్యలేదు కదా!" అన్నాడు బాల.

"హా అయితే.." అన్నాడు పత్రిక.

“మరి నీకు నాపై కోపం ఎందుకు? అన్నాడు బాల.

“నాకు కోపం ఏమిలేదు, మా నాయకుడు చెప్పాడు కాబట్టి నేను కాపలా కాస్తున్నాను” అన్నాడు పత్రి.

“సరే, నీకు నాకు ఇద్దరికీ సమయం గడిచేలా మనం విషయాలు పంచుకుందామా?” అన్నాడు బాల.

“హా చెప్పు” అన్నాడు పత్రి.

“ఐతే నేను ముందు అడుగుతాను” అన్నాడు బాల.

“అడుగు కానీ, అది నిధి గురించి ఐతే చర్చ నిషేధం” అన్నాడు పత్రి.

“నాకు నిధి గురించి ఏమి వద్దు, తేజో ద్వీపం బట్టి శిఖర వ్యవస్త అంటే ఏంటి? దానితో మా పట్నానికి మీ వాళ్ళు ఎలా వెళ్ళారు?” అన్నాడు బాల.

“అదా.. ప్రపంచంలో ఉన్న గోపురాలు ఒకొక్కటి ఒక ప్రత్యేక నక్షత్రమునకు అనుసంధానించబడి ఉంటాయి. దీనినే శిఖర వ్యవస్థ అంటారు. మేము మనుషుల దగ్గరికి, లేక వారి ఆవాసాలలోకి వెళ్ళంటే.. ఈ వ్యవస్థను వినియోగించి దగ్గరలో ఉన్న దేవాలయానికి చేరుకుంటాం. అందులో మాకు ఒక ప్రతేక బస ఉంటుంది. మనుషుల కళ్ళబడకుండా మా పని ముగించుకుని వెనుతిరుగుతాం. ఇలా ప్రయాణించడానికి మా తేజో ద్వీపం మాకు సహకరిస్తుంది” అన్నాడు పత్రి.

***

# PART 39

పత్రి చెప్పింది బాలకి అర్థం అయ్యినట్టే వుంది గాని కాలేదు కానీ, ఆలయాల గోపురాలు కలుపుతూ వీరు ప్రయాణ మార్గాలు ఎంచుకుంటున్నారని అర్థం అయ్యింది.

***

శ్యామ్ సుందర్ నిద్రలేచే సరికి, వసుంధర అన్నగారు, తన చెల్లెలి భర్త ఇంట్లో ఉన్నారు.

“ఏం బావ.. ఏంటి ఇలా వచ్చారు?” అన్నాడు శ్యామ్.

“హ నేనే రప్పించాను, వెళ్ళి స్నానం చేసి రండి, టిఫిన్ చేస్తూ మాట్లాడుదురు” అంది వసుంధర.

టిఫిన్ అయ్యాక “మా సూర్యానికి, తమ్ముడు కొడుకు చంద్రానికి.. మీ రెండో దాన్ని, మూడో దాన్ని ఇచ్చి చేస్తాం అని వాళ్ళు పుట్టినప్పుడే చెప్పారు కదా బావా!” అన్నాడు వసుంధర సోదరుడు.

“అవును, ఇప్పుడు మాత్రం ఏం మారిందని! వాళ్ళ చదువులు అవ్వగానే చేద్దాం” అన్నాడు శ్యామ్ సుందర్.

“మేమూ అదే అనుకున్నాం కానీ, మీరు పెద్ద దానికి వర్ణ సంకరం చేయడానికి పూనుకున్నట్లు మా చెల్లాయి చెప్పింది” అన్నాడు వసుంధర అన్నగారు శంకరం.

అప్పుడు అర్థం అయ్యింది వాళ్ళు ఎందుకు వచ్చారో..!

“ఈ రోజులలో కూడా ఇంకా ఈ పట్టింపులా బావా?” అన్నాడు శ్యామ్ సుందర్.

"శాఖ పట్టింపే ఇంకా పోలేదు. వర్ణ సంకరం ఎక్కడ చెయ్యాలి బావా? అయినా మారి పోతున్న మనుషులను బట్టి ఇవి ఇంకా ఎక్కువగా చూడాలని నా అభిప్రాయం" అన్నాడు శంకరం.

"అదే సమయంలో పిల్లల మనసు కూడా చూడాలి కదా!" అన్నాడు శ్యామ్.

"నిజమేనే చెల్లాయ్.. బావకి ఏదో అయ్యింది. అమావాస్య రోజు ఏమైనా తొక్కడా!?" అని వ్యంగ్యంగా అన్నాడు శంకరం.

"అది కాదు బావా.." అంటూ ఏదో చెప్పబోయాడు శ్యామ్.

"బావా.. నీమీద ఉన్న గౌరవంతో ఏమి అనలేకుండా ఉన్నాను. ఈ ఇంట్లో ఆడపిల్ల నా ఇంట్లోకి రావాలి అంటే, నువ్వు ఇలాంటి ఆలోచనలు మాను. కాదు కూడదు అంటావా..! వాళ్ళిద్దరికీ కూడా వర్ణ సంకరం చెయ్యి, మమ్మలిని మర్చిపో" అన్నాడు శంకరం.

"అన్నయ్య ఒక ముద్ద తిని వెలుదువు" అంది వసుంధర.

"వద్దులే.. అసలే కతికితే అతకదూ అంటారు. అసలే అతికలా ఇంకా కతకడం ఎందుకు? మేము బయలు దేరుతాం" అన్నాడు శంకరం.

శ్యామ్ సుందరం ఏదో తప్పు చేసిన వాడిలా నుంచుండి పోయాడు.

శంకరం, శేఖరం వెళ్ళి పోయారు.

లోపల నుండి ఇవన్నీ వింటున్న వినీష, నిశ్శబ్దంలో మునిగి ఆలోచనల వలలో చిక్కుకుంది.

'ఏంటీ ప్రపంచం, నేను కోరుకున్నది పొందడానికి ఇంతమంది అనుమతి కావాలా? అసలు విశాల్ తో నా పెళ్ళికి, నా చెల్లిల్ల పెళ్ళికి ఏంటీ సంబంధం? నాన్న గారు ఇంకొంచెం గట్టిగా మాట్లాడవల్సింది. ఒకసారి విశాల్ తో మాట్లాడితే బాగుంటుంది అనుకుంది.

'సంకల్పం చెయ్యి అదే జరిగిపోతుంది' అన్న హరీష మాటలు గుర్తుకు వచ్చాయి.

"నేను సూపర్ మార్కెట్ కి వెళుతున్నాను. నీకు ఏమైనా కావాలా?" అని అడిగిన మనీష వంక చూసి,

"నేను కూడా వస్తాను" అంటూ బయలుదేరింది వినీష.

మెట్లు దిగిన ఇద్దరికీ కన్నారావు కనిపించాడు.

"ఏంటి మార్కెట్ కా! నేను వస్తున్నా పదండి" అన్నాడు.

'నువ్వు ఎందుకు?' అన్నట్లు చూసారు.

"మీ అమ్మగారు మీకు తోడుగా వెళ్ళామన్నారు" అన్నాడు కన్నారావు.

పైన బాల్కనీలో ఉన్న తల్లి కనిపించింది. 'విశాల్ కి చెప్పి వీడికి ఇంకో కోటింగ్ ఇప్పించాలి' అని వినీష లోపల అనుకుంది.

సూపర్ మార్కెట్ విశాల్ ఇంటికి దగ్గర, అటువైపుగా వెళుతూ ఆ ఇంటి వైపే చూసింది.

కిటికీ నుండి లోపల కనపడుతున్నాడు విశాల్. కొత్త చిగురు వాసన కోకిలకి చెప్పనక్కర లేదేమో! విశాల్ కూడా వినీష వంక చూసాడు.

కన్నారావుని కళ్ళతో చూపించింది.

తాము సూపర్ మార్కెట్ కి వెళుతున్నాం అని చెప్పడానికి, "మీకు సూపర్ మార్కెట్ లో ఏం పని?" అంది మనీష కన్నారావుతో.. విశాల్ కి అర్థం అయ్యింది.

విశాల్ లోపలికి వెళ్ళి "అమ్మా బయట నుండి ఏమైనా తెవాలా?" అన్నాడు.

"హా.. కాఫీ పొడి అయిపోయింది తీసుకురా!" అంది అనంత.

గబాగబా బయటకి వెళ్ళాడు. సూపర్ మార్కెట్ కి రెండు డోర్స్, వినీష వెళ్ళిన వైపు కాకుండా రెండో వైపు వెళ్ళాడు.

కన్నారావు సీరియస్ గా టూత్ పేస్ట్ మీద ఉన్న ప్రోడక్ట్ ఇన్ఫర్మేషన్ అర్థం కాకపోయినా చదువుతున్నాడు.

విశాల్ వెళ్ళి లేడీస్ హెయిర్ పిన్స్ ప్యాక్ తీసి, వెనుక నుండి కన్నారావు బ్యాక్ పాకెట్ లో వేసాడు.

ఎదురుగా ఉన్న సూపర్ మార్కెట్ మేనేజర్ తెలిసిన వాడు కావడం వల్ల "ఏం కావాలి?" అని అడిగాడు.

ఎదురుగా వినీష మబ్బుల చాటు నుండి ముందుకి వచ్చిన జాబిల్లిలా కనపడుతుంది. మనసు ఆకాశం అంత అయ్యి ఆమెనే చూస్తున్నాడు విశాల్.

“ఏం కావాలి?” ఈ సారి కొద్దిగా విసుగ్గా అడిగాడు మేనేజర్.

విశాల్ వాళ్ళ అమ్మ ఏమి తెమ్మందో, మర్చిపోయాడు. “కందిపప్పు..” అన్నాడు.

విశాల్ తడబాటు చూసి వినీష నవ్వుకుంది.

ఈలోపు కన్నారావు వచ్చి (విశాల్ ని చూసాడు అనుకుంట) “అయ్యిందా ఇంక వెళ్దామా!” అన్నాడు.

బిల్ పే చేసి బయటకు వెళ్ళారు వినీష, మనీష అండ్ కన్నారావు.

మేనేజర్ ని దగ్గరకి పిలిచి, “సర్ వాడు లేడీస్ పిన్స్ పాకెట్ లో వేసుకున్నాడు. బిల్ పే చేశాడా?” అన్నాడు విశాల్.

“అవునా, వుండు..” అని కన్నారావుని వెనుకకి పిలిచాడు మేనేజర్.

రెండో డోర్ నుండి బయటకి వచ్చి వినీషతో “ఎలా ఉన్నావ్?” అన్నాడు.

“నువ్వు అనుకున్నట్టుగానే ఉన్నాను” అంది వినీష.

ఇంతలో మనీష కలగచేసుకుని “నేను లోపలి వెళ్ళి చూసి వస్తాను” అంటూ వెళ్ళింది.

“నిన్ను కలవాలి” ఇద్దరు ఒక్కసారే అన్నారు.

“సరే రేపు సాయంత్రం పంచముఖ ఆంజనేయ స్వామి గుడిలో కలుద్దాం” అన్నాడు.

ఈలోపు కన్నారావు ఏడుపుగొట్టు ముఖంతో బయటకి వచ్చాడు.

విశాల్ కనపడకుండా వెళ్ళాడు.

“కాఫీ పొడి తెమ్మంటే.. కందిపప్పు తెచ్చావు ఏంటి..?” అని తల్లి తిడుతుంటే,

‘నా దేవతని చూస్తూ మైమరిచి పోయాను’ అని చెప్పలేక తనలో తాను నవ్వుకున్నాడు.

***

# PART 40

ఆరోజు పౌర్ణమి.

మూర్తి ఇంటి దగ్గర ఉన్న పంచముఖ ఆంజనేయ స్వామి గుడిలో పౌర్ణమి పూజలు చేస్తున్నారు. ఆవు నేతి దీపాలతో, సుగంధ పరిమళాలతో గుడి కోలాహలంగా వుంది. చిన్నపిల్లలు గడ్డిలో పరిగెడుతూ ఆడుతున్నారు. కొంతమంది ప్రసాదం పంచుతున్నారు. గుడి గంట మోగుతూనే వుంది.

గుడి మెట్టు పై కూర్చుని వుంది వినీష. మయూర నీలం రంగు పట్టు పరికిణి, దాని పైకి లేత గులాబీ రంగు మాచింగ్ వేసుకుని, కాళ్ళకు పెట్టుకున్న పట్టీలను సరి చేసుకుంటుంది.

గుడిలోకి అప్పుడే వచ్చిన విశాల్.. వినీషని చూస్తూ అక్కడే ఉండిపోయాడు.

'బహుశా..! బ్రహ్మ దేముడు ఈ బొమ్మని మకరందంతో తయారు చేసినట్టు ఉన్నాడు' అనుకుని పైకి చూసి 'నీ ఋణం ఎలా తీర్చుకోవాలయ్యా?' అన్నాడు.

దూరం నుండి విశాల్ ని గమనిస్తున్న వినీష ముసిముసిగా నవ్వుకుంది.

విశాల్ వంక చూసి తన వైపు రావడం తల దించుకుంది.

తల దించుకుని కూర్చున్న వినీష, "నాన్నగారు అడగగానే గుడికి ఎలా ఒప్పుకున్నారో అర్థం కాలేదు, ఎందుకు ఏమిటి అని అడగకుండా అలా ఎలా పంపించారో..! ఎంత ఆలోచించినా అర్థం కావడం లేదు" అంది.

"అవును, నాకు ఆఫీస్ కి ఫోన్ చేసి సాయంత్రం చెప్పారు. మిమ్మల్ని ఇక్కడ కలవమని" అన్న ఆ గొంతు విని ఉలిక్కిపడి పైకి చూసింది.

ఎదురుగా ఉన్నది.. ఎదురుగ ఉన్నది.. విశాల్ కాదు ఈశ్వర్.

వినీషకి నోట మాట రావడం లేదు.

"ఈ డ్రెస్ లో మీరు చాలా బాగున్నారు" అన్నాడు ఈశ్వర్.

ఏమీ అనలేదు వినీష. ఈశ్వర్ గురించి తనకు ముందు నుండీ తెలుసు. వాళ్ళ కుటుంబం చాలా పెద్దది. వాళ్ళ నాన్నగారికి కూడా.. వాళ్ళు అవసరంలో చాలా హెల్ప్ చేసారు. ఈశ్వర్ చాలా బుద్ధిమంతుడు, మంచి మాటకారి. అన్నిటికన్నా.. చాలా సంస్కారి. అతను వినీషని పెళ్ళి చేసుకోవాలని అనుకుంటున్నట్లు.. అమ్మ వాళ్ళు చెపితే వినడమే కానీ, అతను ఎప్పుడూ తనతో మాట్లాడి ఎరుగడు.

అందుకే అతను మాటలుతుంటే మౌనంగా ఉండి పోయింది.

"ఇదిగో ఇది ఒకసారి పట్టుకో.." అని ఒక చిన్న చెక్క పెట్టె ఇచ్చి, "తెరిచి చూడు" అన్నాడు.

చూసింది. అందులో వజ్రాలు పొదిగిన బంగారు గొలుసు వుంది.

'ఇది నాకెందుకు?' అని చూసింది.

"ఇది మా అమ్మది, ఆవిడ ఇప్పుడు లేరు. తన చిన్న కోడలు.. అంటే నా భార్యకి ఇవ్వమని చెప్పింది. మిమ్మలిని నేను చిన్నప్పటి నుండి ఇష్టపడ్డాను. మీకు ఇష్టమైతే అది పెట్టుకోండి, లేకుంటే వద్దు. నేను లోపల దర్శనం చేసుకుని వస్తాను" అని గుడిలోకి కదిలాడు ఈశ్వర్.

వెళ్ళేవాడు వెనుతిరిగి "నాకు ఇప్పటి కుర్రాళ్ళ లాగ ప్రపోజ్ చేయడం రాదు. మనసులో ఏముందో మాటలోనూ అదే ఉంటుంది. మీకు ఇష్టం లేకుంటే నిరభ్యంతరంగా చెప్పవచ్చు" అని వెళ్ళాడు.

ఇంతలో చేతిలో గులాబీల గుచ్చంతో విశాల్ వచ్చాడు.

"ఎక్కడికి వెళ్ళిపోయావ్?" అంది వినీష.

చేతిలో గులాబీలు చూపించి, "ఇవిగో వీటికి నిన్ను చూపించి వాటి గర్వభంగం చేద్దామని" అని నవ్వాడు.

"ఈ మాటలకు ఏమి తక్కువలేదు" అంటూ జరిగిందంతా చెప్పింది.

***

తేజో దీపం ద్వారా గుడి పైన ఉన్న గోపురానికి చేరుకున్న మరుగుజ్జులు, గోపురం పైన ఉన్న శిఖరం కుందులు పై కూర్చుని గుడి అంతా చూస్తున్నారు. వారి పరిమాణం వల్ల గోపురంలో కలిసిపోయారు.

వాళ్ళు వచ్చిన కాసేపటికే, విశాల్ అనుకోకుండా అక్కడికి రావడం వాళ్ళకి చాలా ఆనందంగా వుంది.

అందులో చిన్నగా ఉన్నవాడు, "తేజో ద్వీపం తీసి కింద పెట్టాడు. అది మెల్లగా దాని పరిమాణం మార్చుకుని పెద్దది అయ్యింది. అందరు తలలు వంచి దానికి నమస్కారం చేసారు.

***

గుడిలో ఉన్న ఈశ్వర్ దర్శనం ముగించుకుని బయటకి వచ్చాడు. వినీష కనిపించలేదు అని వెతికాడు.

విశాల్ కోసం మూర్తి గుడి లోపలికి వచ్చాడు. తను ఎక్కడ ఉన్నడా అని వెతుకుతున్నాడు.

పూజారిగారు గుడిలో ఉన్న అందరికి ప్రసాదం పంచుతున్నాడు.

గుడి వెనుకకి వెళ్ళి వినీష చెపుతున్న విషయం అంతా విని, "మరి నువ్వు ఎందుకు ఇది తీసుకున్నావ్?" అన్నాడు విశాల్.

"ఏం చెయ్యను? నాకు మాట రావడం లేదు. ఏం చెప్పాలో అర్థం కాలేదు" అంది వినీష.

"ఐతే ఇంకేం, నీకు మంచి ఈడు జోడు.. చేసుకో మరి" అన్నాడు విశాల్.

తన చేతితో విశాల్ నోటిని మూసింది వినీష.

"ఇంకెప్పుడూ సరదాకి కూడా అటువంటి మాటలు అనకు" అంది వినీష.

అప్పటికే ఆమె కళ్ళు కన్నీళ్ళను తిప్పుతున్నాయి.

పారిజాతం సువాసన వస్తున్నా ఆమె చేయిని మెల్లగా దింపుతూ, "అదే మాట నేను అడిగితే ఏమని చెపుతావ్?" అన్నాడు విశాల్.

"ఇదిగో, ఇది నువ్వే నా మేడలో వెయ్యి" అంది.

విశాల్ గొలుసు తీసుకున్నాడు.

***

తేజో ద్వీపం వల్ల ఒకే సారి మెరుపులు, ఉరుములు రాసాగాయి.

కరెక్ట్ గా విశాల్ ఆ గొలుసు తీసుకునే సమయానికి.. ఈశ్వర్, మూర్తి, ప్రసాదం పంచుతున్న పంతులు చూసారు.

వాళ్ళు ముగ్గురూ పిలిచేలోపు విశాల్, వినీష.. ఒక పెద్ద మెరుపుతో ఒక్కసారిగా మాయం అయిపోయారు.

అక్కడున్న వారంతా అవాక్కయ్యారు. మూర్తి దగ్గరకెళ్ళి అక్కడంతా వెతికాడు.

పంతులు గారు, ఈశ్వర్ చెరో వైపున పరిగెత్తి వెతికారు. ఏమీ లాభం లేకపోయింది.

'కొంపతీసి వీడు టైమ్ మెషిన్ కోసం ఇంటికి వెళ్ళాడా?' అనుకుంటూ బయటకి పరిగెత్తుకెళ్ళాడు మూర్తి.

ఇంటికి చేరుకుని ప్రొజెక్టర్ ని చూసాడు. అది చల్లగా వుంది. 'అంటే వీడు రాలేదు, ఏమైపోయినట్టు?' అని ఆలోచించాడు మూర్తి.

***

పున్నమి రాత్రిలో అడవంతా మెరిసిపోతుంటే.. విశాల్, వినీష అడవిలో బాలకి దగ్గరగా ఉన్నారు.

***

# PART 41

శ్యాం సుందర్ కి ఈశ్వర్ విషయం చెప్పగానే విస్మయం చెందాడు.

వసుంధర కల్పించుకుని "నేను ముందే చెప్పాను, వాడు ఉట్టి అలగా వెధవని. మీరు వింటేనా? ఇద్దరూ కలిసి ఊరు వదిలి వెళ్ళకముందే ఏదో ఒకటి చేయండి. ఇది బయటకి పొక్కిందంటే పరువు నష్టం" అంటూ కొంగు నోట్లో పెట్టుకుని రోదించసాగింది.

"నువ్వు కాసేపు మాట్లాడకు, అయినా తప్పు నాది. ఈశ్వర్ ఉంటాడు అన్న ధైర్యంతో ఒక్కదాన్ని పంపించాను" అన్నాడు శ్యామ్ సుందర్.

"ఎవరీ విశాల్?" అడిగాడు ఈశ్వర్.

"అదంతా పెద్ద కథ, ముందు వాళ్ళు ఎటు వెళ్ళారో చెప్పండి" అన్నాడు శ్యామ్.

"నేను సరిగా చూడలేదండి, పెద్ద మెరుపులు వచ్చి కళ్ళు మూసుకున్నాను" అన్నాడు ఈశ్వర్.

"మెరుపులా..! పౌర్ణమి వెన్నెలలో మెరుపులేంటి?" అన్నాడు శ్యామ్.

"అదే నాకు అర్థం కాలేదు. పెద్ద శబ్దంతో మెరుపులాంటిది ఏదో ఒక కాంతి వచ్చింది. కళ్ళు తెరిచి చూసేసరికి వాళ్ళు లేరు కానీ, వాడి చేతిలో నా బంగారు గొలుసు చూసాను" అన్నాడు ఈశ్వర్.

"ఇంకేమి! అది పట్టుకుని ఈ పిచ్చిమొఖాన్ని తీసుకుని, ఏటో ఉడాయించాడు. పోలీస్ కంప్లైంట్ ఇవ్వండి వెంటనే" అంది వసుంధర.

"నువ్వు కొంచెం ఆగు, పోలీస్ దాకా వెళితే లేని పోనీ గొడవ. వాడిని మనమే వెతుకుదాం" అని బయటకి నడిచాడు శ్యామ్ సుందర్.

"సర్, మీరు ఏమి అనుకోనంటే.. నేను వెళ్ళి నా గొలుసు వాడు దొంగతనం చేసాడని పోలీస్ కంప్లెయింట్ ఇస్తా, వినీష పేరు ఎత్తకుండా" అన్నాడు ఈశ్వర్.

"సరే మీ ఇష్టం" అన్నాడు శ్యామ్.

ఈశ్వర్ వెళ్ళిపోయాక కన్నారావుని పిలిచి, "నీకు ఆ విశాల్ ఇల్లు తెలుసా?" అని అడిగాడు.

కన్నారావు "పదండి చూపిస్తా" అంటూ కదిలాడు.

***

అడవిలో చల్లగాలి మొహానికి తగిలి, విశాల్ కి మెలుకువ వచ్చింది. ఎదురుగా మర్రిచెట్టుకి కట్టేసి ఉన్న వినీష కనిపించింది. కంగారుగా లేవబోయాడు. అప్పుడు అర్థం అయ్యింది, తాను కూడా కట్టివేసి ఉన్నాడని.

"వినీ.." అని పిలిచాడు.

కళ్ళు తెరిచింది వినీష, "ఏమైంది విశాల్? మనం ఎక్కడ ఉన్నాం?" అంది.

"అదే నాకు అర్థం కావడం లేదు, గుడి వెనుక మనం మాట్లాడుకోవడం వరకు గుర్తు ఉంది" అన్నాడు.

"అవును, నాకు కూడా. మనం కలలో ఏమి లేము కదా!" అంది వినీష.

"ఇది కల అంటావా?" అన్నాడు.

"అలాగే ఉంది కానీ, కట్టేసి ఎందుకు ఉన్నాం?" అంది వినీష.

"నేను చెపుతా" అంటూ చెట్టు చాటు నుండి బయటికి వచ్చాడు బాల.

వినీష భయంగా చూసింది.

ఏం పర్లేదు అన్నట్లు సైగ చేసాడు విశాల్.

"నీకు కావాల్సిన సమాచారం అంతా ఇచ్చాను. మరలా నా జోలికి రావద్దని చెప్పాను" అన్నాడు విశాల్.

బాల బేలగా నవ్వాడు. ఎంత అమాయకుడివిరా తమ్ముడు! నేను నిన్ను తీసుకువస్తే, నాకు నేను చెట్టుకు ఎందుకు కట్టుకుంటాను" అన్నాడు.

"మరి ఎవరు తీసుకు వచ్చారు? అసలు మనం ఎక్కడ ఉన్నాం?" అన్నాడు విశాల్.

బాల జరిగినదంతా చెప్పసాగాడు.

***

రాత్రి పదకొండు గంటలకి తలుపు శబ్దం అయ్యింది.

"మీ అన్నయ్య వచ్చినట్టు ఉన్నాడు. నాన్న లేస్తే తిడతారు, వెళ్ళి తలుపు తియ్యి" అంది అనంత.

గబగబా వెళ్ళి తలుపు తీసింది స్వప్న. ఎదురుగా ఎవరో కొత్త వ్యక్తులు.

"ఎవరు కావాలండి?" అంది స్వప్న.

"విశాల్ ఇల్లు ఇదేనా?" అడిగాడు శ్యామ్ సుందర్.

"అవును కానీ, ఇంకా ఇంటికి రాలేదు" అంది స్వప్న.

ఈలోపు విశాల్ తండ్రి బయటకు వచ్చి, స్వప్నని లోపలి వెళ్ళమని సైగ చేస్తూ "చెప్పండి" అన్నాడు.

"మేము కాదు చెప్పాల్సింది నువ్వు" అన్నాడు శ్యామ్.

"కొద్దిగా మర్యాదగా మాట్లాడండి" అన్నాడు విశాల్ తండ్రి.

"అది ఇవ్వాలంటే మా దగ్గర ఉండాలి కదా! నీ కొడుకు నా కూతురిని ఎత్తుకెళ్ళి.. నా పరువు, మర్యాద రెండు తీసాడు" అన్నాడు శ్యామ్.

"మీరు ఏదో అపోహలో ఉన్నారు. మా వాడు అలాంటివాడు కాదు" అన్నాడు.

"నువ్వు నీ కొడుకులాగే వెధవలా ఉన్నావ్. మా పిల్లని లేవతీసుకుపోయాడంటే అపోహ అంటావేంటి?" అన్నాడు కన్నారావు.

శ్యామ్.. కన్నారావు వంక కోపంగా చూసి, "నేను మాట్లాడుతున్న కదా!" అన్నాడు. విశాల్ తండ్రి వంక తిరిగి, "ఇదిగో చూడండి, ఈరోజు పంచముఖ ఆంజనేయ స్వామి గుడిలో, మా అమ్మాయితో మీ అబ్బాయి ఉన్నట్లు, తరువాత కనిపించకుండా పోయినట్లు ప్రత్యక్ష సాక్షులు చెప్పగా, నేను వచ్చాను. మీతో

గొడవపడటం తద్వారా మా ఇంటి గుట్టు రచ్చకెక్కించడం నాకు ససేమిరా ఇష్టం లేదు కాబట్టి, మీ అబ్బాయి మా అమ్మాయిని ఎక్కడ దాచాడో కనుక్కుని, నాకు సూర్యోదయం లోపల చూపించకపోతే నాకన్నా చెడ్డవాడు లేడు" అన్నాడు.

విశాల్ తండ్రికి ఇవేమి అర్థం కావడం లేదు. "నిజంగా నాకు ఏమి తెలియదు. నిజంగా వాడు ఆ పని చేస్తే, వాడు ఇంటికి వస్తే, అమ్మాయినే కాదు వాడిని కూడా మీకు అప్పచెబుతాను కానీ, నాకు నా కొడుకు గురించి పూర్తి అవగాహన ఉంది. వాడి చెల్లి అంటే వాడికి పంచప్రాణాలు, ఆడపిల్లలిని చాలా గౌరవంగా చూస్తాడు. అటువంటి వాడు మీ అమ్మాయిని ఏదో చేసి ఉంటాడంటే నేను నమ్మలేను. ఎక్కడో ఏదో జరిగింది, నేను కూడా వాకబు చేసి చెబుతాను" అన్నాడు.

"సరే నేను మరల వస్తాను" అని గేట్ దాటాక వెళ్ళి, కన్నారావుని "నువ్వు వెళ్ళు, నేను వస్తాను" అని మరల వెనుకకి వచ్చాడు శ్యామ్.

విశాల్ తండ్రి మరలా ఎందుకున్నట్లు చూసారు.

"చూడండి.. మీ ఇంట్లో ఆడపిల్ల ఇద్దరు తెలియని వ్యక్తులతో మాట్లాడకూడదని, మేము రాగానే లోపలి పంపారు, అది తండ్రిగా మీ బాధ్యత. ఒక ఆడపిల్ల తండ్రిగా నాకు అదే బాధ్యత ఉంటుంది కదా! దయచేసి నిజం తెలిస్తే చెప్పండి. దాన్ని చిన్నప్పటి నుండి వదిలి ఎప్పుడూ ఉండలేదు మేము" అని చేతులు జోడిస్తూ అన్నాడు శ్యామ్.

"ఎంతమాట! నా కూతురు ఒకటి, మీ కూతురు ఒకటా? నాకు నిజంగా ఏమి తెలియదు సర్. దయ చేసి నన్ను నమ్మండి" అంటూ ఎదురు నమస్కారం చేసాడు విశాల్ తండ్రి.

***

# PART 42

ఈశ్వర్ వెళ్ళి స్టేషన్ లో రిపోర్ట్ ఇచ్చాడు. సుందర్ ప్రతాప్ వరకు వెళ్ళింది విషయం.

"పేరు ఏమి అన్నారు?" అన్నాడు సుందర్.

"పేరు విశాల్ సర్" అన్నాడు ఈశ్వర్.

"కాలేజ్ స్టూడెంట్ విశాల్ రాజవంశీ నా?" అని అడిగాడు సుందర్.

"పూర్తి పేరు తెలీదు, గుడిలో చూసాను" అన్నాడు ఈశ్వర్.

"మీకు ఇంతకుముందు అతను తెలుసా?" అని అడిగాడు సుందర్.

"లేదు, ఇదే మొదటసారి చూడటం. నా చేతిలో బంగారు హారం తీసుకుని పారిపోయాడు" అన్నాడు ఈశ్వర్.

"మరి అతని పేరు విశాల్ అని ఎవరు చెప్పారు?" అడిగాడు సుందర్.

"అక్కడ ఉన్న భక్తుల్లో ఒకరు చెప్పారు సర్" అన్నాడు ఈశ్వర్.

"ఓహ్.. ఓకే, గొలుసు సుమారు ఎన్ని గ్రాములు ఉండవచ్చు?" అని అడిగాడు సుందర్.

"దాదాపు ౩౦ గ్రాములు" చెప్పాడు ఈశ్వర్.

"మగవారి గొలుసు ౩౦ గ్రాములా?" అన్నాడు సుందర్.

"లేదు సర్, అది మా అమ్మది" అన్నాడు ఈశ్వర్.

"అంటే మీతో పాటు ఆవిడ అక్కడ ఉన్నారా?" అని అడిగాడు సుందర్.

"లేదు, ఆవిడ కాలం చేసి చాలా ఏళ్ళు అయ్యింది" అన్నాడు ఈశ్వర్.

"మరి ఆవిడ చైన్ మీ దగ్గర ఎందుకుంది?" అని అడిగాడు సుందర్.

"నాకు గుడిలో పెళ్ళిచూపులు ఏర్పాటు చేసారు. ఆ అమ్మాయికి ఇవ్వడానికి తీసుకువెళ్ళాను" అన్నాడు ఈశ్వర్.

"ఆమెకి ఇచ్చారా? అయినా పెళ్ళి చూపులంటున్నారు, పెళ్ళిచూపుల్లో గొలుసు, ఉంగరం ఇవ్వరు కదా!" అన్నాడు సుందర్.

"అంటే.. నా పెళ్ళి చూపులు, నిశ్చితార్థం రెండూ" అన్నాడు ఈశ్వర్.

సుందర్ ఒక్క క్షణం మౌనంగా ఉన్నాడు.

"చూడండి ఈశ్వర్, మీరు చెప్పే కథలు వినడానికి మాకు ఖాళీ లేదు. నిజంగా జరిగిందంతా చెప్పండి, లేకపోతే వెళ్ళిపోండి అంతే కానీ, మీ టైమ్ వేస్ట్ చేసుకుని, మా టైమ్ వేస్ట్ చెయ్యద్దు" అన్నాడు.

ఈశ్వర్ కి అర్థం అయ్యింది, సుందర్ పసిగట్టాడు అని. పూసగుచ్చిన తీరున అంతా సవివరంగా చెప్పాడు. సుందర్ అంతా విని, "వాడు చూడడానికి ఎలా ఉంటాడు?" అన్నాడు.

చెప్పాడు ఈశ్వర్.

అంతా విని, "రేపు ఉదయమే నేను దర్యాప్తు చేయిస్తాను" అన్నాడు సుందర్.

ప్రెస్ వాళ్ళకి వివరాలు ఇచ్చారు, స్టేషన్ ఫైల్ లో ఉన్న విశాల్ ఫోటో వాళ్ళకి అందింది.

ఈశ్వర్ వెళుతూ వెళుతూ "సర్ దయచేసి వినీష పేరు బయటకి రాకుండా చూడండి" అన్నాడు.

సుందర్ నర్మగర్భంగా నవ్వి, "తన తప్పు లేకపోతే ఎటువంటి సమస్యా లేదు, మీరు వెళ్ళండి" అన్నాడు.

***

తెల్లవారింది. అన్ని పేపర్స్ హెడ్లైన్స్ లో విశాల్ పేరు, బాలికను కిడ్నాప్ చేసిన చైన్ స్నాచర్ విశాల్ ఎక్కడ? తెలుగు ఇంగ్లిష్ పేపర్ లో మెయిన్ హెడ్డింగ్ గా వచ్చింది.

***

ఇవేమి తెలియని విశాల్, వినీష అడవిలో ఏం చేస్తున్నారో చూద్దాం.

బాల మొత్తం కథ చెప్పిన తరువాత విశాల్ కి అర్థం అయ్యింది. తాము అడవిలో చూసినవాడే శౌంఠి అని. ఇంతలో వచ్చారు నాయక, పత్రి.

"మానవా! సూటిగా అడుగుతున్నా, మా శౌంఠి ఎక్కడ?" అన్నాడు నాయక.

"నేను మీ శౌంఠిని చూసిన మాట వాస్తవం కానీ, అతనికి నాకు ఎటువంటి సంబంధము లేదు" అన్నాడు విశాల్.

నాయక, పత్రి వంక చూసి "వీడి మేధో మధనం చేసి, శౌంఠి ఎక్కడ ఉన్నది కనుక్కోండి" అన్నాడు.

పత్రి చకచకా విశాల్ భుజాల పైకి ఎక్కాడు. తల పైకి చేరి, మేధో మధనం (బ్రెయిన్ స్ప్రింక్లింగ్) మొదలుపెట్టాడు. చుట్టూ ఉన్న వారు రకరకాల వాయిద్యాలు వాయిస్తున్నారు. తంతు ముగిసాక కిందకి దిగి వచ్చి, చిత్రికకి ఏదో చెప్పసాగాడు పత్రి.

చిత్రిక అంతా విని ఒక ఆకు పైన చిత్రాన్ని గీయసాగాడు. చిత్రం పూర్తి అయ్యింది. దూరంగా తీసుకెళ్ళి అందరూ చూసి వచ్చారు.

వెనుతిరిగి వచ్చిన పత్రి.. విశాల్ ని, వినీషని మార్చి మార్చి చూసాడు. విశాల్ కి ఇంకా మత్తుగా ఉంది. వినీష బిగుసుకుని చూస్తుంది.

"ఏమైంది? వాడి బుర్రలో శౌంఠి ఉన్నడా?" అడిగాడు బాల.

నాయక నవ్వి, గీసిన చిత్రాన్ని ఎదురుగా పరిచాడు. అందులో కనిపించిన దానికి బాలకి నవ్వు వచ్చింది, వినీష కళ్ళు వదిలి చూసింది.

ఆ చిత్రంలో అన్నీ వినీష రూపాలే ఉన్నాయి.

"వీడు ఎవరో మహానుభావుడు. మా జీవితకాలం మేధ లోను, మనసులోని అన్నీ పొరల్లో ఒకటే రూపం ఎప్పుడు చూడలేదు" అని వినీష వంక చూసాడు నాయక.

"అమ్మ ఈ వ్యక్తికి నిజం చెప్పమని నువ్వైనా చెప్పు" అన్నాడు.

వినీష మౌనంగా ఉంది.

నాయక చెప్పిన మాటలు ఆమె చెవుల్లోకి వెళ్ళడం లేదు.

'ఏంటీ ఈ మనిషి! నేను అంటే ఎందుకు ఇంత పిచ్చి ప్రేమ? ఇది ఈ జన్మదేనా? అసలు అంత ప్రేమకు నేను తగినదాన్నా?' ఇలా పలు విధాలా ఆలోచిస్తుంది.

"ఓ వనితా! పిలిస్తే వినిపించిందా?" విచిత్రంగా పిలిచాడు నాయక.

ఏంటి అన్నట్లు చూసింది. ఈలోపు విశాల్ మేలుకున్నాడు.

"నీకు ఎం కావాలో నన్ను అడుగు, ఆమెని ఏమి అనకు" అన్నాడు.

"ఈ వనిత పట్ల నీ మనసు నాకు తెలిసిందిలే, అందుకే ఆమెకి విషం ఇచ్చి, రోజు కొంచెం కొంచెంగా రూపం మారుస్తాం" అన్నాడు నాయక.

"నేను చెప్పేది నిజం, ఆ మహాశివుని పై ఆన. నాకు శొంఠి గురించి ఏమి తెలియదు" అన్నాడు.

"మీ మనుషులను మేము నమ్మం, నువ్వు శొంఠి ఆచూకీ తెలిపేదాకా ఆమెను హింసించక తప్పదు" అన్నాడు నాయక.

"దీనికి ఆమెకి ఎటువంటి సంబంధం లేదు. అయినా తీసుకువచ్చేటప్పుడు ఆమెను ఎందుకు తీసుకురావాల్సి వచ్చింది? అని అడిగాడు బాల.

ఈశ్వర్ బంగారు గొలుసు మోసుకుని వచ్చారు ముగ్గురూ.

"ఇదిగో.. దీని వల్ల" అన్నాడు నాయక.

"బంగారు గొలుసు వల్లా? అదెలా?" అన్నాడు బాల.

"పుత్తడి శంకర స్కలిత పదార్థం, మోహిని దేవిని మోహించిన దశలో సాక్షాత్తు పరమశివుడు భూమిపై వదిలిన పదార్థం. ఇది ఐశ్వర్యాన్ని, ఆయుష్షని పెంచుతుంది. సరిగ్గా మేము వీడిని తీసుకుని వచ్చేసరికి, ఆమె చేతిలో ఉన్న పుత్తడిని వీడి చేతిలోకి తీసుకుంటున్నట్లు ఉన్నాడు. అది బంధంగా చూసి, తేజో ద్వీపం ఆమెని కూడా తీసుకుని వచ్చింది" అన్నాడు.

ఈలోపు విషం పాత్ర తీసుకుని ఒక మరుగుజ్జు వచ్చాడు.

"ఇదిగో నా ఆఖరి మాట.. నువ్వు చెప్పావా సరి, లేకపోతే ఆమెకు విషం ఇవ్వాల్సి ఉంటుంది" అన్నాడు నాయక.

"సరే, నా దగ్గరికి రా. నీకు ఒక రహస్యం చెబుతా" అన్నాడు విశాల్.

నాయక విశాల్ భుజాలకు చేరాడు, "ఇప్పుడు చెప్పు" అన్నాడు.

"ఇంకా దగ్గరకు రా" అన్నాడు విశాల్.

దగ్గరగా జరిగాడు నాయక. నోటితో నాయకను పట్టాడు విశాల్. అందరూ హతాశులై చూస్తున్నారు.

నాయక.. విశాల్ నోట్లోంచి రావడానికి ప్రయత్నం చేస్తున్నాడు కానీ, బలమైన పళ్ళ మధ్యలో ఇరుక్కున్నాడు.

***

# PART 43

పేపర్ లో విశాల్ ఫోటో చూసి మూర్తి కంగారుపడ్డాడు. వెంటనే బయలుదేరి విశాల్ ఇంటికి చేరుకున్నాడు.

మూర్తిని చూడగానే స్వప్న పరిగెత్తుకుని వచ్చింది.

"నీకోసమే ఎదురు చూస్తున్నాం అన్నయ్యా, విశాల్ అన్నయ్య ఎక్కడ ఉన్నాడు?" అంది.

"నాకు తెలీదు, నిన్న గుడిలో ఉన్నట్లు ఉండి మాయం అయ్యాడు" అని జరిగిందంతా చెప్పాడు మూర్తి.

"ఇది వినడానికి పెద్ద కట్టు కథలా ఉందిరా మూర్తి" అన్నాడు విశాల్ తండ్రి గోపాల్.

"లేదు, నేను నిజం చెపుతున్నాను. నన్ను నమ్మండి" అన్నాడు మూర్తి.

"ఇప్పటి వరకు వాడిని, నిన్ను నమ్మాము కాబట్టే, ఇంతవరకు వచ్చింది" అన్నాడు గోపాల్.

"వాడు నాకు తెలీకుండా ఎక్కడికీ వెళ్ళడు, ఇప్పుడు ఎక్కడికి వెళ్ళాడో తెలియడం లేదు. వాడిని వెతికే బాధ్యత నాది" అంటూ బయటకి వచ్చాడు మూర్తి.

వెనుకనే అనంత వచ్చింది, "నీకు నిజం తెలిస్తే నాకైనా చెప్పరా" అంది.

"నిజమే చెపుతున్నా అమ్మ, నా ఎదురుగానే మాయం అయ్యాడు" అన్నాడు మూర్తి.

"మరి ఆ అమ్మాయి ఎవరు?" అంది అనంత.

"ఇప్పుడు మీకు చెప్పే సమయం లేదు, వాడు వచ్చాక అంతా వివరంగా చెబుతాను. ఒకటి మాత్రం నిజం, ప్రేమించిన అమ్మాయిని తీసుకుని పారిపోయే పిరికివాడు కాదు వాడు. నాకన్నా.. వాడిని కన్న మీకే ఎక్కువ తెలుసు. నేను వాడితో తిరిగి వస్తాను" అంటూ బయలుదేరాడు.

ఇంటికే వెళుతున్నాడు గాని, బుర్రకి ఏమి తట్టడం లేదు. అసలు తిరిగి టైమ్ ట్రావెల్ చేసి వెనక్కి వెళితే బెటర్ అనుకుంటూ ఇంటికి చేరాడు. లోపలికి వెళ్ళి ప్రొజెక్టర్ ఆన్ చేసాడు. ముందు రోజు రాత్రి సరిగా ఎనిమిది గంటలకు టైమ్ సెట్ చేసాడు. ఇప్పుడు ఆన్ ఆఫ్ స్విచ్ కోసం చూసాడు, అది పెట్టిన చోట లేదు. రూమ్ అంతా వెతికాడు, ఎక్కడా దొరకలేదు. మొత్తంగా ఇల్లు అంతా వెతికాడు, కనిపించలేదు.

'అక్క బావ ఇంట్లో లేరు, పనిమనిషి కూడా వారం నుండి రాలేదు' అని అనుకుంటూ ఇల్లు అంతా వెతుకుతున్నాడు.

మూర్తికి తెలియని విషయం, పక్కింటి చింటూ గాడు స్విచ్ ని బొమ్మ అనుకుని తీసుకెళ్ళాడు అని, అది వాడి బొమ్మల మధ్యలో ఉందని.

ఎవరో తలుపు కొట్టారు, వెళ్ళి తీసాడు. ఎదురుగా పోలీస్, ఏంటి అన్నట్లు చూసాడు. "సుందర్ ప్రతాప్ సర్ నిన్ను తీసుకు రమ్మని చెప్పారు" అన్నాడు.

మూర్తికి అర్థం అయ్యింది, ఒకింత విసుక్కుంటూ బయలుదేరాడు.

***

మనీష, హరీష దిగులుగా ఉన్నారు. శ్యామ్ అయితే ఇంక చెప్ప నక్కరలేదు, వసుంధర గగ్గోలు పెడుతూ ఉంది.

కన్నారావు వచ్చి వసుంధర చెవిలో ఏదో చెప్పాడు.

వసుంధర లోపలి వచ్చి, "కన్నారావుకి ఎవరో రౌడీలు తెలిసిన వాళ్ళు ఉన్నారంట. వాళ్ళకి డబ్బు ఇస్తే, వెతికి తెస్తారంట ఇద్దామా?" అంది.

శ్యామ్ ఏమి మాట్లాడలేదు.

"ఏదో ఒక ప్రయత్నం చెయ్యకపోతే ఎలా?" అంది.

శ్యామ్ లేచి బయటికి వెళ్ళి కన్నారావుని పిలిచాడు.

"ఏంటి అంకుల్!" అంటూ వచ్చాడు.

లాగి ఒకటి ఇచ్చాడు శ్యామ్.

"ఇంకొకసారి నువ్వు ఈ విషయంలో కల్పించుకుంటే ప్రాణం తీస్తా" అన్నాడు.

వాడు అది పట్టుకుని మెట్లు దిగి వెళ్ళిపోయాడు. వసుంధర ఏదో మాట్లాబోయింది.

"ఎక్కువ మాట్లాడితే నీకు కూడా అదే గతి" అని కోపంగా అన్నాడు శ్యామ్.

మనిషా, హరీష దగ్గరికి వచ్చి "ఊరుకోండి నాన్నా" అన్నారు.

"మీ అక్క నిజంగా ఈ పని చేసిదంటారా?" అన్నాడు శ్యామ్.

"లేదు, అక్కడ ఏదో జరిగింది" అని ఇద్దరు ముక్త కంఠంతో అన్నారు

"నేను అదే నమ్ముతున్నానురా" అన్నాడు శ్యామ్.

***

విశాల్ నోట్లో కాసేపు విల విలలాడాక ఒకే సారి గాలిలోకి నాయకను ఊసివేసాడు విశాల్.

నాయక లేచి ఏదో అనబోయాడు.

"ఇదిగో చూడు నా వినీషకి విషం ఇస్తా అన్నందుకే ఈ కొసరు. ఆమె పై ఈగ వాలితే నా అసలు రూపం చూడాల్సి వస్తుంది" అన్నాడు.

విశాల్ కోపానికి అందరూ హతాశులై చూస్తున్నారు. ఒక్క క్షణంలో నిన్ను నేను పట్టి చంపగలను కానీ, మీ మీద అటువంటి అభిప్రాయం కానీ, అవసరము గాని నాకు లేవు. మీ శొంఠిని తీసుకెళ్ళింది వాడు, నేను కాదు" అంటూ చెప్పాడు విశాల్.

కోపంతో ఊగిపోతున్న నాయక తన భాషలో ఏదో అన్నాడు.

చుట్టూ ఉన్న మరుగుజ్జులు భయంతో అటు ఇటు పరుగులు పెట్టారు.

బాల పక్కనే ఉన్న పత్రిని "ఏంటి..?" అని అడిగాడు.

"నాయక రోచిని పిలిచాడు, దాన్ని చూస్తూనే మాకు ప్రాణాలు పోతాయి" వణుకుతూ అన్నాడు పత్రి.

దూరంగా చెట్లు విరుగుతున్న శబ్దంతో అక్కడికి వచ్చింది రోచి. చేతిని పైకి లేపి వినీషని చూపించాడు. భయపడిన వినీష బిగుసుకుపోయింది.

"నాయక ఆగు" గట్టిగా అరిచాడు విశాల్.

రోచి ఆగింది.

నాయక, విశాల్ వంక చూసాడు.

"బాల చెప్పింది విని నువ్వు ఒక పెద్ద వీరుడివి అనుకున్నాను, చాలా న్యాయమూర్తి అనుకున్నాను. అయితే నీ పరిమాణంలానే నీ బుద్ధి కూడా చిన్నది అని అర్థం అయ్యింది" అన్నాడు విశాల్.

"అధిక ప్రసంగం, నీవు నన్ను మట్టుబెట్ట చూసితివి కనుక ప్రతీకారం తీర్చుకోవడం తప్పులేదు" అన్నాడు.

"సరే, నీ ప్రతీకారం నా పైన, నన్ను నమ్మి వచ్చిన తన పైన కాదు. కావాలంటే దానికి నన్ను ఎరగా వెయ్యి. ఎందుకంటే ఆమె నా ప్రాణం, ఆమెకు ఏదైనా ఐతే నేను ఎలాగూ బ్రతకను కాబట్టి, తనను వదిలి పెట్టు" అన్నాడు విశాల్.

"వద్దు విశాల్, నువ్వు లేకుండా నేను ఉండలేను, నన్ను వెళ్ళనీ" అని వినీష ఏడుస్తూ అంది.

"వినీ.. నీకు నా పైన కొంచమైనా ప్రేమ ఉంటే ఇంకొక్క మాట మాట్లాడకు" అన్నాడు విశాల్.

అంత భయానక పరిస్థితిలో కూడా.. వినీ అని పిలుస్తున్న విశాల్ పిలుపుకి వినీష మనసు పులకరించింది.

"నాయక వాళ్ళని ఇక్కడికి రప్పించింది నేను. వాళ్ళకు శౌంఠికి ఎటువంటి సంబంధం లేదు, నా మాట విను" అన్నాడు బాల.

"నీవు అడిగింది సబబుగా ఉంది కాబట్టి, నిన్నే రోచికి ఆహారంగా వేస్తున్నాను" అన్నాడు నాయక.

విశాల్ నవ్వి "ఒక్క నిమిషం" అన్నాడు.

బాల వంక తిరిగి, "నువ్వు చెడ్డవాడివైనా, ఆఖరి నిమిషంలో నాకు సహాయం చేయడానికి ప్రయతించావు. నీ ఋణం వచ్చే జన్మలో తీర్చుకుంటా నేస్తమా! నాకు దయచేసి ఇంకో సహాయం చేసి పెట్టు. దయచేసి వినీషని తిరిగి తన ఇంటి వద్దకి చేర్చు" అన్నాడు విశాల్.

"తప్పకుండా" అని "అయినా నువ్వు అనుకుంటే ఏదో రకంగా తప్పించుకోవచ్చు" అన్నాడు బాల.

"దాని సైజ్ చూసావా" రోచిని ఉద్దేశించి అని నవ్వాడు విశాల్.

వినీష వంక తిరిగి చూసాడు.

వినీష వెక్కి వెక్కి ఏడుస్తూ ఉంది.

"వినీ.. దయచేసి ఏడవొద్దు, నేను కలవక ముందు వరకు నువ్వు ఎంతో సంతోషంగా ఉన్నావు. నేను నీ జీవితంలోకి వచ్చాక నీకు కన్నీళ్ళు గిఫ్ట్ గా ఇచ్చినట్టు ఉన్నాను. మది కోరినది విధి ఇవ్వదు, విధి ఇచ్చినది మది మెచ్చదు. ఇదే సగటు మధ్య తరగతి ప్రేమికుడి అనుభవం. పోరాటం చేసి నీ మనసు గెలిచిన నేను, నీతో కలసి బ్రతకడంలో మాత్రం ఓడిపోతున్నాను. మళ్ళీ జన్మలో కూడా ఇలానే పుట్టి, నీకోసం తపస్సు చేసైనా తిరిగి వస్తాను, సెలవు" అంటూ కళ్ళు మూసుకున్నాడు.

విశాల్ మాటలకి వినీషతో పాటు అక్కడున్న అందరికి కళ్ళ నీళ్ళు తిరిగాయి, ఒక్క నాయకకి తప్ప.

నాయక సైగ చూసి రోచి మెల్లగా విశాల్ దగ్గరకి వస్తూ ఉంది.

***

# PART 44

"ఏరా..! మీరు చదువుకుంటారా? లేక హత్యల్లో, కిడ్నాప్ లలోను పాల్గొంటారా?" సుందర్ అడుగుతున్న ప్రశ్నలకి మూర్తి మౌనంగా ఉన్నాడు.

"మౌనం మనిషికి బ్రహ్మాస్త్రం. మాట్లాడని వాడిని ఎన్ని తిట్టినా ఏం లాభం! నోరు విప్పి మాట్లాడు, లేకపోతే మా స్టైల్ లో మాట్లాడించాల్సి వస్తుంది" కోపంగా అన్నాడు సుందర్.

"ఏం మాట్లాడాలి సర్? ఇంతకుముందు హత్య జరిగినప్పుడు సాక్షాలు తీసుకువచ్చాం. అందులో మమ్మల్ని మొదట అనుమానించారు. ఇప్పుడు నేను నిజం చెపుతున్నా, మీరు నమ్మడం లేదు. అది నిజం అని ప్రూవ్ చేయడానికి నా దగ్గర సాక్ష్యం లేదు. విశాల్ కిడ్నప్ చేసాడని మీరే నిర్ణయించి, అది పేపర్ కి కూడా ఇచ్చారు. ఇప్పుడే డిగ్రీ పాస్ అయ్యాము, ఆ వార్త చూసాక ఇంక మాకు ఎవడైనా ఉద్యోగం ఇస్తాడా? నిజానిజాలు తెలియకుండా వాడి జీవితంతో ఆడుకునే హక్కు మీకెవరు ఇచ్చారు? నేరం మోపిన వాడు ముద్దాయి, నేరం నిరూపణ అయినవాడు నేరస్థుడు. మీరొక IPS ఆఫీసర్, మీరంటే మాకు చాలా గౌరవం. ఆఖరికి మీరు కూడా ఇలా ముద్దాయిని నేరస్థుడిగా చేస్తే మేము ఎవరికి చెప్పుకోవాలి సర్?" అని ఆవేశంగా అడిగాడు.

మూర్తి అన్న మాటలకూ సుందర్ ఆలోచనలో పడ్డాడు.

"సరే నువ్వు వెళ్ళు, విశాల్ గురించి సమాచారం తెలిస్తే నాకు వెంటనే ఇన్ఫార్మ్ చెయ్యి" అన్నాడు.

దిగులుగా కదిలాడు మూర్తి.

***

రోచి కదులుతూ వచ్చి విశాల్ ముందు పెద్దగా నోరు తెరిచింది. ఇంతలో వెనుక నుండి ఎవరో పెద్దగా అరిచారు.

రోచితో పాటు అందరూ వెనుతిరిగారు.

ఎదురుగా శౌంఠి నిలబడి ఉన్నాడు.

విశాల్ ని చూపిస్తూ నాయకకు ఏదో చెప్పాడు.

నాయక మొహంలో మార్పు వచ్చింది. రోచిని వెళ్ళిపొమ్మని చెప్పాడు.

క్షణంలో అక్కడి వాతావరణం అంతా మారిపోయింది. కొంతమంది వచ్చి విశాల్ కట్లు విప్పారు. మరికొంత మంది వినీష కట్లు విప్పారు.

వినీష పరుగున వెళ్ళి విశాల్ ని గట్టిగా హత్తుకుంది. ఆమె తలలో చెయ్యి పెట్టి ప్రేమగా సముదాయించాడు.

"ఎక్కడ నేర్చుకున్నావు ఈ డైలాగ్ లు? నన్ను వదిలి నీ దారిన నువ్వు వెళితే, నేను ఎవరో సాయం తీసుకుని ఇంటికి వెళ్తా అని ఎలా అనుకున్నావు? బ్రతుకు పంచుకుకోలేనప్పుడు చావైనా పంచుకోవాలిగా.." అంటూ విశాల్ గుండెల పై సుకుమార హస్తాలతో మోదసాగింది.

ఆమె ముఖారవిందాన్ని రెండు చేతులా పట్టుకుని, "మల్లెపూవుకి కోపం వస్తే ఎర్రగా మారుతుందేమో! మరి నా మందారానికి కోపం వస్తే ఏం రంగుకి మారుతుంది" అని ఆమె కళ్ళ నీళ్ళను బొటన వేళ్ళతో తొలగిస్తూ అన్నాడు.

"నాకేమి కోపం లేదు" అంటూ తిరిగి హత్తుకుపోయింది.

"తమ్ముడూ మీ రొమాన్స్ చాలు, కొద్దిగా నా సంగతి చూడు" అన్నాడు బాల.

విశాల్ నవ్వి బాలని ఆగమని సైగ చేసాడు.

కిందకు వంగి, "నాయకా నిన్ను ఏమైనా కష్టపెట్టి ఉంటే మన్నించగలవు" అన్నాడు.

"లేదు మానవా..! నేనే మూర్ఖంగా ప్రవర్తించాను. నీ మాట నమ్మి ఉంటే ఇదంతా జరిగేది కాదు, స్వల్పంలో అనర్థం జరిగి ఉండేది" అని నొచ్చుకున్నాడు నాయిక.

"ఇంక మాకు సెలవు ఇప్పిస్తే ప్రయాణమౌతాం" అన్నాడు విశాల్.

శౌంఠి వచ్చి "మా మిత్రుడివి నువ్వు. మేము మానవులతో సహవాసం చేసి దశాబ్దాలు దాటింది. ఇప్పుడు నువ్వు వచ్చావు. మా ఆతిథ్యం తీసుకుని వెళ్ళవలిసిందే" అని పట్టుబట్టాడు.

"నిజమే మిత్రమా! రాబోయే అమావాస్య ముందు రోజు శౌంఠికి, మా పడుచు జాజికి మనువు. నువ్వు చూసి వెళ్ళవలిసిందే" అన్నాడు నాయక.

ఏం చేద్దామని వినీష వంక చూసాడు విశాల్. నీ ఇష్టం అన్నట్లు పెదవి విరిచింది వినీష.

"సరే మీరు అడిగినట్లే ఇక్కడ ఉంటాను కానీ, నాదొక కోరిక తీరిస్తే" అన్నాడు విశాల్.

"చెప్పు మిత్రమా" అన్నాడు నాయక.

"దయచేసి బాలని కూడా విడుదల చెయ్యండి" అని అడిగాడు విశాల్.

"వాడు మా శౌంఠిని తీసుకుని వెళ్ళాలని చూసాడు. ఏమి తెలియని నిన్ను ఇందులో ఇరికించాడు. అటువంటి వాడిని వదలడం నీకు, నాకు.. ఇద్దరికీ మంచిది కాదు" అన్నాడు నాయక.

"నాయక.. దుర్మార్గులైన మనుషులు రెండు రకాలు. పుట్టుకతో కొంతమంది, పుట్టాక పరిస్థితుల వల్ల ఇంకొంతమంది. వీడు రెండో రకం వాడు. ఇంక ఎటువంటి అపకారం తలపెట్టకుండా ఉండేలా నేను చూసుకుంటాను, నన్ను నమ్ము" అన్నాడు విశాల్.

బాలని కూడా విడుదల చేశారు.

"ఒరేయ్ అన్నయ్య, 'తమ్ముడు.. తమ్ముడు.' అని నన్ను పిలిచి మంచి టైమ్ లో నా మైండ్ లో పడిపోయావ్. ఇలా మంచి వాడిగా ఉండిపోతే బెటర్, లేకపోతే ఈ తమ్ముడు వేసిన ఒట్టు.. గట్టు మీద పెట్టి మట్టిలో కలిపేయగలడు" అని వార్నింగ్ ఇచ్చాడు విశాల్.

"నిజంగా నేను మారిపోయానురా తమ్ముడు. నీ ప్రేమ, త్యాగం, ధైర్యం చూసాక నీకులా లేనందుకు బాధపడ్డాను. అందుకే ఇంక వెధవ పనులు చెయ్యను, ఆ శివునిపై ఒట్టు" అన్నాడు బాల.

ఈలోపు మారుగుజ్జులు వచ్చి "రండి మీకు బస చూపిస్తాం" అని వెనుకనున్న సరస్సు దగ్గరకు తీసుకెళ్ళారు.

కలువ పూవులు, తామర ఆకులుతో నిండి ఉన్న అందమైన సరస్సులో చిన్నచిన్న పాకలు ఉన్నాయి.

వినీష కళ్ళు పెద్దవి చేసుకుని, "అబ్బా ఎంత బాగుందో!" అంది.

"ఇక్కడే సెటిల్ అయిపోదామా?" అన్నాడు విశాల్.

కొద్దిగా సిగ్గు పడుతూ "నాకు ఓకే" అంది.

"అది సరే గాని, ఇక్కడ ఆడవాళ్ళు ఎవరూ ఉండరా?" అడిగింది వినీష.

"ఎందుకు ఉండరు..! శౌంఠికి పెళ్ళి అని చెప్పారు కదా! అంటే ఉన్నట్లే" అన్నాడు విశాల్.

నాయక అది విని, విచిత్రమైన సౌండ్ చేస్తూ ఎవరినో పిలిచాడు. చూడచక్కని మరుగుజ్జు భామలు గుంపుగా వచ్చారు.

"ఆ వనిత మనకు వచ్చే అమావాస్య వరకూ అతిథి, దగ్గర ఉండి చూసుకోండి" అన్నాడు.

మరుగుజ్జు వనితలు ముందుకి దారి చూపుతూ వినీషని తీసుకెళ్ళారు. వెనకే వెళ్ళబోయిన విశాల్ ని వారు రావద్దని అడ్డగించారు.

"మాలో ఆలూమగలు తప్ప ఒకే కొట్ట (కొట్ట గుడిసెకు పర్యాయ పదం) కింద ఇద్దరూ ఉండటం నిషిద్ధం" అన్నాడు పత్రి.

"నేను ఫ్రెష్ అయ్యి వస్తా నువ్వు కూడా రా" అన్నాడు విశాల్.

***

# PART 45

వెన్నెల జలపాతమై కురుస్తోంది మేఘాలు అందులో తడుస్తామని కాబోలు.. ఎక్కడివక్కడ దాగి, ఆకాశంలో తారలకు మాత్రమే చోటు ఇచ్చాయి.

విశాల్ కొద్దిగా జలకాలాడి బయటకు వచ్చాడు. పౌర్ణమి వెళ్ళి రెండు రోజులు మాత్రమే అవ్వడం వల్ల జాబిల్లి ఇంకా మెరుస్తూనే ఉంది. ఇంతలో ఎదురుగా నిలబడ్డ వినీష, మరుగుజ్జులు ఇచ్చిన వస్త్రాలలో వెలిగిపోతూ కనిపించింది. విశాల్ కళ్ళు అప్పగించి చూస్తున్నాడు.

“వాళ్ళు ఇచ్చిన దుస్తులు బాలేదా?” అంది వినీష.

విశాల్ అలాగే చూస్తున్నాడు.

“ఏంటి ఏమి మాట్లాడవు, బాలేదా? మార్చుకుని రానా?” అంది వినీష.

“కళ్ళకు కలాన్ని పట్టుకునే శక్తి ఉంటే అది కాళిదాసుని ఓడించేదేమో! మనసుకి మాట్లాడే శక్తి ఉంటే మన్మథ రాగాలు మాట్లాడేదేమో! అందాన్ని ఉద్దరించడానికి పుట్టిన నా శిల్పమా..! నిన్ను వర్ణించడానికి నేను ఇంకో బాష కనిపెట్టాలేమో!” అన్నాడు విశాల్.

“ఛీ.. పో.. ఒక్క మాట అర్థం కాలేదు” అంటూ సిగ్గుపడింది వినీష.

ఆ వసంత రాత్రి నిండు వెన్నల కింద ఒక పెద్ద తామరాకు పై కూర్చున్నారు. కాళ్ళు నీళ్ళలో కదుపుతూ మాట్లాడుకుంటున్నారు.

“నేను కనిపించకపోవడంతో నాన్న, అమ్మ చాలా కంగారుపడి ఉంటారు. వాళ్ళు ఏమి చేస్తున్నారో..! ఏమో..!” అంది వినీష.

“హా! నా పరిస్థితి అంతే. ఇంట్లో వాళ్ళు మాత్రమే కాదు, మా మూర్తి గాడు కూడా పచ్చి నీరు ముట్టడు. అయినా ఇంత బెంగ ఉన్న దానివి మరి ఉండడానికి ఎందుకు ఒప్పుకున్నావ్? వెళ్ళిపోయే వాళ్ళం కదా!” అన్నాడు విశాల్.

"ఒక్క క్షణం అదే అనుకున్న కానీ, నేను పది గంటలు కనిపించకపోయినా పది రోజులు కనిపించకపోయినా.. వెనుతిరిగి వెళ్ళాక ఒకటే పరిస్థితి. ఇక్కడ ఉంటే కనీసం మనసుకు నచ్చిన వాడితో కొంచమైనా కాలం గడపచ్చు" అంది వినీష.

"అంటే నేను మనసుకు నచ్చానంటావ్" అన్నాడు విశాల్.

"నువ్వని నేను చెప్పనా! అదిగో అక్కడ ఉన్నాడు చూడు" అంటూ నీటిలో విశాల్ ప్రతిబింబాన్ని విశాల్ కి చూపించింది.

"కష్టం.. వాడు ఆల్రెడీ ఆమెతో ప్రేమలో పడ్డాడు" అని వినీష ప్రతిబింబాన్ని చూపించాడు విశాల్.

ఇద్దరూ ముసిముసిగా నవ్వుకున్నారు.

***

శ్యామ్.. వినీష కోసం బెంగతో తిండి తినడం లేదు.

స్వప్న తన అన్నయ్య కోసం దిగులుపడి జ్వరం తెచ్చుకుంది.

ఒక్క మూర్తి, ఈశ్వర్ మాత్రమే కాస్త ధైర్యంగా ఉన్నారు.

ఈశ్వర్ రోజూ పోలీస్ స్టేషన్ కి వెళ్ళి అప్డేట్ తీసుకుంటున్నాడు.

మూర్తి మొదటి రెండు రోజులు టైమ్ స్విచ్ కోసం వెతికి తరువాత దొరికినా లాభం లేదు అని గుడికి వెళ్ళి ఆరా తీయడం మొదలు పెట్టాడు.

ఆరోజు కనిపించకుండా పోయింది ఇద్దరే కాబట్టి ఎవరికీ చీమైనా కుట్టినట్టు లేదు. 'ఏరా..! ఎక్కడికి వెళ్ళిపోయావ్? ఎక్కడున్నా ఆ భగవంతుడు నిన్ను క్షేమంగా చూడు గాక' అని మొక్కుకున్నాడు.

***

తెల్లవారింది. బారెడు పొద్దు ఎక్కింది. మొహం మీద పడిన సన్నని నీటి తుంపరతో నిద్ర లేచాడు ,విశాల్.

పత్రి కష్టపడి చెంచా వంటి వస్తువుతో నీళ్ళు విసురుతున్నాడు.

"ఏంటి పత్రీ" అని అడిగాడు విశాల్.

"నాయక మిమ్మల్ని తీసుకుని రమ్మని చెప్పాడు" అన్నాడు.

విశాల్ వెళ్ళేసరికి వినీష అడవికి రాణిలా ముస్తాబు అయ్యి ఉంది.

విశాల్ ని చూసి పలకరింపుగా నవ్వింది.

వినీష ఎదురుగా ఏనుగు పరిమాణంలో ఉన్న ఉడుత ఉంది.

"ఇలాంటివి ఎప్పుడూ మాకు కనిపించవే" అన్నాడు విశాల్.

"ఇవన్నీ మాకులానే మానవలకు భయపడే నిస్వార్థ జీవులు. నేను అడిగాను కాబట్టే అది వచ్చింది. దీని పేరు రామి, ఈ అడవిలో ఉన్న అన్ని వింతలు విశేషాలు దీనికి తెలుసు" అన్నాడు.

"మిత్రమా! అంతా కుశలమా!" అంది రామి.

విశాల్ వింతగా "అయ్య బాబోయ్! ఇలాంటి వాటికి కూడా ఇన్ని శక్తులు ఉంటాయా!" అన్నాడు.

"ఒకప్పుడు అన్ని జీవులు ఇలానే ఉండేవి. మానవ మేధ పెరిగి స్వార్థం పడగ విప్పడంతో, ఇవన్నీ మూగబోయాయి" అన్నాడు నాయక.

"ఇంతకీ నేను ఎందుకు దీన్ని పిలిచాను అంటే, అది మీ ఇద్దరినీ తీసుకుని ఈ అడవిలో మీరు ఆశ్చర్యపోయే ప్రదేశాలకు విహారయాత్రకు తీసుకు వెళుతుంది. తీరిగ్గా తిరిగి రండి" అన్నాడు నాయక.

సన్న ఈల వేస్తూ రామిని అధిరోహించి, వెనుక వినీషని కూర్చోపెట్టుకుని "పద నేస్తం" అన్నాడు విశాల్.

రామి కదిలింది, దాని జుట్టుని గట్టిగా పట్టుకుని కూర్చున్నారు. రామి వేగం పెంచింది.

"ఇంతకీ ఎక్కడికి తీసుకుని వెళ్తావు?" అని అడిగాడు విశాల్.

"ముందు మనం తేలియాడే జలపాతంకి, గురుత్వాకర్షణ శక్తిని ధిక్కరించి.. మంత్రముగ్ధులను చేసే జలపాతానికి వెళదాం. అక్కడ నీరు క్రిందికి కాకుండా పైకి ప్రవహిస్తుంది. ఆకాశంలోకి నీరు కారుతున్న దృశ్యం మిమ్ములను ఆశ్చర్యానికి గురి చేస్తుంది" అంది రామి.

"వినడానికే వింతగా ఉంది. నువ్వు పక్కన ఉంటే అన్నీ అద్భుతాలే" అంది వినీష.

ఇంతలో జలపాతానికి చేరుకున్నారు. కొండల కింద నుండి నీరు విచిత్రంగా పైకి ఎగబాకుతుంది. మెట్లు ఎక్కుతున్నట్టు జలచరాలు కింద నుండి పైకి ఎక్కుతున్నాయి. నీరు కొండ వాలుగా ఎగబాకి, ఆకాశానికి పిచికారీ చేసే రీతిలో నీటిని వెదజల్లుతూ ఉంది.

విశాల్, వినీష నీటిలో కాలు పెట్టారు. నీరు పెళ్ళికెళ్ళిన బంధువులను ఆహ్వానచినట్లు ఇద్దరినీ మెల్లగా పైకి లాక్కుంది. రామి వచ్చి వారించి, వెనుకకు తీసుకువచ్చింది.

"నేను చూపే అన్ని ప్రదేశాలు కూడా ఇప్పటి మానవులు చూడనవి కానీ, ఇవన్నీ ప్రమాదమైనవి. మీరు దయచేసి వాటిని సాదరణమైనవిగా భావించకండి అంది" రామి.

కాసేపు అదే ప్రాంతంలో కూర్చున్నారు. ఎంతో ఆహ్లాదంగా ఉంది.

***

# PART 46

"ఇక్కడే నిలిస్తే ఎలా? ఇటువంటి వింతలు ఇంకా చాలా ఉన్నాయి. బయలుదేరుదామా?" అంది రామి.

వినీష జలపాతం దగ్గరకి వెళ్ళి చూస్తుంది.

"వినీ.." అని పిలిచాడు విశాల్.

ఆ ధ్వని కొండలను తాకి నీటిని చీల్చి, వంద శబ్ద తరంగాలుగా మరి ప్రతిధ్వనించింది.

అది విని "విశాల్.." అని పిలిచింది వినీష.

ఆ ప్రతిధ్వనులకు విశాల్ నవ్వాడు.

కళ్ళు టపటపా మిటకరిస్తూ ఆనందంగా చూసింది రామి.

తిరిగి బయలుదేరుతుండగా "ఈ నీరు చాలా ఔషధ శక్తులు ఉన్నదని. సాక్షాత్తు ఆ పరమశివుడి జటాజూటంనకు వెళ్ళే గంగా జలం ఇదే అని ప్రసిద్ధి" అంది రామి.

వినీష దోసిలితో నీటిని తీసుకుని వచ్చి, వాటిని విశాల్ కి పట్టించింది. ఆమె మునివేళ్ళు తన పెదవులను తాకుతుంటే అద్భుతమైన ఉద్వేగం కలిగింది. అది ఆమె స్పర్శ వల్లనో.. లేక ఆ నీటి వల్లనో అర్థం విశాల్ కి కాలేదు.

మరల రామిని అధిరోహించి పయనమైనారు.

"మీ జాతి నాకు ఎప్పుడూ అర్థం కాదు" అంది రామి.

"ఏమి అర్థం కాలేదు" అన్నాడు విశాల్.

"ఈ ప్రపంచంలో ఏ జీవి అయినా తన జాతి పరంగా ఒకే ప్రజ్ఞ మేధ కలిగి ఉంటాయి. ఒక్క మనుషులు మాత్రమే పుర్రెకో బుద్ధితో ఉంటారు" అంది రామి.

"అని నీకెవరు చెప్పారు?" అన్నాడు విశాల్.

"మా పెద్దలు చెప్పారు. నేను చూసినంత వరకు రాముడు లాంటి దేముడు, రావణుడిలాంటి రాక్షసుడు కూడా మీలోనే ఉన్నారు. ఎందుకు మీ జాతిలోనే ఇంత వ్యత్యాసం? ఇంకా మీ జన్మ మాకన్నా ఉత్తమమైనది అంటారు. అదెలాగో నాకెప్పటికీ అర్థం కాదు" అంది రామి.

"అది నేను చెపుతా కానీ, మాలో నీకు మంచి ఏమి కనిపించలేదా? అని అడిగాడు విశాల్.

"అది మంచో చెడో నాకు తెలీదు కానీ, మీ భావోద్వేగాలు, ఒకరి కోసం ఒకరు పడే తపన నాకు చాలా ఇష్టం. చిన్నచిన్న విషయాలకు మీరు పడే ఆనందం కూడా" అంది రామి.

రామి తలపై ప్రేమగా నిమురుతూ చెప్పసాగాడు విశాల్.

"నువ్వు గమనించింది, మీ పెద్దలు చెప్పినది నిజం. భగవంతుడు సృష్టించిన జీవులలో మానవజన్మ అత్యంత ఉత్తమమైనది. మానవుడు ఒకడు మాత్రమే వెన్నముక నిలువుగా కలిగి ఉన్నాడు. మిగిలిన జీవులు అన్నీ భూమికి సమాంతరంగా ఉండేవి. ఐతే ఈ జన్మ సార్థకత చేసుకోవాలంటే మనిషి మనిషిలానే బ్రతకాలి" అన్నాడు విశాల్.

"అదెలా? ఇలాగే బ్రతకాలని ఎవరు చెబుతారు?" అడిగింది వినీష.

"మన వేదాలు. సాక్షాత్తు మహా విష్ణువే రాముడిగా అవతరించి, ఒక మనిషి ఎంత ధర్మ బద్ధంగా బ్రతకవచ్చో ఆయన జీవించి, నిరూపించి మరి చెప్పాడు. కృష్ణ భగవానుడి రూపంలో ధర్మం, ధర్మసూక్ష్మం నేర్పించాడు కానీ.. మనం స్వార్థం, అసూయ, మోసం, వంచన వంటి జాడ్యాలతో మనం మనుషులమని మర్చిపోతున్నాం. భగవంతుడే మనిషికి ఇవన్నీ ఇచ్చి పరీక్ష పెడతాడు. గెలిచినవాడు ఊర్ధ్వ లోకాలకు, ఓడినవాడు అధోఃలోకాలకు వెళ్ళటం అంది కర్మ సిద్ధాంతం" అన్నాడు విశాల్.

"విశాల్ నిన్ను చూస్తే ఒక్కోసారి నాకు భయం వేస్తుంది" అంది వినీష.

"ఎందుకు?" అన్నాడు విశాల్.

"ఇవన్నీ ఎక్కువ తెలిసిపోయి, సన్యాసం తీసుకుంటావేమో..!" అని నవ్వింది వినీష.

పగలపడి నవ్వారు ఇద్దరూ.

రామికి విశాల్ చెప్పిన వివరణ సంతృప్తి ఇచ్చింది.

"ఇప్పుడు ఎక్కడికి వెళుతున్నాం?" అంది వినీష.

"ఇంద్రధనుస్సు ఉద్యానవనం. ఊహకు అందని ప్రతి రంగులో ఉండే శక్తివంతమైన మెరిసే పూలతో నిండిన తోటలో, పువ్వులు మృదువైన రంగురంగుల కాంతిని విడుదల చేస్తాయి. అది మీ చుట్టూ అద్భుతమైన ఇంద్రధనస్సు ప్రభావాన్ని సృష్టిస్తుంది. ఆ తరువాత స్ఫటిక గుహలు, వివిధ పరిమాణాలు మరియు రంగుల మెరుస్తున్న స్ఫటికాలతో అలంకరించబడిన గుహలలో మిరుమిట్లుగొలిపే ప్రదర్శనలో కాంతిని ప్రతిబింబిస్తుంది. మొత్తం గుహ వ్యవస్థ మీ పరిసరాలను ప్రకాశవంతం చేసే మాయా తేజస్సును విడుదల చేస్తుంది" అంది రామి.

"వింతగా ఉంది, ఇంకా ఏమున్నాయో!" అంది వినీష.

"గాలిలో తేలే ద్వీపాలు, గాలిలో సంచరించే ద్వీపాలు, ప్రతి ఒక్కటి దాని ప్రత్యేక పర్యావరణ వ్యవస్థ మరియు తేలియాడే వన్యప్రాణులను కలిగి ఉంటాయి. పై నుండి ప్రకృతి దృశ్యాలు గాలిలో బంధింపబడ్డ కలలా కనిపిస్తాయి. మాట్లాడే చెట్లు, సందర్శకులతో వారి స్వంత శ్రావ్యమైన భాషలో సంభాషించగల తెలివైన మరియు పురాతన చెట్లను కలవచ్చు. వారి సున్నితమైన గుసగుసలు పురాతన జ్ఞానాన్ని మరియు ఆధునిక జ్ఞానాన్ని కలిగి ఉంటాయి" అని చెప్పింది రామి.

వాటిని చూసిన వినీషకి, విశాల్ కి అది కలయో..! నిజమో..! అర్థం కావడం లేదు. ఈ పరిస్థితి వారు ఇల్లు వదిలి పది రోజులు కావస్తోందన్న నిజాన్ని కూడా మరిపింపజేస్తున్నాయి.

అప్పటికే సంధ్య వేళ దాటింది, మెల్లగా అడవిని చీకట్లు కమ్ముకుంటున్నాయి.

"రామి నీకు ఏ రకంగా కృతజ్ఞతలు తెలపాలో నాకు తెలియడం లేదు. ఇన్ని అద్భుతాలు ఒక్కసారిగా మాకు చూపించావు" అన్నాడు విశాల్.

"అంగుష్టలకు మీరు మిత్రులు అంటే మాకు కూడా మిత్రులే. ఇది మా అతిథులకు మేము చేసే మర్యాద" అంది రామి.

"ఇంకా ఏమి మిగిలి ఉన్నాయి?" అడిగాడు విశాల్.

"ఇంకొక్కటి కానీ, దాని చెంతకు మిమ్ములనును నేను తీసుకుపోలేను. అక్కడ మానవులకు ప్రవేశం నిషిద్ధం" అంది రాణి.

"ఏంటది? మాకెందుకు నిషిద్ధం?" అడిగింది వినీష.

"కాలపరిమితి ఎరుగని వృక్షరాజ గ్రంథాలయం. భూమి యొక్క చరిత్ర జ్ఞానం మరియు కథలను బహిర్గతం చేసే పుస్తకాలను కలిగి ఉన్న చెట్ల మధ్య దాగి ఉన్న విస్తారమైన గ్రంథాలయం. ప్రతి పుస్తకం భూమి యొక్క ఏదో ఒక సమాచారాన్ని కలిగి ఉంటుంది. అందులో మీ జీవిత రహస్యాలు, భూత భవిష్యత్, వర్తమానాల వివరాలు ఉన్న ఎన్నో పుస్తక నిఘంటువులు ఉంటాయి. అందువల్ల మానవుల ప్రవేశము నిషిద్ధం" అంది రామి.

"కనీసం దూరం నుండి చూడగలమా?" అడిగాడు విశాల్.

"హ! తప్పకుండా" అంటూ కదిలింది రామి

***

# PART 47

మూర్తికి ఏమి తోచడం లేదు. 'విశాల్ ఏమైపోయాడో తెలీదు, పోలీస్ లు వాడి మీద కిడ్నాప్ కేస్ పెట్టారు. ఇప్పుడు ఎవరిని అడగాలి ఏమని అడగాలి. నాకు తెలియకుండా వాడు వెళ్ళే ప్రసక్తి లేదు. ఏంటి ఒకేసారి అలా మాయమైపోయాడు. సమయానికి టైమ్ స్విచ్ కూడా కనిపించడం లేదు. ఏంటి, వాడు లేకపోతే జీవితం ఇలా కూడలిలోకి వచ్చేసింది. దేముడొక్కడే దిక్కు' అనుకుని ఇంకోక్కసారి గుడికి వెళితే ఏమైనా తెలియచ్చేమో అని గుడికి బయలుదేరాడు.

సాయంత్రం కావడం వల్ల అప్పుడే భక్తులు వస్తున్నారు. లోపల గర్భగుడి చుట్టూ తిరిగి చూసాడు. ఒక్క సింహ ద్వారం తప్ప ఎక్కడి నుండి బయటపడే మార్గం కనిపించలేదు. పూజారిగారు ఎదురుపడ్డాడు.

పరిచయం ఉన్న వ్యక్తి కావడం వల్ల, "ఏమైంది! నీ చెలికాడు ఆచూకీ దొరికిందా? పాపం మంచివాడు, అలా ఎందుకు చేసాడంటావ్?" అన్నాడు.

"అయ్యా, మీరు కూడా మా గురించి తెలిసి ఇలా మాట్లాడడం ఎంతవరకు సబబు..!" అన్నాడు.

"హా నిజమే కానీ, పేపర్ లో వచ్చిన వార్తలు వాళ్ళు వీళ్ళు అంటున్న మాటలు విని అలా అడిగా, ఏమనుకోకు. మంచివాళ్ళకు మంచే జరుగుతుంది" అన్నాడు పూజారి.

"ఏమి మంచో..! ఆరోజు ఆ మెరుపులు, ఉరుములు మీరు విన్నారు కదా! వాళ్ళ అదృశ్యం మీకు వింతగా లేదూ" అన్నాడు మూర్తి.

"హా, కొద్దిగా అలానే ఉంది. ఎవరో సాధువు చెప్పారు, గోపురం పైన ఏదో దీపం మరుగుజ్జు ఆకృతిలో ఉన్న జంతువులు చేతిలో ఉందని" అన్నాడు పూజారి.

"అవునా..! నిజంగానా..! ఎవరతను? ఎక్కడ ఉంటాడు?" అడిగాడు మూర్తి.

"ఎవడో పిచ్చివాడిలా ఉన్నాడు, సాక్షాత్తు హనుమంతుడి గుడిలో మరుగుజ్జు భూతాలా? గంజాయి తాగి తాగి వాడి తెలివి తెల్లారింది" అన్నాడు పూజారి.

"అతను ఎక్కడ ఉంటాడు తెలుసా?" అన్నాడు మూర్తి.

"ఈ సాధువులందరు పెద్ద శివాలయంలో ఉంటారు. అప్పుడప్పుడూ స్వామి దర్శనానికి వస్తారు" అన్నాడు పూజారి.

"శివాలయంలో చాలామంది సాధువులు ఉంటారు. అతనిని ఎలా గుర్తుపట్టగలను?" అన్నాడు.

"అతని తలపై కొన్ని పక్షి వెంట్రుకల్లా ఉన్నాయి" అన్నాడు పూజారి.

హుటాహుటిన పెద్ద శివాలయానికి పరిగెత్తాడు మూర్తి.

***

రామి వృక్ష గ్రంథాలయం పై దూసుకువెళుతోంది. ఒక కొండ వెనుక వలయాకారంలో ఉన్న పచ్చని వృక్షం పెద్ద భవనంలా ఉంది. చూడడానికి చాలా అందంగా, ఆకర్షణీయంగా ఉంది.

"ఇదేదో ఇంగ్లీష్ సినిమాలో సెట్ లా" ఉంది అన్నాడు విశాల్.

ఒకేసారి చుట్టూ తిరిగి చూసారు.

"ఇంక మనం తిరిగి వెళ్ళాలి. దీని కాపరి చూసాడంటే నాకు శిక్ష వేస్తారు" అంది రామి.

లోపల కనపడుతున్న అందమైన హాల్, ఆసనాలు చూస్తూ, "నీకు కూడా శిక్షలు ఉంటాయా? ఎవరు వేస్తారు?" అన్నాడు విశాల్.

"మాకు జాతి శాసనం ఉంటుంది. ఎవరైనా దాని ప్రకారం నడుచుకోవాలి. ఏదైనా శాసనం ఉల్లంఘిస్తే శాసన ధిక్కరణకు శిక్ష మాకు మేమే అమలు చేసుకోవాలి" అంది రామి.

"మీరు చేసుకోకపోతే, తప్పు చేసి తప్పించుకుంటే?" అడిగింది వినీష.

"తప్పించుకోవడం అంటే?" అడిగింది రామి.

ఏదో చెప్పబోయిన వినీషకి వద్దన్నట్లు సైగ చేసాడు విశాల్.

తిరిగి తాము ఉన్న అడవి దగ్గరలోకి వచ్చేసరికి అందమైన మిణుగురులు అడవంతా కలతిరుగుతున్నాయి.

"అబ్బా.. ఎంత బాగుందో!" అంది వినీష.

"ఇక్కడి నుండి నడిచి వెళదాం" అని దిగి రామి బుగ్గ మీద నిమురుతూ,

"ధన్యవాదం మిత్రమా! నేడు జీవితంలో మరిచిపోలేని రోజు" అన్నాడు విశాల్.

"నాకు కూడా మానవా, మీ మీదున్న అనుమానం ఈరోజుతో నివృతి అయ్యింది. సుఖీభవ" అంటూ కనుమరుగైంది రామి.

అడవంతా మిలమిలా మెరుస్తూ ఉంది. వినీష రెండు మిణుగురులు చేతి గుప్పిట పట్టి మూసింది. చేతులు మధ్య నుండి వెలుగు వస్తూ ఆరుతూ ఉంది. వాటిని పట్టుకుని ఆడుతున్న వినీష మోముని చూసి ఇంకా పులకించిపోతున్నాడు విశాల్.

కాసేపు ఆడాక చేతిలో ఉన్న ఒక మిణుగురుని పట్టి విశాల్ వైపు తిరిగి "మన పెళ్ళి జరుగుతుందా? లేదా?" అని అడిగింది వినీష.

ఎందుకు అన్నట్లు చూసాడు విశాల్.

"మనం అనుకున్నది జరిగేది ఐతే అది మన చేతిలో నుండి ఎగిరిపోతుంది. జరగకపోతే చేతిలోనే ఉండిపోతుంది" అంది.

"నువ్వేం అనుకుంటున్నావు?" అన్నాడు విశాల్.

"ఇద్దరం ఒకేసారి చెబుదాం" అంటూ "జరుగుతుంది" అని ఇద్దరూ అన్నాక చెయ్యి తెరిచింది.

***

శివాలయం చేరేసరికి కొద్దిగా చీకటి పడింది. చాలా పెద్ద ఆలయం అది. లోపల ఉన్న పది మర్రి చెట్లు, రావి చెట్లు కింద గుంపులు గుంపులుగా సాధువులు ఉన్నారు.

"అయ్యా ఇక్కడ తలపై కోడి ఈకలు కలిగి ఉన్న సాధువు ఎవరైనా తెలుసా?" అని అందులో ఒకరిని అడిగాడు మూర్తి.

"ఎందుకు?" అడిగాడు ఆ సాధువు.

"కొద్దిగా పని ఉంది" అన్నాడు మూర్తి.

"గుడిలో కాదు, వాడు గుడి ఆవల.. వెనుక పక్క ఉంటాడు. వాడి పేరు శరభ" అన్నాడు ఆ సాధువు.

గుడి వెనుకకి వెళ్ళాడు, చీకటి పడటంతో అంతగా కనిపించడం లేదు. కొద్ది దూరం వెళ్ళక గుప్పుమని గంజాయి వాసన తగిలింది. గుంపులు గుంపులుగా కూర్చుని నెగడు చుట్టూ కూర్చున్నారు. అదేదో సినిమా సెట్టింగ్ లా అనిపించింది.

దగ్గరలో ఉన్న గుంపుని వాకబు చేసాడు. వారు మైకంలో ఉన్నారు, సరిగ్గా సమాధానం చెప్పడం లేదు. మూర్తిలో సహనం చచ్చిపోతోంది.

"శరభ.." అని పిలిచాడు.

దూరంగా ఉన్న గుంపు నుండి ఒక సాధువు లేచి వచ్చాడు.

"శరభ అంటే నువ్వేనా?" అని అడిగాడు మూర్తి.

"అవును, ఏమి కావాలి?" అడిగాడు శరభ.

"మొన్న పౌర్ణమి రోజు గుడిలో ఏమి చూసావ్?" అని అడిగాడు.

"ఎందుకు.. విని ఎవరు నమ్మారు కనుక..?" అన్నాడు శరభ.

"నేను నమ్మాను కనుకే వచ్చాను. దయచేసి ఏమి చూసావో చెప్పు" అన్నాడు.

గంజాయి మత్తులో ఉన్న శరభ "రేపు రా చెబుతా" అన్నాడు.

"లేదు, చాలా అర్జెంట్. ఇద్దరి ప్రాణాలకు సంబంధించిన విషయం, ఇప్పుడే చెప్పు" అన్నాడు.

శరభ నవ్వుతూ, "వెళ్ళు.. వెళ్ళు.. నువ్వు పోలీస్ వా ఏమైనా? రేపురా చెబుతా" అన్నాడు.

"అవును నేను పోలీస్ నే, లేకపోతే నీ పేరు ఎలా తెలిసింది? ఏదో సన్యాసివని వదిలేసా, NDPS చట్టం ప్రకారం గంజాయి మరియు హెరాయిన్

తో సహా మాదక ద్రవ్యాలు మరియు సైకోట్రోపిక్ పదార్థాలను స్వాధీనం చేసుకోవడం, వినియోగం, అమ్మకం, కొనుగోలు, రవాణా మరియు సాగు చేయడం చట్టవిరుద్ధం మరియు శిక్షార్హమైన నేరాలు. నిన్ను అరెస్ట్ చేసి లోపల వేస్తే సరి, పద" అన్నాడు.

ఎంట్రన్స్ కోసం ప్రిపేర్ అయిన కంటెంట్ మూర్తికి సమయానికి పని చేసింది.

శరభ దెబ్బతో దారికి వచ్చాడు.

***

# PART 48

విశాల్, వినీష ఇద్దరు ఊపిరి బిగబట్టి.. వినీష తెరిచిన చేతి వంక చూస్తున్నారు.

చేతిలో ఉన్న మిణుగురు పైకి ఎగరకుండా అలాగే స్థిరంగా ఉంది.

"అంటే మన పెళ్ళి జరగదా?" అంటూనే జలజలా కన్నీరు కార్చింది వినీష.

"అయ్యో రామ..! ఒక్కసారి అక్కడ ఏముందో చూడు" అన్నాడు.

ఒక మిణుగురు వినీష రెండు వేళ్ళ మధ్యలో ఇరుక్కుని ఉంది. ఎగరడానికి ప్రయత్నం చేస్తున్న మిణుగురు, ఇరుకుని ఉన్న మిణుగురుని బయటకు లాగడానికి ప్రయత్నం చేస్తుంది.

"దాని ప్రేయసిని నువ్వు పట్టి బంధించి, దాన్ని మాత్రం పొమ్మంటే ఎలా వెళుతుంది?" నవ్వుతూ అన్నాడు విశాల్.

వేళ్ళు రెండు వదిలేసింది వినీష రెండు కలిసి ఎగిరి వెళ్ళిపోయాయి.

"హమ్మయ్య, ఎంత బయపడ్డానో నేను!" అంది వినీష.

"సరే ఇంక పద, ఇప్పటికే చీకటి అయ్యింది" అన్నాడు విశాల్.

మెల్లగా నడుస్తున్నారు. విశాల్ ఎడమ చేతి నుండి తన చెయ్యి లోపలి పెట్టి, భుజంపై తలవాల్చి నడుస్తూ ఉంది వినీష.

"అవును, ఇందాక రామికి మోసం చేయడం అంటే ఏంటో చెపుతుంటే ఎందుకు ఆపావ్?" అంది.

"మోసం అనేది మానవజాతి పుట్టినప్పుడు తెలియని విద్య. ఆది మానవుడు మనుగడ కోసం పోరాటం చేసి చేసి స్థిరపడి.. ఆధునిక మానవుడిగా మారాక.. స్వార్థం పెరిగి నేర్చుకున్న విద్యలలో మోసం ఒకటి. రామి వంటి జాతి ఇంకా

చెక్కు చెదరని క్రమబద్ధమైన శాసన సహిత జీవితాన్ని గడుపుతున్నాయి. మోసం నేర్పడం ద్వారా మనం రామి మనసులో విషం నింపడం నాకు ఇష్టం లేదు, అందుకే ఆపాను'' అన్నాడు.

"అమ్మ నాయినో! ఇంత అర్థం ఉందా ఇందులో! అయినా నీకు ఇవన్నీ ఎవరు నేర్పారు విశాల్?'' అడిగింది వినీష.

"మా నాయనమ్మ, అవును ఆవిడ వేదం, వేదాంగాలు చదివారు. మాకు చిన్నప్పుడు కథలు ద్వారా ఎన్నో విలువైన విషయాలు నేర్పారు. అప్పుడు విన్నప్పుడు నిద్రపోయే ముందు కథలా ఉండేది కానీ, ఎదిగే కొద్దీ అవి అక్షరసత్యాలు అని అర్థం అయ్యింది'' అన్నాడు విశాల్.

"ఈ తెలివితేటలు అన్నీ మన పెళ్ళి జరగడానికి ఉపయోగపడితే బాగుండు'' అంది వినీష.

***

శరభ మాట్లాడటం మొదలు పెట్టాడు. "పౌర్ణమి రోజు పంచముఖ ఆంజనేయుణ్ణి శివ రూపంగా మేము కొలుస్తాం. అందుకే ఆరోజు ఆ గుడికి వచ్చాను. మేము జపం చేస్తూ ప్రతి 108 మార్లుకు ఒక్కసారి శిఖరాన్ని చూసి నమస్కరిస్తాం. ఆరోజు నేను జపం మొదలు పెట్టేసరికి కొద్దిగా సమయం మించింది. దాదాపు జపం పూర్తి అయిన సమయంలో శిఖరంపై ఆరు అంగుళాల మనుషులు ఏదో లాంతరు పట్టుకోవడం చూసాను. ఇంతలోనే పెద్ద మెరుపు, ఉరుము వచ్చాయి. కళ్ళు మూసి తెరిచేసరికి అవి మాయం అయిపోయాయి'' అని జరిగినదంతా పూసగుచ్చినట్టు చెప్పాడు.

"మరి ఈ సంగతి అప్పుడు ఎవరికీ ఎందుకు చెప్పలేదు?'' అన్నాడు మూర్తి.

"పూజారికి చెప్పడానికి ప్రయత్నం చేసాను కానీ, ఆయన హనుమంతుని గుడి పై అటువంటివి జరగవని వాదించాడు'' అన్నాడు శరభ.

"అదీ నిజమే కదా! మనకి దెయ్యం, భూతం అని భయమేస్తే ఆయన్ని తలుచుకుంటాము. ఆయన గుడి మీదికి అవి ఎలా వస్తాయి?'' అన్నాడు మూర్తి.

"అవి మరుగుజ్జు ఆకారంలో ఉన్నాయి అని అన్నాను గాని, అది ఏదో పిశాచి గణం అని నేను అనలేదు. మానవుల్లాగే వేరే జాతుల్లో కూడా దేవుడిని ఆరాధించే వాళ్ళు ఉండటం సహజం" అన్నాడు శరభ.

"అవి చూడటానికి ఎలా ఉన్నాయి?" అని అడిగిన మూర్తికి, శరభ వివరించి చెప్పాడు.

మూర్తికి అడవిలో చూసిన శౌంఠి గుర్తుకు వచ్చాడు. దానితో పాటు శ్రీశైల ద్వారకాపురి గుర్తుకు వచ్చింది. మరునాడు శ్రీశైలం బయలుదేరాలని నిర్ణయించుకున్నాడు.

***

శ్యామ్ సుందర్, వసుంధర రిక్షా దిగారు.

అదొక చిన్న పూరి గుడెసెలు ఉన్న ప్రదేశం. అక్కడక్కడా తప్ప పెద్ద జనం లేరు.

అటుగా బిందె పట్టుకుని వెళుతున్న ఒక మహిళని, "పాశాలమ్మ ఇల్లు ఎక్కడ?" అడిగాడు శ్యామ్.

ఆమె కొద్దిగా సంకోచంగా చూసి, "ముందుకు వెళ్ళి కుడివైపు సందులో తిరిగి ఎడమ వైపు ఉన్న రెండో ఇంట్లోకి వెళ్ళండి" అంది.

శ్యామ్ సుందర్ ముందు నడుస్తున్నాడు, వసుంధర అనుసరించింది.

"ఏమండి, ఇందాక రిక్షా వాడు ఉన్నాడని నేను అడగలేదు. అసలు ఈ అంజనం ఏమిటి?" అని అడిగింది.

"అంజనం అన్నది ఒక పురాతన కళ. పూర్వం కావాల్సిన వ్యక్తులు, వస్తువులు, జంతువులూ తప్పిపోయినప్పుడు వాటి జాడ కనుక్కోడానికి వాడేవారు. ఈ పద్ధతిలో మంత్రించిన నీటి ఉపరితలం పై మనకు కావాల్సిన సమాచారం కనపడుతుంది. నీళ్ళు మాత్రమే కాకుండా వివిధ సంస్కృతులు వారు నిప్పు (పైరోమాన్సీ), పొగ (క్యాప్నోమన్సీ) మరియు రాళ్ళు లేదా రత్నాలు (లిథోమాన్సీ) వంటి సహజ వస్తువులు వాడి ఈ అంజనం వేస్తారు. అయితే ఈరోజుల్లో వీటి మీద నమ్మకాలు అందరికి తగ్గాయి. కొంతమంది దీన్ని

వాడుకుని డబ్బు సంపాదించసాగారు. అందుకని మెల్లగా ఈ కళ కనుమరుగైపోయింది" అన్నాడు శ్యామ్.

"మరి ఈ పాశాలమ్మకు ఈ విద్య వచ్చా?" అంది వసుంధర.

"నాకు తెలీదు కానీ, వాళ్ళ అమ్మాయి కనిపించకపోతే ఆమె ఎక్కడ ఉందో సరిగ్గా చూసినట్టు చెప్పిందని, మా ఆఫీస్ గుమస్తా పార్థసారధి చెపితే విన్నాను" అన్నాడు శ్యామ్.

ఒక తాటాకు ఇంటి ముందుకి వచ్చి ఆగారు. బయట ఉన్న ఒక చిన్న అమ్మాయి "మామ్మ లోపల ఉంది రండి" అంది.

లోపల ఒక పండు వృద్ధురాలు ఉంది. శ్యామ్ ని చూసి "ఏమి కావాలో చెప్పండి! ఇంకొక పది నిముషాలు మాత్రమే తిది బాగుంది" అంది.

శ్యామ్.. వినీష గురించి చెప్పాడు. ఆమె అంతా విని, ఎదురుగా ఉన్న చాప మీద కూర్చోమని చెప్పింది. తలుపులు వేసి వచ్చింది అక్కడున్న అమ్మాయి. ఇంట్లో కరెంట్ లేనందువల్ల చీకటిగా ఉంది. ఇల్లంతా సాంబ్రాణి వాసనతో కొంచెం భీతావహ వాతావరణం నెలకొంది.

"ఎవరువారు ఎరుకవారు.. ఎవరువారు ఎరుకవారు.." అంటూ లయబద్ధంగా పలుకుతూ, ఎదురుగా ఉన్న నీటిలో చేతిని పెట్టి కలుపుతూ ఉంది పాశాలమ్మ.

"ఏమైనా కనిపించిందా?" అని అడిగింది. నీటి వైపే తదేకంగా చూస్తున్న చిన్న అమ్మయి, "ఇంకా ఏమిలేదు" అంది.

***

# PART 49

అమావాస్య ఇంకా మూడు రోజులు ఉండగా శొంఠి జాజి పెళ్ళి సంబరాలు మొదలయ్యాయి. రకరకాల సంగీత వాయిద్యాలు తీసుకువచ్చారు. విప్ప సారా వంటి ద్రవాన్ని తీసుకుని కొంతమంది సంగీత వాయిద్యాలను వాయిస్తుంటే, మరికొంత మంది శ్రావ్యంగా పాడుతున్నారు. తినడానికి అడవిలో ఉన్న ఫలాలు, దుంపలు తీసుకువచ్చారు. శొంఠి, జాజి చూడడానికి చాలా ముద్దుగా కనిపిస్తున్నారు. అందరితో పాటు విశాల్ కి, వినీషకి కొత్త బట్టలు ఇచ్చారు.

పెళ్ళి తంతు అయ్యింది. మరుగుజ్జులు అందరూ విశాల్, వినీష కూడా నాట్యం చేయాలని కోరారు. అప్పటివరకు వారి నాట్యాన్ని చూసిన విశాల్, వినీష వారిలాగానే నాట్యం చేయసాగారు.

ఇంతలో మరుగుజ్జులో ఒకడు విశాల్

పాదాలను చూపిస్తూ "దేవా.. దేవా.." అని గట్టిగా అరిచాడు.

అక్కడున్న అందరూ విశాల్ దగ్గరికి వచ్చి అతని పాదాలపై పడి నమస్కరించ సాగారు.

విశాల్ కి అర్థం కావడం లేదు. అప్పుడే వచ్చిన నాయక విశాల్ పాదాలపై పడి, "దేవా మమ్మల్ని అందరినీ పెద్ద మనసుతో మన్నించు. నువ్వు మాకోసమే వచ్చిన దేముడవని తెలియక, నిన్ను నానా యాతనా పెట్టాము" అంటూ తలొగ్గాడు.

"అసలు ఏమి జరుగుతుంది నాయక" అడిగాడు విశాల్.

"మీ పాదాలపై ఉన్న శూల ఆయుధం గుర్తు వల్ల మీరు మా దేముడని తెలిసింది. తరతరాలుగా మేము అనుభవిస్తున్న ఒక శాపం నుండి రక్షించడానికి

మీరు మా వద్దకు వస్తారని, మీ వల్ల మా జాతి శాపవిమోచనము అవుతుంది అని మా పెద్దలు ఎప్పుడో రాసి పెట్టారు" అన్నాడు నాయక.

విశాల్ తన పాదం వంక చూసుకున్నాడు. చిన్నప్పుడు సైకిల్ పైనుండి పడి పెడల్ కాలులో దిగడం వల్ల ఏర్పడిన గాయం తాలూకు మచ్చ ఉంది. అక్కడ అడవిలో మట్టి అంటుకోవడం వల్ల అది ఒక మార్క్ లా కనపడుతోంది.

"నాయకా, మీరు ఏదో పొరపడుతున్నారు. అది నాకు జరిగిన ఒక ప్రమాదంలో ఏర్పడిన గాయం" అన్నాడు విశాల్.

"గుర్తు ఏ రకంగా వచ్చింది అన్నది కాదు, ఆ గుర్తు ఉన్న మీరు మా దగ్గరకి వేంచేయడం మా అదృష్టం. ఇక నుండి మీరే మా అయ్య, ఆ తల్లే మా అమ్మ" వినీష వంక చూపిస్తూ అన్నాడు నాయక.

"అసలు ఈ శాపం ఏంటి? నేను మీకు ఏ రకమైన సహాయం చేయగలను చెప్పండి" అన్నాడు విశాల్.

నాయక చెప్పడం మొదలుపెట్టాడు.

***

అంజనం చూస్తున్న అమ్మాయి "హా.. కనపడుతోంది" అంది.

"ఏమి కనపడుతోంది" అంది పాశాలమ్మ.

"పంచారామానికి పడమరగా మల్లన్న కనుసైగల్లో, వనంలో రాణిలా ఉంది" అంది ఆ అమ్మాయి.

శ్యామ్, వసుంధరా అయోమయంగా చూస్తున్నారు.

"రాణి పక్కన రాజు, ఆడి పక్కన బంటు.." ఏదో ట్రాన్స్ లో ఉన్న దానిలా ఆ చిన్నపిల్ల చెప్పుకుపోతూ ఉంది.

కాసేపు అయ్యాక తంతు ఆగిపోయింది. ఆ చిన్నపిల్ల లేచి వెళ్ళిపోయింది.

"తీరిగ్గా వచ్చిన పాశాలమ్మ, మీ కూతురు శ్రీశైలంకి పడమరన ఉన్న అడవిలో ఉంది" అంది.

శ్యామ్, వసుంధర ఇంకా మారు మాట్లాడకుండా బయలుదేరారు.

"దిక్కుమాలిన సంత, ఇంకా నయం చంద్ర మండలంలో ఉందని చెప్పలేదు" అంది వసుంధర.

శ్యామ్ సుందర్ ఏం మాట్లాడలేదు.

'ఎక్కడ ఉన్నవురా తల్లి?' అనుకున్నాడు. ఏమైపోయిందో అని లోలోపల తల్లడిల్లిపోతున్నాడు.

***

మూర్తి శ్రీశైలంలో బస్ దిగాడు. మల్లన్న దర్శనానికి వచ్చిన భక్తులతో కిటకిటలాడుతోంది. దిగిన వెంటనే శ్రీశైలం శివాలయంలో దూరి దర్శనానికి ఉపక్రమించాడు. వృద్ధ మల్లన్న, పెద్ద మల్లన్నకు మొక్కి విశాల్ ఎక్కడ ఉన్నా క్షేమంగా ఉండాలని మొక్కాడు. భ్రమరాంబ దర్శనం అయ్యాక బయటకి వచ్చి ఎదురుగా ఉన్న గట్టు పై కూర్చున్నాడు. ఎండ కొద్దిగా జోరుగా ఉంది.

ఈలోపు ఒక ముసలి అవ్వ వచ్చి, "చల్లని మజ్జిగ తాగుతావా బాబు?" అని అడిగింది.

"ఆ ఇవ్వు" అంటూ తీసుకున్నాడు మూర్తి.

ముసలి అవ్వని చూస్తే జాలి అనిపించింది.

చిల్లర ఇవ్వబోతే "వద్దులే ఉంచుకో.. చల్లగా ఉండు నాయన" అంది.

"అవ్వా నేను ఒక విషయం అడగాలి. నువ్వు ఇక్కడ ఉండేదానివేనా?" అన్నాడు మూర్తి.

"అవును అయ్యా, మేము చెంచులం. నల్లమల అడవిలో ఉంటాం" అంది అవ్వ.

"నా స్నేహితుడు ఒకడు తప్పి నల్లమలలో చిక్కుకున్నాడు. అక్కడ ఉన్న మరుగుజ్జులు వాడిని తీసుకెళ్ళారని నాకు సమాచారం అందింది. వారి గురించి నీకు తెలుసా?" అని అడిగాడు.

"మరుగుజ్జులా..! ఎప్పుడో మా తాత చిన్నతనంలో చెపితే విన్నాను కానీ, నేను ఎప్పుడు చూడలేదు" అంది అవ్వ.

"మరి ఎవరిని అడిగితే తెలుస్తుంది?" అన్నాడు.

"ఇక్కడ అడిగి ఫలితం లేదు, తెలిసినా నీకు చెప్పరు. అడవిలో ఇష్టకామేశ్వరి అమ్మవారి గుడి ఉంది. అక్కడి పూజారి మా చెంచు జాతి వాడు పెద్దవాడు. అతనికి నల్లమలలో తెలియని రహస్యం లేదు, అక్కడికి వెళ్ళి ప్రయత్నం చెయ్యి" అంది అవ్వ.

"ఇష్టకామేశ్వరి అమ్మవారు ఎవరు?" అన్నాడు మూర్తి.

"శ్రీశైలం సమీపంలోని నల్లమల కొండల్లో ఉన్న ఈ ఆలయాన్ని ఇష్టకామేశ్వరి ఆలయం అని పిలుస్తారు. దుర్గామాత భక్తుడైన ఇంద్రసేన అనే రాజు ఈ ఆలయాన్ని నిర్మించాడని పురాణాలు చెబుతున్నాయి. ఒకరోజు ఇంద్రసేనుడు అడవిలో వేటాడుతుండగా ఒక గేదె ఎదురైంది. గేదె మారువేషంలో ఉన్న రాక్షసుడు, అది ఇంద్రసేనపై దాడి చేసింది. ఇంద్రసేనుడు ధైర్యంగా పోరాడాడు కానీ, అతను రాక్షసుడికి సాటి కాదు. రాక్షసుడు ఇంద్రసేనను చంపబోతున్నట్లుగా అనిపించినప్పుడు దుర్గాదేవి ప్రత్యక్షమై రాక్షసుడిని చంపింది.

అప్పుడు దేవత ఇంద్రసేనునికి తాను ప్రతి అమావాస్యకు ఆలయానికి వచ్చి గేదె తింటానని చెప్పింది. దెయ్యాల బారిన పడకుండా ఉండేందుకు ఇదే మార్గం అవుతుందని చెప్పింది. ఇంద్రసేనుడు అంగీకరించాడు. అప్పటి నుండి ఈ ఆలయం దుర్గాదేవి భక్తులకు ఆరాధనా స్థలంగా ఉంది. ఆవిడ నుదుట బొట్టు పెట్టి, కోరుకున్న కోరిక ఏదైనా తీరుస్తుంది అని ప్రతీతి కానీ, అక్కడికి చేరుకునే మార్గం చాలా క్లిష్టంగా ఉంటుంది. రోజుకు నూటా యాభై మంది మాత్రమే వెళ్ళే వీలు ఉంది. అమావాస్య రోజు అక్కడికి వెళ్ళడం నిషిద్ధం" అంది అవ్వ.

"సరే నేను ఇప్పుడే బయలుదేరుతాను" అంటూ కదిలాడు మూర్తి.

***

# PART 50

నాయక తమ శాప వృతాంతము చెపుతున్నాడు.

"మనుషులతో మోసగింపబడ్డ మేము అడవికి వచ్చి, ఇక్కడకి దగ్గరలో ఉన్న దేగల దీవిలో స్థిరపడ్డాము. మేము జన్మతా శివ భక్తులం. పశుపతి నాథుడిని కొలవనిదే మాకు రోజు మొదలు కాదు. దేగల దీవి చుట్టూ ఉన్న నీటిలో మొసళ్ళు ఎక్కువగా ఉండటం వల్ల అది ఒక కందకంలా పని చేసి, మానవులు మా చెంతకు రాకుండా కాపాడుతుంది. దీవిలో మాకు కావాల్సిన పళ్ళు ఫలాలు దుంపలు రకరకాలు పుష్కలంగా ఉండటం వల్ల మేమందరం ఎంతో హాయిగా బ్రతికేవాళ్ళము. కొన్ని ఏళ్ళు గడిచింది, మా కష్టపడే తత్వం వల్ల దీవి చాలా అందంగా తయారయ్యింది. రకరకాల పుష్ప జాతులు అక్కడికి వలస వచ్చే పక్షుల ద్వారా అభివృద్ధి చెంది, ఎంతో మనోహరంగా మారిపోయింది.

దీవిలో ఉన్న పశుపతి నాథుడు సాక్షాత్తు వజ్ర లింగం ఆయన వెదజల్లే కాంతితో మాకు ప్రతి రాత్రి పున్నమి రాత్రే అయ్యింది. పగలు సూర్యుడు, రాత్రి స్వామి మాకు కాంతిని ఇచ్చేవారు. తలుచుకుంటే ఇప్పటికీ నా మాది పులకరిస్తుంది.

అలా పశుపతి నాథుని దయతో కాలం గడిచిపోతున్న మాకు, ఒక అమావాస్య జీవితాన్ని అంధకారం చేసేసింది. అమావాస్యలో కూడా మెరిసిపోయే మా దీవి పై హరాళి అనే యక్షిణి కన్ను పడింది. తన ప్రియునితో భూలోకానికి విహారానికి వచ్చి, మా దీవిలో దిగి అక్కడ సంచరించసాగింది. దానికి మాకు ఎంటువంటి అభ్యంతరం లేదు. ఆ సర్వేశ్వరుడు ఈ ప్రపంచాన్ని అందరి కోసం

సృష్టించాడని నమ్మే జాతి మాది. ప్రతి అమావాస్యకు మా దీవి చేరి తన ప్రియునితో ప్రణయ కలాపాలు చేసేది హరాళి.

ఒకరోజు పశుపతి నాథునికి పెట్టిన ప్రసాదాన్ని సురా పాన మత్తులో తస్కరించింది. అమావాస్య రోజు మేము ఉపవాస దీక్ష చేసి, కేవలం ఆయన ప్రసాదం మాత్రమే స్వీకరిస్తాం. ప్రసాదం లేకపోతే దీక్ష భగ్నం అవుతుందని రోజూ పూజ చేసే మా అమ్మ, నాన్న కొన్ని ఫలాలు తీసుకు వెళ్ళి, ప్రసాదం తమకు వదిలేయమని ఫలాలను ఆరగించమని కోరారు. అహం దెబ్బ తిన్న హరాళి వారిని తినేసింది. దానితో మేము ఎదురు తిరిగాం. మద అహకారంతో, మత్తులో ఉన్న హరాళి ప్రియుడు ఆలయంలోకి వెళ్ళి లింగాన్ని పెకిలించాలని చూసాడు.

పశుపతి నాథుడికి ఆగ్రహం రావడం వల్ల అక్కడికక్కడే వాడు రక్తం కక్కుకుని మరణించాడు. అది చూసి హరాళి అక్కడి నుండి పారిపోయింది. జాతి పెద్దలు మరణించడంతో మేము దిక్కు తోచని వారం అయ్యాము.

అప్పటి నుండి ప్రతి అమావాస్యకి మా దీవికి వచ్చి దొరికిన వారిని తీసుకుని తినేయసాగింది. అలా కొన్ని వేలు ఉండే మా జాతి, కొద్ది కాలంలోనే చాలా తక్కువ సంఖ్యకు పడిపోయింది. మాకు అమావాస్య కాళరాత్రిగా మారిపోయింది. అప్పటి నుండి ప్రతి అమావాస్య ఆలయంలో జాగారం చేసే వాళ్ళం. కొన్నాళ్ళు అలా గడిచింది అసలు అది మా దీవికి ఎలా వస్తుందో తెలుసుకోవాలని మేము ప్రయత్నం చేసాం. మా అందరిలో తెలివైన వాడు రోచి, వాడికి ఆ పని అప్పచెప్పాము.

ఒక అమావాస్య రోజు కాపు కాసి, తేజో ద్వీపం సాయంతో హరాళి మా వద్దకు వస్తుందని తెలుసుకున్నాడు రోచి. ఒక పథకం ప్రకారం దాన్ని ఎత్తుకుని వచ్చాడు రోచి. తేజో ద్వీపం లేకుండా అది తిరిగి తన యక్షలోకం వెళ్ళలేదు. అది మేము తస్కరించాము అని తెలియగానే హరాళి కోపంతో ఊగిపోయింది. ద్వీపంలో ఉన్న వృక్ష, జంతు, జాతులను నాశనం చేసింది. చివరికి గుడి లోపలి వరకు వచ్చి ఎదురుగా ఉన్న రోచిని కాలుతో తన్నింది.

రోచి తప్పించుకున్నాడు. హరాళి కాలు లింగానికి తాకింది. మేము చూస్తూ ఉండగానే దాని కళ్ళు నీటి బుడగలుగా పేలిపోయాయి. ఆమె అంధురాలు

అయిపోయింది. ఆ సంఘటనతో శివలింగం కాంతిని కోల్పోయింది. ఆమె అక్కడ కూర్చుని తాను కావాలని అపరాధం చేయలేదని, తన తేజో ద్వీపాన్ని దొంగిలించిన వాళ్ళను దండించే క్రమంలో అనుకోకుండా జరిగిన తప్పు అని ఆ దేవదేవుని ప్రార్థించింది. ఆ సమయంలో రోచి పొరపాటున తనకు ఏ తేజో ద్వీపం తెలియదని అబద్ధం చెప్పాడు. దేవదేవుని ముందు అబద్ధం ఆడితే పచ్చిమాంసం తినే పాముగా మారిపొమ్మని శపించింది హరాళి. అలా మారిపోయిన రోచినే మీరు చూసింది'' అన్నాడు నాయక.

“ఎప్పుడో చిన్నప్పుడు చదివిన చందమామ కథలా ఉంది” అంది వినీష.

“పోయిన కళ్ళు తిరిగి ఇమ్మని ప్రాధేయపడింది హరాళి. ‘చేసిన పాపం తీరే వరకు ఆ శిక్ష తప్పదని, తిరిగి కళ్ళు ఇవ్వగలిగిన వాడు ఆ పశుపతి నాథుడే’ అని అశరీరవాణి పలికింది.

‘పాపకర్మ పోవాలంటే ఏమి చేయాలి?’ అని అడిగిన ప్రశ్నకు,

‘శివలింగానికి తిరిగి పూర్వ కాంతి వచ్చేవరకు ప్రతి అమావాస్యకు పూజ చేయాలనీ, లింగానికి అమర్చిన వజ్రాల సహాయంతో మనోనేత్రం ద్వారా అప్పటి వరకు చూడవచ్చు’ అని చెప్పింది అశరీరవాణి.

వెంటనే ఆమె శివలింగాన్ని తడిమి, దానికి అమర్చి ఉన్న వజ్రాలను తీసుకుంది. కళ్ళు లేకపోయినా లేచి బయటకు వెళ్ళింది.

ఎవరినో గట్టిగా పిలిచింది. ఇంకొక యక్షిణి ప్రత్యక్షం అయ్యింది. అయితే ఆమె ఆలయం లోపలికి రాకుండా ఉండిపోయింది. వారిద్దరూ కలిసి ఏవో మంత్రాలు వల్లించారు. క్రమంగా దీవిలో చెట్టూ చేమా మాయం కాసాగింది.

మేము లింగానికి సాష్టాంగ పడ్డాము. ‘మేము నిన్నే నమ్ముకుని ఉన్నాము’ అని ప్రార్థించాం.

దయామయుడైన పశుపతి నాథుడు పలికాడు, ‘మీరు శ్రీశైల మల్లన రక్షణలో ఉన్న నల్లమల వెళ్ళిపొమ్మని, మా కోసం తన అంశతో పుట్టిన వాడు తిరిగి దేగల దీవికి మమ్మలిని తీసుకువస్తాడని’ పలికాడు. ఆయన్ని ఎలా గుర్తు పట్టాలని అడుగగా అతని పాదం పై రక్షణ ముద్ర ఉంటుందని చెప్పి ఈ రావి

ఆకుని మాకు ప్రసాదించారు. మీ రాక కోసం మేము ఎంతో ఎదురు చూసాము. ఇన్నాళ్ళకు మీరు వచ్చారు" అన్నాడు నాయక.

ఆ రావి ఆకుని చూసి ఆశ్చర్యపోయాడు విశాల్.

'ఏంటి నేను నిజంగా శివాంశ సంభూతుడినా!' అనుకున్నాడు.

"మరి అక్కడి నుండి ఎలా బయటపడ్డారు?" అడిగింది వినీష.

"దేవదేముడు పలికిన తరువాత మాకు ఎంతో సమయం లేదు. హరాళి అప్పటికి ఆలయం తప్ప అన్నిటినీ మాయం చేసింది. ఈలోపు పత్రి తేజో ద్వీపం సాయంతో మమ్మల్ని అందరిని అక్కడి నుండి ఇష్టకామేశ్వరి దేవి గుడికి మరల్చాడు కానీ, లింగానికి వెనుక ఉన్నా వారు అక్కడే ఉండిపోయారు. అందులో నా కుమారుడు బీక్యా, నా భార్య మృది కూడా ఉన్నారు" అని కన్నీళ్ళు పెట్టుకుంటూ చెప్పాడు నాయక.

"దయచేసి బాధపడవద్దు, ఆ పరమశివుడు అంతా మంచి చేస్తాడు" అన్నాడు విశాల్.

"ఇప్పటకీ హరాళి ఉందా?" అని అడిగింది వినీష.

"హా.. ప్రతి అమావాస్యకు అక్కడికి వచ్చి వజ్రాలను పరిచి, ఆ కాంతిలో గుడిలోకి వెళుతుంది. బ్రహ్మ కాలం వరకు పూజలు చేసి తిరిగి వెళుతుంది. డేగల దీవి కేవలం అమవాస్య రోజు మాత్రం కనిపిస్తుంది. మిగిలిన దినాలలో అది అదృశ్యమౌతుంది" అన్నాడు నాయక.

"మరి మీరు తేజో ద్వీపం సాయంతో ఎప్పుడూ వెళ్ళడానికి ప్రయత్నం చెయ్యలేదా?" అన్నాడు విశాల్.

"పశుపతి నాథుని మాట మాకు శాసనం కనుక మీరు వచ్చే వరకు వేచి ఉన్నాం" అన్నాడు నాయక.

"హరాళి గురించి నేను మా ప్రపంచంలోనే విన్నాను. ఇది బయటకు ఎలా పొక్కింది?" అని అడిగాడు.

"ఈ చుట్టుపక్కల తప్పస్సు చేసే చాలామందికి హరాళి గురించి, అమావాస్య రోజు ఆమె ఆగమనం గురించి తెలుసు. వాళ్ళు వజ్రాల వేటలో వెళ్ళి

హరాళికి ఆహారం అయిపోయారు. అతి కొద్దిమంది ప్రాణాలతో బయటపడ్డారు. వారి ద్వారా ఇది వ్యాప్తి చెంది ఉండవచ్చు" అన్నాడు నాయక.

"వజ్రాల వేటకై ఇక్కడికి వచ్చే చాలామందిని మేము భయపెట్టి వెనుకకు పంపుతాం. భయపడని వాళ్ళను నామం పెట్టి గుడికి వెళ్ళేలా చేస్తాం. అక్కడి ప్రధాన అర్చకుడు ఎన్నో తరాలుగా మాకు స్నేహితులు. వారు నామం చూసి వజ్రాల వేటకు వచ్చారని తెలుసుకుని, మంచి మాటలు చెప్పి వెనుకకు పంపిస్తారు" అని ముగించాడు నాయక.

***

# PART 51

ఇష్టకామేశ్వరి ఆలయానికి బయలుదేరాడు మూర్తి. అక్కడికి వెళ్ళడానికి కొన్ని లోకల్ రిజిస్టర్డ్ జీప్స్ ద్వారా రోజుకి కేవలం 150 మందికి మాత్రమే ప్రవేశముంటుంది. తను వెళ్ళి లైన్ లో నిలబడి వెయిట్ చేస్తుంటే, ఆఖరికి తన వంతు వచ్చింది. జీప్ లో ఒక మూల ఎక్కి కూర్చున్నాడు. గుట్టలు, కొండల నడుమ సాగుతున్న ప్రయాణంలో జీప్ ఎత్తి కుదేస్తోంది. అలా ముప్పై నిమిషాలకి ఇష్టకామేశ్వరి ఆలయానికి చేరుకున్నాడు.

"తిరిగి వెళ్ళడానికి ఇంకా ముప్పై నిముషాల టైమ్ మాత్రమే ఉంది. తొందరగా దర్శనం చేసుకుని రండి. సాయంత్రం ఐదు గంటలు తరువాత ఇక్కడ వన్య మృగాల సంచారం వల్ల మనుగడ చాలా ప్రమాదం" అన్నాడు జీప్ డ్రైవర్.

ఆ మాట వినడం ఆలస్యం.. అందరూ దర్శనానికి పరుగులు తీశారు. మూర్తి మొదటి లైన్ లో ఉండటం వల్ల దర్శనం చాలా ఈజీగా జరిగిపోయింది. అమ్మవారి ముందు తన స్నేహితుడు విశాల్ క్షేమంగా ఉండాలని కోరుకున్నాడు.

ఆలయం బయటికి వచ్చి, కొబ్బరి చిప్ప పగలగొట్టి ప్రసాదం తింటున్న మూర్తి దగ్గరికి ఒక పూజారి వచ్చి, "నాకు మజ్జిగ అమ్మే ముదుసలి మంగమ్మ సమాచారం పంపింది. నువ్వు నీ స్నేహితుడిని వెతుకుతున్నావట కదా! అతని గురించి ఇంకేమైనా వివరాలు చెప్పగలవా!?" అని అడిగాడు.

మూర్తి, విశాల్ గురించి వివరించి చెప్పాడు. అంతేకాక శరభ చెప్పిన మరుగుజ్జులు గురించి కూడా చెప్పాడు.

"మరుగుజ్జుల గురించి నేను వినడమే గాని, ఎటువంటి ఆచూకీ తెలియదు. అడవిలో ఎక్కడో దాగున్న పసుపతి నాథుని ఆలయాన్ని మరుగుజ్జులు నిర్మించారని అంటుంటారు. మీరు అక్కడికి చేరుకుంటే విశాల్ గురించి వివరాలు తెలియవచ్చు" అని అన్నాడు పూజారి.

మూర్తి, 'అలాగే'నంటూ పూజారి చూపిన దిశ వైపు కదిలాడు.

అంతలో అతన్ని తీసుకు వచ్చిన జీప్ డ్రైవర్, "అటు ఎటు వెళుతున్నావ్? సమయం దాటుతుంది బయలుదేరి వెళ్ళాలి" అంటూ పిలిచాడు.

"హా! వస్తున్నా, లఘుశంకకు పోవాలి" అని చెప్పి పొదలమాటుగా బయలుదేరాడు మూర్తి.

***

నాయక చెప్పిన కథ అంతా విన్న విశాల్, "నాకు కొన్ని సందేహాలున్నాయి. వాటికి సరైన సమాధానాలు ఇవ్వు" అని అడిగాడు.

నాయక వెంటనే, 'సరే' నన్నాడు.

"మీ కథ అంతా పశుపతి నాథుని ఆలయంలో ఉన్న పూజారికి తెలుసు. అంటే మీరు వారితో ప్రతి రోజు సంభాషిస్తారా?" అని అడిగాడు విశాల్.

"మేము పరస్పర మానసిక సమాచార సందేశాల ద్వారా మా విషయాలను పంచుకుంటాము. దీని కోసం మేము భౌతికంగా కలవాల్సిన పనిలేదు" అన్నాడు నాయక.

"ఇదేదో వింత భాషలా ఉంది" అంది వినీష.

విశాల్ చిరునవ్వుతో, "మనస్సుతో కమ్యూనికేట్ చేసే లేదా మాట్లాడే సామర్థ్యాన్ని తరచుగా టెలిపతిగా సూచిస్తారు. టెలిపతి అనేది వ్యక్తుల మౌఖిక లేదా భౌతిక సంభాషణ అవసరం లేకుండా ఆలోచనలు, భావాలు లేదా సమాచారాన్ని నేరుగా ఒక మనస్సు నుండి మరొక మనస్సుకు ప్రసారం చేయగల భావన. ఇది ఒక రకమైన ఎక్స్ట్రాసెన్సరీ పర్సెప్షన్ (ESP)గా పరిగణించబడుతుంది. సాధారణంగా సైన్స్ ఫిక్షన్ తో పాటు పారానార్మల్ సాహిత్యంలో ఇది పూర్తిగా వివరించబడింది. అయినప్పటికీ, టెలిపతి అనేది శాస్త్రీయంగా నిరూపించబడలేదు" అన్నాడు విశాల్.

"ఇదంతా నాకు పెద్ద మాయాజాలంలా ఉంది" అంది వినీష.

విశాల్.. నాయక వంక తిరిగి, "కొద్దిగా తేజో ద్వీపం గురించి వివరిస్తారా!" అని అడిగాడు.

"తేజో ద్వీపం ఒక అద్భుతమైన సాధనం. దీనిని ఉపయోగించి మెరుపు వేగంతో పనులు చక్కపెట్టవచ్చు. మీరు అనుకున్న చోటుకు మెరుపు వేగంతో

మానసికంగా, శబ్ద వేగంతో భౌతికంగా చేరుకోవచ్చు. హరాళి దీనిని ఉపయోగించే భువరలోకం నుండి భూలోకానికి చేరుకుంటుంది" అన్నాడు నాయక.

"సరే, మరి ఫలానా చోటుకి తీసుకు వెళ్ళమని ఎలా చెప్పగలరు?" అని అడిగాడు విశాల్.

"ఇది చాలా సులభం. పాతతరం దేవాలయాలన్నీ గోపురాలు కలిగి ఉంటాయి. వీటికి విమానాలు అని ఇంకొక పేరు కూడా ఉంది. ప్రతి గ్రామంలో ఉన్న గ్రామ దేవత ఆలయ గోపురం తేజో ద్వీపానికి అనుసంధానించబడి ఉంటుంది. దీని ద్వారా మేము ఒక గ్రామం నుండి ఇంకో గ్రామానికి క్షణంలో చేరుకుంటాం" అన్నాడు నాయక.

విశాల్ కి ఇప్పుడు పూర్తిగా అవగతం అయ్యింది. తనని వినీషని మరుగుజ్జులు ఎలా ఎత్తుకుని వచ్చారో!

"ఇప్పుడు మన తక్షణ కర్తవ్యం ఏమిటి!?" అని అడిగాడు విశాల్.

"రేపు అమావాస్య.. కాబట్టి రేపటి వరకు నిరీక్షించాలి" అన్నాడు నాయక.

వినీషని చూస్తూ, "రేపు నేను వీళ్ళతో చేయబోయేది సాహసం. ఇందులో గెలుపో, ఓటమో నాకు తెలియదు. నన్ను నమ్మి అర్థిస్తున్న వీరిని నేను కాదనలేను. దయచేసి నువ్వు ఇంటికి వెళ్ళు. నేను ఈ పని పూర్తయ్యాక నీ దగ్గరకు వస్తాను" అన్నాడు విశాల్.

"ఆ మాట మాత్రం అనవద్దు. చావో బతుకో నీతోనే అని నీకు చాలా సార్లు చెప్పాను కనుక, నేను నీతోనే ఇక్కడ ఉంటాను" అంది వినీష.

ఇంకా ఏదో చెప్పబోతున్న విశాల్ నోటిని తన మునివేళ్ళతో అడ్డుకుంది వినీష.

ఎంతవారలు గాని కాంతదాసులే అన్నట్టు.. విశాల్ అన్నీ తెలిసి కూడా వినీషకి వద్దు అని చెప్పలేకపోయాడు.

"నేను ఒకసారి పూజారిని కలిసి రావచ్చా?" అని అడిగాడు. దానికి 'సరే' అన్నాడు నాయక.

***

# PART 52

చీకటి పడుతోంది. అడవిలో మూర్తి ఒక్కడే నడిచి వెళ్తున్నాడు. అమావాస్య దగ్గర పడటంతో వెన్నెల వెలుగు కూడా పెద్దగా లేదు. కీచురాళ్ళు చెవులు గళ్ళు పడేలా అరుస్తున్నాయి. కళ్ళకు కనపడిన ఎండు కర్ర ఒకటి తీసుకుని, దొరికిన ఎండుటాకులు దానికి చుట్టి వెలిగించాడు. నడుస్తున్న కాలిబాట పట్టుకుని ముందుకు వెళుతున్నాడు.

'అసలు ఈ అడవిలో ఇంకో గుడి ఎందుకు ఉంది. ఉంటే బయట ప్రజలకు ఎందుకు తెలీదు? ఇక్కడకి ఎవ్వరినీ రానివ్వకపోవడానికి కారణం ఏమైయుంటుంది! అసలు విశాల్ ని మరుగుజ్జులు తీసుకుని వచ్చారా? వినీషతో కలిసి వీడే వచ్చాడా?' మూర్తి బుర్ర నిండా ప్రశ్నలు.

వెనుక ఏదో చప్పుడు వినిపించగానే వెనుతిరిగి చూసాడు. ఎవరూ కనిపించలేదు. ఇంకాస్త ముందుకు నడిచాడు. ఎవరో వెంబడిస్తున్న శబ్దం ఇంకా ఎక్కువ అయ్యింది. పరిగెత్తడం మొదలు పెట్టాడు మూర్తి.

***

విశాల్ పూజారిని కలుస్తానని అడగగానే, అతని నుదుటికి నామం పెట్టి వెళ్ళమని చెప్పాడు నాయక.

వినీష, విశాల్ పశుపతి నాథుని ఆలయంలోకి వెళ్ళారు.

అతి కొద్దిమంది మాత్రమే ఆలయ ఆవరణంలో ఉన్నారు. అంతకు ముందే నాయక సమాచారం పంపాడేమో! పూజారి పలకరింపుగా నవ్వాడు.

అతనికి ఇద్దరు నమస్కారాలు చేయగానే, 'దీర్ఘాయుష్మాన్ భవః' అని దీవించి, "వెళ్ళి దర్శనం చేసుకుని రండి" అని చెప్పాడు.

లోపల వేదాల మంత్రగోషతో జరుగుతున్న అభిషేకం తిలకించి ఇద్దరూ బయటికి వచ్చారు.

ఎదురుగా ఉన్న మండపంలో కూర్చుని, ప్రసాదం తింటూ, "బహుశా నేను ఎందుకు వచ్చానో మీకు తెలుసు అనుకుంటా!" అన్నాడు విశాల్.

అవునన్నట్లు తల పంకించాడు పూజారి.

"ఇక్కడికి వచ్చే వాళ్ళను భయపెట్టి తిరిగి వెనుకకు పంపవలసిందిగా నాకు అంగుష్ఠులు (మరుగుజ్జులు) సమాచారం పంపుతారు కానీ, మొట్టమొదటి సారిగా వచ్చేది సాక్షాత్తు తమ దైవం అని, అడిగిన ప్రశ్నలన్నిటికీ సమాధానాలు చెప్పమని నన్ను అభ్యర్థించారు. నీవు వచ్చిన తరువాత నీ తేజస్సు, నీ పాదాలకు పైన ఉన్న శివశక్తి అక్షరేఖను పోలిన గుర్తు చూసి నాకు అర్థం అయ్యింది. వచ్చింది సామాన్యుడు కాదు" అని అన్నాడు పూజారి.

"అయ్యో! దయచేసి మీలాంటి పెద్దలు నాలాంటి అర్భకులను పొగడకూడదు. నేను మామూలు మనిషిని. అరిషడ్వర్గాలు కూడా జయించలేని సామాన్యుడిని" అని అన్నాడు విశాల్.

"నీ మాటలోనే తెలుస్తుంది నాయనా! నీ గొప్పతనం. దయచేసి నీకు నేను ఏమి సహాయం చేయగలనో చెప్పు" అన్నాడు పూజారి.

"హరాళి గురించి తెలిసి కూడా దేగల దీవికి వెళ్ళి అక్కడ ఉన్న వజ్రాలను తీసుకుని వచ్చినవారు ఎంతమంది మీకు తెలుసు?" అని అడిగాడు విశాల్.

"దాదాపు ఎవ్వరు లేరు. ఒక్క తెల్లదొర, అతని బంటు తప్ప" అన్నాడు పూజారి.

విశాల్ వెంటనే, "ఈ నడుమ కాలంలో.." అని అడగగానే,

"ఒక నెల క్రితం మాత్రం ఇద్దరు వచ్చారు. నేను ఎంత చెప్పినా వినలేదు. వారు మరి వెళ్ళారో లేదో నాకు తెలీదు" అన్నాడు పూజారి.

పూజారి వహీద్, బాల గురించి చెపుతున్నాడని విశాల్ కి అర్థం అయ్యింది.

"తెల్లదొర తన బంటుతో వచ్చినపుడు ఎలా తప్పించుకున్నారు? మీ దగ్గర ఏమైనా సమాచారం ఉందా?" అని అడిగాడు విశాల్.

"హా! అది వాళ్ళ అదృష్టం. వారు వెళ్ళిన రోజు దీపావళి అమావాస్య కాబట్టి, యక్షిణి వారిని తినకుండా, వజ్రాలపై ఆశ కలిగినవాడిని దండించి, లేనివాడికి వరం ఇచ్చి వదిలిపెట్టింది" అన్నాడు పూజారి.

"ఇప్పుడు నేను వెళ్ళి యక్షిణిని ఎదుర్కోవాలంటే నా వల్ల అయ్యే పనేనా?" అడిగాడు విశాల్.

"హరాళితో యుద్ధం మానవ మాత్రులకు అసాధ్యం. డేగల దీవిని తిరిగి మరుగుజ్జులు పొందాలంటే రెండే మార్గాలున్నాయి. ఒకటి, హరాళి శాప విమోచనం జరిగి ఆమె కళ్ళు ఆమెకు రావాలి. రెండు, ఆమె తనంతట తానుగా భూలోకం రావడం మానేయాలి" అన్నాడు పూజారి.

"రెండూ మన వల్ల కాని పనులు. ఇంకేదైనా దారి ఉంటే చెప్పండి" అన్నాడు విశాల్.

"ద్వీపంలో వచ్చే వజ్రాల వెలుగు మానవ మాత్రులు చూడలేరు. చూసినా కూడా వెంటనే కళ్ళు పోతాయి" అన్నాడు పూజారి.

"మరి తెల్లదొర అతని బంటు ఎలా చూసారు?" అన్నాడు.

"దానికి ఒక పరిష్కారం ఉంది. ఆవు నెయ్యితో చేసిన కాటుక పెట్టుకోవడం వల్ల కంటికి ఎటువంటి హాని కలుగదు. బహుశా అదే వాళ్ళు చేసి ఉండవచ్చు. ఇప్పుడు హరాళి చూసేది, ఆ వజ్రాల వెలుగులో మనో నేత్రంతో! సాధారణంగా నిశాచరులు (రాత్రి పూట తిరిగే జీవాలు) శత్రువుని కళ్ళు చూసి గుర్తుపడతాయి కనుక, ఈ కాటుక హరాళి దృష్టిలో మీరు పడకుండా కూడా కాపాడవచ్చు కానీ, ఇది ఒక ఊహా మాత్రమే" అన్నాడు పూజారి.

"ఇవన్నీ మీకు ఎవరు చెప్పారు?" అడిగాడు విశాల్.

"మా వంశంలో తరతరాలుగా ఇక్కడే ఉన్నాం. మాకు చిన్ననాటి నుండి ఈ విషయాలు చెప్పేవారు. నా ముందు తరం వరకు ఈ విషయాలు మామూలుగానే చర్చించేవారు. చాలామంది వజ్రాలకు ఆశపడి హరాళికి బలైపోయారు. ఇక అప్పటి నుండి ఈ విషయాలు రహస్యాలుగా మారిపోయాయి. మేము కూడా దీనిని ఎవరితోనూ చర్చించము. ఇంతకన్నా నా దగ్గర ఎటువంటి సమాచారం లేదు" అన్నాడు పూజారి.

విశాల్ కి తాను జర్మన్ బుక్ లో చదివింది గుర్తు వచ్చి, “గుడికి వంద అడుగుల దూరంలో ఉండాలని ఏమైనా నియమం ఉందా?” అడిగాడు.

ఆ మాట విని పూజారి విస్తుపోయాడు. “ఈ విషయం నీకు ఎలా తెలుసు?” అన్నాడు.

“మీ తండ్రిగారి పేరు?” అని అడిగాడు విశాల్.

“శివ సాధు, ఎందుకు అడుగుతున్నావు?” అని అడిగాడు పూజారి.

“ఈ విషయాలు అన్ని తెల్ల దొరకి మీ తండ్రిగారు చెప్పినట్లు ఆయన ఒక పుస్తకంలో రాసుకున్నాడు” అని చెప్పాడు విశాల్.

“ఆ దీవిలో దిగిన వెంటనే హరాళి వెదజల్లే వజ్రాలు ఒక ఎత్తు అయితే వంద గజాల నుండి ఒకొక్క గజానికి పరిచే వజ్రాలు ఒక ఎత్తు. అవి చాలా శక్తివంతమైనవి. ఈ వంద వజ్రాలు, గర్భగుడిలో లింగం పైన పెట్టి పూజ చేసే ఎనిమిది కలిపి నూట ఎనిమిది రుద్రాక్ష వజ్రాలు ఆయనకెంతో ప్రియం. అందువల్ల ఆ వజ్రాలు హరాళి పూజలో చాలా ముఖ్యం” అన్నాడు పూజారి.

“ఇంక నాకు మిగిలింది రెండు ప్రశ్నలు..” అన్నాడు విశాల్.

“ఏంటో చెప్పు” అన్నాడు పూజారి.

“నేను వచ్చాక శివశక్తి అక్షరేఖ అని చెప్పారు, అంటే ఏంటి?” అన్నాడు.

“మంచి ప్రశ్న, 79° E 41'54 యొక్క ఒకే భౌగోళిక రేఖాంశంలో 8 రహస్యమైన పురాతన దేవాలయాలు ఉన్నాయి. ఈ ప్రసిద్ధ ఆలయాలు కేదార్ నాథ్ ఆలయం (ఉత్తరాఖండ్), కాళేశ్వర ముక్తీశ్వర స్వామి ఆలయం (తెలంగాణ), శ్రీకాళహస్తి ఆలయం (ఆంధ్రప్రదేశ్), ఏకాంబరేశ్వర ఆలయం, జంబుకేశ్వర ఆలయం, అన్నామలైయార్ ఆలయం, నటరాజ ఆలయం అలాగే చివరకు రామనాథస్వామి ఆలయం (తమిళనాడు). ఈ శివాలయాలను 4,000 సంవత్సరాల క్రితం పురాతన వాస్తుశిల్పులు ఖచ్చితమైన అక్షాంశ, రేఖాంశాలను కొలవడానికి ఎటువంటి GPS లేదా గిజ్మోస్ లేకుండా ఉపగ్రహ సాంకేతికత లేని యుగంలో నిర్మించారు. వాస్తుశిల్పులు కూడా వందల కిలోమీటర్లతో వేరు చేయబడ్డారు. అయినప్పటికీ ఈ దేవాలయాలు 79° రేఖాంశాల వద్ద ఖచ్చితంగా స్థాపించబడ్డాయి. కేదార్‌నాథ్ మరియు రామేశ్వరం మధ్య దూరం 2383

కిలోమీటర్లు. అంతే ఈ ఎనిమిది ఆలయాలను కలుపుతూ ఒక ఊహా రేఖను గీయడం వల్ల ఒక సరళరేఖ ఏర్పడుతుంది, దీనినే మన పూర్వీకులు శివశక్తి అక్షరేఖ అన్నారు'' అని చెప్పారు పూజారి.

“అంటే సైన్స్ కనిపెట్టక ముందే మన వేదాల్లో అక్షంశాలు, రేఖంశాలు ఉన్నాయన్నమాట'' అంది వినీష.

“అవునమ్మా! యోగ శాస్త్రం (గణనలు) ఎంతో పురాతనమైనవి అంటే శక్తివంతమైనవి. ఇంతకీ చెప్పొచ్చేది ఏమిటంటే, శివుని అంశతో పుట్టిన వారికీ ఈ శివశక్తి అక్షరేఖ పోలిన గుర్తులు ఉంటాయి'' అన్నాడు పూజారి.

“ఈ ఆలయం నల్లమలలో ఎక్కడ ఉంది? ఇక్కడకి మామూలు మనుషులు ఎందుకు రావడం లేదు. ఎందుకు అతికొద్ది మంది మాత్రమే ఇక్కడ ఉన్నారు'' అడిగాడు విశాల్.

“ఇది నల్లమలలో పశ్చిమంగా ఉన్న లోయలో ఉంది. ఇక్కడి రావడానికి ఒకే ఒక మార్గం ఉంది. అది తెలిసిన వాళ్ళు మాత్రమే రాగలరు. తెలియని వాళ్ళు వేరే దారులలో వస్తే ఏ క్రూర మృగానికో, అడివి తేనెటీగలకో ఆహారం అయిపోతారు. చుట్టూ ఉన్న చెంచులు మాత్రం ప్రతి శివరాత్రికి వస్తారు'' అని చెప్పాడు పూజారి.

***

# PART 53

అర్ధరాత్రి అడివిలో పరిగెడుతున్న మూర్తికి తన వెనుక శబ్దం ఎక్కువైనట్లు అనిపించి, పరిగెడుతూ పరిగెడుతూ వెనుకకు చూసాడు. అది ఒక ఎలుగుబంటని అర్థం అయ్యింది. ఒక్కసారిగా ఆగి చేతిలో ఉన్న కాగడా చూపిస్తూ దానికి అదిలించడానికి ప్రయత్నం చేశాడు. అది ఎక్కడిది అక్కడే ఆగింది. మూర్తి ఒక్క అడుగు ముందుకు వేసాడు, అది కూడా ఒక అడుగు వెనుకకు వేసింది. దాంతో ఎక్కడలేని ధైర్యం వచ్చింది. ఇంకో అడుగు వేసాడు. అది ఒక్కసారి ముందుకు దూకింది, ఏమి చేయాలో తెలియని పరిస్థితిలో.. చేతిలో ఉన్న కాగడా దానిపైకి విసిరాడు. విచిత్రంగా మనిషి పట్టినట్టు కాగడాను పట్టి, రెండు కాళ్ళ మీద నడవసాగింది.

మూర్తి వెనుతిరిగి పరిగెడుతున్నాడు. అది వెనుకాల వస్తుంది. వెనుకకు చూస్తూ, చూస్తూ మార్గంలో మధ్యగా వేలాడుతున్న ఒక చెట్టు కొమ్మకు మూర్తి తల ఢీకొంది. దెబ్బ గట్టిగా తగలడంతో నుదురు చిట్లి రక్తస్రావం కాసాగింది. కిందపడ్డ మూర్తి మెల్లమెల్లగా స్పృహ కోల్పోతున్నాడు. చెట్టు కొమ్మపై ఉన్న పెద్ద అడవి తేనెపట్టు కదిలి, ఒకేసారి మూర్తి పైకి దూసుకు వస్తోంటే, మరోవైపు ఎలుగు తన దగ్గరికి రావడం లీలగా కనిపించింది.

***

శ్యామ్ సుందర్ ఇంట్లో పరిస్థితి రోజు రోజుకు విషమంగా తయారవుతోంది. వినీష విషయం ఆ నోటా ఈ నోటా పొక్కి బావమరుదులు శంకరానికి, శేఖరానికి తెలిసిపోయింది. మనీష, హరీష మొక్కని దేవుళ్ళు లేరు.

ఆరోజు ఉదయాన్నే శంకరం వచ్చి, "వసుంధరా..!" అని పిలిచాడు.

"అయ్యో! లోపలి రా అన్నయ్య. అక్కడే నిలబడ్డావ్" అంది వసుంధర.

"పిలవడానికి మీకు సిగ్గు లేదేమో కానీ, లోపలి రావడానికి మాకు సిగ్గు ఏడ్చింది" అన్నాడు.

శ్యామ్ సుందర్ బయటకి వచ్చి, "అవేం మాటలు! లోపలికి రా మాట్లాడుకుందాం" అన్నాడు.

"ఏం మాట్లాడతావు? కులం కానివాడు నీ కూతురుని ఎలా లేపుకు వెళ్ళాడో సీరియల్ గా చెబుతావా?" అన్నాడు శంకరం.

"శంకరం, మాటలు పదిలంగా రాని.. నువ్వు వాగేది నా కూతురు గురించి అని మర్చిపోకు. దానిని కిడ్నప్ చేసారు. అంతేగాని అది మా నుంచి పారిపోయేంత పిరికిది కాదు" అన్నాడు శ్యామ్.

"అవును, మీ కుటుంబానికి ఉన్న ఖలేజా చాలా పెద్దది, మాకు అంత ధైర్యం లేదు. ఇదిగో నీ రెండో కూతురుకి నిశ్చితార్థం కింద నువ్వు ఇచ్చిన ఉంగరం. దాని మేడలో మేము పెట్టిన గొలుసు పారేస్తే నేను అఘోరిస్తాను" అన్నాడు శంకరం.

అంతా వింటున్న మనీష ఉంగరం, మెడలో నుండి గొలుసు తీసి, "ఇదిగో మావయ్య, ఇది తీసుకుని వెళ్ళండి. అక్క గురించి ఇంకొక్క మాట మాట్లాడకండి. అదేమిటో మాకు తెలుసు, ప్రత్యేకించి మీకు మేము చెప్పనక్కరలేదు" అంది.

"అవునమ్మా! నేను అదే అంటున్నాను. ఎవరు చెప్పక్కరలేదు, మీ సంగతి ఊరే కోడై కూస్తుంది" అంటూ వెనుతిరిగాడు శంకరం.

ఇంకో పది నిమిషాలకు శేఖరం వచ్చాడు.

"నీకు కూడా గొలుసు కావాలా బావా?" అన్నాడు శ్యామ్.

"అయ్యో అదేం వద్దు బావా! ఎంత కాదన్నా అది నా మేనకోడలు. పెట్టినా దానిని వెనుకకు తీసుకోవాలా ఏంటి? కానీ, నాది అదే సమస్య బావా, నేను నీతో వియ్యం అందుకునే పరిస్థితిలో లేను. ఏమి అనుకోకు" అంటూ వెళ్ళిపోయాడు శేఖరం.

"శేఖరం అన్నయ్య కొంచెం నయం అనిపించాడు" అంది వసుంధర.

"ఒకడు పొడిగుడ్డతో కొస్తే.. రెండోవాడు తడిగుడ్డతో కోశాడు. కోసింది మాత్రం నా కుత్తుకే! నా ఎదురుగా కూర్చోవాలంటే భయపడే మనుషులు నోరు

లేపి వీరంగం వేస్తున్నారు. ఛీ.. ఈ బ్రతుకు బతకాలా? చస్తే సరి” అని కూలబడ్డాడు.

“నాన్నా..!” అంటూ శ్యామ్ దగ్గరికి చేరారు మనీష, హరీష.

***

“నాన్న ఈ స్వీట్ తీసుకోండి” అంది స్వప్న.

“ఎందుకురా ఇప్పుడు” అన్నాడు గోపాల్.

“నాన్న! ఈరోజు అన్నయ్య పుట్టినరోజు. అందుకే చేసాను” అంది స్వప్న.

“ఏమైపోయాడో, ఎలా ఉన్నడో..” అంటూ స్వరం మార్చాడు గోపాల్.

“అన్నయ్యకు ఏమి కాదు నాన్న, ఏదో జరిగింది తప్పక వస్తాడు” అని స్వప్న దిగులుగా అంది.

అనంత గోడకి ఆనుకుని ఆకాశంలోకి చూస్తుంది.

***

“రేపే అమావాస్య. ఈరోజు విశ్రాంతి తీసుకోండి” అన్నాడు పూజారి.

వెంటనే లేచి, “లేదండి, మేము బయలుదేరుతాం. మమ్మల్ని ఆశీర్వదించండి” అన్నాడు విశాల్.

“దీర్ఘాయుష్మాన్ భవః విజయోస్తు” అన్నాడు.

బయలుదేరుతుండగా, గుడి అరుగు పైనుండి,

“ఈరోజు వాడి పుట్టిన రోజు పూజ చెయ్యండి” అని ఎవరో చెప్పారు.

అది విని వెనుతిరిగి చూసాడు విశాల్.

అక్కడ మూర్తి కూర్చుని ఉన్నాడు.

“ఒరేయ్..” అంటూ పరిగెత్తాడు విశాల్.

ఇద్దరు గట్టిగా ఆలింగనం చేసుకున్నారు.

“ఇక్కడికి ఎలా వచ్చావ్ రా?” అన్నాడు విశాల్.

"ఏరా! నాకు తెలీకుండా నువ్వు పారిపోయి వస్తే, నేను మాత్రం రాను అనుకున్నావా?" అంటున్న మూర్తి మొహం అంతా వాచిపోయి ఉంది.

"ఏమైంది ముఖానికి?" అడిగాడు విశాల్.

"ఇతను నీకు తెలుసా?" అని అడిగాడు పూజారి.

అవున్నట్లు తల ఊపాడు విశాల్.

"ఇతను బ్రతికి బట్ట కట్టడం నిజంగా నేను చూసిన అద్భుతం. ఈరోజు తెల్లవారు జామున అడివిలో పడున్న ఇతనిని మా సన్యాసులు తీసుకుని వచ్చారు. అడవి తేనెటీగలు కరవడం వల్ల వాపు వచ్చింది. నేనే తేనే రాసి కట్టు కట్టాను. విచిత్రం ఏంటంటే, తేనెటీగలు ఒకేసారి కుడితే మనిషి బ్రతకడం కష్టం కానీ, ఇతన్ని కేవలం రెండు మాత్రమే కుట్టాయి. అది ఎలా సాధ్యమో అర్థం కాలేదు" అన్నాడు పూజారి.

వినీష దూరంగా ఉండి వాళ్ళిద్దరిని చూసింది.

"ఎలా ఉన్నారు?" అడిగాడు మూర్తి.

బాగానే ఉన్నానన్నట్టు తల ఊపింది.

విశాల్ తాను ఎలా ఇక్కడికి చేరింది, ఆ తరువాత జరిగినవన్ని విపులంగా చెప్పసాగాడు.

అన్ని విని, "అక్కడ అమ్మ, చెల్లి, నాన్న నీకోసం తల్లడిల్లిపోతున్నారు రా! వాళ్ళను మరిచిపోయి నువ్వు ఇలా ఎవరికోసమో సాహసాలు చేయడం అవసరమా?" అన్నాడు మూర్తి.

"ఆపదలో ఉన్నవాళ్ళు అసక్తులు. మనల్ని సహాయం అడిగితే మధ్యలో వదిలి ఎలా రావాలి? అయినా ఇవన్నీ నాకు నిన్ననే తెలిసాయి. ఈ రెండు వారాలు నేను ఇంకో లోకంలో ఉన్నాను" కొంటెగా వినీష వంక చూస్తూ అన్నాడు.

మెల్లగా లేచి ముగ్గురు మరుగుజ్జుల ప్రదేశానికి బయలుదేరారు.

***

# PART 54

నాయకకు మూర్తిని పరిచయం చేసి జరిగినదంతా చెప్పాడు విశాల్.

"మీకు తోడుగా ఇంకో దేవుడు కూడా వస్తే మాకు సంతోషం" అన్నాడు నాయక.

మూర్తి అయోమయంగా, "దేవుడు ఏంటి?" అన్నాడు.

"అబ్బో! అదో పెద్ద కథ. తర్వాత తీరిగ్గా చెబుతాలే. మనకు అంతకన్నా ముఖ్యమైన విషయాలు ఉన్నాయి" అన్నాడు విశాల్

మూర్తి, విశాల్ కూర్చున్నారు.

నాయక.. మూర్తి భుజాలెక్కి కూర్చున్నాడు.

"మనం హరాళి గురించి చదివిన కాగితంలో రక్తపు మరక వల్ల కొంత సమాచారం కోల్పోయాం. ముఖ్యంగా హరాళి వద్దకు వెళ్ళినప్పుడు అంగవైకల్యం ఉన్నవాళ్ళని తీసుకుని వెళ్ళాలని, అలా వెళితే ప్రమాదం ఉండదని వహీద్.. బాలకి చెప్పాడంట" అన్నాడు విశాల్.

"ఇటువంటి సంఘటన నాకు ఎదురుపడలేదు" అన్నాడు నాయక.

"ఆ జర్మన్ పేపర్ నా దగ్గర ఉంది" అన్నాడు మూర్తి.

బ్యాగ్ లో నుంచి తీసి విశాల్ కి ఇచ్చాడు. ఆ పేపర్ కింద పెట్టమని చెప్పి, నాయక రక్తపు మరకపై ఏదో చదువుతూ నోటితో ఊదాడు. వెంటనే మరక పోయి కింద ఉన్న అక్షరాలు కనిపించాయి. 'Schwarzdorn..'

"ఏరా! డిక్షనరీ ఉందా?" అన్నాడు విశాల్.

"హా, ఉంది" అంటూ డిక్షనరీ కాపీ తీసాడు మూర్తి.

"ఇవన్నీ బాగ్ లో పెట్టుకుని ఎందుకు తిరుగుతున్నావు?" అని అడిగాడు విశాల్.

"టైమ్ మెషిన్ స్విచ్ పోయాక, ఆ రూంలో వదిలి నాకు రావాలని అనిపించలేదు అందుకే కూడా తెచ్చాను" అన్నాడు మూర్తి.

"స్విచ్ పోయిందా? అదెలా..!?" అని అడిగాడు విశాల్.

"ఏమో రా! ఎంత వెతికినా కనిపించలేదు" అన్నాడు మూర్తి.

డిక్షనరీలో అర్థం వెతికారు. "Schwarzdorn అంటే blackthorn అంటే నల్ల తుమ్మ" అన్నాడు విశాల్.

"అవును, యక్షిణిలకు కొన్ని పిశాచ గణాలకు నల్లతుమ్మ అంటే భయం" అన్నాడు నాయక. విశాల్ అక్కడి వాక్యం అంతా మరలా రాసాడు.

"ఇప్పుడు అర్థం అయ్యింది, నారాయణ చేతికర్ర నల్లతుమ్మతో చేసినది. అందుకే యక్షిణి దాని కింద ఉన్న వజ్రం వదిలి వేసింది. తెల్ల దొరకి అబద్ధం చెప్పి నారాయణ వజ్రం నొక్కెసాడు" అన్నాడు విశాల్.

"ఇంక మనకి తిరుగులేదు" అంటూ, "నాయకా.. రేపు సాయంత్రానికి నువ్వు ఏర్పాటు చేయాల్సినవి" అని తనకు కావాల్సినవి అన్ని చెప్పాడు.

నాయక అక్కడ నుండి కదిలాడు.

"మనం ఇద్దరం సరే, వినీష సంగతి ఏంటి?" అని అడిగాడు మూర్తి.

"తాను కూడా వస్తానని అంటుంది" అన్నాడు విశాల్.

"వెళ్ళేది చాలా ప్రమాదకరమైన పని అని తెలిసి కూడా తనని ఎలా రిస్క్ లో పెడతాం" అన్నాడు మూర్తి.

"అవుననుకో! నేను చాలా చెప్పి చూసాను. ఇప్పుడు ఇంకా చాలా లేట్ అయ్యింది. మొత్తం మరుగుజ్జులు మనతో వస్తున్నారు. మనం ఇప్పుడు వినీషని ఇక్కడ వదిలే పరిస్థితి లేదు కాబట్టి, తప్పదు" అన్నాడు విశాల్.

"ఏమోరా! ఇప్పుడు మీరిద్దరూ కలిసి ఉన్నారని ఆనందించాలా! ఇటువంటి చోట ఇరుక్కున్నారని, భయపడాలా? అర్థం కావడం లేదు" అన్నాడు మూర్తి.

"ఒరేయ్ సంకల్పం చెయ్యి. అంతా మంచి జరుగుతుంది" అన్నాడు విశాల్.

అమావాస్య రానే వచ్చింది. ఆరోజు నాయకతో కలిపి అందరు మరుగుజ్జులు ఏవో పూజలు చేస్తున్నారు.

"ఏం పూజలు అవి?" అని అడిగాడు మూర్తి.

"హిందూమతంలో అమావాస్య రోజు చాలా ఆధ్యాత్మిక ప్రాముఖ్యతను కలిగి ఉంది. మరణించిన కుటుంబ సభ్యులు, పూర్వీకుల ఆత్మలను గౌరవించడానికి, అలాగే ప్రార్థనలు చేయడానికి వివిధ ఆచారాలను నిర్వహించడానికి ఇది ముఖ్యమైన సమయంగా పరిగణించబడుతుంది. అమావాస్య రోజున ఆచారాలు ఆధ్యాత్మిక ప్రయోజనాలను అందజేస్తాయని, మరణానంతర జీవితంలో వారి ప్రయాణంలో ఆత్మలకు సహాయపడతాయని మేము నమ్ముతాము. దీనిలో భాగంగా మేము నిర్వహించే వివిధ రకాల క్రతువులు..

పితృ తర్పణం: పితృ తర్పణం అనేది ఒకరి పూర్వీకులు, మరణించిన కుటుంబ సభ్యులకు గౌరవాన్ని, కృతజ్ఞతలు తెలియజేయడానికి నిర్వహించే ఆచారం. పూర్వీకులకు నీరు, నువ్వులు, బియ్యం మరియు ఇతర ఆహార పదార్థాలను సమర్పించడం దీని ఆచారం. ఈ వస్తువులను నైవేద్యంగా సమర్పించడం ద్వారా ఆత్మలు పుష్టి పొంది పుణ్యఫలం పొందుతాయన్నది మా నమ్మకం.

ఆహార సమర్పణ:

చనిపోయిన కుటుంబ సభ్యులకు ఇష్టమైన వంటకాలతో కూడిన ప్రత్యేక భోజనాన్ని వారి కుటుంబాలు సిద్ధం చేస్తాయి. ఆ తర్వాత వారి జ్ఞాపకార్థం ఈ భోజనాన్ని ప్రియమైన వారికి అందజేస్తారు. మరణించిన వారి ఆత్మలు.. సమర్పించిన ఆహారం స్వీకరించి దీవెనలు అందిస్తాయని విశ్వాసం.

పవిత్ర నదులలో స్నానం: అమావాస్య రోజున పవిత్ర నదులలో లేదా నీటి వనరులలో పవిత్ర స్నానం చేయాలని మేము నమ్ముతాము. ఈ చర్య శరీరం మరియు ఆత్మను శుద్ధి చేస్తుందని, మరణించిన పూర్వీకులకు పుణ్యాన్ని అందజేస్తుందని నమ్మకం.

దాతృత్వం మరియు విరాళాలు: మరణించిన కుటుంబ సభ్యుల పేరు మీద దాతృత్వం లేదా విరాళాలు అందించడం కూడా ఒక సాధారణ పద్ధతి. ఈ రోజున నిరుపేదలకు విరాళం ఇవ్వడం లేదా మతపరమైన సంస్థలకు సహకరించడం వల్ల ఆత్మలకు సానుకూల కర్మలు లభిస్తాయని నమ్ముతారు.

మంత్రాలు మరియు ప్రార్థనల పఠనం:

మరణించిన ఆత్మల కోసం ఆశీర్వాదం కోసం పవిత్ర గ్రంథాల నుండి మంత్రాలు, శ్లోకాలు మరియు ప్రార్థనలను చదవడానికి కుటుంబాలు సమావేశమవుతాయి. ఈ శ్లోకాలు ఆత్మలకు మార్గనిర్దేశం చేసేందుకు, వారికి శాంతిని చేకూర్చేందుకు సహాయపడతాయని నమ్ముతారు.

ధ్యానం:

మాలో చాలా మంది వ్యక్తులు అమావాస్య రోజున ధ్యానంతో పాటు ఆత్మపరిశీలనలో సమయాన్ని వెచ్చిస్తారు. ఇది వారి పూర్వీకులతో అనుసంధానం అవ్వడానికి మరియు జీవితం యొక్క అశాశ్వత స్వభావాన్ని ఆలోచించడంలో, మోక్ష సాధనలో వారికి సహాయపడుతుంది.

మొత్తానికి ఈరోజు మాకో పండగ. మా పెద్దల కోసం మేము వెచ్చించే సమయమిది. రోజంతా ఉపవాసం చేసి మా ఆదిదేవుడి ప్రసాదం తీసుకుంటాం" అన్నాడు నాయక.

"మరి మనం ఎందుకురా, చిన్నప్పటి నుండి అమావాస్య అంటే ఏదో దుర్దినంలా చూస్తున్నాం" అన్నాడు మూర్తి.

"అదేరా మన దౌర్భాగ్యం, అమావాస్య రోజు ప్రతికూల శక్తులకు, భూత, ప్రేత గణాలకు శక్తి ఎక్కువ. మనిషి ఇది తెలుసుకుని తనలో ఉన్న స్వార్థం వల్ల ఆ ప్రతికూల శక్తుల సాయంతో వేరే మనిషిని బాధపెట్టే క్షుద్రాన్ని మొదలుపెట్టాడు. అది మొదలు అమావాస్యకు ఉన్న అసలైన విలువ మరిచి, మన పూర్వీకులు అదొక దుర్దినంగా ముద్ర వేశారు. మరుగుజ్జులు మనకన్నా చాలా స్వచ్ఛమైన జాతి. వారికి ఎటువంటి వర్గ బేధాలు, అసూయాద్వేషాలు లేవు" అన్నాడు విశాల్.

***

# PART 55

చీకటి పడింది. ప్రసాదం తీసుకు వచ్చి అందరికి ఇచ్చారు మరుగుజ్జులు. అందరూ తల్లివేరు మర్రిచెట్టు కింద కూర్చున్నారు.

"మనం ఎప్పుడు వెళ్ళాలి?" అడిగాడు విశాల్.

"మొదటి జాము వేళకి యక్షిణి వస్తుంది. అప్పుడు మాత్రమే ద్వీపం కనపడుతుంది. అప్పుడు వెళ్ళాలి" అన్నాడు నాయక.

అందరిలోను ఒక రకమైన భయం కమ్ముకుని ఉంది. ఏమి జరగబోతుందన్న ఉత్సుకత కొంత మందికి, తిరిగి వస్తామా! అన్న అనుమానం కొందరికి.

ఆ నిశ్శబ్దాన్ని చీలుస్తూ, "అసలు యక్షిణులంతా ఇంత భయంకరంగా ఉంటారా?" అని అడిగింది వినీష.

"నాకు తెలిసిన కొన్ని విషయాలు చెబుతాను. యక్షిణులు అసలు ఎంతమాత్రం అపాయం తలపెట్టే జీవులు కాదు. వీరు భువరలోకంలో ఉండే దేవతలు. హైందవ పురాణాలు, జానపద కథలలో యక్షిణిలను అతీంద్రియ స్త్రీ జీవులు అని, వీరు ఆధ్యాత్మిక మరియు మాంత్రిక శక్తులను కలిగి ఉంటారు అని చెప్తారు.

యక్షిణుల లక్షణాలు:

యక్షిణిలు వరాలను ఇచ్చే దేవతలు. వీరు తలచిన కోరికలను నెరవేర్చడం, ఆపదలో ఉన్న వారిని రక్షించే సామర్థ్యం కలిగి మంత్రముగ్ధులను చేసే అందం గల దేవతా స్త్రీలు. సాధారణంగా అడవులు, నదులు, ఇతర సహజ పరిస్థితులలో నివసిస్తారని అంటారు. వీరు పూర్వీకులు దాచిన నిధులను రక్షించే శక్తిని కలిగి ఉంటారని నమ్ముతారు.

వివిధ రకాల యక్షిణిలు: యక్షిణిలు తరచుగా వారి లక్షణాలు మరియు విధుల ఆధారంగా వివిధ రకాలుగా వర్గీకరించబడతారు. యక్షిణిలలో కొన్ని సాధారణ రకాలు గురించి చెపుతా వినండి" అన్నాడు నాయక.

"1. మాతృక యక్షిణిలు: ఇవి అత్యంత ప్రసిద్ధ, సాధారణంగా చిత్రీకరించబడిన యక్షిణిలు. ఎవరికి హాని చెయ్యని అమ్మ వంటి మనస్సు కలిగి మెత్తని స్వభావంతో ఉంటారు.

2. భోగ యక్షిణులు: ఈ యక్షిణులు సుఖాలు మరియు కోరికలతో సంబంధం కలిగి ఉంటారు. వారు తరచుగా ప్రాపంచిక కోరికలను నెరవేర్చగల ఆకర్షణీయంగా ఉండి,

మంత్రముగ్ధులను చేసే దేవతా స్త్రీలుగా చెప్పబడ్డారు.

3. శక్తి యక్షిణులు: ఈ యక్షిణులు ఆధ్యాత్మిక మరియు అతీంద్రియ శక్తులను కలిగి ఉంటారని నమ్ముతారు. వారు తరచుగా ఆధ్యాత్మిక ఎదుగుదల, ధ్యానం మరియు స్పృహ యొక్క ఉన్నత స్థితిని కలుగచేయగల సామర్థ్యం కలిగి ఉంటారు.

4. రక్షా యక్షిణులు: ఈ యక్షిణులు రక్షణ కోసం ఆవాహన చేయబడతారు. వారు జీవులు లేదా ప్రదేశాలను ప్రతికూల శక్తులు, ఆత్మలు నుండి కాపాడతారని నమ్ముతారు.

5. విద్యా యక్షిణులు: ఈ యక్షిణులు జ్ఞానం మరియు విద్యతో సంబంధం కలిగి ఉంటారు. వారు వివిధ విషయాలను నేర్చుకోవడం మరియు పాండిత్యం కోరుకునే పండితులు మరియు విద్యార్థులచే ఆవాహన చేయబడతారు.

6. ధన యక్షిణులు: ఈ యక్షిణులు సంపద మరియు శ్రేయస్సుతో ముడిపడి ఉంటాయి. వారిని ఆర్థిక విజయం మరియు సమృద్ధి కోసం పిలుస్తారు.

7. ఔషధ యక్షిణిలు: ఈ యక్షిణులు మూలికా ఔషధం మరియు వైద్యం గురించిన జ్ఞానం కలిగి ఉంటారని నమ్ముతారు. వారిని ఆరోగ్యం మరియు శ్రేయస్సు కోసం ప్రార్థిస్తారు.

8. గణ యక్షిణులు: ఈ యక్షిణులు తరచుగా సంపదకు దేవుడైన కుబేరుని పరిచారకులుగా లేదా సహచరులుగా చిత్రీకరించబడతారు. వారు సంపద

మరియు భౌతిక శ్రేయస్సుతో సంబంధం కలిగి ఉంటారు. మరియు సంగీతంలో ప్రావీణ్యం కలిగి ఉంటారు'' అని నాయక చెప్పాడు.

అందరూ తన్మయంతో వింటున్నారు.

''మరి హరాళి ఎటువంటి యక్షిణి?'' అని అడిగాడు విశాల్.

''ఆమె ఒక భోగ యక్షిణి, స్వతహాగా మంచి మనస్సుగల దేవతా స్త్రీ. కేవలం తన ప్రియుడైన యక్షుడు చనిపోయింది మా వల్లనే అని, ఆమె మా పైన కక్ష పెంచుకుంది. దాని పర్యవసానం మా జాతిని నాశనం చేసింది. కన్నులు లేక అంధురాలుగా మారిపోయింది'' అన్నాడు నాయక.

''మొదటి జాముకి ఇంకొంతసేపే ఉన్నది'' అంటూ రోచిని పిలిచాడు నాయక.

మరుగుజ్జులు అందరు పారిపోయారు.

''రోచి మీవాడే అయినప్పుడు వీళ్ళకి ఎందుకంత భయం?'' అన్నాడు విశాల్.

''రోచి శాపం సంగతి నాతో వచ్చిన కొంత మందికి మాత్రమే తెలుసు. మిగిలిన సంతతికి మేము తప్పు చేస్తే దండించే సర్పంగానే తెలుసు'' నవ్వుతూ అన్నాడు నాయక.

''అందరూ ఇక్కడికి రండి. భయం వలదు, అందరూ రండి'' అని పిలిచాడు నాయక. ఒక్కక్కరుగా అందరూ వచ్చారు.

''దీనిపై ఎక్కి కూర్చోండి'' అన్నాడు.

అందరు మెల్లగా రోచిపై ఎక్కి కూర్చున్నారు. అందరికి రెండు వస్తువులు అందజేసారు. ఒక ఆకుల దొన్నె (అందులో గోమయం), ఇంకొకటి నల్లతుమ్మ చెక్క ఉన్నాయి.

తల భాగంలో వినీష, విశాల్, మూర్తి కూర్చున్నారు. మూర్తి భుజాలపై నాయక నిలబడి ఉన్నాడు.

కొందరు తేజో ద్వీపం తీసుకుని వచ్చారు. దానికి నమస్కరించి ఏవో మంత్రాలూ చదువుతున్నాడు నాయక.

ఒక్కక్షణం పెద్ద శబ్దం, మిరుమిట్లు గొలిపే కాంతి ఏర్పడ్డాయి. అందరూ కళ్ళు తెరిచి చూసారు. డేగల దీవిలో ఉన్నారు.

చూడడానికి శిథిలం అయిపోయిన ప్రదేశం, అన్నీ ఎండిన మొక్కలు, చెక్క ముక్కలతో కొంత దుర్గంధంగా ఉంది. అందరూ రోచి పైనుండి దిగి వచ్చారు. కళ్ళకి

తాను ఆవు నెయ్యి రాసుకుంటూ, అందరిని రాసుకోమని చెప్పాడు విశాల్.

"అందరూ శ్రద్ధగా వినండి, మేము ఆలయంలోకి వెళుతున్నాం. అక్కడ మీ సహోదరులను కలిసి వారిని బయటకు తీసుకుని వస్తాం ఈలోపు యక్షిణి వస్తుంది. ఆమె వజ్రాలు వెదజల్లుతుంది. ఆ వెలుగులో ఆమె గుడి వరకు నడచి వస్తుంది. ఈలోపు మీరు మీ చేతిలో ఉన్న గోమయాన్ని (ఆవు పేడ్) ని వజ్రాలపై కప్పండి. ఎవ్వరూ ఒక్క వజ్రం కూడా తాకకండి. వెలుగు లేకపోయే సరికి యక్షిణి మనో నేత్రంతో చూడలేదు. ఆ సమయంలో మేము ఇక్కడ ఉన్నవారిని తీసుకు వస్తాం. ఆమె వజ్రాలు వెతికేలోపు మనం తేజో ద్వీపంతో తిరిగి వెళ్ళిపోదాము" అన్నాడు విశాల్.

ఇక్కడే ఊహించని పరిణామం ఒకటి జరిగింది. చచ్చిపోయాడనుకున్న వహీద్ తేజో ద్వీపం సహాయంతో, విశాల్ వాళ్ళు డేగల ద్వీపం వచ్చినప్పుడు వారికి తెలియకుండా రోచి తోక భాగంలో దాక్కుని డేగల ద్వీపం చేరుకున్నాడు. ద్వీపం రాగానే, పక్కకు జరిగి చీకట్లో కలిసిపోయాడు.

***

# PART 56

అనుకున్నట్టుగా విశాల్ అండ్ గ్యాంగ్, కొంత మంది మరుగుజ్జులను తీసుకుని గుడి వైపుగా చిన్న కాగడా సహాయంతో వెళ్ళారు. గుడి దగ్గరకి వెళ్ళే సరికి పెద్ద శబ్దంతో హరాళి మెరుపుల మధ్యలో నుండి దిగింది. గుడి తలుపు దగ్గర ఉన్న విశాల్, వినీష, మూర్తి దూరం నుండి చూసారు.

"అబ్బా! ఎంత బాగుందో.." అంది వినీష.

"వచ్చింది సినిమా స్టార్ కాదు యక్షిణి. చూసిందంటే ఇంకేం ఉండదు" అన్నాడు మూర్తి.

"ఆ వెలుగులో నిజాంగా బాగుంది రా!" అన్నాడు విశాల్.

"చాల్లే సంబడం, చూసింది చాలు, ముందు పని చూడు" బుంగమూతి పెట్టుకుంటూ అంది వినీష.

చిరు మందహాసంతో గుడి తలుపులు నెట్టాడు, అవి తెరుచుకోలేదు.

"హరాళి వజ్రాలు పరిచే వరకు గుడి తలుపులు తెరుచుకోవు" అన్నాడు నాయక.

"హరాళి వజ్రాలను ఒకదాని తరువాత ఒకటి పరుస్తుంది. గుడి తలుపులు మెల్లగా తెరుచుకున్నాయి.

నాయక చప్పున లోపలి దూరిపోయాడు. వజ్రాలు మిరుమిట్లు గొలిపే కాంతిని ప్రసరిస్తున్నాయి.

హరాళి గుడికి వంద అడుగుల దూరంలోకి వచ్చేసరికి గుడి తలుపు పూర్తిగా తెరుచుకుంది. అప్పటికే కాగడా ఆర్పివేశారు కనుక, బయటి నుండి వస్తున్న వజ్రాల కాంతి మసక మసకగా ఉంది. లోపల నిలువెత్తు పశుపతి నాథుని వజ్రలింగం చూడటానికి కన్నులు చాలడం లేదు.

నాయక కనపడ లేదు. "నాయక.. నాయకా..!" అంటూ మెల్లగా పిలిచాడు విశాల్.

హరాళి రుద్రక్ష వజ్రాలు పరుస్తుంది. 90 అడుగులు దూరంలో శివ లింగం చుట్టూ వెతుకుతున్నాడు మూర్తి.

విశాల్, వినీష చేతులు ముకిలించి మహాదేవునికి నమస్కరిస్తున్నారు.

"నాయికా ఎక్కడున్నావ్? మనం వెళ్ళాలి తొందరగా రా" అంటున్నాడు మూర్తి.

౩౦ అడుగులు దూరంలో ఉంది హరాళి.

"ఒరేయ్ దండం పెట్టింది చాలు, నాయక కనిపించడం లేదు" అన్నాడు మూర్తి.

20 అడుగులు..

విశాల్, వినీష కూడా లింగం చుట్టూ తిరిగి చూస్తున్నారు. గుడిలోని కాంతి ఎక్కువ అవుతుంది.

హరాళి తలుపు వరకు వచ్చింది గడప దాటేసరికి, శివలింగం వెనుక ఉన్న రహస్య మార్గంలోకి దూరిన మూర్తి.. వినీషని, విశాల్ ని లాగాడు. లోపలికి వచ్చిన హరాళి, ముక్కు ఎగరేసింది.

"तंत्रिका, तंत्रिका गन्ध (నరులు నర వాసన) त्वम् अत्र कचित्, अहं तत् ज्ञात्वा आगत्य शरणं याचयिष्यामि, अन्यथा अहं चर्वितः भक्षितः भविष्यामि.. (మీరు ఇక్కడే ఎక్కడో ఉన్నారు. ఆ సంగతి నాకు తెలుసు. వచ్చి నన్ను శరణు వేడుకోండి, కాదని నక్కితే నమిలి తినేస్తాను)" అంటూ కలియ తిరుగింది.

దీవిలో బయట.. హరాళి గుడిలోకి వెళ్ళిన తక్షణం బయట ఉన్న మరుగుజ్జులు ఆవుపేడ ముద్దలను వజ్రాలపై వేయసాగారు. ప్రేత సర్పం దాడిలో కాలు కోల్పోయిన వహీద్, మరుగుజ్జులు వెనుకనే వస్తూ గోమయంతో ఉన్న వజ్రాలను ఒక గొనె సంచిలోకి ఏరుతున్నాడు. తమ పనిలో నిమగ్నమైన మరుగుజ్జులు వహీద్ రాకను గమనించలేదు.

సరిగ్గా గుడికి వంద అడుగుల దూరంలోకి వచ్చాడు వహీద్. ఇంకొక వజ్రం తీస్తే హరాళికి తెలిసిపోతుందని అక్కడ నుండే వెనుతిరిగాడు.

రోచి.. వహీద్ ని చూడనే చూసింది. వేగంగా వచ్చి తోకతో వహీద్ ని కొట్టింది. వహీద్ చేతిలో ఉన్న సంచి దూరంగా పడగా విసురుగా వెళ్ళి రెండు, మూడు రుద్రాక్ష వజ్రాలను తన శరీరంతో తాకించాడు. అవి చెదిరి గుడికి వంద అడుగుల కన్నా ఎక్కువ దూరంలో పడ్డాయి.

హరాళి ఉన్నట్టుండి గట్టిగా హుంకరించి బయటకు వెళ్ళింది. మరుగుజ్జులు ఎక్కడివారు అక్కడ తప్పుకున్నారు. వారు రోచి వహీద్ ని కొట్టడం చూసారు.

వజ్రాలు మూట పట్టుకుని వహీద్ పరిగెడుతున్నాడు. కాంతి తగ్గిపోవడంతో హరాళి మనోనేత్రం మూసుకుపోయింది. చేతులతో తడుముతూ రుద్రక్ష వజ్రాలను ఏరుతుంది. దాని మీద గోమయం ఉండటం గమనించింది. లేచి నిలబడి చుట్టూ గట్టిగా నోటితో ఊదసాగింది. ఆ గాలి వేగానికి గోమయం ఎగిపోసాగింది.

రోచి, వహీద్ ను వెంబడించింది. వజ్రాలు కాంతి తిరిగి రాగానే మనోనేత్రంలో హరాళికి రోచి కనిపించింది.

"నీకు శాపం వల్ల కూడా బుద్ధి రాలేదు" అంటూ రోచి వైపు కదిలింది.

రోచి మరలా తన బలమైన తోకతో ఒక్కటి కొట్టింది. ఆ దెబ్బకి వహీద్ చేతిలో ఉన్న వజ్రం సంచి ఒక పెద్ద చెట్టు చిటారు కొమ్మపై పడింది. వహీద్ ఎగిరి నీటిలో పడి చనిపోయాడు.

గుడి లోపల నాయక, భూగర్భములో ఉన్న రహస్య గదిని తెరుచుకుని బయటకు వచ్చాడు. అతనితో పాటు ఇంకా చాలామంది మరుగుజ్జులు బయటకు వచ్చారు.

గుడి గడప దాటి బయటికి వచ్చి "అందరూ వెనుకకు పదండి" అన్నాడు మూర్తి.

అందరూ గుడి వెనుకకు వెళ్ళారు.

విశాల్ బయటకు వచ్చి, "వినీష ఏది?" అన్నాడు,

"లోపలే ఉండాలి కదా! బయట లేదు" అన్నాడు మూర్తి.

మరలా వెనుతిరిగి గుడిలోకి పరుగు పెట్టాడు విశాల్. ఏదో వెతుకుతూ కనిపించింది వినీష.

"ఏమయ్యింది త్వరగా పద" అన్నాడు విశాల్.

"ఈశ్వర్ ఇచ్చిన గొలుసు ఇక్కడ పడింది చీకట్లో కనిపించడం లేదు" అంది వినీష.

"సరే, నువ్వు వెళ్ళు. నేను చూస్తా" అన్నాడు విశాల్.

***

వహీద్ ని పడగొట్టి వెనుకకు తిరిగిన రోచికి ఎదురుగా హరాళి కనిపించింది. ఒక్కసారిగా తన మీద దూకబోయాడు. హరాళి తన చేత్తో రోచి మెడ పట్టుకుంది. అంతే శాప విమోచనమయ్యి రోచి మరల తన మరుగుజ్జు రూపం పొందాడు.

గుడి వెనుక తేజో ద్వీపం సాయంతో నాయక అందరినీ పంపుతున్నాడు.

ఇంకా కొంతమంది మిగిలారు. "దేవా! హరాళి మరల వస్తే ప్రమాదం తొందరగా రండి" అన్నాడు నాయక.

"ఎక్కడ వీడు?" అని అడిగాడు మూర్తి.

"గుడి లోపల.." అని చెప్పింది వినీష.

"టైమ్ లేదు, నేను తీసుకు వస్తా" అంటూ వెళ్ళాడు మూర్తి.

కాగడా వెలిగించి అక్కడే ఉన్న లింగానికి దీపారాధన చేసాడు విశాల్.

కాగడా వెలుగులో మెరుస్తున్న వజ్ర లింగం చూస్తూ చుట్టూ వెతుకుతున్నాడు.

తేజో ద్వీపం చేస్తున్న శబ్దాలు విన్న హరాళి, "అది నా తేజో ద్వీపం" అని గుడి వైపు పరిగెత్తింది.

చేతిలో ఉన్న రోచి గిలగిలా కొట్టుకుంటున్నాడు.

ఒక మూల రాతి నెఱకు వేలాడుతూ కనిపించింది ఈశ్వర్ ఇచ్చిన గొలుసు. "ఒరేయ్, త్వరగా అందరు వెళ్ళారు. హరాళి దగ్గరకు వస్తుంది పరిగెత్తు" అని చెప్పి మూర్తి అరిచాడు.

తేజో ద్వీపానికి సమీపంలో ఉన్న అందరూ ఉత్కంఠగా చూస్తున్నారు. విశాల్ బయటకి రావడం హరాళి గుడికి చేరడం ఒకేసారి జరిగింది.

***

# PART 57

విశాల్ కి ఎదురుగా హరాళి.. ఎంత కోపంలో ఉన్నా, దేవతా స్త్రీ యొక్క అందం ఒక్కసారిగా విశాల్ ని కట్టి పడేసింది. "ఒరేయ్ రా రా!" అని మూర్తి అరిచిన అరుపుకి స్పృహలోకి వచ్చిన విశాల్ వెళ్ళబోతుండగా హరాళి పట్టుకోబోయింది.

విశాల్ కి ఇంక కష్టమని అర్థం అయ్యి, "మీరు వెళ్ళండి" అన్నాడు.

ఈలోపు ఎక్కడి నుండి వచ్చాడో! శౌంఠి వచ్చి టక్కున హరాళి చేతిలో ఉన్న రుద్రక్ష వజ్రాన్ని ఒకదాన్ని లాగి పారిపోసాగాడు.

విశాల్ ని వదిలి శౌంఠి వెంటపడింది హరాళి.

"శౌంఠి..!" అని గట్టిగా పిలిచి వెనుక వెళ్ళబోయిన విశాల్ ని పట్టుకున్నది వినీష.

వినీష మరో చెయ్యి మూర్తి చేతిలో ఉంది. చిటికెలో శౌంఠిని పట్టి వెనుతిరిగింది హరాళి.

నాయక తేజో ద్వీపాన్ని ఆవిష్కరించాడు.

హరాళి పరిగెట్టి వస్తుంది. అందరూ చేతిలో ఉన్న నల్లతుమ్మ చెక్కలను విసిరారు. వాటిని చూసి ఒక్క క్షణం ఆగింది హరాళి.

ఈలోపు అందరూ మాయం అయ్యారు.

రోచి, శౌంఠి హరాళి చేతిలో బందీలు అయిపోయారు.

అందరూ తల్లి వేరు కింద కూర్చుని ఉన్నారు. దేగల దీవి నుండి తిరిగి వచ్చిన తమ తమ కుటుంబాలను కలుసుకుని ఆనందంగా ఉన్నారు.

"శౌంఠి, రోచిని వదిలి ఎలా వస్తాం?" అన్నాడు విశాల్.

"ఒరేయ్ మూర్ఖంగా మాట్లాడకు. యుద్ధం అన్నాక కొంతమందిని కోల్పోక తప్పదు. మనం అక్కడ ఉన్న వారందరినీ రక్షించాం కదా!" అన్నాడు మూర్తి.

ఇంతలో శౌంఠిని వెతుకుంటూ వచ్చింది జాజి.

"వాళ్ళకి పెళ్ళయ్యి ఇంకా రెండు రోజులు కాలేదు. ఇప్పుడు శౌంఠి గురించి అడిగితే ఏం చెప్పాలి" అంది వినీష.

విశాల్, మూర్తిని చూపిస్తూ, "వాడిని అడుగు" అన్నాడు.

జాజి ఒకొక్కరిని అడుగుతుంది. ఎవరూ మాట్లాడటం లేదు, సరాసరి నాయక వద్దకు వచ్చి, "నా పెనిమిటి ఎక్కడ నాయక?" అంది.

నాయక తలదించుకున్నాడు.

"ఏమైంది ఒక్కరైనా పలకండి, ప్రాణాలతో ఉన్నాడా?" అందరికి ఆ ప్రశ్నలు ఈటెల్లా పొడుస్తున్నాయి.

విశాల్ విలవిలలాడుతున్నాడు.

వినీషకి కళ్ళ నీళ్ళు ఆగడం లేదు.

"నువ్వైనా చెప్పు" అంటూ వినీష కాళ్ళు పట్టుకుంది జాజి.

జాజిని రెండు చేతుల్లోకి తీసుకుని బొటన వేలితో ప్రేమగా ఆమె తలపె నిమిరింది వినీష.

"శౌంఠి.. హరాళి చేతికి చిక్కాడు. మరలా వచ్చే అమావాస్యకి ఏదో ఒకటి చేసి తీసుకు వస్తాము" అన్నాడు నాయక.

అది విని జాజి బోరున విలపించింది.

విశాల్ వైపు తిరిగి, "దేవుడా! శౌంఠి నీవు ఇదివరలో కూడా తనని రక్షించావని చెప్పాడు. మీరు బయలుదేరే ముందు కూడా నీవుండగా తనకి ఎటువంటి భయం లేదు అన్నాడు. తనని తీసుకు వచ్చే బాధ్యత నీది కాదా!" విలపిస్తూ అంది జాజి.

"రాబోయే అమావాస్యకి మేము తీసుకువస్తాం అని చెపుతున్నా కదా!" అన్నాడు నాయక.

"నీ సొంత కుటుంబం కోసం నీవు శతాబ్దాలు భయపడిపోలేదా! దేవుడయ్య లేకుంటే.. ఇప్పుడు నీకు వెళ్ళే ధైర్యం కూడా లేదు. ఎందుకు నన్ను మభ్య పెడుతున్నావ్?" అని గట్టిగ అరిచింది.

ఒక్క క్షణం అంతా మౌనం అలుముకుంది.

"జాజి.. శౌంఠిని నేనే తీసుకుని వస్తాను" అన్నాడు విశాల్.

ఏదో చెప్పబోయిన అందరిని చూస్తూ "ఇంకొక్క మాట మాట్లాడితే నా మీద ఆన" అన్నాడు విశాల్.

"నేను వస్తాను" అంది వినీష.

"హరాళి ముందు నేను బలహీనుణ్ణి. ఇప్పుడు నువ్వు నాతో వచ్చి బలహీనతగా మారద్దు" అన్నాడు విశాల్.

"ఎలా తీసుకు వస్తావ్?" అన్నాడు మూర్తి.

"నాకు తెలియదు రా! కానీ, సంకల్పం ముఖ్యం. అది నాకు మీ అందరి వల్లా బోలెడు ఉంది" అని నాయకని పిలిచి,

"హరాళి ఇంకా ఎంతసేపు ఉంటుంది" అన్నాడు.

"ఇంకొక ఘడియ" అన్నాడు నాయక.

"అది చాలు నాకు" అన్నాడు విశాల్.

"అంటే ఎన్ని నిముషాలు?" అడిగింది వినీష.

"నిమిషం: నిమిషం అనేది ఆంగ్లంలో నిమిషానికి దాదాపు సమానం.

ఘడియా: ఒక ఘడియా అనేది ఆంగ్లంలో 24 నిమిషాలకు దాదాపు సమానం.

విఘడియా: విఘడియా దాదాపు 60 నిమిషాలు, ఆంగ్లంలో ఒక గంట వలె ఉంటుంది.

ముహూర్తం: ముహూర్తం దాదాపు 48 నిమిషాల నిడివిని కలిగి ఉంటుంది. దీనిని తరచుగా శుభ సందర్భాలలో లేదా కార్యక్రమాలలో ఉపయోగిస్తారు.

యమ: ఆంగ్లంలో యమ అనేది దాదాపు 3 గంటలకు సమానం.

ప్రహార: తెలుగులో యమలాగానే ప్రహార దాదాపు 3 గంటలు.

అహోరాత్ర: ఆంగ్లంలో ఒక రోజు మాదిరిగానే అహోరాత్ర పూర్తి రోజు లేదా 24 గంటలు.

పక్షం: ఒక పక్షం చంద్ర పక్షాన్ని సూచిస్తుంది. ఇది దాదాపు 15 రోజులు.

మాసం: ఒక మాసం అనేది ఆంగ్లంలో ఒక నెల మాదిరిగానే ఒక నెల.

సంవత్సరం: సంవత్సరం అనేది ఒక సంవత్సరం. ఇది ఆంగ్లంలో సంవత్సరానికి కూడా సమానం" అని చెప్పి, "ఇంక నేను బయలుదేరుతాను" అన్నాడు విశాల్.

మూర్తి వెంటనే, "పద" అన్నాడు.

"వద్దురా! నేను లేక, నీవు లేక ఇక్కడ లెక్క కుదరదు. శౌంఠి నాకోసం ఉండిపోయాడు. దీనికి నాదే బాధ్యత" అన్నాడు విశాల్.

"సరే! నీకోసం వచ్చే అమావాస్య వరకు ఎదురుచూస్తాను. లేకుంటే నేను వస్తా" అన్నాడు మూర్తి.

తేజో ద్వీపం సాయంతో నాయక బయలుదేరడానికి సిద్ధపడ్డాడు.

వినీష దగ్గరికి వచ్చాడు విశాల్.

ఏదో మాట్లాడబోతుంటే వినీష తన చేతితో విశాల్ నోరు మూసివేసి, "నువ్వు నాకు ఏమి చెప్పద్దు. నీలాంటి వాడిని ప్రేమించానన్న గర్వంలో విర్రవీగుతున్నాను. తిరిగి తొందరగా రా!" అంది.

ఒక చిరు మందహాసంతో మూర్తికి, 'చూసుకో' అన్నట్టు కనుసైగ చేసి నాయకతో బయలుదేరాడు.

దేగల దీవికి చేరుకున్నాక, "నాయక ఇంకొక్క విఘడియ ఇక్కడ నాకోసం తేజో ద్వీపంతో వేచి ఉండు. నేను రాకపోతే తిరిగి వెళ్ళిపో" అన్నాడు.

"నువ్వు మా దేవరవి నిన్ను అడ్డుకునే శక్తి లేదు. పోయిరా నీకోసం కాసుకొని కూర్చుంటా" అన్నాడు నాయక.

***

# PART 58

విశాల్.. హరాళి చెంతకు నడుస్తున్నాడు. కనపడితే చంపుతానని ఆమె చెప్పిన విషయం చెవుల్లో తిరుగుతూ ఉంది. గుడి మెట్లపై కూర్చుని ఉంది హరాళి. రుద్రాక్ష వజ్రాలు మెట్లు మొత్తం పరిచి ఉండటం వల్ల గుడి ముందు భాగం వెలుగుతో నిండి పోయింది. హరాళి ఏటో చూస్తూ ఆలోచిస్తుంది.

విశాల్ నడుస్తున్న అడుగుల చప్పుడుకి, వెనుదిరిగి చూసింది. హరాళి కాలికింద ఉన్న రోచి, శౌంఠిని ఒక్క తన్ను తన్ని.. గాల్లో లేచి వేగంగా వచ్చి విశాల్ గుండెలపై తన్నింది. దాంతో వెల్లకిలా పడ్డాడు విశాల్.

హరాళి రెండు కాళ్ళ మధ్య ఉన్నాడు విశాల్ చేతిలో ఉన్న త్రిశూలం లాంటి ఆయుధం రెండు చేతులతో పట్టుకుని విశాల్ ని పొడవడానికి సిద్ధం అయ్యింది.

విశాల్ ఎంతమాత్రం జడవలేదు. ఒక చేత్తో రోచి, శౌంఠిని వెళ్ళిపొమ్మని సైగ చేసాడు. త్రిశూలం కిందకి దిగుతున్న సమయంలో, “ఆగు!” అని గట్టిగా అరిచాడు.

హరాళికి విచిత్రంగా అనిపించింది.

‘ఎవరు ఇతడు, చావంటే భయం లేదు ఇలాంటి మానవులు కూడా ఉన్నారా?’ అనుకున్నది.

“నేను ఏమి తప్పు చేసానో చెప్పి.. ఆ తరువాత నన్ను చంపు” అన్నాడు విశాల్.

“నీవు ఒక అల్ప మానవుడివి నీ ప్రశ్నలకు సమాధానం చెప్పాల్సిన పని నాకు లేదు” అంది హరాళి.

"సాక్షాత్తు యమధర్మరాజులాంటి మహానుభావుడు.. మా తప్పులేవో చెప్పి మరీ మాకు నరకంలో శిక్షలు వేస్తారు. నువ్వు ఆయన కన్నా ఎక్కువ అనుకుంటే చెప్పకు" అన్నాడు విశాల్.

హరాళి ఒక్కసారి విశాల్ కళ్ళలోకి చూసి, "మరుగుజ్జనులను నా నుండి తప్పించుకునేలా చేసావ్!" అంది

"మరుగుజ్జులు అమాయకులు, నీ ముందు శక్తిహీనులు.. వాళ్ళ నివాసాన్ని ఆక్రమించి జీవితం విచ్చిన్నం చేసే అధికారం నీకు ఎవరు ఇచ్చారు?" అని అడిగాడు విశాల్.

"నా ప్రియుడి చావుకి కారణం అయ్యి.. నా తేజో ద్వీపం దొంగిలించి, నన్ను ఈరోజు ఇలా అంధురాలిగా నిలబెట్టిన వాళ్ళు ఎలా అమాయకులు అవుతారు" అని శూలాన్ని కిందకు దించుతూ అడిగింది హరాళి.

హరాళిలో మార్పు వస్తుందని విశాల్ కి అర్థం అయ్యింది.

"సరే, నీ తేజో ద్వీపం దొంగిలించింది రోచి. నువ్వు అతన్ని శపించి కొన్ని దశాబ్దాలుగా అతని పాపంకి నిష్కృతి చూపావు. వాళ్ళ ద్వీపానికి నువ్వు నీ ప్రియుడు వచ్చి వాళ్ళని ఇక్కడి నుండి బహిష్కరించి వారి జీవితాలను అల్లకల్లోలం చేసారు. మహదేవుడికి వచ్చిన కోపంతో నీ ప్రియుడి మరణం సంభవించింది. అందులో అర్భకులైన మరుగుజ్జులు ఏమి చేసారు?" అన్నాడు విశాల్.

హరాళిలో ఆలోచన మొదలైంది కానీ, ఆమె అహం దానికి ఒప్పుకోవడం లేదు.

"మరుగుజ్జులు సంగతి వదిలేయ్, మీ మానవుల సంగతి చెప్పు వికలాంగుడు అని ఒకడిని దీపావళి పూట చంపకుండా వదిలేస్తే, వాడు తుమ్మ చెక్క కింద ఒక రుద్రాక్ష వజ్రాన్ని దాచి తీసుకెళ్ళిపోయాడు. పసుపతి నాథుడికి 108 వజ్రాలతో పూజ చేస్తే కాని దయ రాదు. మీకున్న ధన వ్యామోహం వల్ల నేను ఏళ్ళ తరబడి అంధురాలినై ఇలా బ్రతకాల్సిన పరిస్థితి ఏర్పడింది. ఇది నా తప్పు అంటావా! మీ మానవ తప్పిదం అంటావా?" అడిగింది హరాళి.

విశాల్ మెల్లగా లేచి నుంచున్నాడు.

"ప్రతి జాతి, తెగ.. మంచి చెడు రెండు కలిగి ఉంటుంది. ఒక్క చెడునే చూస్తున్నావ్, యక్షిణి జాతి అంటే మాకు కుబేర కుటుంబం. మేము యక్షులను ఆరాధిస్తాం. భక్తులను దండించే దేవతలు ఉంటారా? అదీ నిష్కారణంగా.." అన్నాడు విశాల్.

"నువ్వు చాలా తెలివిగా మాట్లాడుతున్నావ్! మీరు చేసినవి అన్నీ కాకతాళీయం. మేము చేసిన పనులు అన్నీ వాంఛితం అన్నట్లు.." అంది హరాళి.

"అవును, అలానే నాకు అనిపిస్తుంది" అన్నాడు విశాల్.

"నీ అభిప్రాయాలతో నాకు పనిలేదు. మీలాంటి అర్భక జాతితో మాకు తర్కము లేదు" అంది హరాళి.

"సరే! నేను తర్కంకి సిద్ధంగా లేను కానీ, నన్ను చంపడానికి ఒకే ఒక్క కారణం చూపించి నన్ను చంపు" అన్నాడు విశాల్.

"నా రుద్రాక్ష వజ్రం తస్కరించిన నీచ జాతినందు పుట్టినవాడిగా, నా తేజో ద్వీపం దొంగిలించిన అంగుష్ఠులకు మిత్రుడివైన వైనం వల్ల.. నిన్ను చంపదలిచాను" అంది హరాళి.

"మేము అర్భకులం సరే, మీరు మాకన్నా ఎలా ఎక్కువో నిరూపించండి" అన్నాడు విశాల్.

"ధనాన్ని శాసించే కుబేర ప్రభువుకి మేము దాసులం. భూలోకం కన్నా ఉత్తమమైన భువరలోకము మా నివాసం. ఇంతకన్నా ఏమి కావాలి?" అంది హరాళి.

విశాల్ సన్నగా నవ్వి, "నేను సరైన బదులు చెపితే నన్ను వదిలేస్తావా?" అన్నాడు.

"హా! నిన్ను గానీ, నీ ప్రియ మిత్రులని గానీ నేను వదిలి వేయగలను. నాతో తర్కంలో తలపడు" అంది హరాళి.

"సరే" అన్నాడు విశాల్.

రోచి, శౌంఠి కళ్ళు అప్పగించి చూస్తున్నారు.

"మీ యక్షిణి జాతి యొక్క ప్రత్యేకత ఏంటి?" అన్నాడు విశాల్.

"సర్వ శక్తిమంతులం, సర్వ విద్య కోవిదులం" అంది హరాళి.

"మరి ఈ సర్వ విద్యలు మానవులు కూడా కలిగి ఉన్నారా?" అన్నాడు విశాల్.

"లేదు, మానవులు అధములు. వారికన్నా మేము ఎన్నో రేట్లు మేలు" అంది హరాళి.

"సరే, యక్ష జాతిలో పుట్టిన మహనీయులు పేర్లు చెప్పండి" అన్నాడు విశాల్.

"కుబేరుడు" అంది హరాళి.

"ఇంకా.." అన్నాడు విశాల్.

ఇంకా ఏవో యక్షుల పేర్లు చెప్పింది.

అన్నీ చెప్పాక, "ఎందుకు..,?" అని అడిగింది.

"ఒక జాతి తెగ యొక్క విలువ అందులో జన్మించిన పూర్ణ పురుషుల వల్ల తెలుస్తుంది. మీకు కుబేరుడు తప్ప చెప్పుకోవడానికి తగిన కారణాలు కలిగిన వ్యక్తులు ఎవరూ లేరు కానీ, మా జాతిలో దశావతారాలలో ఆ విష్ణువు జన్మించాడు. శక్తి పీఠాలలో అమ్మవారు నెలకొంది. శ్రీ రామ రూపంలో, కృష్ణ కీర్తనలో భగవంతుడే సాక్షాత్తు మమ్మల్ని కాపాడాడు.

***

# PART 59

మీ యక్ష జాతి ఘనమైనది కాబట్టి, ఈ దశావతారాలు భువర్లోకంలో ఎందుకు జరగలేదు. ఊరూరా ఉన్న అమ్మవార్లు.. మా పూజలే ఎందుకు అందుకుంటున్నారు? ఎందుకు మీ దగ్గర వెలవలేదు?" అని అడిగాడు విశాల్.

విశాల్ అడుగుతున్న ప్రతి ప్రశ్న తూట్లుగా హరాళి మనసుని పొడుస్తున్నాయి.

శౌంఠి, రోచి.. విశాల్ ని ఒక దేవుడుని చూసినట్లు చూస్తున్నారు.

"కామం, క్రోధం, లోభం, మోహం, మదం, మాత్సర్యం వంటి అరిషడ్వార్గాలు మీకు లేవు అని మా ఋషులు వేదాలలో రాశారు కానీ, మిమ్మల్ని చూసాక మీరు వాటికి అతీతులు కాదని అర్థం అయ్యిదమ్మా" అన్నాడు విశాల్.

"అధిక ప్రసంగం, మీ ధన వ్యామోహం మాకు లేదు దానిని ఎలా సమర్థిస్తున్నావ్?" అంది హరాళి.

"ఆకలి దప్పిక మీకు లేదు, వాయువేగంతో ఎక్కడికైనా వెళ్ళగలరు. మనో వాంఛ వెంటనే నెరవేరుతుంది కానీ, మాకు ఆకలి ఉంది. దప్పిక ఉంది. ఇవి తీర్చుకోవడానికి ధనం అవసరం. పట్టుమని శతాబ్దం కూడా లేని జీవితం రోగాలు రొస్టులతో నిండిపోయి.. పడుకున్నా.. లేచినా ధనం.. ధనం.. ధనం.. దానితోనే పని" ఆవేశంగా అరిచినట్టు చెప్పాడు విశాల్.

"ఇప్పుడు చెప్పు తల్లి! మాకు ధన వ్యామోహం ఉండటం తప్పా?" అన్నాడు.

విశాల్ మాటలలోని నిజాయితీ హరాళిని మంత్రముగ్ధురాలిని చేసింది.

"నువ్వు కారణజన్ముడివిరా పుత్రా! నేను నా స్వభావాన్ని మరిచి ఇలా రాక్షసిలా మారిపోవడం నిజంగా ఒక శాపం కానీ, ఏమి చేయలేని నిస్సహాయత వల్ల ఇలా మారిపోయాను" అని గుడి మెట్లపైన కూలబడుతూ అంది.

విశాల్ కి జాలి వేసింది.

"నువ్వు సర్వశక్తిమంతురాలివి. ఆ వజ్రం తిరిగి తీసుకుని రావడం ఎంత పని?" అన్నాడు.

"అది నాకు అసాధ్యము. మాకు భూలోకంలో కొన్ని ప్రదేశాల వరకే ప్రవేశం. అది దాటి రావడానికి గ్రామ దేవతలు ఒప్పుకోరు" అంది హరాళి.

"ఆ వజ్రం ఉనికి నాకు చెప్పు తల్లి, నేను తీసుకుని వస్తాను" అన్నాడు విశాల్.

"అది ఉండే ప్రదేశం నాకు తెలియదు కానీ, ఆ దేశానికి రాజు ఎవరో చెపుతాను" అంది హరాళి.

"దయచేసి చెప్పండి, నేను తప్పక తీసుకు వస్తాను" అన్నాడు.

హరాళి గాలిలో నుండి ఒక చిత్రాన్ని తీసింది.

"అది అమెరికా అధ్యక్షుడైన బిల్ క్లింటన్ చిత్రం. ఇతని రాజ్యంలో ఉంది" అని చేతికి ఇచ్చింది.

'అంటే రుద్రాక్ష వజ్రం అమెరికాలో ఉందన్న మాట' అనుకుని, "తల్లి నాకు సెలవు ఇప్పించు. నేను వజ్రంతో తిరిగి వస్తాను" అన్నాడు.

"విజయోస్తు" అంది హరాళి.

"సరిగ్గా వచ్చే అమావాస్య వరకు తిరిగి ఇక్కడ ఉంటాను. దయచేసి నా మిత్రులైన శౌంఠి రోచిని వదిలి పెట్టగలవు" అన్నాడు విశాల్.

"సరి సరి, విజయంతో తిరిగి రా!" అంది హరాళి.

శౌంఠి, రోచిని భుజాలపై వేసుకున్నాడు.

వారు హరాళికి నమస్కారం చేసారు.

బయలుదేరుతుండగా, "ఒక్క క్షణం.." అంది హరాళి.

విశాల్ వెనుతిరిగి చూసాడు ఆమె చేతిలో ఈశ్వర్ వినీషకి ఇచ్చిన గొలుసు ఉంది.

"ఇది బహుశా మీ మెడలో నుండి జారీ పడింది అనుకుంటా" అంది.

అది తీసుకుని "అవును తల్లి" అని తీసుకున్నాడు.

"గుడిలో నేను పెట్టిన బంగారు గొలుసు ఒకటి కనపడలేదు మీరు ఎవరైనా చూస్తే తిరిగి ఇవ్వండి. మానవుడు అది ధరించరాదు, దేవతా ఆభరణాలు ఆయుష్షు తీసి

వేస్తాయి" అంది హరాళి.

విశాల్ కి అర్థం అయ్యింది చీకటిలో వినీషకి హరాళి గొలుసు ఇచ్చాను అని కానీ, ఆయుష్షు అనగానే గుండె ఝల్లుమన్నది.

"అది ధరిస్తే ఆయుష్షు ఎంత తగ్గుతుంది తల్లి?"

"అది వేసుకున్న పక్షం రోజులు మాత్రమే బతుకుతారు" అంది.

"మరి తెలియక ధరిస్తే!" అడిగాడు విశాల్.

"తెలియక ధరించినా.. తిరిగి తీసుకు వచ్చి అప్పచెప్పిన తరువాత దానిని చిన్న తప్పుగా పరిగణించి భువరలోకంలో ఒక రోజు బందిఖానా చేస్తాము" అంది.

"నేను వాకబు చేసి మీకు చెప్పగలను" అన్నాడు విశాల్.

"తూర్పున ప్రత్యక్ష నారాయణుడు పొడుచుకు వస్తున్నాడు. మరల వచ్చే అమావాస్య రోజు కలుస్తాను" అంది హరాళి.

విశాల్ కి టెన్షన్ గా ఉంది. 'కొంపదీసి వినీష చూసుకోకుండా ఆ గొలుసు వేసుకోలేదు కదా!' అంటూ పరుగు పరుగున నాయక దగ్గరకి చేరుకున్నాడు.

రోచి, శౌంతిని.. నాయక ఆలింగనం చేసుకున్నాడు.

"దేవర మిమ్ములను తెస్తాడని నాకు ఎరుకే" అంటూ తేజో ద్వీపాన్ని ప్రేరేపించాడు.

నిదుర లేకుండా తల్లి వేరు చెట్టు కింద అందరు జాగారం చేస్తూ ఎదురు చూస్తున్నారు.

విశాల్ ని చూడగానే.. వినీష చంటిపాప అమ్మని హత్తుకున్నట్లు అతుక్కుపోయింది. అందరూ హర్షధ్వానాలు చేసారు. వినీషకి ఈశ్వర్ గొలుసు ఇచ్చాడు.

"హమ్మయ్య దొరికిందా! ఇందాకనే నేను చూసాను. గుడిలో నువ్వు ఇచ్చింది మనది కాదు" అని అంది వినీష.

"ఏది అది, ఎక్కడ ఉంది నువ్వు వేసుకోలేదు కదా!" కంగారుగా అడిగాడు.

"లేదు, మూర్తికి ఇచ్చాను" అంది వినీష.

"ఒరేయ్ వినీష ఇచ్చిన గొలుసు ఏది?" అని అడిగాడు.

"ఎక్కడైనా పడిపోతుందని మేడలో వేసుకున్నా రా! ఎలా ఉంది" అంటూ కాలర్ తొలగించి చూపిస్తున్న మూర్తిని చూసి వెన్నులో చలి పుట్టి గుండె దడ పెరుగుతుండగా స్థాణువు అయిపోయాడు విశాల్.

***

# PART 60

వెంటనే తేరుకున్న విశాల్, "ఆ గొలుసు ఇలా ఇవ్వు. అయినా ఏది పడితే అది చేసుకుంటావా?" కోపంగా అన్నాడు.

"ఇప్పుడు ఏమయిందిరా! భద్రంగానే ఉందిగా" అంటూ తీసి ఇచ్చాడు.

దాన్ని నాయక దగ్గర పెట్టాడు.

"నాయక.. నేను వచ్చే అమావాస్యకు తిరిగి వస్తాను దీన్ని క్షేమంగా నీ దగ్గరే ఉంచు" అన్నాడు.

"అలాగే దేవా" అంటూ తలా ఊపాడు నాయక.

"మరలా రావడం ఏంటి!?" అడిగాడు మూర్తి.

ఒక్క హరాళి గొలుసు విషయం తప్పించి అన్ని విపులంగా చెప్పాడు.

"నాయక కుటుంబం బంధువులు, మిత్రులు అందరు ఆ దీవి నుండి బయటపడ్డారు. తిరిగి హరాళికి సహాయం చేసే అవసరం మనకు ఏముంది" అన్నాడు మూర్తి.

"తప్పు రా! ఎంతో కష్టపడి మన జాతి గొప్పదని చెప్పి వాదించాను. నన్ను నమ్మి శౌంఠిని, రోచిని వదిలిపెట్టింది. పోయిన రుద్రాక్ష వజ్రం తిరిగి తెచ్చి ఇస్తే.. తను చేసే పూజ వల్ల.. హరాళికి కళ్ళు రావడమే కాదు, తిరిగి పశుపతి నాథుని లింగరూపాన్ని, పోయిన కాంతిని తీసుకుని వచ్చినవాళ్ళం అవుతాం. తద్వారా అంగుష్టులకు వాళ్ళ రాజ్యమైన దేగల దీవి తిరిగి వస్తుంది. మనకి పుణ్యం కూడా" అన్నాడు విశాల్.

"సరే, నీ ఇష్టం" అన్నాడు మూర్తి.

"ఉదయమే పశుపతి నాథుని దర్శనం చేసుకుని రాత్రి వరకు విశ్రాంతి తీసుకొండి. తేజో ద్వీపం సాయంతో మిమ్మలను తిరిగి మీ నగరానికి చేరుస్తాం" అన్నాడు నాయక.

"ఇదేదో బాగుంది రా! ఇలాంటివి ఒక వంద పెట్టుకుంటే మన భారత దేశంలో ప్రయాణానికి ఇంధన ఖర్చు ఉండదు" అన్నాడు మూర్తి.

విశాల్ పైకి నవ్వినట్టు ఉన్నా, 'మూర్తికి ఏమైనా అవుతుందా!' అని ఆలోచిస్తున్నాడు.

"మీరు ఇద్దరూ ఇలా కూర్చోండి. మీకు కొన్ని విషయాలు చెప్పాలి" అన్నాడు మూర్తి.

విశాల్ పై కిడ్నప్ కేస్ దగ్గర నుండి వినీష మిస్సింగ్ వల్ల ఏం జరిగిందో అంతా పూస గుచ్చినట్టు చెప్పాడు.

"మరి ఇన్నాళ్ళూ.. ఈ విషయం నాకు ఎందుకు చెప్పలేదు" అన్నాడు విశాల్.

"ఇప్పటి వరకు నేను చెప్పే పరిస్థితి, నువ్వు వినే పరిస్థితి ఉందా? అందుకే చెప్పలేదు" అన్నాడు మూర్తి.

వినీష మూగగా రోదిస్తుంది.

కాసేపు ఆలోచించాక, "నా దగ్గర ఒక ఐడియా ఉంది" అన్నాడు విశాల్.

"ఏంటది?" అడిగారు వినీష, మూర్తి.

పూజారిగారిని మనతో తీసుకు వెళ్ళాలి. మన మీద ఉన్న అనుమానాన్ని, జాలిగా మార్చెయ్యాలి. అప్పుడు నాకు, వినీషకి నీకు.. ఎవ్వరికి ఏ డామేజ్ కాదు" అన్నాడు.

"ఒరేయ్, వీధి నాటకంలో పద్యంలా వినడానికి బాగుంది కానీ, అర్థం మాత్రం కావడం లేదు" అన్నాడు మూర్తి.

"మా పక్కింటి బాలుగాడు సెవెంత్ క్లాస్ పబ్లిక్ ఫెయిల్ అయ్యాడు. చుట్టాలు, బంధువులు రిజల్ట్ ఏం వచ్చిందంటే, వాడికి పరీక్షల సమయంలో కుక్క కరిచింది అని, అందుకే పరీక్ష రాయలేదని చెప్పేవాడు. ఎందుకని నేను

అడిగితే.. ఫెయిల్ అయితే అవమానం, కుక్క కరిస్తే అభిమానం అనే వాడు. వాడి లాజిక్ నాకు బాగా నచ్చేది. ఇప్పుడు కూడా మనం అదే చెయ్యబోతున్నాం" అన్నాడు.

ముగ్గురూ నవ్వుకున్నారు.

పూజారి వద్దకు వెళ్ళి విశాల్ ఏదో మాట్లాడి వచ్చాడు.

"మనం జీపులో వెళ్ళాలి. తేజో ద్వీపం వద్దు" అన్నాడు విశాల్.

సాయంత్రం అవుతుండగా అంగుష్టులకు వీడ్కోలు చెప్పారు.

అందరూ విశాల్ కాళ్ళ మీద పడ్డారు. తమ వల్ల ఏదైనా సహాయం కావాలంటే.. ఎప్పుడూ సిద్ధంగా ఉంటామని చెప్పారు.

జాజి తన చేతితో చేసిన చిన్న చిన్న లక్క పిడతలను వినీషకి బహుమతిగా ఇచ్చింది. అందరిలోనూ వీడిపోతున్న ఉద్వేగం కనపడుతుంది.

శౌంఠి, విశాల్ భుజం పైకి ఎక్కి ఏడుస్తున్నాడు.

"ఎందుకు రా, మరలా అమావాస్యకి వస్తా కదా" అన్నాడు విశాల్.

"ఇక్కడే ఉండిపో దేవా!" అని విశాల్, వినీష వంక చూస్తూ అన్నాడు శౌంఠి.

"నువ్వు హాయిగా జాజిని పెళ్ళి చేసుకున్నావు. మరి నా జాజిని నేను చేసుకోవద్దా?" అన్నాడు విశాల్.

అందరూ నవ్వడంతో వాతావరణం కాస్త తేలికయ్యింది.

పూజారిగారిని తీసుకుని జీప్ లో బయలుదేరి, తెల్లవారు జామున ఊరిలోకి చేరుకున్నారు.

మూర్తిని ఇంటికి వెళ్ళిపొమ్మని చెప్పి, విశాల్, వినీషతో కలిసి.. సరాసరి టూ టౌన్ పోలీస్ స్టేషన్ కి వెళ్ళాడు.

డ్యూటీలో ఉన్న పోలీసులు విశాల్ ని గుర్తు పట్టారు. అందులో ఒకడు విశాల్ చెంప పైన కొట్టాడు.

"చెప్పేది వినండి సర్, ఎందుకు కొడుతున్నారు" అడిగాడు విశాల్.

"నువ్వు చేసిన పనికి కొట్టాలా చంపాలా" అన్నాడు.

"అదే ఏంటి ఆ పని?" అని అడిగాడు విశాల్.

"ఆడపిల్లను ఎత్తుకుని వెళ్ళడం" అన్నాడు పోలీస్.

"క్షమించండి నన్ను ఎత్తుకెళ్ళిన విషయం వాస్తవం కానీ, అది విశాల్ కాదు. మా ఇద్దరిని కలిపి వహీద్ అనే రౌడీ ఎత్తుకుని వెళ్ళి అడవిలో బంధించాడు" చెప్పింది వినీష.

కాసేపటికి విషయం తెలిసి సుందర్ ప్రతాప్ వచ్చాడు.

"ఏం జరిగింది" అని అడిగాడు.

పూజారి.. వహీద్ అతని అనుచరులు రావడం వరకు నిజం చెప్పి, వాళ్ళతో వీళ్ళని తీసుకుకొచ్చారని ఒక కట్టు కథ చెప్పాడు.

వహీద్ గురించి అంతకు ముందే తెలుసు కాబట్టి సుందర్ కొన్ని ప్రశ్నలు వేసినా విశాల్ మీద నమ్మకంతో, వినీష ఇస్తున్న వాంగ్మూలంతో అదంతా నమ్మాడు.

"సరే మరి, ఎలా తప్పించుకున్నారు" అని అడిగాడు సుందర్.

"పూజారి సహాయం వల్ల తప్పించుకున్నాం" అని, వహీద్ అడవిలోనే ఉన్నాడని చెప్పాడు విశాల్.

"సరే, ఆ అమ్మాయిని వాళ్ళ ఇంట్లో అప్పచెప్పండి" అని,

వినీష వైపు తిరిగి మీకు, "ఈశ్వర్ ఏమవుతాడు?" అని అడిగాడు సుందర్.

"ఫ్యామిలి ఫ్రెండ్ సర్" అంది వినీష.

"అతను కిడ్నప్ కేస్, చైన్ స్నాచింగ్ కేస్ పెట్టారు. ఆయనికి చెప్పి కేసు వెనుకకి తీసుకోమని చెప్పండి" అన్నాడు సుందర్.

"ఆయన చెప్పిన చైన్ ఇదే సర్!" అంటూ చూపించింది.

వెనుకకి తిరిగిన వినీషకి శ్యామ్ సుందర్ కనిపించాడు.

"నాన్న గారు.." అని ఏదో చెప్పబోయిన వినీష చెంప చెల్లుమనిపించాడు.

"అయ్యో సర్..!" అని ముందుకి వచ్చాడు విశాల్.

విశాల్ ని చూస్తూ, “ఇంకొక్క మాట మాట్లాడితే పోలీస్ స్టేషన్ లోనే నిన్ను మర్డర్ చేస్తా నోర్ముయ్యి” అన్నాడు శ్యా.

సుందర్ “కూర్చోండి” అని చెప్పి జరిగిందంతా చెప్పాడు.

“ఒక రౌడీ వెధవతో స్నేహం చేస్తే రౌడీలే పట్టుకెళతారు. అభం శుభం తెలియని నా కూతురుకి ఏదైనా జరిగి ఉంటే బాధ్యత ఎవరిది సర్! మీరు అయినా చెప్పండి. నా ఇంటి వంక నా కూతురి వంక.. ఆ రాస్కల్ ని చూడవద్దని” అంటూ వినీష చేయి పట్టుకుని గుంజుకెళ్ళాడు శ్యామ్.

వినీష నిస్సహాయంగా వెనుతిరిగి చూస్తూ వెళ్తుంటే, నోట మాట రాని విశాల్ నుంచుని చూస్తు ఉండిపోయాడు.

కన్న కలలు అన్నీ కల్లలుగా చేసి కదిలిపోతున్న వినీష.. విశాల్ కనురెప్ప చాటున దాగున్న కన్నీటి చుక్కని అడిగుంటే అది చెప్పి ఉండేది, కలలన్ని కథలు కథలు గా..

***

# PART 61

పూజారితో కలిసి విశాల్ ఇంటికి చేరుకున్నాడు. పోలీస్ జీప్ లో నుండి దిగగానే అనంత, స్వప్న పరుగు పరుగున వచ్చి, విశాల్ ను కౌగలించుకుని ఉండిపోయారు.

"ఊరుకోండి అమ్మ, వచ్చేసాను కదా!" అన్నాడు విశాల్.

వాళ్ళని ఊరుకోబెట్టి, "నాన్న ఏరి!?" అని అడిగాడు.

"ఆయన ఆఫీస్ పని పైన క్యాంపు వెళ్ళారు" అంది అనంత.

ఇంట్లో కూడా అదే వహీద్ కిడ్నప్ స్టోరీ చెప్పాడు.

"పోనీలేరా! దేవుడి దయవల్ల క్షేమంగా ఇల్లు చేరుకున్నావ్. ఇకనైనా జాగ్రత్తగా ఉండు" అంది అనంత.

పూజారిగారు సాయంత్రం వరకు ఉండి బయలుదేరి వెళ్ళిపోయాడు. రాత్రి 8 గంటలకు విశాల్ నాన్న వచ్చారు. విశాల్ ని చూడగానే బావురుమన్నారు. ఆయనను గట్టిగా పట్టుకున్నాడు విశాల్.

"మీ కళ్ళలో నీళ్ళా నాన్నా..! జీవితంలో నేను ఎప్పుడు ఊహించని విషయం. నన్ను తిట్టండి కొట్టండి కానీ, మీరు కూడా ఇలా మారిపోతే ఎలా నాన్న? సింహాన్ని చూసిన కళ్ళకి చిట్టెలుకను చూపించకండి" అన్నాడు.

విశాల్ తరువాత రెండు రోజులు ఎటూ వెళ్ళలేదు. మూర్తి కూడా రాలేదు.

మూడో రోజు బయలుదేరి మూర్తి దగ్గరకి వెళ్ళాడు. మూర్తికి జ్వరం వచ్చింది అని చెప్పింది అక్కయ్య.

"ఏరా, ఆ అడవిలో 20 రోజులు క్యాంపులు అవసరమా? ఏ అడవి దోమో కుట్టినట్టు ఉంది. పడుకున్నవాడు లేవలేదు" అని అంది.

విశాల్ ఏమి మాట్లాడలేదు. మూర్తిని డాక్టర్ కి చూపించి తీసుకువచ్చాడు.

"ఏరా! వినీష విషయం ఏమైంది? వాళ్ళ ఇంట్లో అంతా సెట్ అయ్యిందా?" అని అడిగాడు మూర్తి.

"హా!" అని ముక్తసరిగా అన్నాడు విశాల్.

'ఏం చేస్తుందో, ఎలా ఉందో! ఇంట్లో వాళ్ళ మాటలకు ఏమైనా ఫీల్ అవుతుందేమో' అని లోపల అనుకున్నాడు.

"మూర్తి, నేను మరలా వస్తాను రా. ఇంతకీ టైమ్ మెషిన్ స్విచ్ ఏమైంది?" అడిగాడు విశాల్.

"ఏమో కనపడలేదని చెప్పాగా" అన్నాడు మూర్తి.

విశాల్ లోపలి వెళ్ళి, "ఆకుపచ్చ ఎరుపు రంగుల కలిసి ఉన్న స్విచ్ లాంటిది ఏమైనా చూసావా" అని అక్కయ్యను అడిగాడు.

"హా, చెప్పటం మరిచాను. నిన్న చింటూ వాళ్ళ అమ్మగారు తీసుకుని వచ్చి ఇచ్చింది. వాడు ఏదో బొమ్మ అని తీసుకెళ్ళడాని.. అది మూర్తి రూమ్ లో డెస్క్ లో పెట్టాను" అంది. రూంలోకి వెళ్ళి డెస్క్ ఓపెన్ చేసాడు, స్విచ్ అక్కడే ఉంది.

అది మూర్తికి ఇచ్చి, "ఈసారి అయినా కాస్త భద్రంగా పెట్టు" అంటూ బయలుదేరాడు విశాల్.

ఇంటికి వెళ్దాం అనుకుని వినీష ఇంటి వైపు స్కూటర్ తిప్పాడు. వీధి చివర బండి ఆపి పార్క్ చేసి, మెల్లగా నడవసాగాడు. వినీష ఏ బాల్కనీ లోనైనా కనపడక పోతుందా అని చిన్న ఆశ! దూరంగా గేట్ కి అనుకుని సిగరెట్ కాలుస్తున్న కన్నారావు కనిపించాడు.

'ముష్టి వెధవ ఎప్పుడూ ఇంట్లోనే తగలడతాడు' అని అనుకున్నాడు.

ఇంటి వెనుక వైపు సందులోకి వెళ్ళాడు. పెరట్లో జామ చెట్టు ఉంది. దాని కొమ్మల ద్వారా వినీష వాళ్ళ వెనుక పక్క బాల్కనీలోకి చేరుకున్నాడు. మధ్య గదిలో అందరూ ఉన్నారు. వినీష అశోక వనంలో సీత వలె తలదించుకుని ఉంది.

"మూడు రోజుల నుండి నేను అడుగుతూనే ఉన్నా.. నువ్వు మౌనం గానే ఉన్నావ్. రేపు ఈశ్వర్ వాళ్ళ కుటుంబానికి నేను చెప్పి తీరాలి. అయినా నువ్వు

ఎక్కడికో వెళ్ళి ఇరవై రోజుల తరువాత వచ్చినా కూడా ఈశ్వర్ నిన్నే చేసుకోవాలని పట్టు పడుతున్నాడు. నీకు అది ప్రేమలా కనిపించడం లేదా? అతను ఏ విషయంలో విశాల్ గాడి కన్నా తక్కువ!?" అని అడుగుతున్నాడు శ్యామ్.

"పోనీలెండి నాన్న, అక్కకి కొంచెం టైమ్ ఇవ్వండి" అంది మనీష.

"మీరు నోరు ముయ్యండి" అని కోపంగా అన్నాడు శ్యామ్.

"సరే, ఇప్పుడు ఈశ్వర్ ని చేసుకోను అంటుంది. అప్పుడు ఏం చేస్తారు?" అంది హరీష.

"మంచిది, అప్పుడు మీ అందరికి విషం ఇచ్చి, నేను కాస్త పుచ్చుకుంటా" అన్నాడు శ్యామ్.

"పెద్దాయన అంత అంత మాటలు అంటున్నాడు. అయినా నీకు చీమ కుట్టినట్టు లేదు. మాట్లాడు.. ముంగిలాగ ఉండకు" అంది వసుంధర.

మొదటిసారి పెదవి విప్పింది వినీష! కారు మేఘానికి తగిలిన గాలి తూట్లకు బద్దలై కురిసిన వడగళ్ళ వానలా, మౌన ముద్రలో ఉన్న మంచు పర్వతం బద్దలై కొండ ఎత్తున కడలిని కదిపినట్టు... "ఏమి మాట్లాడాలి, ఏం చెప్పాలి? నా మనసు చూసిన దాన్ని మీ కళ్ళు చూడలేవు. నా కళ్ళు చూసిన దాన్ని మీ మనసు ఒప్పుకోదు. నా మనసు పీక నొక్కేసినాక నా మౌన ఘోష వినేదెవరు? మీకు సమాజం మీద ఉన్న ప్రేమ నాపై ఒక్క శాతమైనా ఉందా! ఎక్కువ నవ్వితే తప్పు, మాట్లాడితే తప్పు, కాళ్ళు ఊపితే తప్పు, కలలు కంటే తప్పు, ప్రేమిస్తే తప్పు.. ఆఖరికి ఇప్పుడు చావడం కూడా ఒక తప్పు. ఒక మనిషిని హృదయం కావాలా! రుధిరం కావాలా? అని అడిగితే, మొదటిది ఆడితేనే.. రెండవది తిరుగుతుందని ఎలా చెప్పను? పదాలకి అర్థం ఏంటి అని అక్షరాలు అడిగితే ఎలా చెప్పను? ఏమి చెప్పను..? ఊపిరి ఆడటం లేదు అమ్మా!" అంటూ వెక్కివెక్కి ఏడ్చింది.

అది చూసిన విశాల్ తో సహా అందరి మనసు కదిలిపోయింది.

శ్యామ్ చెయ్యి తలపై వేసి నిమురుతూ.. "నేను నిన్ను పుట్టిన నిమిషం నుండి ఈరోజు వరకు ఏమి కోరలేదు. తండ్రిగా నీ అన్ని కోరికలు తీర్చగలిగాను. నీకు మాకన్నా వాడే ఎక్కువ అనుకుంటే నిరభ్యంతరంగా వెళ్ళిపోవచ్చు కానీ,

ఇంకెప్పుడు నా ఇంటి వైపు తిరిగి చూడను అని మాట ఇవ్వు" అంటూ వినీష చేయి తన తలపై పెట్టుకున్నాడు.

"సమాజం, కుటుంబం, బంధువులు చుట్టాలు.. ఇవి ఈ ముసలి చేతకాని చేవలేని తండ్రికి ముఖ్యం అమ్మా!" అన్నాడు శ్యామ్.

"నాన్నా.." అంది వినీష.

"అవును, నాన్ననే అడుగుతున్నా. వాడి కోసం మమ్మల్ని గానీ, మా కోసం వాడిని గానీ త్యాగం చేయక తప్పదు తల్లి" అన్నాడు శ్యామ్.

"మీరు ఇటువంటి కొత్త వేలం వెర్రి పెట్టకండి" అంది వసుంధర.

నువ్వు మాట్లాడకు అన్నట్లు చూసాడు.

వినీషకి అర్థం అయ్యింది. ఏమి చేయలేని నిస్సహాయ స్థితి.

"మరి వాళ్ళకి నీకు ఈశ్వర్ అంటే ఇష్టం అని చెప్పేయనా?" అడిగాడు శ్యామ్.

"మీ ఇష్టం నాన్న" అంటూ లేచి బాల్కనీలోకి పరిగెత్తింది.

అక్కడే నక్కి వింటున్న విశాల్ ని చూసి గట్టిగా కౌగిలించుకుంది. కళ్ళ నుండి కన్నీటి వరద కారుతుంది. ఆమె కళ్ళపై తన పెదవులను ఉంచిన విశాల్ కి ఉప్పగా ఉన్న కన్నీరు భవిష్యత్తుని చెపుతుంది. ఒక్క మాట కూడా లేదు, ఒకరి శ్వాస ఇంకొకరికి తగులుతుంది. గాలి ఎక్కడిది అక్కడ నిలిచి ఆ ప్రేమ రాహిత్యాన్ని చూస్తోంది. ప్రకృతి కాంత ఈ ఓదార్పు నాకు లేదా అన్నట్లు స్థాణువైపోయింది. ఇద్దరి కన్నీటి బొట్లు కలిసి కిందకి జారీ నేలపై ఇద్దరి మధ్యా హద్దులు గీస్తున్నాయి. ఇదే చరమాంకం అని చెబుతున్నాయి.

***

# PART 62

మూర్తి, విశాల్ తమ హై స్కూల్ సోషల్ టీచర్ రవీంద్ర ఇంటికి వెళ్ళారు. ఆయన ఈజీ చైర్ లో కూర్చుని టీవీలో ఇస్తరాకులు టీవీ సీరియల్ చూస్తున్నారు.

మూర్తి, విశాల్ ఒకరి ముఖంలోకి ఒకరు చూసుకుని నవ్వుకున్నారు.

చేతిలో ఉన్న ఫ్రూట్ బాగ్ టీపాయ్ మీద పెడుతూ, "నమస్తే మాష్టారు" అన్నాడు మూర్తి.

కళ్ళజోడు సర్ధుకుని, "ఎవరూ?" అన్నారు రవీంద్ర గారు.

"మేము సర్ మీ ప్రియ శిష్యులం మూర్తి, విశాల్" అని తమ బ్యాచ్ ఇయర్ చెప్పారు.

"హా! బాగున్నారు రా అబ్బాయిలు చాల కాలమైంది కదా! కళ్ళు కూడా కనపడటం లేదు. అందుకని కొంచెం గుర్తు పట్టలేకపోయా" అన్నారు.

"పర్లేదు సర్" అని ఆ మాటా ఈ మాటా అయ్యాక,

"మీతో కొంచెం పని ఉండి వచ్చాము సర్" అన్నాడు విశాల్.

"చెప్పండి రా! ఏమి కావాలి" అన్నాడు రవీంద్ర.

"ఇండియా నుండి అమెరికాకి వెళ్ళిన వజ్రాలు గురించి మీకు ఏమైనా తెలుసా?" అడిగాడు విశాల్.

ఆయన లోపల నుండి ఒక పాత పుస్తకం తెచ్చాడు. "అది తెరిచి ప్రపంచవ్యాప్తంగా మన దేశం నుండి పట్టుకెళ్ళిన వజ్రాలలో 8 అతి ముఖ్యమైనవి.

అవి కోహ్-ఇ-నూర్ డైమండ్, హోప్ డైమండ్, దర్యా-ఇ-నూర్, ఓర్లోవ్ డైమండ్, రీజెంట్ డైమండ్, సాన్సీ డైమండ్, నాసాక్ డైమండ్, టావెర్నియర్ బ్లూ డైమండ్ (ఫ్రెంచ్ బ్లూ). ఇందులో మీరు ప్రతేయకంగా అడుగుతున్నారు కాబట్టి

అమెరికాలో ఉన్న భారత్ దేశానికి చెందిన వజ్రం హోప్ (hope diamond). హోప్ డైమండ్ ప్రపంచంలోని అత్యంత ప్రసిద్ధ వజ్రాలలో ఒకటి. దాని పరిమాణం, అందం చెప్పుకోదగ్గది.

హోప్ డైమండ్ యొక్క ఖచ్చితమైన మూలం ఖచ్చితంగా తెలియదు. అయితే ఇది భారతదేశంలోని గోల్కొండలోని కొల్లూరు గని నుండి ఉద్భవించిందని నమ్ముతారు. ఇది ప్రారంభంలో సుమారు 112 క్యారెట్ల కఠినమైన వజ్రం అని భావిస్తున్నారు. వజ్రం యొక్క విలక్షణమైన నీలం రంగు దీని ప్రత్యేకత. వజ్రం యొక్క ప్రారంభ చరిత్ర చాలా వరకు ఊహాజనితమైనది. ఇది ఒకప్పుడు టావెర్నియర్ బ్లూ అని పిలువబడే పెద్ద నీలి వజ్రంలో భాగమని పురాణాలు సూచిస్తున్నాయి. దీనిని 17వ శతాబ్దంలో ఫ్రెంచ్ రత్నాల వ్యాపారి జీన్–బాప్టిస్ట్ టావెర్నియర్ ఐరోపాకు తీసుకువచ్చారని నమ్ముతారు. కాలక్రమేణా, ఈ నీలి వజ్రం తిరిగి కత్తిరించబడింది. చివరికి ఫ్రాన్స్ రాజు లూయిస్ XIV ఆధీనంలోకి వచ్చింది, అతను దానిని రాజ చిహ్నంగా మార్చాడు."

***

# PART 63

"ఫ్రెంచ్ విప్లవం సమయంలో, వజ్రం ఇతర రాజ ఆభరణాలతో పాటు దొంగిలించబడింది. ఆ తరవాత కొంతకాలం అదృశ్యమైంది. ఇది తరువాత పుంజుకుంది. 19వ శతాబ్దం ప్రారంభంలో, ఇది సుమారు 45.52 క్యారెట్ల బరువున్న చిన్న, కుషన్ ఆకారంలో ఉన్న రాయిగా మార్చబడింది. హోప్ డైమండ్ నేడు గుర్తించబడిన పరిమాణం మరియు ఆకృతి ఇది.

వజ్రం 19వ శతాబ్దంలో అనేక చేతులు మరియు దేశాల గుండా వెళ్ళింది. ఇది యునైటెడ్ కింగ్‌డమ్ రాజు జార్జ్ IV మరియు హెన్రీ ఫిలిప్ హోప్‌తో సహా వివిధ యూరోపియన్ ప్రభువులు మరియు కలెక్టర్ల యాజమాన్యంలో ఉంది, వీరి నుండి దీనికి దాని పేరు వచ్చింది. వజ్రం చివరికి ఐరోపాను విడిచిపెట్టి యునైటెడ్ స్టేట్స్ కి దారితీసింది.

ఎవెలిన్ వాల్ష్ మెక్లీన్, ఒక అమెరికన్ సాంఘికురాలు, 20వ శతాబ్దం ప్రారంభంలో హోప్ డైమండ్ యొక్క అత్యంత ప్రసిద్ధ యజమానులలో ఒకరిగా మారింది. ఆమె దానిని తరచుగా ధరించేది. మెక్లీన్ యొక్క ఆర్థిక కష్టాలు మరియు వ్యక్తిగత విషాదాలు, ఆమె భర్త మరియు కొడుకు మరణంతో సహా, వజ్రం శాపగ్రస్తమైనది అన్న ఊహాగానాలకు దారితీసింది.

1958లో, ఎవెలిన్ మెక్లీన్ మరణించిన తరువాత, ఆమె కుటుంబం వాషింగ్టన్, D.C లోని స్మిత్సోనియన్ ఇన్స్టిట్యూషన్ యొక్క నేషనల్ మ్యూజియం ఆఫ్ నేచురల్ హిస్టరీకి హోప్ డైమండ్ ను విరాళంగా ఇవ్వాలని నిర్ణయించుకుంది.

ఇప్పటికి అది అక్కడే ఉంది. అయినా మీకు దీని గురించి అడగాల్సిన అవసరం ఏంటిరా?" అన్నారు రవీంద్ర.

"ఏమి లేదు సర్ మొన్న పీజీ ఎంట్రన్స్ టెస్ట్ లో ఈ ప్రశ్న అడిగారు. మాకు తెలియలేదు, అందుకే" అన్నారు ఇద్దరు.

బయటపడ్డ ఇద్దరు సరాసరి మూర్తి ఇంటికి వెళ్ళారు.

విశాల్ సెక్స్టాంట్ తీసుకుని అట్లాస్ లో ఉన్న నేషనల్ మ్యూజియం ఆఫ్ నేచురల్ హిస్టరీ, వాషింగ్టన్, D.C కి అక్షాంశం, రేఖాంశం లెక్కించాడు 38.891014, –77.026703.

"హా దొరికింది రా" అన్నాడు విశాల్,

"సరే, రాత్రికి వెళ్దామా?" అన్నాడు మూర్తి.

"అమెరికాలో రాత్రి, మనకు పగలు. మనకి రాత్రి, వాళ్ళకు పగలు. కాబట్టి మనం డే టైమ్లోనే వెళ్ళాలి" అన్నాడు విశాల్.

***

# PART 64

"ఇప్పుడు ఇక్కడ మధ్యాన్నం 12:20. వాషింగ్టన్ లో ఎంత అయ్యి ఉంటుంది?" అన్నాడు మూర్తి.

విశాల్ ఏవో లెక్కలు వేసాడు. "హా 2:50 am అంటే తెల్లవారుజాము మూడు అవుతుంది. నేను టైమ్ ప్రొజెక్టర్ ఆన్ చేస్తా. వాళ్ళ టైమ్ 3 :30 am వరకు మనం వెళ్ళవచ్చు" అన్నాడు మూర్తి.

"నీ దగ్గర ఉన్న పోలరాయిడ్ కెమెరా పట్టుకు రా" అన్నాడు విశాల్.

రెండు మంకీ కాప్స్ మొహానికి వేసుకున్నారు.

"ఇవెందుకు? అక్కడ మనల్ని ఎవరు గుర్తు పట్టరు కదా!" అన్నాడు మూర్తి.

"అవును కానీ, అమెరికా లాంటి అభివృద్ధి చెందిన దేశాలలో సీసీటీవీ అనే దూరదర్శన యంత్రం ఒకటి వాడుతారు. దాని ద్వారా వాళ్ళు మనల్ని గుర్తు పట్టే అవకాశం ఉంది" అన్నాడు విశాల్.

"ఇది నీకు ఎలా తెలుసు?" అన్నాడు మూర్తి.

విశాల్ నవ్వి, "నువ్వు జేమ్స్ బాండ్ సినిమాలు చూడరా! ఇలాంటివి అన్నీ తెలుస్తాయి" అన్నాడు.

కరెక్ట్ గా ఒక అరగంటలో ఇద్దరు సెట్ చేసిన మ్యూజియం లొకేషన్ కి చేరుకున్నారు. పెద్ద హాల్ లో ఉన్నారు. ఎదురుగా నిజంగా నుంచుని ఉందా అన్నట్టు పెద్ద ఏనుగు. ఒక్కసారిగా ఇద్దరు దడుచుకున్నారు.

వీళ్ళు ఒక్క అడుగు వేసారో లేదో గార్డ్స్ బెల్ మోగింది. బహుశా సీసీటీవీ నుండి రక్షణ విభాగం వారు చూసినట్టు ఉన్నారు. దూరంగా ఎక్కడో బూట్ల శబ్దం వినపడుతుంది. విశాల్ పోలరాయిడ్ కెమెరా తీసి అక్కడ గోడ మీద వేసి ఉన్న ఇండోర్ మ్యాప్ ని ఫోటో తీసాడు. ఇంకా ఒక్క క్షణంలో గార్డ్స్ లోపలి వస్తారు అనగా స్విచ్ ఆన్ చేసి ఇద్దరూ మాయమైపోయారు.

"ఎందుకు స్విచ్ ఆఫ్ చేసావ్? ఇంకా కొద్ది సేపు ట్రై చేస్తే బాగుండేది" అన్నాడు మూర్తి.

"ఏంటి ట్రై చేసేది? వాళ్ళకు దొరికామంటే అమెరికా జైల్ లో చిప్ప కూడు తినాలి" అని పోలరాయిడ్ లో నుండి ఫోటో తీసాడు విశాల్.

"ఏంటి ఇది? అని అడిగాడు మూర్తి"

"దీనిని ఇండోర్ మ్యాప్ (indoor map) అంటారు. పెద్ద పెద్ద భవనాల్లో ఏది ఎక్కడ ఉందో తెలిపే మ్యాప్ అన్న మాట. ఇప్పుడు దీన్ని చూసి మనం వజ్రం ఎక్కడ ఉందో కనుక్కోవాలి. తద్వారా వజ్రం యొక్క సరైన స్థల నిర్ధారణ చేసి, అప్పుడు దాన్ని తీసుకురావాలి. అంటే మనం మ్యూజియంలో ఒక్క నిమిషం కన్నా ఎక్కువ ఉండకూడదు" అన్నాడు విశాల్.

"ఒరేయ్, ఆఖరికి ఇలా వజ్రాల దొంగాగా మారిపోయావు. నన్ను మార్చేసావు" అన్నాడు మూర్తి. ఇద్దరూ నవ్వుకున్నారు.

***

సమయం 2:50 am..

"హోప్ డైమండ్ రెండో ఫ్లోర్ లో ఉంది, దాని సరైన అక్షాంశం, రేఖాంశం కనుగొంటే చాలా సులువుగా వజ్రాన్ని తీసుకురావచ్చు" అన్నాడు విశాల్.

"కానీ సెక్స్టాంట్ ఉపయోగించి అది తీసుకుని రాలేము. మరి ఎలా?" అన్నాడు మూర్తి.

"అందువల్లే మనం రోజూ ఒకసారి వెళ్ళి ఈ విలువలను అంచనా వేస్తూ రావాలి. ఈ మ్యాప్ ప్రకారం ఏనుగుకి ఎడమవైపు రుద్రాక్ష వజ్రం ఉంది కానీ, రెండో అంతస్థులో మనం దాని అక్షాంశం, రేఖాంశం సరిగ్గా లెక్కించగలిగితే చాలు. కాకపోతే ఇది ఒక్కసారితో అయ్యే పనికాదు" అన్నాడు విశాల్.

ఆ రోజు నుండి రోజు ఒక్క డెసిమల్ డిగ్రీ పెంచుతూ, వెళ్ళి వస్తున్నారు. దాదాపు 24 రోజులకు వారనుకున్న పని అయ్యింది. వజ్రం యొక్క అక్షాంశం, రేఖాంశం సరిగ్గా లెక్కించారు.

"ఈ రోజు తీసుకొద్దాం" అన్నాడు మూర్తి.

"వద్దు, అమావాస్య వరకు ఆగుదాం అమావాస్యకి దాన్ని తీసుకొచ్చి హరాళికి ఇచ్చేద్దాం" అన్నాడు విశాల్.

"ఎందుకు అంత ఆలస్యం!?" అన్నాడు మూర్తి.

"ఈ వజ్రం శివుడే అలకరించుకున్న ఆభరణం, దాన్ని మన దగ్గర పెట్టుకోవడం ప్రమాదం. అందుకే దాన్ని ఆయనకు ఇచ్చే రోజే తీద్దాం" అన్నాడు విశాల్.

అమావాస్య రానే వచ్చింది, విశాల్ మూర్తి చేతిలో ఒక సాంబ్రాణి పిడత, ఒక నల్లరాయి పట్టుకుని, పోర్టల్ ఆన్ చేసారు. సాంబ్రాణి బాగా వేసి మంచి పొగ వచ్చేలా నిప్పులు పేర్చారు. దట్టమైన సాంబ్రాణి పొగ వస్తుంది. మ్యూజియంకి చేరిన వెంటనే ఎదురుగా రుద్రక్ష వజ్రం కనిపించింది. మూర్తి చేతిలో ఉన్న సాంబ్రాణి పొగ ఇంకా ఎక్కువ చేసాడు. ఆ గదిలో ఏమి కనిపించడం లేదు, విశాల్ చేతిలో ఉన్న నల్ల రాయితో గాజు బాక్స్ ని బద్దలు గొట్టి, ఆ రాయి వజ్రం బదులు పెట్టి, రక్షక భటులు వచ్చేలోగా విజయవంతంగా తప్పుకున్నారు. సీసీటీవీలో లీలగా ఉన్న ఆకారాలు తప్ప, ఆ పొగలో ఎవరు కనపడలేదు.

ఆ మరునాడు మ్యూజియంలో దెయ్యాలున్నాయా అన్న ప్రకటనలు అమెరికా అంతా Ghosts in the museum అని వెలువడ్డాయి.

ఇద్దరూ వజ్రంతో విశాల్ బండి మీద దేగల దీవికి బయలుదేరారు.

***

# PART 65

విశాల్ స్కూటర్ దూసుకెళుతుంది.

'ఈరోజే.. మరలా అమావాస్య! మూర్తికి ఏమవుతుందో ఏమో! ప్రేమించిన ప్రేయసి దూరమైపోయింది, కనీసం నెయ్యము నేర్పిన నేస్తాన్ని అయినా కాపాడుకోలేనా!' అని ఆలోచిస్తున్నాడు విశాల్.

"ఏంటి, మరలా వినీష ఊహల్లోకి వెళ్ళావా?" అడిగాడు మూర్తి.

"కొత్తగా వెళ్ళడానికి ఏముందిరా కంటికి చూపులా, చెవులకు శబ్దంలా, నోటికి మాటలా.. నా హృది శబ్ధంలో ఒక తరంగం నా వినీ" అన్నాడు విశాల్.

"అంతగా ప్రేమించినవాడివి లేవదీసుకెళ్ళాల్సింది" అన్నాడు మూర్తి.

"దానికి ఆస్కారం ఉన్నా, అమ్మానాన్న నేర్పిన సంస్కారం మా ఇద్దరికీ అడ్డు వస్తుంది. అందుకే ఆ దేవుడికి నమస్కారం పెట్టి ఎదురు చూస్తున్నాం. అయినా హాయిగా డిగ్రీ కంప్లీట్ చేసి ఒక ఉద్యోగం చూసుకుని సెటిల్ అవ్వకుండా, టైమ్ మెషిన్ వెనుకబడి ఇన్ని బాధలు తెచ్చుకున్నాం" అన్నాడు విశాల్.

"రాసి ఉన్నది జరుగక మానదు. అంతా లలాట లిఖితం" అన్నాడు మూర్తి.

ఇద్దరు అడవిలోకి చేరుకునే సరికి రాత్రి అయ్యింది. అక్కడికి వెళ్ళేసరికి నాయక ఎదురు చూస్తున్నాడు.

"రా దేవా! నీ కోసం కాసుకొని ఉన్నా" అన్నాడు నాయక.

కాసేపు విశ్రాంతి తీసుకుని ఒక చేత్తో వజ్రం రెండో చేత్తో హరాళి ఆభరణం పట్టుకుని మొదటి జాముకి దేగల దీవి చేరుకున్నారు.

అప్పటికే హరాళి దేగల దీవి చేరుకుంది.

వజ్రాలు జల్లి కూర్చుని ఎదురుచూస్తుంది.

విశాల్ ని చూడగానే పలకరింపుగా నవ్వింది.

"తల్లి, ఇదిగో నువ్వు అడిగిన రుద్రాక్ష వజ్రం" అని ఇచ్చాడు. అది చూడగానే హరాళి ఉబ్బితబ్బిబ్బు అయ్యింది. అందరూ లోపలికి వెళ్ళి గుడి అంతా అలంకారాలు చేసారు. పుట్ట తేనె టెంకాయ నీరు, మంచి తీర్థం, చెరుకు రసం, విభూది తీసుకు వచ్చి పశుపతి నాథునికి అభిషేకం చేశారు. గంటా నాథంతో దేగల దీవి అపర కైలాసం అయిపోయింది. శివ పంచాక్షారి జపిస్తూ 108 రుద్రాక్ష వజ్రాలతో హరాళి లింగానికి పూజ చేసింది.

విశాల్, మూర్తితో పాటు వచ్చిన మరుగుజ్జులు అందరూ ధ్యానం చేస్తున్నారు. అందరూ హరాళికి కళ్ళు రావాలని కోరుకున్నారు.

ఎక్కడి నుండో ఒక శంఖా నాదం, వజ్రలింగం భూమి మీద సూర్యుడిలా ప్రకాశించింది. హరాళికి రెండు నేత్రాలు తిరిగి వచ్చాయి. దేగల దీవిలో అన్ని చెట్లు మరల పచ్చగా మారిపోయాయి, పేరుకి అమావాస్య అయినా.. పశుపతి నాథుని వల్ల పౌర్ణమి కన్నా ఎక్కువ వెలుగుతో, దీవి అంతా సుగంధంతో నిండిపోయింది.

అందరి హర్షధ్వానాలతో దీవి మారుమోగింది. పూజ ముగిశాక, అందరూ గుడి ఆవరణలో ఆశీనులయ్యారు.

హరాళి.. నాయక వద్దకు వచ్చి, "నన్ను క్షమించు నాయక. విచక్షణ కోల్పోయి, ఎన్నో ఏళ్ళు నిన్ను నీ కుటుంబాన్ని విడదీసాను. అకారణంగా నీ జాతి ప్రజలను చంపాను" అంది.

"అంతా ఆ పరమేశ్వర ఇచ్ఛ తల్లి" అని "తల్లి ఇదిగో మీ తేజో ద్వీపం దీనికి తస్కరించినందుకు గాను నేను మిక్కిలి క్షంతవ్యుణ్ణి" అన్నాడు నాయక.

"ఇది నా బహుమానంగా నీ వద్దే ఉంచుకో, లోక కళ్యాణార్థం దీనిని ఉపయోగించు" అంది హరాళి.

"మూర్తి వద్దకు వచ్చి నాకోసం నీవు ఎంతో కష్టపడ్డావు. నా కథ ఉన్నంత కాలం విశాల్ పేరూ, నీ పేరు ఉండిపోతాయి. నీకు ఏమి కావాలో కోరుకో" అంది.

"నిజమా తల్లి! నాకు ఏది అడిగినా ఇస్తావా? అయితే మా వాడి వివాహం కోరుకున్న వినీషతో జరిగేలా చూడు" అన్నాడు మూర్తి.

"నీ కోసం కాకుండా నీ స్నేహితుడి కోసం కోరుతున్నావు. మానవులు మహనీయులు అనడానికి మీ స్నేహం ఒక దర్పణం. మీ జాతి మీద ఉన్న మా దురభిప్రాయాన్ని సదభిప్రాయంగా మార్చేశారు కానీ, మనిషి యొక్క జననం, వివాహం, మరణం ఇవి కర్మ ఫలాలు. అవి ఎవ్వరూ మార్చలేరు. కేవలం ఆ పరమేశ్వరుడు తప్ప! ఇంకేదైనా కోరుకో" అంది హరాళి.

"మా ఇద్దరికీ అంతులేని ఐశ్వర్యం ఇవ్వమ్మా!" అన్నాడు మూర్తి.

"తథాస్తు.." అంది.

వహీద్ విసిరిన వజ్రాల సంచి మూర్తి కాళ్ళ దగ్గర ప్రత్యక్షమైంది. వీటి విలువ మీ కలియుగంలో ఉన్న ప్రపంచ రాజ్యాలు అన్నీ కలిసినా విలువ కట్టలేవు" అని,

విశాల్ వైపు చూసి, "నీకు ఏమి కావాలి?" అని అడిగింది హరాళి.

"నావి మూడు కోరికలు" అన్నాడు విశాల్.

"మొదటిది ఈ ద్వీపాన్ని తిరిగి అంగుష్టులకు ఇచ్చి వేయాలి. వారు తప్ప ఇందులో వేరే ఎవరూ వారి అనుమతి లేకుండా ప్రవేశించకూడదు" అన్నాడు విశాల్.

"నాలాంటి వారి నుండి రక్షించమని నన్నే అడుగుతున్నావు" అని నవ్వి,

"అయినా ఏ యుగం వారు నాయనా మీరు? ఈ నిస్వార్ధ కోరికలు ఏమిటి?" అంది హరాళి.

విశాల్ మాట్లాడలేదు.

"మిగిలిన రెండు కోరికలు ఏంటి?" అంది హరాళి.

తెల్లవారింది, ఈలోపు భువరలోకం నుండి పుష్పక విమానం దిగి వచ్చింది.

"నాకు అవసరం వచ్చినప్పుడు ఆ కోరికలు అడుగుతాను తల్లి" అన్నాడు విశాల్.

"తథాస్తు" అంది.

హరాళికి ఘనమైన ఆహ్వానం పలికారు యక్షులు. పుష్పక విమానం ఎక్కుతూ ఉండగా యక్షులు నీవు ధరించిన ఆభరణాలలో ఏదో ఒకటి మానవులు ధరించారు. వాటితో నీకు యక్షలోక ప్రవేశం నిషిద్ధం అన్నారు.

విశాల్ వెంటనే పరిగెత్తాడు.

"తల్లి తప్పు అయ్యింది. అది తెలియక మేము ధరించిన మాట వాస్తవం. అది నీకు చెప్పటం మరిచాను" అన్నాడు విశాల్.

"తెలియక చేసినా, తెలిసి చేసినా తప్పు తప్పే కనుక ధరించిన వాడి ప్రాణాలు తీసివేయడమే" అన్నాడు యక్షుడు.

హరాళి కల్పించుకుని, "ఈ విషయంలో మనం సముచిత నిర్ణయం తీసుకోవాల్సిన అవసరం ఉంది. వారు నా ప్రాణాలు కాపాడిన మిత్రులు. వీరికి యక్షకులకు ఉన్న శిక్షే అమలు పర్చండి" అంది.

"అటులైన ధరించినందుకు, అది దాచినందుకు భువరలోకంలో ఒక వర్షం రాజా ప్రసాదంనందు పనిచేయవలె" అన్నాడు యక్షుడు.

"నాకు సమ్మతమే" అన్నాడు మూర్తి.

"ఒరేయ్ నోరుముయ్యి. అందులో నీ తప్పు ఏముంది? నేను కదా తెచ్చింది, ఆ శిక్ష నాకు" అన్నాడు విశాల్.

"అదేమీ కుదరదు" అంటున్నాడు మూర్తి.

విశాల్.. హరాళి వంక తిరిగి, "నా రెండో కోరిక మూర్తిని నిర్దోషిగా విడిచి పెట్టి ఆ శిక్ష నాకు వెయ్యండి" అన్నాడు.

"ఒరేయ్.." అని అరిచాడు మూర్తి.

"ఆలోచించే అడుగుతున్నావా?" అడిగింది హరాళి.

"హా!" అన్నాడు విశాల్.

"తథాస్తు" అంది హరాళి.

"ఏంటిరా ఈ మూర్ఖత్వం? నేను చేసిన తప్పుకి నీకు శిక్ష ఏంటి"అన్నాడు మూర్తి.

"ఎంత సేపు రా! ఒక్క వర్షం అంతే కదా!" అన్నాడు విశాల్.

అది విన్న యక్షుడు, "భూలోకంలో ఒక వర్షం అంటే సంవత్సరం, భువరలోకంలో ఒకే రోజు అంతే! మా సంవత్సరం మీకు 364 సంవత్సరాలు.

అది విని అందరు అవాక్కయిపోయారు, విశాల్ కూడా!

***

# PART 66

"అంటే నేను 364 సంవత్సరాలు బతికి ఉండాలా?" అన్నాడు విశాల్.

"లేదు, మా భువర్లోకం ప్రకారం అవి 364 రోజులు మాత్రమే" అన్నాడు యక్షుడు.

"మరి మా ఆయుష్షు వంద సంవత్సరాలు మాత్రమే కదా!" అన్నాడు విశాల్.

"అది భూలోకంలో. భువర్లోకంలో ఉంటే అది మానవులకైనా మాకైనా ఒకటే" అన్నాడు యక్షుడు.

మూర్తి మౌనంగా వింటున్నాడు.

"మీరు విధించిన ఎటువంటి శిక్ష అయినా నాకు సమ్మతమే కానీ, నాకు కొన్ని రోజులు గడువు కావాలి. నేను పూర్తి చేయవల్సిన పనులు కొన్ని ఉన్నాయి" అన్నాడు విశాల్.

"అలాగే కుమారా! వచ్చే అమావాస్య వరకు నీకు గడువు ఇస్తున్నాను. అప్పటి వరకు కార్యములు ముగించుకుని ఇక్కడికి రాగలవు" అని చెప్పి వెనుతిరిగింది హరాళి.

"అమ్మ.. ఒక్క మాట" అన్నాడు విశాల్.

ఏమిటన్నట్లు చూసింది హరాళి.

"నా మూడో కోరిక.." అని మెల్లగా ఏదో చెప్పాడు విశాల్.

"విచిత్రంగా ఉంది నాయనా! అయినా తథాస్తు" అంది హరాళి.

పుష్పక విమానం ఎక్కిన తరువాత, "వ్యక్తిత్వంలో మీరు ఏ దేవతలకు తీసిపోరు, అందుకేనేమో.. ఆ మహావిష్ణువు కూడా నీవు చెప్పినట్టు మీలోనే దశావతారాలు పొందాడు" అని అంది హరాళి.

చూస్తూ చూస్తూ ఉండగానే పుష్పక విమానం ఎగిరి వెళ్ళిపోయింది.

విశాల్.. మూర్తి వంక చూసాడు.

మౌనంగా ఉన్న మూర్తిని చూసి, "ఎందుకురా అలా ఉన్నావ్? మనం ఇప్పుడు కోటీశ్వరులం" అన్నాడు విశాల్.

మూర్తి గట్టిగా విశాల్ చెంప మీద కొట్టాడు.

మరుగుజ్జులు అందరూ ఒకేసారి మూర్తి పైకి దూసుకొచ్చారు.

'ఆగండి' అన్నట్లు సైగ చేసాడు విశాల్.

మూర్తి కొడుతూనే ఉన్నాడు. విశాల్ దెబ్బలు తింటున్నాడు కానీ.. ఒక్క మాట మాట్లాడలేదు, తిరిగి చెయ్యి ఎత్తలేదు. కొట్టి కొట్టి మూర్తి.. గుక్క పెట్టి చిన్న పిల్ల వాడిలా ఏడుస్తున్నాడు. మరుగుజ్జులకు అర్థం కావడం లేదు. నాయకను అడిగారు.

"దానినే స్నేహం అంటారు" అన్నాడు కళ్ళు తుడుచుకుంటూ నాయక.

విశాల్ గొంతు బొంగురు పోతుండగా, "ఒరేయ్ ఏడవకురా! నాకు ఏడుపు వస్తుంది కానీ, ఎన్ని విషయలా కోసం ఏడవను?" అన్నాడు.

"నువ్వేమైనా హీరోవి అనుకుంటున్నావా లేక శిబి చక్రవర్తివా? నా తప్పులుకి నీవెలా బాధ్యుడివిరా!? ధనంలో జమిందారుని చేసి, స్నేహానికి బిచ్చగాడిని చేసేస్తావా? నా నుంచి దూరమయ్యే అధికారం నీకు ఎవరిచ్చారు?" తిడుతున్నట్టు అడుగుతున్నాడు మూర్తి.

"నన్ను క్షమించ రా" అన్నాడు విశాల్.

"క్షమించడానికి నేను ఎవర్ని? క్షమించబడడానికి నువ్వెవరు? ఏదో బడిలో కలిసాం, స్నేహం అన్నావు, నిన్ను వదిలి ఒక్క రోజు కూడా ఉండలేని స్థితికి తెచ్చావ్. ఇప్పుడు వెళ్తా అంటున్నవ్, పోరా కలలో కలిశావ్ అనుకుంటాను" ఏడుస్తున్న గొంతుతో మూర్తి తిడుతుంటే విశాల్ కి కూడా చాలా బాధ వేస్తుంది.

"ఒరేయ్, నన్ను ఈ ప్రపంచంలో ఎవరు అర్థం చేసుకోపోయిన పర్లేదు కానీ, నువ్వు కూడా ఇలా మాట్లాడితే ఎలా రా? మనసు కోరుకున్నది ఎలాగూ దక్కలేదు, నాకంటూ మిగిలిన మనసైన మనుషుల్ని ఎలా కోల్పోను" అన్నాడు విశాల్.

"నా గురించి వదిలేయ్, నీ మీద కోటి ఆశలు పెట్టుకున్న అమ్మ, రిటైర్మెంట్ కి దగ్గరగా ఉన్న నాన్న.. నీకోసం అహర్నిశలు ఎదురు చూసే చెల్లి ఏమైపోతారో ఆలోచించావా?" అన్నాడు మూర్తి.

"హా ఆలోచించారా, ఆ ఆలోచనకి రూపమే హరాళితో నా మూడో కోరిక" అన్నాడు విశాల్.

"ఏం కోరుకున్నావ్!?" అన్నాడు మూర్తి.

"చెపుతా పద" అన్నాడు విశాల్.

అందరు కలిసి, తిరిగి వనానికి చేరుకున్నారు. వజ్రాల మూటలో ఒక వజ్రం తీసుకెళ్ళి పూజారికి ఇచ్చాడు విశాల్.

"సర్వ పరిత్యాగం చేసిన నాలాంటి వాడికి ఎందుకు ఈ వజ్రాలు?" అన్నాడు పూజారి.

"దీనితో గుడిని బాగు చేయించండి. ఇక్కడికి వచ్చిన వారికి వసతి కల్పించి, ఆహారం ఏర్పాటు చెయ్యండి. పశుపతినాథ స్వామికి ఘనమైన పూజలు చెయ్యండి" అన్నాడు విశాల్.

అది స్వీకరించి, "విజయోస్తు" అని దీవించాడు పూజారి.

ఇద్దరు కలిసి స్కూటర్ పైన తిరిగి బయలుదేరారు. ముందు వజ్రాల బస్తా ఉంది.

"వీటిని ఎలా దాయాలి రా?" అన్నాడు విశాల్.

"మా బావ స్నేహితుడు రామస్వామిగారు వజ్రాల వ్యాపారి. ఆయన వేరు వేరు దేశాల నుండి విలువైన వజ్రాలు తీసుకు వచ్చి ఇక్కడ సంపన్నుల కుటుంబాలకు అమ్ముతూ ఉంటాడు. మన ఒకొక్క వజ్రాన్ని చిన్న చిన్న ముక్కలుగా చేసి ఆయన ద్వారా అమ్మవచ్చు" అన్నాడు మూర్తి.

ఆ రోజు అంతా ప్రయాణించి టౌన్ చేరుకున్నారు. విశాల్ ఇంటికి చేరుకుని చాల సేపు నిద్రపోయారు.

పడుకున్న కొడుకుని చూసి, 'ఎంత అలిసిపోయాడో, ఎన్ని సార్లు చెప్పినా ఈ తిరుగుడు మానడు కదా!' అనుకున్నది అనంత.

"అమ్మ, నాన్న నాకు అమెరికాలో ఉద్యోగం వచ్చింది. నెలకి లక్ష జీతం, తొందరగా స్వప్నకి పెళ్ళి చేసి నెల రోజులలో వెళ్ళాలి" అన్నాడు విశాల్.

అందరూ ఆశ్చర్య పోయారు. విశాల్ ఆడుతున్న అబద్ధాలకి మూర్తి మౌన సాక్షిగా మిగిలాడు.

"అవును రేపు అడ్వాన్స్ గా డబ్బులు పంపుతామని చెప్పారు మా ఆఫీస్ లో" అంటూ, "నాన్నగారు ఆ పెళ్ళిళ్ళ పేరయ్యకు కబురు పెట్టండి" అంటూ బయటకి నడిచాడు.

వినీష ఇంటి వైపు వెళ్ళారు. ఇల్లు తాళం పెట్టి ఉంది.

మూర్తి.. కన్నారావు ఇంటి తలుపు కొట్టాడు. ఎవరో ఆడమనిషి తలుపు తెరిచింది.

"శ్యామ్ సుందర్ గారు ఇల్లు తాళం పెట్టి ఉంది ఏంటి!?" అని అడిగాడు.

"వాళ్ళు ఇల్లు ఖాళీ చేసారు" అంది ఆ మనిషి.

"ఎక్కడికి వెళ్ళారో తెలుసా!" అడిగాడు మూర్తి.

"వాళ్ళ సొంత ఊరు వెళ్ళారు కూతురి పెళ్ళి కదా!" అంది ఆమె.

"ఎప్పుడు!" అన్నాడు మూర్తి.

"ఏమో నాకు సరిగ్గా తెలియదు. ఆ లేచిపోయి మరలా తిరిగి వచ్చిన పిల్ల పెళ్ళి అని తెలుసు" అంది.

ఆ మాట విని పరుగు పరుగున వచ్చాడు విశాల్. ఆమె ముఖంలోకి తదేకంగా చూస్తూ, ఏదో గొణిగాడు. ఒక్క క్షణం శిలలా అయిపోయి తిరిగి స్పృహలోకి వచ్చింది.

"లేచిపోయిన పిల్ల ఎవరు పిన్నిగారు?" అని అడిగాడు విశాల్.

"ఎవరు లేచిపోయారు, పిల్ల ఎవరు?" అడిగింది ఆ ఆడ మనిషి.

మూర్తి కళ్ళు వదిలిపెట్టి చూస్తున్నాడు.

"అదే పిన్నిగారు, శ్యామ్ సుందర్ గారి పెద్దమ్మాయి వినీష" అన్నాడు విశాల్.

"నీ నోరు పడిపోను. బంగారంలాంటి పిల్ల లేనిపోని నిందలు వేయకండి పొండి ఇక్కడ నుండి" అంది పిన్నిగారు.

చిన్నగా ఈల వేస్తూ బయటకి వచ్చాడు విశాల్.

"ఇదేలా సాధ్యం రా" అన్నాడు మూర్తి.

"ఇదే నేను కోరుకున్న మూడవ కోరిక!" అన్నాడు విశాల్.

"ఏంటో చెప్పు" అడిగాడు మూర్తి.

***

# PART 67

"నేను కోరుకున్న మూడో కోరిక విచిత్రమైనదిరా! దీని వల్ల నేను ఎవరైనా తమ గతాన్ని కొంత వరకు గాని, పూర్తిగా కానీ మర్చిపోయేలా చేయగలను. దాన్ని ప్రయోగించడం వల్లే ఆవిడ వినీష మీద తనకి ముందు అభిప్రాయాన్ని గుర్తు పెట్టుకుంది" అన్నాడు విశాల్.

"ఏమోరా! నువ్వెంటో, నీ చేష్టలు ఏంటో ఆ భగవంతుడికి తెలియాలి. వినీషకి పెళ్ళి అని తెలిసినా నీలో చలనం లేదు. ఏంటి సంగతి?" అన్నాడు మూర్తి.

"వినీషతో పెళ్ళి నాకు రాసిపెట్టి లేదని హరాళి చెప్పకనే చెప్పింది. ఇప్పుడు నేనున్న పరిస్థితిలో.. ఆ ఊహ కూడా తప్పు. ఎక్కడ ఉన్నా, ఎలా ఉన్నా నా వినీష నవ్వుతూ ఉండాలి, నగుమోముతో ఉండాలి. ఈ జన్మ కాకపోతే వచ్చే జన్మలో అయినా నాకోసం ఆమె పుడుతుంది" కొంచెం బొంగురుపోయిన గొంతుతో అన్నాడు విశాల్.

మూర్తి అదిమి పట్టుకున్నాడు.

"మొదటి నుండి నా భయం ఇదేరా, వెన్నపూస మనసున్న నువ్వు. బయటకి రాయిలా కనిపించినా, కరిగిపోయే కారుణ్యం. ఇది జగమెరగని సత్యం" అని మూర్తి కొంచెం ఉద్రేకంగా అన్నాడు.

"మాటలు తప్ప మనం ఏమి చేయగలం రా?" అన్నాడు విశాల్.

"ఇంక వినీషని కలవాలి అని లేదా? అయినా ఆమె నిజంగా ప్రేమిస్తే ఇలా చెయ్యగలదా?" అన్నాడు మూర్తి.

"నేను వినీష స్థానంలో ఉన్నా అదే చేస్తాను. కుటుంబం, విలువలు, ప్రేమలు, ఆప్యాయతలు ఇవన్నీ తెలిసిన మనుషులు ఇదే చేస్తారు. ఆమె ఎంత బాధ అనుభవిస్తుందో నాకు మాత్రమే తెలుసు" అన్నాడు విశాల్.

***

స్వప్న పెళ్ళి అనుకున్న వాడితోనే కుదిరింది. కట్నంగా వాళ్ళు అడిగినవన్నీ సమకూర్చాడు విశాల్. పెళ్ళి శుభలేఖలు వచ్చాయి.

మూర్తి, విశాల్ వాటిని పంచడం కోసం చుట్టుపక్కల గ్రామాల్లో ఉన్న తమ బంధువులు, స్నేహితులు ఇంటికి రోజూ తిరుగుతున్నారు. ఇద్దరిలో ఇంతకుముందు ఉన్న సంతోషం లేదు. ఏదో యాంత్రికంగా పనులు జరుగుతున్నాయి.

కష్టపడి వినీష అడ్రెస్ పట్టుకుని శుభలేఖ పంపించాడు. అందులో తన అడ్రెస్స్ పంపించాడు.

పెళ్ళి ఒక రోజు ఉందనగా వినీష నుండి ఒక ఉత్తరం వచ్చింది.

"స్వప్న పెళ్ళి విషయం విని చాలా సంతోషించాను, ఎంతైనా నేను కోల్పోయిన ఆడపడుచు కదా! ఆ పెళ్ళిలో నువ్వు హీరోలా మెరిసిపోతూ ఉంటావని కూడా తెలుసు, అది చూడడానికి నేను మాత్రం ఉండలేను. జీవితం పెట్టిన పరీక్షలో నేను ఓడిపోయాను విశాల్. తెలియని ప్రశ్నలకు సమాధానం ఇవ్వలేక, అన్నిటికి నీ పేరే సమాధానం అని తెలిసినా.. నోరు తెరిచి చెప్పలేని పరిస్థితి. మనసు లేని ఒక మట్టిబొమ్మ, ఇష్టం లేని బొమ్మల కొలువులో ఇంకో బొమ్మతో ఉన్నట్లే. నువ్వైనా ఇంత మంచివాడిలా కాకుండా, కాస్త ఆరాచకవాదివై ఉంటే బాగుండేదేమో! నిన్ను తిట్టాలని ఉంది, కొట్టాలని ఉంది, కనీసం నిన్ను చూడాలని ఉంది కానీ.. ఏమి చెయ్యను? ఇప్పుడు నేనొక పంజరంలో రామ చిలుకను. నా రూపేగాని, నా మనసు ఎవరు చూస్తారు. చచ్చిపోవాలని చాలాసార్లు అనిపించింది కానీ, నువ్వు మిగిల్చిన జ్ఞాపకాలు ఇంకా ఏడు జన్మలు వరకు మరచిపోలేని పరిస్థితి. నిన్ను వదిలి వెళ్ళడానికి మనసు ఒప్పదు, కలిసి బ్రతకడానికి బ్రతుకు ఒప్పదు. మొత్తానికి ఈ జీవితం నువ్వు లేని ఒక శూన్యం. నువ్వు ఎక్కడ ఉన్నా, ఎలా ఉన్నా హాయిగా ఉండు. ఎల్లప్పుడూ నిన్నే ధ్యానం చేసే ఒక పిచ్చిది, నీ (నీది కాని) వినీ."

స్వప్నని పెళ్ళి కూతురు చేస్తున్న రోజు వచ్చిన ఉత్తరం వందసార్లకు పైగా చదివి, ప్రతి అక్షరంలోను వినీషని స్పృశిస్తున్నాడు విశాల్.

"ఒరేయ్ ఇంత ఏడుస్తూ బంధువులని ఎలా చూసుకుంటావ్? చుట్టాలని ఎలా పలకరిస్తావ్?" అన్నాడు మూర్తి.

మొట్ట మొదటిసారిగా వినీష లేని వెలితి విశాల్ ని తినేస్తోంది.

స్వప్న పెళ్ళి అంగరంగ వైభవంగా జరిగింది. అప్పగింతలు అయ్యాయి. అమ్మ నాన్న ఏడుస్తున్నారు.

విశాల్ వెళ్ళి “బహుశా వీళ్ళ ఇద్దరికి రేపటి నుండి పని మనిషి ఉండదని బెంగ ఏమో!” అని నవ్వుతూ అన్నాడు.

“నిన్నూ..” అంటూ మీదకి వచ్చి కౌగలించుకుని ఏడుస్తున్న స్వప్నని ఓదారుస్తూ,

“ఎందుకురా ఏడుస్తున్నావ్? నీకోసం అమ్మా, నాన్న అందరూ ఎప్పుడూ ఉన్నారు. ఒకరోజు అక్కడ, ఒక రోజు ఇక్కడా ఉండు” అన్నాడు విశాల్.

“అంటే, నువ్వు లేవా?” అంది స్వప్న.

“నేను అమెరికాలో కదరా ఉండేది. అందుకని అలా అన్నాను” అని అబద్ధం చెప్పాడు విశాల్.

“నువ్వు లాయర్ అయ్యి ఉంటే బాగుగా ఉండేది రా, అబద్ధాలకు కేర్ ఆఫ్ అడ్రెస్ లా ఉన్నావ్” అన్నాడు మూర్తి.

ఒక జీవం లేని నవ్వు నవ్వాడు విశాల్.

ఆ మరునాడు అందరూ వెళ్ళిపోయారు. అమావాస్య ఇంకా వారం రోజులు ఉంది.

“ఇల్లంతా బోసిపోయింది. అది ఉండగా తెలియలేదు గాని సందడి అంతా స్వప్నదే” అన్నాడు విశాల్.

“అవునురా, పౌర్ణమి విలువ అమావాస్య రోజు గాని తెలియదు. అది ఈ ఇంటి చందమామ, మన గడప మీద దీపం రా” అంది అనంత.

అమావాస్య ఇంకా రెండు రోజులు ఉందనగా, వినీష సొంత ఊరుకి బయలుదేరాడు విశాల్.

“నేనూ వస్తాను” అన్నాడు మూర్తి.

“వెళ్ళేది తెంపడానికి, అతికించడానికి కాదురా. నేను వెళ్ళి వస్తా” అన్నాడు విశాల్.

***

# PART 68

వినీష ఊర్లో బస్ దిగిన విశాల్ కి, ఆమె అడ్రెస్ కనుక్కోవడం పెద్ద కష్టం కాలేదు. రిక్షా వాడికి చెపితే తీసుకెళ్ళి దింపాడు. బయట వసారా ఉన్న ఒక పెద్ద పెంకుటిల్లు. తలుపు తట్టాడు, ఎవరూ తెరవలేదు. గట్టిగా పిలిచాడు.

లోపల నించి "ఎవరూ!" అని వచ్చింది వసుంధర.

విశాల్ ని చూసి, "నీ బెడద పోతుందని ఇక్కడిదాకా వచ్చాము. ఇక్కడికి దాపరించావా?" అని కోప్పడింది.

ఆమె అరుపులు విని వినీష బయటకి వచ్చింది. విశాల్ ని చూసి అవాక్కయ్యింది. వెళ్ళిపొమ్మని వెనుక నుండి సైగ చేసింది.

నువ్వు ఆగు అన్నట్టు చెయ్యి చూపించాడు విశాల్.

వసుంధర కళ్ళలోకి కళ్ళు పెట్టి చూసి, "నేను మీకు తెలుసా?" అని అడిగాడు.

వసుంధర కళ్ళు వదిలి విశాల్ కళ్ళలోకి చూసింది.

వినీష అయోమయంగా చూస్తుంది. ఏమి జరుగుతుందో అర్థం కావడం లేదు.

"నేను మీకు తెలుసా?" అని మళ్ళీ అడిగాడు విశాల్.

"ఎవరు నాయనా నువ్వు? ఎప్పుడూ చూసిన గుర్తులేదు" అంది వసుంధర.

"నేను వినీష క్లాస్ మేట్ అమ్మా, ఏదో పని మీద ఈ ఊరు వచ్చాను. తాను ఇక్కడే ఉందని తెలిసి, చూసి వెళదాం అని వచ్చాను" అన్నాడు విశాల్.

వసుంధర పలకరింపుగా నవ్వి, "చాలా సంతోషం, రా నాయనా. ఏం పేరో!" అంది.

"నన్ను విశాల్ అంటారు అమ్మా" అన్నాడు.

"మంచి పేరు, ఎక్కడో విన్నట్టు ఉంది. ఉండు వినీషని పిలుస్తా" అని వెనుతిరిగింది.

వెనుక ఉన్న వినీషని చూసి అదిగో "నీ క్లాస్మేట్ అంట, ఎండలో వచ్చాడు కొంచెం మంచి తీర్థం తెస్తా" అని లోపలకి వెళ్ళింది వసుంధర.

వినీష చేష్టలుడిగి నిలబడింది.

"ఏంటి ఇది? కలా? నిజమా?" అంది.

"ఒక అబద్ధం లాంటి నిజం" అన్నాడు విశాల్.

"అలా ఎలా?" అంది వినీష.

"చెపుతాలే నా చెవుల పిల్లి, ఇంతకీ ఎలా ఉన్నావు? నీ ఉత్తరం చూసి ఉండలేక వచ్చేసాను" అన్నాడు విశాల్.

"తొందరగా వెళ్ళిపో విశాల్. నాన్న వచ్చే టైమ్ అయ్యింది, చూస్తే తంటా" అంది వినీష.

"ఏమి పర్లేదు, నేను చూసుకుంటా" అన్నాడు విశాల్.

వసుంధర నీళ్ళ గ్లాస్ తీసుకుని వచ్చింది. "కాస్త మంచి తీర్థం తీసుకో నాయనా, ఎండనపడి వచ్చావు. వంట అయిపోవచ్చింది, మీరు మాట్లాడుతూ ఉండండి. ఈలోపు వినీష వాళ్ళ నాన్నగారు కూడా వస్తారు, కాస్త ఎంగిలిపడి వెలుదురు గాని" అంది.

"అబ్బే వద్దమ్మా, నేను బయట హోటల్ లో ఎక్కడైనా చేస్తాను" అన్నాడు విశాల్.

"భలేవాడివి, ఈ పల్లెటూర్లో ఏముంటాయి? అయినా మధ్యాహ్నం అన్నం వద్దు అనకూడదు" అని మందలించింది వసుంధర.

"ఏమే నీవన్న చెప్పు" అంది వినీషని ఉద్దేశించి.

"హా అదే చెపుతున్న, ఈలోపు నువ్వు వచ్చావ్" అంది వినీష.

"నాన్నగారు, చెల్లెలిద్దరూ బాబాయి ఇంట్లో ఉన్నారు. వెళ్ళి తీసుకురా" అంది వసుంధర.

"హా అలాగే" అని ముసిముసిగా నవ్వుకుంటూ బయటకి నడిచింది వినీష.

"నీకు తెలుసో..! లేదో..! వినీషకి పెళ్ళి కుదిరింది. వచ్చే నెల ఇక్కడే, చెప్పిందా?" అంది వసుంధర.

గొడ్డలితో చెయ్యి నరికి, నొప్పి ఉందా..! అని అడిగినట్లు అనిపించింది విశాల్ కి.

"హా చెప్పిందమ్మా" అన్నాడు.

"ఇలా రా" అంటూ పెరట్లోకి తీసికెళ్ళింది వసుంధర.

గోడ వెనుక పెద్ద స్థలం ఉంది.

"ఇదిగో ఇక్కడే పెద్ద పందిరి వేయిస్తాం, దాదాపు ఐదు ఆరు వందలకు పైగా మందికి సరిపడా ఉంటుంది. వినీష వాళ్ళ నాన్నగారికి ఇక్కడ మంచి పలుకుబడి ఉంది" అని చెపుతోంది వసుంధర.

విశాల్ మనసు ఏడుస్తోంది. నేత్రాలు నిర్లిప్తంగా ఉన్నాయి.

"చాలా సంతోషం" అన్నాడు విశాల్.

"ఉత్తి సంతోషం అంటే కుదరదు, మీ స్నేహితులను అందరిని తీసుకుని నువ్వు తప్పకుండా రావాలి" అంది వసుంధర.

"నాకు రావాలని ఉందమ్మా కానీ, అమెరికా వెళ్ళిపోతున్నాను. అక్కడ ఉద్యోగం వచ్చింది. అయినా వినీష పెళ్ళికి ముక్కోటి దేవతలు వస్తారు, అంత మంచి మనిషి వినీష" అన్నాడు విశాల్.

అప్పటికే కదిపితే కన్నీళ్ళు వచ్చేస్తాయి అన్నట్టు ఉంది విశాల్ పరిస్థితి.

"నీ మాటలు వింటూ ఉంటే.. ఎంతో కాలంగా తెలిసిన మనిషిలా అనిపిస్తుంది" అంది వసుంధర.

ఈలోపు శ్యామ్ సుందర్ తన కూతుళ్ళతో లోనికి వచ్చాడు. విశాల్ ని చూడగానే, ముఖ కవళికలు మారాయి.

శ్యామ్ కళ్ళలోకి చూస్తూ, "నమస్కారం సర్" అన్నాడు విశాల్.

"మీరు..?" అన్నాడు శ్యామ్.

"ఇతను విశాల్ అని మన వినీష క్లాస్మేట్ అట" అంది వసుంధర.

వినీషకి గుండె గొంతులోకి వచ్చేసింది.

"అలాగా! ఎక్కడో చూసినట్టు ఉంది" అన్నాడు శ్యామ్.

ఆ మాటతో వినీష కుదుటపడింది.

అందరూ కలిసి భోజనం చేసారు. శ్యామ్ కి, వసుంధరకి కాళ్ళకి నమస్కారం చేసి బయలుదేరాడు విశాల్.

"నాన్నా.. నేను తనని బస్ ఎక్కించి వస్తాను" అని విశాల్ కూడా బయలుదేరింది వినీష.

"ఇప్పుడు చెప్పు, అలా ఎలా?" అని అడిగింది వినీష.

విశాల్ తన వరం గురించి చెప్పాడు.

"అంటే దీని అర్థం, మన కథలో ఉన్న నీకు.. నాకు తెలిసిన వ్యక్తులందరూ నన్ను మర్చిపోతారు. నన్ను చూసినా ఏది జ్ఞప్తికి రాదు" అన్నాడు విశాల్.

"అబ్బా! వినడానికి చాలా చాలా బాగుంది. మరి ఇది ఉపయోగించి మనం పెళ్ళి చేసుకోలేమా!?" ఆశగా అడిగింది వినీష.

"పిచ్చిదాన! నేను జ్ఞాపకాలు మాత్రమే మార్చగలను, మనుషుల మనసుల్ని కాదు. ఈ జన్మకి క్షమించేయ్" అన్నాడు.

వినీష మౌనంగా అయిపోయింది. బస్ వచ్చింది.

"ఎక్కేముందు నువ్వు ఒక్కమాట నాకు ఇవ్వాలి" అని అడిగాడు విశాల్.

"ఏంటది చెప్పు" అంది వినీష.

జేబులో ఉన్న ఒక మడత పెట్టిన కాగితం తీసి చేతిలో పెట్టాడు. ఇది పూర్తిగా చదువు, ఆఖరి అక్షరం వరకు, చదివాక కాల్చేయి" అన్నాడు విశాల్.

"సరే" అంది వినీష.

"మాట" అన్నాడు చేయి చాస్తూ.

"సరే" అంది చేతిలో చెయ్యి వేసి. "గుర్తుంచుకో.. మాట తప్పితే నన్ను చంపినట్టే" అన్నాడు.

"ఏం మాటలవి! తప్పకుండా" అంది.

బస్ బయలుదేరింది, విధిలాగే అది కూడా వినీష నుండి దూరంగా తీసుకుపోసాగింది. కంటికి కనిపించేత దూరంగా వెళ్ళే వరకూ ఒకరిని ఒకరు చూసుకున్నారు, వారికి తెలీకుండానే చేతులు వీడ్కోలు పలుకుతున్నాయి.

***

# PART 69

ఎవరో గుండెను పిండేస్తున్న భావనతో ఇంటికి వచ్చింది వినీష. మేడ మీదకి వెళ్ళి పనస చెట్టు నీడలో కూర్చుని, విశాల్ ఇచ్చిన ఉత్తరం తీసింది.

"నా నీకు,

బహుశా.. ప్రపంచంలో ఏ ప్రేమికుడు, రాయని ఒక ప్రేమలేఖ ఇది. ఏ చరిత్రలోను లేని ఒక వింత అనుకుంటా కానీ, విధి బలీయమైనది, దాని ముందు మన మనస్సు చాలా చిన్నది. ఎదురు తిరిగినా ఎదుటివారికి కనిపించనంత చిన్నది. నేను వచ్చిన పని అయ్యింది అని నాకు తెలుసు. ఎందుకంటే, అది జరిగితేనే నేను నీకు ఈ ఉత్తరం ఇవ్వాలనుకున్నాను. ఈరోజుతో నీ జీవితంలో విశాల్ పేరు తుడిచేసాను. నేను ఇప్పుడు ఎవరికీ తెలియని ఒక కొత్త వ్యక్తిని, నువ్వు మాత్రం నా పరిచయంకాక మునుపు బంగారు తల్లి వినీషవే! దీని కోసమే నిన్ను కలిసి బాధపెడతాను అని తెలిసి కూడా వచ్చాను. కలువ పువ్వు పైన కాలం వేసిన మచ్చలు తుడిచేసాను. నేను నిజంగా చాలా అంటే చాలా దూరం వెళ్ళిపోతున్నాను. కంగారు పడకు, ప్రాణాలతోనే ఉంటాను. అన్నట్టు మరిచాను, నేను నీకు ఇచ్చిన గిఫ్ట్స్, లెటర్స్ ఏమైనా ఉంటే అవన్నీ దయచేసి నాశనం చెయ్యి. వాటి వల్ల ముందు ముందు ఇంకా ఏవో ఇబ్బందులు రావచ్చు. నా గుర్తుగా అంటావేమో! అవి లేకుండా నేను నీకు గుర్తు ఉండనని నేను అనుకోవడం లేదు. అసలు నేను నీకు గుర్తు ఉండాలని కోరుకోవడం లేదు. అగాథంలో పుట్టి, అంచలంచలుగా ఎదిగి, ఉవెత్తున ఎగసిన అలని చూసి, వడ్డున ఉన్న రాతి ముక్క అనుకుంటుంది అట, 'ఈ అందమైన అల నాకోసమే' అని కానీ, కలిసిన క్షణంలోనే తన కుటుంబం పిలుస్తుంది అని తిరిగి అగాథాలకు వెళ్ళిపోతుంది ఆ అల కన్య. మన కథ కూడా అంతే!

నేను వచ్చాకే నీ జీవితంలో, నీ మోమున కన్నీళ్ళు చూసాను. మాయమైన చిరునవ్వు మరలా రావాలని నిజాంగా కోరుకుంటున్నాను. అందుకే నువ్వు నన్ను మరిచిపోవాలి. మరుపు దేముడు మనిషికి ఇచ్చిన వరం. కాలం దానిని

దుప్పటిలా పట్టుకుని, కాసుకుని కూర్చుంటుంది. ఒక మనిషి కష్టాన్ని, సుఖాన్ని ఎంతోసేపు గుర్తులేకుండా ఆ దుప్పటి కప్పి కాపాడుతుంది. ఇప్పుడు ఆ దుప్పటి నీకు నేను కప్పబోతున్నాను, దీని వల్ల ఇంక నీకు కూడా నేను గుర్తురాను.

ఆ దుప్పటికి పడ్డ చిన్న చిన్న చిల్లులె, మన జ్ఞాపకాలు. అవి బాధ పెడతాయి, సంతోష పెడతాయి. నీకు నేను గుర్తు ఉండి, నేను మాత్రం నిన్ను ఎందుకు మరువాలని తిడుతున్నావు కదూ! అందుకే, జీవితంలో ఎప్పుడైనా నా పేరు వింటే నీకు మన గతం అంతా గుర్తు వస్తుంది. (వినీష కన్నీళ్ళతో లెటర్ అంతా తడిచిపోతోంది). చాలా మంది విశాల్ లు ఉంటారు కదూ! అందుకే ఎప్పడైతే నా పూర్తి పేరు "విశాల్ రాజవంశీ" అని వింటావో అప్పుడు తదుపరి 6 గంటల పాటు నాతో గడిపిన నీ గతం అంతా నీకు గుర్తు వస్తుంది. ఆ తరువాత మరలా మరుపు కమ్ముతుంది. ఇది కేవలం నేను స్వార్థపరుడిని కాను అని నా మనసుకి నేను చెప్పుకోవడానికి నేను ఇచ్చిన వెసులుబాటు. నీ కన్నీళ్ళకు అడ్డుకట్ట కట్టి, చిరునవ్వుల పల్లకి నిన్ను చేర్చాలనుకునే నీకు ఏమీ కాని, కాలేని ఒక..? సెలవు.

నీ నేను."

వెక్కి వెక్కి వెక్కి వెక్కి ఏడుస్తూ ఉంది వినీష. చాలాసేపు అలాగే ఉండిపోయింది. కింద నుండి అమ్మ పిలిచింది. తీసుకొచ్చిన అగ్గిపెట్టి తీసి కాగితాన్ని వెలిగించింది. అది కన్నీళ్ళ స్నానం చేయడం వల్ల మెల్లిగా కాలుతోంది. విశాల్ తో ఉన్న అన్ని జ్ఞాపకాలు ఒకదాని తరువాత ఒకటి కరిగిపోతున్నాయి.

మనిషా వచ్చింది, "ఏం చేస్తున్నావ్?" అంది.

"ఏమో! ఏదో నీరసంగా ఉండి కూర్చున్న" అంది వినీష.

"మధ్యాహ్నం వచ్చిన ఫ్రెండ్ వెళ్ళిపోయాడా?" అడిగింది మనీష.

"ఎవరు?" అంది వినీష.

"అదే విశాల్" అంది మనీష

"ఏమో! నాకేం తెలుసు?" అంది వినీష.

అమ్మ పిలవడంతో మరలా కిందకి వెళ్ళారు ఇద్దరూ.

ఒక ప్రేమ కనుమరుగయ్యింది, ఒక కథ కంచికి చేరింది.

***

# PART 70

"చూడు మూర్తి, వీడు అమెరికా వెళ్ళడానికి బట్టలు, లగేజ్ అవసరం లేదు అంటున్నాడు. ఒక్క స్వప్న చేతితో అల్లి ఇచ్చిన స్వెటర్ మాత్రం తీసుకున్నాడు. తినడానికి ఊరగాయ కూడా వద్దు అంటున్నాడు" అంది అనంత.

"అక్కడ అవన్నీ దొరుకుతాయి లేవే, వద్దు నాకు" అన్నాడు విశాల్.

కక్కలేని, మింగలేని పరిస్థితి మూర్తిది.

స్వప్నని, అనంతని దగ్గరకి తీసుకున్నాడు విశాల్.

"జన్మ జన్మలకి మీరు నాకోసం ఇలానే పుట్టండి" అన్నాడు.

"శుభమా అని పరాయి దేశం వెళుతూ అవేం మాటలురా!" అంది అనంత.

"ఏదో చెప్పలనిపించింది చెప్పాను" అన్నాడు విశాల్.

"వీడు తెలుగు సినిమాలు ఎక్కువ చూస్తున్నాడు అమ్మ. ఆ నాటకాలు ఏమి పట్టించుకోకు" అంది స్వప్న.

చెవి పట్టుకుని "ముందు నువ్వు బావని ఎలా చూసుకోవాలో నేర్చుకో" అన్నాడు విశాల్.

"హా నువ్వు చెప్పాలి మరి" అని విశాల్ చెయ్యి చేతిలోకి తీసుకుని "జాగ్రత్త రా, వేళకి తిను. నీకోసం ఇక్కడ మేము ఎదురు చూస్తాం అని మరిచిపోకు, వెళ్ళి డాలర్స్ పంపించే పనిలో ఉండు" అంది. స్వప్న కళ్ళలో ఒక నీటి పోర కనపడింది.

"ఆటో తీసుకుని వచ్చ, ఇంక బయలుదేరు" అన్నారు గోపాల్.

తల్లిదండ్రుల కాళ్ళకు మొక్కి, మూర్తితో పాటుగా బయలుదేరాడు విశాల్.

ఒక రెండు వందల మీటర్ లు వచ్చిన తరువాత ఆటో ఆపి, "కిందకి దిగు" అన్నాడు విశాల్.

మూర్తి కిందకు దిగి "ఏమయిందిరా?" అన్నాడు.

"ఒరేయ్.. ఒకసారి ఇంటికి వెళ్ళి, నా పేరు చెప్పి, ఉన్నడా? అని అడుగు" అన్నాడు విశాల్.

"నీకేమైనా పిచ్చా? నేను నీతో రావడం చూసారుగా" అన్నాడు మూర్తి.

"లేదురా, నాతో పాటు నిన్ను కూడా గుర్తు పట్టరు. ఒకసారి అడిగి రా" అన్నాడు విశాల్.

మూర్తి వడివడిగా నడుస్తూ విశాల్ ఇంటికి వెళ్ళాడు. అనంత, స్వప్న ఎవరో కొత్త మనిషిని చూసినట్టు చూసారు.

"విశాల్ ఉన్నడా?" అడిగాడు మూర్తి.

"విశాల్ ఎవరు?" అంది అనంత.

నివ్వెరపోయాడు మూర్తి.

"మీరు రాంగ్ అడ్రెస్ కి వచ్చారేమో! అలాంటి వారు ఎవరూ లేరు ఇక్కడ" అంది స్వప్న.

ముక్తసరిగా సరే అని చెప్పి తిరిగి ఆటోని చేరుకున్నాడు మూర్తి.

"ఏరా ఏమైంది?" అన్నాడు విశాల్.

"నీ కోరిక ఫలించింది, నిన్ను వాళ్ళు మరిచారు" అన్నాడు మూర్తి.

విశాల్ చిన్నగా నవ్వాడు.

"ఎందుకు నవ్వుతున్నావ్? ఇది దుర్మార్గం రా. నువ్వు అంటే ప్రాణంగా చూసుకునే అమ్మ, నీవే ప్రాణం అనుకునే చెల్లి. వీళ్ళని మోసం చేయడానికి నీ మనసు ఎలా ఒప్పుకుంది రా?" అన్నాడు మూర్తి.

"అవును. అది మోసమే కానీ, నేను రాను అని తెలిసిన మరుక్షణం వాళ్ళ ప్రాణాలు పోతాయిరా! అందుకే వాళ్ళకి గుర్తు ఉన్నంత వరకు ఒక్క స్వప్నే వాళ్ళ కూతురు. నన్ను గుర్తు పెట్టుకోవడం వల్ల బాధ తప్పితే, వాళ్ళకి సుఖం లేదు.

అందుకే నేను ఒకడిని ఉన్నాను అన్న విషయం వాళ్ళ మస్తిష్కంలో నుండి తుడిచేసాను" అన్నాడు.

మూర్తి కళ్ళు మూసుకున్నాడు.

"ఎందుకు రా కళ్ళు మూసుకున్నావ్?" అడిగాడు విశాల్.

"నీ తరువాత స్టెప్ నాకు తెలుసు, నన్ను కూడా మెస్మరైస్ చేద్దామని నీ ప్లాన్. అది కుదరదు" అన్నాడు మూర్తి.

"చూసావా" నేను ఏమి చేస్తానో ఎవరికి తెలీదు. నువ్వు అవలీలగా కనిపెట్టావ్. ఇదేరా ప్రాణ స్నేహం, అందుకే నీకు కూడా నేను గుర్తు ఉండకూడదు" అన్నాడు విశాల్.

"నువ్వు చెప్పే కథలకు నేను పడను, దయచేసి నన్ను మాయ చెయ్యకు. చిన్ననాడే అమ్మ, నాన్న పోయారు. అదృష్టమో..! దురదృష్టమో..! నువ్వు కలిశావ్. నువ్వు తప్ప వేరే లోకం లేదు. నువ్వు జ్ఞాపకాలు చెరిపేస్తే, నాకు గతమే లేదు రా! నిన్ను జీవితంలో ఏది అడుగలేదు, దయచేసి నన్ను భౌతికంగా వదిలినా.. కనీసం ఆలోచనల్లో ఉండిపో" అన్నాడు మూర్తి. కారాల్సిన కన్నీళ్ళు కంటిరెప్పలని పట్టుకుని ఉన్నాయి.

"ఎందుకురా నన్ను విలన్ ని చేస్తున్నావ్? నువ్వే ఆలోచించు.. నన్ను మరిచిపోతానన్న ఆలోచనే నిన్ను ఇంత బాధ పెడితే, నేను లేనన్న నిజం నిన్ను ఎంతగా తొలిచి వేస్తుంది. నీ బాధ నాది కాదా?" అన్నాడు విశాల్.

ఫాస్ట్ గా వెళుతున్న ఆటోలో నుండి విశాల్ ని పక్కకి నెట్టి బయటకి దూకేసాడు మూర్తి. దురదృష్టవశాత్తు, రోడ్ పక్కన ఉన్న ఒక రాయి తలకి తగిలి స్పృహ కోల్పోయాడు మూర్తి.

కంగారుగా కిందకి దిగిన విశాల్, మూర్తిని తీసుకుని హాస్పిటల్ కి వెళ్ళాడు. మూర్తికి కొద్దిగా మెలుకువ వచ్చింది. తలకి కట్టు, కాళ్ళకి ప్లాస్టర్స్ వేసి ఉన్నాయి. ఎదురుగా ఎవరో ఉన్నారు, అది విశాల్ అన్న విషయం మూర్తి మరిచిపోయాడు.

విశాల్ దగ్గరికి వచ్చి "ఎలా ఉంది?" అన్నాడు.

"మీరు ఎవరు?" అన్నాడు మూర్తి.

చాలా కష్టంగా విశాల్ మోమున చిరునవ్వుతో, “మీరు రోడ్ మీద పడి ఉన్నారు, చుట్టూ ఎవరు లేరు. అందుకనే హాస్పిటల్ కి తీసుకుని వచ్చాను” అన్నాడు విశాల్.

మూర్తి రెండు చేతులు జోడించి “చాలా చాలా థాంక్స్ సర్” అన్నాడు.

“అయ్యో! దానిదేముంది సర్, మనిషికి మనిషి సాయం” అన్నాడు విశాల్.

‘సర్వస్వం అనుకున్న వాళ్ళంతా గుర్తు పట్టలేని స్థాయికి వెళ్ళిపోయారు, ఏం బతుకురా నీది! ప్రేమించిన పడతిని విసిరేసావ్, ప్రాణ స్నేహితుణ్ని మోసం చేశావ్, కుటుంబాన్ని కాలదన్నావ్, నీది ఒక బతుకా?’ అని లోపల అనుకుని బాధపడ్డాడు విశాల్.

డాక్టర్ వచ్చి, “అతను సేఫ్, మీరు ఇంక వెళ్ళవచ్చు” అన్నాడు.

ఒలింపిక్ లో పోటీలేని గోల్డ్ మెడల్ విన్నర్ లా, అమావాస్య సాక్షిగా దేగల దీవికి పయనం అయ్యాడు విశాల్ రాజవంశీ.

***

# PART 71

ఉపసంహారం:

ఇక ప్రస్తుతంలోకి వస్తే, విశాల్ జ్ఞాపకాలు తుఫాన్ లాగా మనసుని చుట్టి, ఆనందం రంగుల రాట్నంలో తిప్పి, కేరింతలు కొట్టించి, నవ్వించి, ఏడిపించి, నవ రసాలను చూపించి, తిరిగి స్తబ్ధంగా ఆగిపోయాయి. అంతులేని నిశ్శబ్దం, అందులో అతని శబ్దం.

టైమ్ ఉదయం మూడు అయ్యింది. ఇంకో రెండు నిమిషాలలో మరలా విశాల్ గుర్తులు జీవితం లోనుండి వెళ్ళిపోతాయి. ఈసారి వాటిని పోనీకూడదు అనుకుంటూ లేచింది వినీష.

అందరూ నిదురపోతున్నారు, మెల్లగా లేచి వంట ఇంటిలోకి వెళ్ళింది. ఒక సన్నని ఇనుప తీగ వంటిది తీసుకుని, గ్యాస్ స్టవ్ ఆన్ చేయడానికి ప్రయత్నం చేసింది. లైటర్ పాడయ్యింది, ఎంత కొట్టినా స్పార్క్ రావడం లేదు.

ఇప్పుడు ఎలా? ఇంకా ఒక నిమిషం, తీగ కాల్చి విశాల్ రాజవంశీ అన్న పేరు చేతిపైన రాసుకోవాలని వినీష ప్రయత్నం. ఇంకా ౩౦ సెకండ్స్ ఉంది, ఏమి చేయాలో తెలియడం లేదు. 'చేతి మీద కత్తితో ఒక గుర్తు పెట్టుకుంటే అప్పుడు గుర్తు ఉంటుందిగా..! ఆ ఆలోచన రాగానే కత్తి తీసుకుంది, చేతిని తాకగానే అది గులాబీపువ్వులా మారిపోయింది.

ఈశ్వర్ లోపలి వచ్చాడు, "ఈ టైమ్ వరకు ఏం చేస్తున్నావ్?" అన్నాడు.

వినీషకి తల తిరగడం మొదలయింది. కింద పడుతున్న సమయానికి ఈశ్వర్ పట్టుకున్నాడు.

తెల్లవారింది, నిద్ర లేచిన వినీషకి, చాలా హాయిగా ఉంది. ఏంటో చిన్నప్పుడు ఆడుకుని వచ్చి మధ్యాహ్నం పడుకుని లేచాక ఉన్న గమ్మత్తు అయిన ఒక మత్తు.

జాహ్నవి "అమ్మా.. ఎలా ఉంది ఇప్పుడు?" అంది.

"నాకు ఏమి అయ్యిందే?" అంది వినీష.

"అదే.. నిన్న నేను జరిగినది చెప్పగానే ఎందుకలా అయిపోయావ్?" అంది జాహ్నవి.

"ఏం చెప్పావ్?" అంది వినీష.

"అది.." అని జాహ్నవి ఏదో చెప్పబోతుండగా వచ్చాడు ఈశ్వర్.

"జాహ్నవి, నీకోసం ఎవరో వచ్చారు" అన్నాడు.

బయటకు వెళ్ళింది, తలుపు దగ్గర నుంచుని ఫోన్ చూసుకుంటున్నాడు విహాంగ్.

"హాయ్ విహంగ్ గారు" అంది జాహ్నవి.

"మీతో కొంచెం మాట్లాడాలి" అన్నాడు విహాంగ్.

ఈలోపు బయటకి వచ్చింది వినీష.

విహంగ్ ని చూడగానే ఏదో ఏదో తెలియని ఒక సంతోషం.

***

ఇప్పుడు పాఠకులుగా మీకు, రచయితగా నాకు ఉన్న ప్రశ్నలు, 364 ఏళ్ళ శిక్షకు వెళ్ళిపోయినా..! విశాల్ మరలా ఎందుకు తిరిగి వచ్చాడు? పెళ్ళి కాని విశాల్ కి విహంగ్ ఎలా కొడుకయ్యాడు? మూర్తి కోమాకి కారణం ఏంటి? ఇవన్నీ తెలియాలి అంటే అందమైన అల –2, కదిలి వచ్చిన కల కోసం ఎదురు చూడాల్సిందే...

స్వస్తి : మీ సత్యజిత్ రే శ్రీకూర్మం

❊❊❊